"ఓయమ్మ లలితా! మనజీవులు గాలిలో నాడుటకంటె, మనము
పిశాచములుగా పరిభ్రమించుచున్నామన్నది నాకు సంతోషకర
ముగా నున్నది. వట్టిజీవులు జీవులుగా తిరుగుట వేఱు. జీవులు జీవు
లుగా తిరుగుటలో నేమియులేదు. జీవుడనగా ననేకజన్మల సంస్కార
ముల సంపుటి, వాడు నిష్క్రియుడు. వాడు చేసెడి దేమియులేదు.
వాడు జీవుడుగా తిరుగుచున్నను, యమయాతన ననుభవించుచున్నను
సమానమే. మానవులు, పిశాచములు నట్లుగాదు. వీరూహచేయగలరు.
కార్యములు సాధించగలరు."

శ్వనాథ సత్యనారాయణ ఆధునిక తెలుగు సాహిత్యంలోనేకాదు,
తెలుగులోనే అనుపమ, బహుముఖ సారస్వతుడని పరిచయం
య్యదం చర్వితచర్వణం, అనుచితం. లాంఛనానికి: జననం-
ష్ణాజిల్లా నందమూరులో, 1895. తెలుగు, సంస్కృత, ఆంగ్ల
ాత్యాల్లో తలస్పర్శి పాండిత్యం సంపాదించి, సాహిత్యాచార్య
పనిచేస్తూ ముట్టని సాహిత్య ప్రక్రియ అంటూ లేక ముట్టినది
ుమి చేయక వదలటమంటూ లేక అవిరళ సాహిత్య వ్యవసాయం
స్తున్న ఉద్దండుడు.

మెస్కో మూడవ సంవత్సర ప్రచురణలలో మొట్టమొదటిదిగా
వెలువడుతున్న ఈ నవల నేపాళరాజవంశ నవలా పరంపరలో
నవది.

# LALITHA PATTANAPU RANI

*By*
VISWANATHA SATYANARAYANA

Publishers :
**M. SESHACHALAM & CO.**
Madras, Machilipatnam, Secunderabad

First Edition :
December, 1969

Printers :
**Sri Kala Printers**
Madras - 33

Cover Design :
**Bapu**

Price :
Rs. 2-

Distributors :
ANDHRA PRADESH BOOK DISTRIBUTORS
Rashtrapathi Road, Secunderabad




101

# 1

"ఇతరులు లోనికి రాకూడదు.''

నల్లగా కఱిమొద్దువలె నున్నాడు. చంద్రమొద్దు అతని మేని చాయ యెఱుపుకలిసిన నలుపు. తాడిచెట్టంత యెత్తున్నాడు. అనగా సుమా రేడడుగుల యెత్తు మనిసి. వాని యొక బుజమునుండి మఱి యొక బుజమువఱకు గజమున్నరయుండును. వానిఱొమ్ముకొలత అడవిలో పెనుగాలికి పడిపోయిన నాల్గువందలయేండ్లు బ్రతికిన నుత్తి చెట్టు మొదలంతయున్నది. ఆజానుబాహువు. అవి చేతులో ఇనుప గుదియలో తెలియదు. నడుమునకు లంగోటావంటిది కట్టినాడు. కాని, అది మట్టలాగువలెనున్నది. వాని యెడమ పాదమునకు పెద్ద యినుప కడియమున్నది. అది సహజముగా నినుమో వాని శరీర చ్ఛాయవలన నినుముగా కనిపించుచున్నదో తెలియదు. ఒకానొక తత్త్వము కలిగిన శరీరము కలవారు బంగరువస్తువులు ధరించినను కొన్నాళ్ళకు నవి యినుపవస్తువులవలె గనిపించును. ఆకాలికడియము తొలినాడు బంగారమేమో! అది కడియమో! గండపెండారమో! అతని తొడలు సగభాగము క్రింద కనిపించుచున్నవి. వాని పిక్కలినుపగుండ్లు. వానినడుము వాని ఱొమ్మునకు తీసిపోదు. వాని కంఠముయొక్క లావుకూడ వాని వక్షస్థల ప్రమాణానుకూలముగ నున్నది.

ఇంక వాని శిరస్సును మొగమును నున్నవి. ఆ మొగము నందున్న నేత్రములు కణకణలాడు రెండు కుంపటులు. ఆ కనుల మీద కనుబొమలు చిట్టీతపొదలు. మీసములు నల్లని రావణాసురుని మీసములు. రావణాసురుని మీసములనగా కొన్ని సముద్రతీరముల

యందు వెదురుజాతిది, నేలమీద ప్రాకెడునది. సన్ననిమట్టలవంటి యాకులుగలది. ఆ మట్టల చివళ్ళు సూదులుగా నుండునది యొక కంపయుండును. అది నేలమీద ప్రాకును. దానిని రావణాసురుని మీసములందురు అది ప్రాకిప్రాకి చివరనొక గుబురుగా నేర్పడును. అవియన్నియు ముండ్లే! వాని మీసములు రావణాసురుని మీసము అనగా ముక్కు క్రింద వెంట్రుకలు లేవు. చివళ్ళు గుబురుగా నున్నవి యని యర్థము. వాని గడ్డముకూడ భయంకరముగా నున్నది. కొందఱి గడ్డములు పొడుగుగా ఱొమ్ముమీదికి వ్యాపించును. కొందఱు గడ్డమును పాయదీసి రెండువైపులకు చిమ్ముదురు. మరి కొందఱి గడ్డములు పెరుగవు. చిట్టడవివలె నుండును. ఇతని గడ్డము చిట్టడవియనుటకు వీలులేదు. మీసములు ముక్కుక్రింద నెట్లులేవో గడ్డముకూడ నట్లే యెడమెడముగా నున్నది— రెండు చెక్కిళ్ళమీద రెండు గుబురులు. గడ్డముక్రింద నొక గుబురు. వానినడుమ మరి రెండు చిన్న గుబురులు.

ఇంక వాని శిరోజములున్నవి. ఎవరిజుట్టయినను పెఱిగి వెనుకకు దువ్వి ముడివేయుటకో రెండు చెవులక్రింద గిరజాలగా దువ్వుటకో పనికివచ్చును. వాని జుట్టు తలలుకోసిన దర్భలువలె కొంత పెరిగి మానివేసినది. అది నిట్టనిటారుగా నిలుచున్నది. సామాన్యముగా నెట్టి వారికైనను తలవెంట్రుకలు సన్నముగా నుండును. కొందఱివి గఱుకుగా మోటుగా నుండవచ్చును. ఇతని తలవెంట్రుకలు మానవుల శిరోజములవలె లేవు. ఒక భల్లూకమో! ఒక యడవిగుఱ్ఱమో! యున్నచో వాని వెంట్రుకలు తెచ్చి తుమ్మబంకపెట్టి నెత్తిమీద నంటించినట్లుండెను అవి గ్రుచ్చుకొనునోయేమో ! లేదా ముండ్లపంది తన మేనికంటకములను నిగిడించి తనపైకి వచ్చెడు జంతువుల కాళ్ళమధ్యగా దూసికొనిపోవునట! అతని తలకట్టుదాని యప్పటి నిగిడించిన ముండ్లవలె నున్నది. అతనిని చూచినంతనే యెవరైనను గుండె పగిలి చావవలెను.

అన్నవాడితడు. అనిపించుకొన్న వాండ్రిద్దఱు. వారిలో నొకర్తుక స్త్రీ, రెండవవాడు పురుషుడు. స్త్రీయే ముందున్నది పురుషుడు వెనుకనున్నాడు. స్త్రీ ధైర్యముగా నిలుచున్నది. అందుచేత,

పురుషుడును ధైర్యముగా నిలుచున్నాడు. ఆ స్త్రీ పద్మపత్రవిశాల లోచన చంచరీకచికుర మందహాససుందర వదనారవింద. సర్వా భరణభూషిత ఆమె చెక్కిలిమీద వెన్నెలలు నిగనిగలాడుచున్నవి. చివురుటాకులమీద, క్రొంబువ్వులమీద సుకుమారముగా ప్రాలెడి వెన్నెలలు తక్కపోలముల మీద ప్రాలుటకు సిగ్గుపడుచున్నవి. ఆమె ధరించినది సన్నని వలిపెపు చీర. ఆ చీర మీద బంగరుపూలు కుట్టి యున్నవి. ఆ చీరయొక్క యంచు చిన్నిచిన్ని రాజహంసలు బంగరుదారములతో గుట్టినది. ఆమె బుజములమీద సన్నని పట్టు వంటి యున్ని నేలువ కలదు. అది కాశ్మీరదేశపు నేలువ. అంత పొడుగుగా లేదు. అంత పొట్టిగా లేదు చలినుండి తనమేను రక్షించు కొనుట కామె దానిని ధరించినది. ఆమె పాదములయందు మరకత మంజీరములున్నవి. హస్తములయందు రత్నకంకణములున్నవి. ఫాల మునం దెఱ్ఱని కుంకుమబొట్టున్నది. ఆమె నిలుచున్న ప్రదేశమంతయు పునుగు జవ్వాది కస్తూరి సువాసనలు గుబాళించుచున్నవి. మానిసి బక్కపలుచనిదివలె కనిపించుచున్నను దృఢమైన యవయవ సన్ని వేశము కలిగినట్లు తెలియుచున్నది. నడుము సన్నగానున్నను స్త్రీకి వక్షోజఘనమండలము లుదాత్తములుగా నున్నచో బక్కపలుచనిది యనిపించదు.

ఆమె వెనుక నిలుచున్న పురుషుడు పెద్దపొడుగరి కాడు. ఆమె కంటె కొంత పొడుగరి యనిపించును. మానిసులలో పొడుగు పొట్టి తనములు చిత్రముగా నుండును. ఒకరికంటె నొక్క రరయంగు ళము మాత్ర మెత్తుగా నుందురు. అయినను వారు పొడుగరులని పించును. మనుజుల మనస్సులు విలక్షణమైనవి. మానవుని యొక్క మనస్సునకు సర్వవస్తువుల యొక్క ప్రమాణ పరిజ్ఞానముండును. అయి దడుగుల యారంగుళముల యెత్తుగల వ్యక్తి పొడుగరియన్న యూహ సామాన్యముగా మానవుల మనస్సులలో కొలవకుండ నభి జ్ఞాన రూపముగ నుండును. దానిపైన నంగుళములో నొక చతుర్థాంశ మున్నను మిక్కిలి పొడుగరి యనిపించును. జంతువు లోకవయస్సు వచ్చునప్పటికి పరమేశ్వరనిర్ణీతమైన యా జంతువుయొక్క జాతి యొక్క శరీరప్రమాణము నిర్ణయించిపెట్టును. సామాన్యముగ

నందఱు నాయెత్తే పెఱుగుదురు. తరువాత పెఱుగరు. మానవులున్నారు. ఒక పదునెన్మిదేడులు వచ్చువఱ కెంత పెరుగుదురో యంతే పెరుగుట. తరువాత పెఱుగరు. పెఱిగినచో వాడెనుబదియేండ్లు బ్రతికినచో నట్టివారొకరితో నొకరాకాశములో మాటాడుకొనవలయునే గాని చిన్నవాండ్రతో మాటాడుకొనుటకు వీలులేదు. లేనిచో నేలమీద పండుకొని పిల్లలతో మాటాడవలయును

సర్వజంతువులింతే. కుక్కలా ప్రమాణమును మించిపెఱుగవు. గుఱ్ఱములా ప్రమాణమును మించిపెఱుగవు ఏనుగులకు నదియొక ప్రమాణమున్నది. తరువాత మనుజులు లోపల పెఱుగుదురు. జంతువులు లోపలకూడ పెఱుగవు. లోపల పెఱుగుట కనులకు గన్పించునది కాదు. వారి క్రియాకలాపములచేత నితరులబుద్ధికి గనిపించునది.

ఆ పురుషుడు పెఱుగుటయై పోయినది. లోనకూడ పెఱుగుట లేదనియే చెప్పవలయును. లోన పెఱుగుట బహువిషయముల మీద నాధారపడియుండును. కొంత రక్తనిష్ఠమైయుండును. వాడు పుట్టినదేశము, వాని తల్లి దండ్రుల శరీరములయందలి రక్తనిష్ఠమైన యొకానొకగుణము, వాడు చదివినచదువు, చదువును వాడు జీర్ణించుకొన్న పద్ధతి, వానివర్ణము, ఆవర్ణముయొక్క వృత్తి మొదలైనవి వానిలోపలి పెఱుగుదల కాధారభూతమగును ఆ పురుషుని కివి యన్నియు నున్నవి. వాని పాళ్ళలో నవియున్నవి. అతడొక ధోవతి కట్టినాడు. అది కొంత ముదుకగుడ్డ ధోవతిని మోంకాళ్ళమీదికి దోపినాడు. బలిష్ఠుడనియే చెప్పవలయును. వాని బుజముమీద నొక యుత్తరీయమున్నది. అదియును ముదుకగుడ్డయే. చలికికాబోలును; వాడు దానిని కప్పికొనెను. వాని శిరోజములు నడుమపాపట దీయబడి నడినెత్తిన ముడివేయబడియున్నది. వాని మీసములు తుమ్మెదరెక్కలవలెనున్నవి. గడ్డములేదు. క్షౌరముచేయబడినది. వాని నేత్రములాకర్ణాంతవిశాలములు, వానిని చూచినచో నెవ్వరైనను వాని సౌందర్యమునకు దిగ్భ్రాంతిపొందుదురు. అంతటి యందగాడు. వాని శరీరచ్ఛాయ వైడూర్యము లింద్రనీలమణులు మరకతములు నూరి తేనియలో కలిపిచేసిన విగ్రహముయొక్కవన్నియ యెట్లుండునో యట్లున్నది. వానికన్ను లెప్పుడును నవ్వుచునే యుండును. అది

పున్నమరాత్రి. ఆ వెన్నెల లతనిమీదపడి వాడొక దేవతామూర్తివలె గన్పించుచుండెను.

ఆ స్త్రీ "ఇతరులు లోనికి రాకూడదు" అన్న వ్యక్తి కనిపించి నంత నే వానికడ్డముగా నిలుచుండెను. వాని నానుకొని నిలుచుండెను. ఆ భయంకరమూర్తి కూడ స్త్రీనికంటె పురుషుని చూచుచుండెను. ఈ పురుషుడు తన నానుకొని నిలుచున్న స్త్రీ లేనిచో భయగ్రస్తుడై నేలమీద కుప్పకూలెడివాడే! ఆమె తననంటుకొని నిలుచున్నది. తనకు భయములేదు. కాని వణకిపోవుచునే యుండెను.

స్త్రీ:—"ఇక్కడ నితరులెవరు? ఇది యెవరియిల్లు? ఎవ్వరిదిని కాదు. ఇది పాడుపడినచోటు, ఇచట గోడలు మాత్రమే కలవు. లోనికి ననిపించుకొనదగిన ప్రదేశమే యిచ్చటలేదు. ఈ గోడలలోనికి పోరాదందువా? అచట నెవరున్నారు? ఇది రాజాంతఃపురముకాదు. ఇదియొక యధికారిగృహము కాదు, ఇచట నెవరుపడినవారే తిరుగ వచ్చును, నీ వెవరియనుజ్ఞపొంది యిచ్చట నిలిచితివి? నీవెవరవు? తనది కానిదేశ మెవ్వడో యెవనికో వ్రాసియిచ్చెనట! అట్లున్నది. నీవిప్పుడు పోనీయవు. నీవు తనాఖీ అంతమనిసివి, నీ శరీరబలముతో మమ్మాప వచ్చును. మమ్ము హింసింపవచ్చును. ఈ స్థలము నీదికాదు, నీవు చుట్టును దారముకట్టలేదు, నీవిప్పుడు మమ్ము పోనీయవు, మేము రేపు వత్తుము.

వ్యక్తి:—నేనెప్పుడిచ్చటనే యుండెదను. మిమ్ము లోపలికి పోనీయను, పోవుటకు వీలులేదు.

స్త్రీ:—నీ విచట రాత్రులందే యుందువా? పగలుకూడ నుందువా? రేపు మేము పగటిపూట వత్తుము, నీవు లేనప్పుడు వత్తుము, నీవు సర్వవేళల నిచ్చట నుండవుకదా! నీవుపోయి యన్న మును తినవలయునుగదా! నీవు దయ్యమంత మానిసివి, నీవు మావలె తినవు, నీవు తిండితిన్నచో జాము సేపు తినవలెను, ఆవేళ చూచి యప్పుడు వత్తుము, ఏమిచేయుదువు?

వ్యక్తి:—మీరు వచ్చినచో పగటివేళల రావచ్చును. నేనప్పు డిచ్చటనుండను, అప్పుడు మీరు లోనికి వెళ్ళినను మా కభ్యంతరము లేదు, రాత్రులందే యిచ్చట లోనికి పోరాదు.

అనగా నా స్త్రీ వెంటనున్న పురుషుడిట్లనెను:—"మనము పగటిపూట నెట్లువత్తుము! మనమును రాత్రులందే రావలయును. ఈలోపల నేమియున్నదో యింతవఱకు చూడలేదు. తక్కినచోటు లన్నియు నాల్గుదినములలో తిరిగి తిరిగి చూచితిమి. ఇదియొక్కటే చూడలేదు. ఈనాడు చూడవలయునని మిగిల్చితిమి, తక్కిన ప్రదేశములకంటె నిది నిస్సంశయముగా నెంతయో నందముగా నుండును. రాజులు రాజభార్యలు వారి పరివారము నివసించుటకు కట్టదగిన స్థలముగదా యిది. రాజాంతఃపురముల లోపలి భాగమెట్లుండునో నేనెప్పుడును చూడలేదు. నేను చూచుటకు నా జీవితములో నేమి వీలులున్నవి. ఇతనిని నీవేమియు చేయలేవా?"

వ్యక్తి:-ఈమె నన్నేమిచేయగలదు? ఈమె నా గుప్పిటిలోనికి రాదు. నేను మిమ్మిద్దఱను చెఱియొక చేతిలోవట్టుకొని పిప్పి పిప్పి చేయగలను. నేనుకాక, మఱియొక్కడైనచో మిమ్ము కూరగావండుకొని తినును,

స్త్రీ:-ఆ మఱియొక్కడెవ్వడు? నీవెందుకు చేయవు?

వ్యక్తి:- ఎవడైన రాక్షసుడైనచో మిమ్మట్లుచేసెడివాడు. నేనెందుకు చేయననగా నీవు స్త్రీవి, నేను స్త్రీలనేమియు చేయను, స్త్రీలను బాధించుట నా మర్యాదకు తక్కువ, నా పౌరుషమున కవమానము, నా బలమునకు చేతక్కువ, అతడు పురుషుడు కదా! అతనినెందుకు చేయవని యడుగుదువేని చెప్పెదను. అతడందగాడు నేను పరమవికార స్వరూపుడను, సౌందర్యవంతులైన పురుషులను చూచినచో భగవంతుడు నన్నింత వికృతాకారునిగా నేలచేసెనని నాకు దుఃఖము కలుగును, అందగాండ్రైన పురుషులజోలికి నేను పోను, వారేపూర్వజన్మములయందే పుణ్యముచేసిరో వారంత సౌందర్యవంతులుగా జన్మించిరి. వారిని చూచినంతనే నేను తొలి జన్మలయందుచేసిన పాపమే నాకు గుర్తునకు వచ్చును. నేను వారి నేమియు చేయను. అందుచేత నితనిని చేయను.

స్త్రీ:-అతడు నిన్నేమైనచేసినచో చేయుదువా?

వ్యక్తి:-వాడు నన్నేమి చేయగలుగును? వీడు క్షత్రియుడు కూడకాడు. క్షత్రియులైనవారే వీరులు. ఖడ్గములుపూని నామీదకి

నెత్తివచ్చినప్పుడు నేను వారిచేతులలోని కత్తులు లాగికొని విసిరి పార వేసితిని, అందగాండైనచో వదలిపెట్టితిని, కురూపులైనచో నిరూపులను చేసితిని, అందముకాని వస్తువును నేను చూడలేను.

స్త్రీ:-నీవు వికృతాకారుడవుకదా!

వ్యక్తి:—నన్ను నేను చూచికోలేనుగదా! ఒకప్పుడు నిశ్చలమైన సరస్సులో నా ప్రతిబింబము నాకు కన్పించినది. నాకప్పు డెంత కోపము వచ్చినదో ఏమి చెప్పను, ఒక మహాగజము చొఱబడి తటాకము నెంత విధ్వంసము చేయునో యంత విధ్వంసము చేసితిని.

స్త్రీ:—ఓయీ! కొందఱి సౌందర్యము శరీరములయందుండును. కొందఱి సౌందర్యము వారి మనస్సులలో నుండును.

వ్యక్తి:—అంత స్సౌందర్యము బహిస్సౌందర్యము సామాన్యముగా కలియవు కలిసినచోట పరమేశ్వరుడు నాట్యము చేయుచున్నాడని చెప్పవలయును.

స్త్రీ:—నీ వెవరవయ్యా! నీ రూపము రాక్షసముగా నున్నది. నీ మాట దేవతామయముగా నున్నది. నిన్ను చూచి నేను భయపడితిని. ఇతడెవరో కన్పించినాడు. మనము విలాసార్థముగా వచ్చితిమి. ఈనాటితో మన విలాసమంతయు తుదముట్టబోవుచున్నది - అనుకొంటిని, అట్లుగాక నా యీ రాక సత్పురుషులతోడి ప్రసంగముగా పరిణమించినది. ఇది పాడుపడిన మహానగరము. పాడువడిన నగరము కాదు. పాడుపెట్టబడిన మహానగరము. ఈ నగరము నిర్మింపబడినదట. ఇందు ఎవరునువచ్చి నివసింపలేదట. నివసించుటకు వీలేలేకపోయినదట. అనేక గృహములకు నిండ్లకప్పులు కూడ వేయలేదు. ఇది రాజుగారు నివసించుటకు నిర్మింపబడిన స్థలము. దొడ్డుత్రోవలు, నంతిపురము, స్నానములగదులు, విహారస్థలములు, చప్పరములు, విశ్రాంతి కేర్పడిన గదులు - సర్వము సిద్ధము చేయబడినవట. పైనకప్పులే లేవు. ఇండ్లకు పైన కప్పులు వేసినతరువాత తక్కిన వెసులుబాట్లు చేసికొందురు. ఈ నిర్మింపబడిన రాజధానిలో కప్పులు మిగిల్చి తక్కినవన్నియు సిద్ధముచేసిరి. వందయేండ్లయినదో, రెండువందల యేండ్లయినదో తెలియదు. చాల యిండ్లకు గోడలు పడిపోయినవి. ఎలుకలు నేలమీది రాళ్ళను కుద్దలించినవి పందికొక్కులు త్రవ్విన మట్టి పోగులు సమ్మ

ద్ధిగా నున్నవి, ఇంటింట తుమ్మదుబ్బులు తుంగలు మొలిచినవి. రాళ్లు కలిసినచోట రాళ్ళను చీల్చికొని రావిమొక్కలు మొలచినవి, గడ్డి నమృద్ధిగా నున్నది. పలుచోట్ల సర్పములు తిరుగుచున్నవి. వన్య మృగములు సమృద్ధిగా వచ్చి యిచట నివాసము ఏర్పరచికొన్నవి. జనులందఱు నీ ప్రదేశమును బహిష్కరించుచున్నారు ఇక్కడికి వచ్చుటకు భయపడుచున్నారు. ఈ స్థలము రాజు తన కుటుంబముతో నివసించుటకు కట్టిన భవనప్రాంగణమని మేమనుకొన్నాము. నాల్గు రాత్రులుగా పలుచోట్లు చూచితిమి. ఈనాడు పున్నమ నిండువెన్నె లలో నీ రాజభవనములను చూడవలయునని మనసులో ననుకొని నేడు వచ్చితిమి. నీవు మమ్మడ్డగించితివి. నీవు మమ్మడ్డగించుట నిజ మునకు సహజముగా నున్నది. రాజాంతఃపురములోనికి పరులను రా నీయరు గదా! అనజ్ఞ లేకుండా పోవుటకు వీలులేదుకదా! తక్కిన వేమియు లేకున్నను ఈ రాజాగారము మాత్రము మన్నింపబడు చున్నది. నేటి రాజు నిన్ను నియమించెనా? ఈ నగరము నిర్మించిన రాజునకు నేడు నేపాలదేశము పాలించుచున్న రాజేమి కావలయును? కొడుకా? మనుమడా? ఈ లోపుగా రాజవంశమే మారిపోయినదా? మా కేమియు తెలియదు."

వ్యక్తి:—మీ రెవరు? నీవన్న ప్రకారము నగరము పాడు వడినది. సర్వజనుల చేత నిది పరిహరింపబడుచున్నది. సివంగులు, తోడేళ్ళు, చిఱుతపులులు మొదలయినవి యిచ్చట తిరుగుచున్నవి. సర్పములు సమృద్ధిగా నున్నవి. ఇట్టి స్థలమునందు మీరు నిర్భయముగా నెట్లు సంచరించుచున్నారు? ఇచ్చటికెందుకు వచ్చినారు? నిన్ను చూచి నచో రాచవడుచువలె నున్నావు. నీ భూషణములు నీ ధరించిన వస్తువులు రాజవంశమువారు ధరించెడివి. నీ మొగమునందు క్షత్రియ స్త్రీ లక్షణము గోచరించుచున్నది. ఈ పురుషుడు క్షత్రియుడుగాడు, అతడందగాడేగాని మొగముచేత క్షత్రియుడుగాడు, శరీరావయవ విన్యాసముచేత గూడ క్షత్రియుడుగాడు. మనోలక్షణముచేత గూడ క్షత్రియుడు గాడు. మీ యిద్దఱకు నేమి సంబంధము? నావంటి భయంకరమూర్తి కన్పించగా క్షత్రియుడైనవాడు తాను స్త్రీని వెను కకు ద్రోసి తాను ముందునకు వచ్చి నిలబడును. ఇతడు నీ వెనుకకు

దాగుకొనుచున్నాడు. మీరు వచ్చి నాల్గు దినములైనదని నీవు చెప్పుచున్నావు. ఇది నగరమైనను అడవి. రాత్రులందు మాత్రమే మీరిచ్చటికి వచ్చుచున్నను తోడు లేకుండా కత్తులుకటారములు లేకుండ నెట్లు వచ్చితిరి? ఎందుకు వచ్చితిరి? నా కర్థము కాలేదు.

స్త్రీ:—మేము వచ్చి పది దినములైనది. ఈ పది దినముల నుండి మే మిచ్చటనే నివసించుచున్నాము. ఈ యూరికి చివరి నొక దొనయున్నది. అది సంతతప్రవాహశీలమైనది. దానిప్రక్క నొక చిన్న సౌధమున్నది. మే మొక నెల దినములకు కావలసిన భోజనసామగ్రి తెచ్చుకొన్నాము అందులో నివసించుచున్నాము. జలసమృద్ధిగల స్థలము. ఆ చుట్టుపట్లకల కొన్ని వృక్షములు ఫలభరితములు. వాటి నెవ్వరు తాకుటలేదు. మేమా ఫలముల నారగించుచు బ్రతుకుచున్నాము. తెచ్చికొన్న పదార్థములను పరిమితముగా వాడుకొనుచున్నాము. మేము విడిదిగా నున్న చోట భయము లేనట్లున్నది. తక్కిన సర్వమైన శిథిలమైన నగరము యొక్క తీరు వేరు. అచట మేమున్న కొంచము ప్రదేశము యొక్క తీరు వేరు. కొన్ని దినములకు పూర్వ మొక యోగి నివసించుచుండెడివాడట. అచటి కడవిజంతువులు వచ్చుటలేదు, మేము దివాసమయములయందా ప్రదేశములు వదలిరాము. దశమినాటికి వెన్నెలలు బలిసినవి. ఆ వెన్నెలలో నీ పాడుపడ్డ నగరమును చూడవలెనని సంకల్పించితిమి. చాలా భాగము చూచితిమి. ఈ భాగమీనాటికి మిగిల్చితిమి నీ దర్శనమైనది మేమింకొకనాడు వచ్చినచో సత్పురుష సమాగమకృత బహిష్కృతులమయ్యెడి వారమేమో "

వ్యక్తి:—మీరు దివాసమయములందిచ్చటి కేల రారు?పగలు వచ్చినచో నేనిచ్చట నుండెడివాడనుగాను. మీరు పోయి యథేచ్ఛగా రాజాంతఃపుర ప్రదేశములన్నియు చూడవచ్చును.

స్త్రీ:—నీవు దివాసమయములందిచ్చట నెందుకుండవు?

వ్యక్తి:—మీరు దివాసమయములం దెందుకు రారు?

స్త్రీ:—అయ్యా! అది యొక రహస్యము. మే మెచ్చట మంటిమో ఎవ్వరికిని తెలియరాదు. మా కోసం జనులు తిరుగుచుందురు.

మేము కన్పించినచో వారు మమ్ము వధించవచ్చును. లేదా బంధించి తీసికొనిపోవచ్చును.

వ్యక్తి:—ఈ నగరమందు మనుష్యనివాసయోగ్యమైన స్థలము నీవు చెప్పిన దొక్కటే. ఎవరైనను వచ్చి యిచట దాగికొన్నచో, దాగికొందురని యనుకొన్నచో మొట్టమొదట నీవు చెప్పిన స్థలము నందే చూతురుకదా!

స్త్రీ:—నిజమే కాని, అచ్చటనే చూడరు. అంత ప్రసిద్ధమైన స్థలములో వారెందుకుందురు? పారిపోయివచ్చినవారు ప్రసిద్ధ స్థలముల యందు దాగియుండరు. అని ప్రసిద్ధ స్థలములను వెదకుట మాని వేయుదురు. మరియు మేమున్న స్థలములో నా యింటిలో నొక రహస్యప్రదేశమున్నది. అది యొక భూగృహము. పూర్వ మిచ్చట నుండెడి యోగి యా భూగృహములో నుండి తపస్సు చేసికొనెడివాడట, ఆ గృహమునకు కొంతదూరమువఱకు జనులు పోరు. ఆయన తపస్సు నకు భంగకరముగా పలుజనులు వచ్చుటచేత నాయన శపించెనట! ఈ మేరదాటి ఎవరు వత్తురో వారు శునకము లగుదురని! అది యను భూతమైన విషయము. అందుచేత సర్వజనులు నా భూగృహముచుట్టు చాల దవ్వు పరిహరింతురు

వ్యక్తి:—మీరు శునకములా? నేను మానవులనుకొన్నాను.

స్త్రీ:—నీవు రమణీయమైన బుద్ధిలక్షణము కలవాడవుమాత్రమే కాదు; హాస్యరసశీలుడవు కూడాను. ఆ యోగి యా భూగృహమును తక్కుటీర ప్రదేశమును వదలిపోయి చాలా పండ్లయినది. కనీసము పదియేండ్లయిన కావచ్చును. ఆయన యున్నప్పుడే యీ శాపము పనిచేయుచుండెను. ఆయన పరిత్యజించి పోయిన తరువాత నా స్థల మునకు నా శాపదానశక్తిపోయినది. ఇది జనులకు తెలియదు. అందు చేత యిప్పుడును జనము దానిని పరిహరించుచునే యున్నారు. మా కది భద్రము.

వ్యక్తి—ఆ సంగతి మీ కెట్లు తెలియును?

స్త్రీ:—ఆ యోగి వెడలిపోయిన తరువాత మరియొక యోగి వచ్చి యచట కొన్నాళ్ళు నివసించెను. తరువాత తరువాత నతడికా శాపము దెలసెను. తాను మార్పు పొందలేదు. అత డొకనాడు మా

యింటికి వచ్చెను. ఈ సంగతి మా నాయనగారితో చెప్పెను. నేను వింటిని. ఇది యందఱకు తెలియదు. నేనీ రహస్యము నుపయోగించుకొనుచున్నాను. నేనిచటికి దివాసమయములం దెందుకు రానో చెప్పితినికదా! నీవు దివా సమయములం దిచట కెందుకుండవో చెప్పుము.

వ్యక్తి:—నీ కథ విన్నకొలది వినవలయు ననిపించుచున్నది. మీ నాయనగా రెవరు? ఆయన యింటనుండి నీవీ యోగి చెప్పిన మాటలెందుకు వింటివి? ఆ యోగి మీ యింటి కెందుకు వచ్చెను? నీ తండ్రి ధనవంతుడా? ఆధ్యాత్మిక విద్యాభిమానియా? పేదలను, బైరాగులను పోషించెడివాడా? నీవు గొప్పయింటి బిడ్డవా? ఇతడు నిన్ను లేవదీసికొనివచ్చెనా? నీ సంగతి నాకు సంపూర్ణముగా దెలిసిన గాని నా సంగతి నీకు చెప్పను. ఇతడు క్షత్రియుడు కాడు. కాడని యితని మొగమే చెప్పుచున్నది. నీవు క్షత్రియస్త్రీవి. నేను రాజాంతఃపురములో మెలగినవాడను. క్షత్రియకుటుంబములతో పరిచయము కలవాడను. క్షత్రియస్త్రీ పురుషులను నేను సులభముగా గుర్తుపట్ట గలను. ఇతడెవరు? ఇతడు నీవెంట నెందుకు వచ్చెను? ఇతని కుల మేమి? బ్రాహ్మణుడు కాడు. క్షత్రియుడు మొదటనే కాడు. వైశ్యుడు కూడా కాడు. శూద్రులలో నే కులమువాడు?

స్త్రీ—ఇన్ని తెలిసినవాడవు నీవు వీని కులమును తెలిసికొన లేవా?

వ్యక్తి:—నేను రాజాంతఃపురములో నుండెడి సేవకుడను. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులను చూచుచుందును. వారి ముఖలక్షణ ములు, వారి శరీరాంగ విన్యాసవైఖరులు, వారి నడకలు, వారి మాటలు, వారి నవ్వులు, వారి చూపులు మొదలైనవి నాకు సుపరి చితములు. ఆ యా వర్ణములవారి ఆ యా లక్షణముల యందొక సామ్యముండును, ఆ సామ్యము బుద్ధికి భాసించి పరిచయముచేత నిలువద్రొక్కుకొనును. ఒకనియందా లక్షణము కనిపించినంతనే ఇతడీ వర్ణము కలవాడని తెలియును. ఉత్తమ శూద్రులందురు. శూద్రులలో కొన్ని కులములవారు సంప్రదాయశుద్ధి కలిగి, సంపన్న గృహస్థులై, సదాచారవంతులై, పౌరుషశాలులై, బ్రాహ్మణులవోలె, క్షత్రియుల

వోలె. వైశ్యులవోలె బ్రతికెడివా రున్నారు. కాని వారి ముఖలక్షణ ములచేతనే వారు శూద్రులలోననే యీ తెగకు చెందినవారని నిర్ణయించుకొనవచ్చును. వారును రాజ కార్య దురంధరులు. రాజధానికి వత్తురు. రాజ దర్శనమునకు వత్తురు, నేను వారిని కూడ గుర్తుపట్టగలను. కాని, రాజధానికి దూరపట్టణ ములలో, పల్లెలలో, వన్యసీమలలో, పర్వతములలో నివసించు బహు జాతులను నే నెఱుగను. వీడీ జాతివాడని తెలిసికొను టకు పరిచయము కావలెను. కొందఱు బట్టలు నేయుదురు. కొందఱు వడ్రంగము చేయుదురు. కొందఱు గుడ్డ లుతుకుదురు. కొందఱు పశువులను కాయుదురు. కొందఱు గొఱ్ఱెలను మేపుదురు. తర తర ములుగా వారా వృత్తులను చేయుటచేత వారి దేహములయందు, వారి మొగములయందు, వారి మాటలయందు నది యొక వైలక్షణ్యా మేర్పడియుండును. అది రక్తనిష్ఠ మగును. ఆ జాతి కది లక్షణ మగును. నాకు పల్లెటూళ్ళయందు తిరిగెడి నలవాటు లేదు. కనుక నేను వారి వారిని జూచి వారు వారే జాతివారో తెలిసికొనలేను. నిన్ను జూచి సులభముగా క్షత్రియస్త్రీయని గ్రహించితికదా! అతడీ కులస్థుడని నేను గ్రహించుటలేదనగా వారి వర్ణమువారితో పరి చయము లేదన్నమాట. అతడే కులస్థుడో నీవు చెప్పుము.

స్త్రీ:—ఏ కులస్థుడైననేమి? మానవుడు!

వ్యక్తి:—నేనును మానవుడనేకదా! మానవునివలె గన్పించు చున్నానుగదా! నేను వికృతస్వరూపుడనుగదా! వికృత స్వభావుడను గానుకదా? ఇతడు సుందరాకారుడుగదా! అతడు సుందరుడు; నేను సుందరుడనుగాను. సుందరుడను కాకపోవుటయేగాదు పరమ భయం కర స్వరూపుడను. మీ యిద్దఱి సంబంధము నాకు తెలియదు. నీ మనస్సునకు కష్టము కలుగకుండుచో నేనొక మాట యందును. మీ రిద్దఱును లేచిపోయివచ్చిరనుకొందము. వాడు నిన్ను తగులుకొని వచ్చెను. లేదా నీవు వానిని తగుల్కొని వచ్చితివి, వాడు మానవు డనుచున్నావు. నేనును మానవుడనేకదా? నీకు మానవత్వము మీద నంత యభిలాషయైనచో, నంత యభిమానమైనచో, నంత సమాన దృష్టి యున్నచో వానిని వదలిపెట్టి యిచట నాతో నుండుము. వాడు

నిన్ని యడవిలో రక్షించలేడు. నేను రక్షించగలను. ఏదైన ఆపద వచ్చినచో నీవు వానిని రక్షింపవలయును. నీవు క్షత్రియస్త్రీవి. నీ రక్తములో ధైర్యసాహసములున్నవి, వాని రక్తములో లేవు. కని పించుచునేయున్నదికదా! నీవొకవేళ వానిని తగుల్కొని వచ్చినచో నందఱును మానవులేయని యెట్లనగలవు? అందఱును మానవు లైనచో వీని మొగమున యేల ప్రొద్దు పొడపించితివి? వీనియందు నీకు నచ్చిన విశేష మొకటి యున్నది - అది యేమిటి? వాని తనూ సౌందర్యము. వాని మొగమునందు నీ హృదయము నాకర్షించు నొక లక్షణమున్నది. ఆ లక్షణము వానిని తక్కిన మానవులనుండి వేఱు చేయుచున్నది. ఎప్పుడొక లక్షణము మానవునొకని మఱి యితరుల నుండీ వేఱుచేయునో అప్పుడు మానవుడన్నమాట. సామాన్య ధర్మ బోధకము. వీడు సుందరుడన్న మాట విశేషధర్మ బోధకము. అట్లే బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర శబ్దములుగాని వారి వారిలో నున్న అంతర్భేద లక్షణములుగాని విశేష ధర్మము లగుచున్నవి. సృష్టిలో విశేష ధర్మములను పాలింతురుగాని సామాన్య ధర్మములను పాలింపరు; పాటింపరు, పాటించుటచేతనే విశేష ధర్మములు పాలింప బడుచున్నవి. మానవసృష్టియందు విశేషమున్నది. జంతువులయందీ ధర్మమున్నది. మేమందఱము జంతువులమని పెద్దపులి లేడిని పాలిం చదు. ఆహారమని తినును. జంతువులయందు వివేకము లేదు. మాన వులయందున్నది. విశేషములను పాలించుటయందే మానవుని వివేక మున్నది. లేనిచో వారును జంతువులవంటి వారే యగుదురు, అగు దురుపో నష్టమేమి? బ్రతికినన్నాళ్లు బ్రతుకుదుము. తరువాత చని పోదుము, మొదలైన వేదాంతము నాస్తికులు చెప్పుదురు. నిజమే. కాదనుటకును వీలులేదేమో! కాని, కొంత విశేషమును మానవుడు పరిగణించుచున్నాడు. అందఱును మానవులే! అందఱును స్త్రీలే! అందఱును పురుషులే! యథేచ్ఛాసంగమము చేయుటలేదు. పశువుల యందు ఋతుకాలము ప్రధానము. మానవులయం దట్లుకాదు. ఇచట ఋతుకాలము పశువులయందువలె విస్పష్టముగా గన్పించుటలేదు. పశువులయందు ఋతుకాలము, సంగమము, గర్భధారణము నిశ్చ యముగా నున్నవి. మానవజాతియందట్లు లేవు. మరియును సౌందర్య

మొక్కటి స్త్రీ-పురుష పరస్పర వాంఛయందు ప్రబలమైన కోరికగ గనిపించుచున్నది. సౌందర్య మొక్కటియే కాదు; అధిక యౌవనము పౌరుషము, శౌర్యము, ధనము, సుద్యోగము మరియును వంశము, నారోగ్యము, పరిశుభ్రత, మధురవాక్కు మొదలైనవి స్త్రీలయందు పురుషులును, పురుషులయందు స్త్రీలును వాంఛించుచున్నారు. వీనిని వేనిని కోరనప్పుడు నా కభ్యంతరము లేదు. ఇతడు మానవుడు. యదృచ్ఛాప్రాప్తమైనవాడు. పైన చెప్పిన విషయములన్నియు కొంత ప్రత్యక్షములు. ప్రత్యక్షములు కానివి యున్నవి. అందులో ప్రధానమైనది వర్ణము. దానినెందుకు పాటించరు? దానిని పాటించుట చేత నొక మహాగుణ ముద్భవించుచున్నది, వ్యక్తులున్నారు. అందఱును కలసి యొక సంఘము. వ్యక్తిధర్మము వేఱు. సంఘ ధర్మము వేఱు. నీవు వ్యక్తిధర్మమునకే ప్రాధాన్యమిచ్చినచో సంఘ ధర్మము చెడిపోవును. సంఘధర్మమును మనస్సులో నుంచుకొని వ్యక్తి ధర్మమును పాలింపవలయును. వ్యక్తిధర్మము పాలింపబడుటచేత సంఘము సురక్షితమగును. సంఘధర్మము పాలింపబడుటచేత వ్యక్తి సురక్షితమగును. వ్యక్తి సంఘము లన్యోన్యాశ్రయముకలవి. దీనిని గుఱించి చెప్పవలసినది చాలా యున్నది. ఇతడు మానవుడని చెప్పినచో సరిపోలేదు. సౌందర్యవంతుడని కూడ చెప్పవలయును. సౌందర్యమన్న లక్షణముకల మానవుని నీ వెన్నుకొని నన్ను మోసము చేయుటకు మానవుడని చెప్పుచున్నావు.

స్త్రీ:—నీవు బ్రాహ్మణుడవా? అనగా నావ్యక్తి కిల కిలా నవ్వెను. అతని నవ్వులును వెన్నెలలును గ్రుచ్చియెత్తబడెను.

# 2

పున్నమనాటి మరునాడు కృష్ణపాడ్యమివచ్చెను. కృష్ణపాడ్యమి యనగా తొలి రెండుగడియలు చీకటి తప్పదు. ఆ చీకటి చమత్కారముగా వచ్చును. వచ్చెను-రాలేదన్నట్లు వచ్చును. చీకటి తప్పకుండ వచ్చును, వచ్చినంతలో తునిగిపోవును, వెన్నెలకోసము ప్రతీక్షించువారికి చీకటి వచ్చినట్లు తెలియునుగాని తక్కినవారికి తెలియదు

శుక్లపక్షములో పగటి వెలుగునకు రాత్రి వెన్నెలకు నెడము కన్పిం చదు, కృష్ణపక్షపు పాడ్యమినాడే ఆ యెడము కన్పించును. కృష్ణ పక్షపు ప్రతిపత్తున నెడము సన్నముగా నుండును. రేఖామాత్రముగా నుండును. కచ్చితముగా కోయబడిన రెండు చెక్కలనంటించినట్లుం డును, ఎడము లేదు. రెండును రెండని తెలియజేయు రేఖయున్నది. కాని, కొన్ని ప్రాణములకదియే బరువుగా నుండును. ఆ క్షత్రియ స్త్రీకి నా సుందరుడైన పురుషునకు నాయెడము బరువయ్యెను. అది యెడమగుటకు వారికి రెండు కారణములున్నవి. మొదటి కారణము వెన్నెల క్రమక్రమముగా క్షీణించును. మూడు నాలుగు దినములలో తమ జ్యోత్స్నావిహారముగాని శిథిల విభిన్న దేశములను చూడ బోవుటగాని జరుగదన్నది, రెండవ కారణము రాక్షసాకృతియైన యా విద్వాంసునివలన పలువిషయములు తెలిసికొనుట కభ్యంతరము కలుగునన్నది, మరియు నిప్పుడతడచ్చటనుండునా? రాత్రులందుండు దునన్నాడు. పగటివేలకూడ నుండునా? ఆశ్చర్యము, అతని వికారా కృతియేమి! అతని సౌజన్యమేమి! అతని యనాగరకరూపమేమి! వాని పాండిత్యమేమి! అతనిమాటలా స్త్రీకి మనస్సునకు కష్టమే కలిగించెను. ఆమె కవమానమే కలిగించెను. ఆమె వివేకమునుకాదను నట్లుండెను. ఆమె చేసినపని యసంగతమన్నట్లుండెను. ఆమెయొక్క వ్యామోహమును ప్రతిపాదించుచుండెను. కాని, యామెగుండియ వానియెడల నాకర్షింపబడుచుండెను. అట్టి యాకారముగలవాని కంఠస్వరము మిక్కిలి వికారముగ నుండవలయును. ధ్వని పెద్దదిగా నున్నను విస్పష్టముగా మధురముగా నుండెను. మేఘ గంభీరనిస్వా నమువలెనుండెను, అతని నవ్వు మరియు నచ్చెరువును గల్పించెను. మాటాడునప్పుడతని కంఠధ్వని పెద్దదిగా నున్నను, నవ్వునప్పటి వాని కంఠస్వరము సుకుమారముగ నుండెను. తుమ్మెదలు ఝంఝమ్మని తిరుగుచుచేసెడి సవ్వడివలెనుండెను. అతని పాండిత్యమట్లుంచి, వాని నాగరకతకు నబ్బురపడకుండనుండుటకు వీలులేకుండెను తాను స్త్రీ గనుక తన్నేమియుచేయడట, అతడు సౌందర్యాభిమాని, సౌంద ర్యము స్త్రీ పురుషులయం దెచ్చటనున్నను నతడాదరించును. ఆ యాదరముయొక్క లక్షణము విలక్షణముగా నున్నది. సౌందర్య

మును సౌందర్యముగా జూచి మన్నించును. దానికెక్కువ వెలకట్టడు దేనివెల దానికే, తూచి వెలకట్టుచున్నాడు, తానీ సుందరుడైన పురుషునితో లేచివచ్చెను. దీనినతడెట్లు గ్రహించెను? అతడు రాజాంతఃపురములయందు సేవకుడు, క్షత్రియాంగనలను సులభముగా నిరూపించికొనగలడు. ఈ సుందరుడు వానిమాటలను సర్వము గ్రహించలేదు, గ్రహించెడి శక్తి యితనికిలేదు, అతని ప్రసంగమెట్లున్నదని యడుగగా నితడు నవ్వెను. ఇతని మందహాసము లేతవెన్నెలలు లవలీకిసాలాగ్రములయందు వ్రాలి లేత మల్లియలమీద వ్రాలినట్లుండును, నాగుండియయొక యేకాగ్రతను భజించును, ఇతని యవివేకము నాకు భాసించదు, అతని ప్రసంగములోని నైపుణ్యమితడు గ్రహించలేదు, మరల నతనివద్దకు పోవుదమనగా నితడు తూష్ణీంభావమును వహించును. ఇతనిదేమున్నది? నేనేది చెప్పిన నది చేయును, ఊఅకయే వినును, సామాన్యవిషయములకు సమాధానము చెప్పును, అవిగో వెన్నెలలు వచ్చుచున్నవి.

ఇద్దఱును గలసి మరల నచ్చటికిపోయిరి, అతడచటనే నిలుచుండెను, అతడిట్లనెను:—"మంచిపని చేసితివి, చీకటిపోయిన తరువాత వచ్చితివి. చీకటిలో నావద్దకు రాకుము, నేడు కృష్ణపక్షప్రథమ దినము, రెండుమూన్నాళ్ళకు చీకటులు ముదురును, వెన్నెలలకు వెన్నెలతనము పోవును, కృష్ణపక్షములో మొదట నాలుగైదు దినములుపోయిన తరువాత వచ్చెడు వెన్నెలలు వెన్నెలలుకావు. అవి పేరునకుమాత్రము వెన్నెలలు, శుక్లపక్షములోని తదియనాటి వెన్నెల కూడ వెన్నెలయే, వెన్నెలలక్షణము శుక్లపక్షమునందు చవితిపంచముల నాటినుండియే నిండియుండును, అట్లే కృష్ణపక్షములో చవితి పంచము లారంభించి వెన్నెలలయందు చీకట్ల లక్షణమే నిండియుండును, నేడు రేపు నెల్లుండిమాత్రమే వెన్నెల వచ్చినతరువాత నీవు నాదగ్గఱకురమ్ము. తరువాత రావద్దు, మరల శుక్లపక్ష షష్ఠి సప్తములలో వచ్చుట నారంభింపుము.

స్త్రీః—"ఏమి? నీవు నల్లగా నున్నావుగనుక చీకటిలో నాకు గనిపింపవా?"

వ్యక్తి:—"నేను నీకు కన్పించుట యట్లుంచుము. నాకు నేనే

గనిపించను, నేనిట్లుండను, చీకటిలో నేను సాధువనుగాను, నా జ్ఞానము నన్నువిడిచి పోవును, నీవు నేడు మరల వచ్చుటచేత నీయందు నాకు సుంతయభిమాన మంకురించుచున్నది. ఈ యభిమానమును పాడుచేసికొనకుము, కడచిన రాత్రి యంత తొందరగా వెడలిపోయితి వేమి? వచ్చుటయే రాత్రిజాము ప్రొద్దుపోయి వచ్చితివి, రెండుజాము లుండవచ్చును, కోడికూసినప్పుడు వెడలిపోవచ్చును, ఎంతయో మాటాడుకొనవచ్చును, వెన్నెల పిండియారబోసినట్లుండెను, నీతో కొంత పరిచయమేర్పడెను. నా మాటలు వినెడువారులేక నేను తహ తహలాడుచుందును, నేను మహారాజుయొక్క ద్వారపాలకుడను, నా మాటలు రాజులకు, రాజపురుషులకు నక్కఱలేదు, నేనెప్పుడు నంతఃపుర స్త్రీలతోడనే మాటాడుచుందును, నీవును స్త్రీవి, స్త్రీల కేవైన మంచిమాటలు చెప్పుటకే నా గుండె యారాటపడుచుండును. దొఱకితివికదా! యని సంతోషించితిని, నేను నీతో నెన్నియో చెప్ప వలయును, మా రాజు చెడిపోయినాడు, ఎవ్వతెనో యొకర్తుకను తెచ్చినాడు, ఆమె లోకోత్తర సౌందర్యవతి, ఇదుగో నీ ప్రక్కనున్న పురుషునివలె, ఆమె మూగది, ఇతడు మూగవాడు. వీరి మూగ తనము ముఖావయవములకు సంబంధించినది కాదు, వారి మనస్సులకు సంబంధించినది, విద్యాబుద్ధులెఱుగనిది, రక్తగతమహాలక్షణములేనిది, మూగతనము, గ్రుడ్డితనము, కుంటితనము మొదలైనవి లోకమునందు శరీరావయవములకు సంబంధించి యవి పనిచేయకున్నప్పుడుగల లక్షణములుగా చెప్పబడును. కన్నులుండి కనలేడందురు. ఎదురుగా నున్నది కూడా చూడలేడు. ఎందుచేత? వివేకము లేకపోవుటచేత.

ఛాందోగ్యములో నొక కథ యున్నది. ఒకప్పు డింద్రియము లకు వానిలో వానికి నేను గొప్ప యనగా నేను గొప్పయని యొక వివాదము కలిగినది. కన్ను లేకున్నచో కలియుగమే లేదందురుకదా! అందుచేత నేత్రము తనకంటె సర్వోత్కృష్టమైన యింద్రియములేదని వాదించినది. అట్లే పంచేంద్రియములును వాని వాని యాధిక్యమును తాను తాను చెప్పికొన్నవి. మనస్సు కూడ నొక యింద్రియమే కదా! ఇవియన్నియు పోరాడుకొనుచుండగా మనస్సు మాటాడకుండా నూఱుకున్నది. ఈ ప్రశ్న యెట్లు తేలవలయును? చివరి కివి యొక

నియమము చేసికొన్నవి. ప్రతి యింద్రియమును తాను లేచిపోయి యొక సంవత్సర మెక్కడనో ప్రోషితత్వమును నెఱపి తిరిగివచ్చును. ఈ లోపుగా తక్కిన యింద్రియములు అవి లేకపోవుటచేత పనిచేయ కున్నచో, వ్యర్థములైనచో దాని యొత్కృష్ట్యము నిరూపింపబడును. ఇట్లు నిర్ణయించుకొని పంచేంద్రియములలో నొక్కొక్కడు బయలు దేఱి పోయి యేడాది యేడాది ప్రవాసము చేసివచ్చినవి. దాని దాని ప్రవాసములో తక్కిన యింద్రియములతో దేహయాత్ర సాగుచునే యున్నది. అందుచేతనే యింద్రియమునకు సర్వోత్కృష్ట లేదని రుజు వైనది. అప్పుడవి యన్నియు గూడి మనస్సుతో నిట్లు చెప్పినవి:—

"మేమొక్కరొక్కరము పోయి యేడాది వలసయుండి వచ్చితిమికదా! నీవుకూడ పోయిరమ్ము"—అని "అట్లే" అని మనస్సు తానుకూడ లేవబోయినది. అది లేచినంతనే తక్కిన యింద్రియములన్నియు పాదులనుండి పెగిలి హఠాత్తుగా పెల్లగిల్లినవి.

అది యెట్లున్నదనగా వేదకాలమునాడు మంచి యుత్త మాశ్వమును పరీక్ష చేసెడివారట! దాని నాలుగు కాళ్లు కలిపి త్రాటితో గట్టి ఆ త్రాడు భూమిలో లోతుగా పాతిన యొక మేకు నకు బిగించి కట్టుదురు. ఆ గుఱ్ఱము నేలపై బడియుండును. ఆ గుఱ్ఱము నొక చబుకతో ఛడేలున కొట్టుదురు. ఆ గుఱ్ఱమా చబుకు దెబ్బ కోర్వలేక నేలమీదనుండి శరీరమును మింటికెగిరించును. భూమిలో లోతుగా పాతబడిన యా మేకు పెల్లగిలివచ్చును. అప్పు డది యుత్తమాశ్వమని చెప్పుదురు. ఆ గుఱ్ఱమెగిరినంతనే ధాత్రిలో నుండి యా మేకెట్లు పెల్లగిలివచ్చునో మనస్సు లేచినంతనే యింద్రి యముల కుదుళ్ళు లేచిపోయినవి. అప్పుడు మనస్సుయొక్క ప్రాధా న్యము తెలిసినది. ఇది యర్థవాదము. ఒక విషయము యొక్క ప్రాధా న్యమును చెప్పెడు కథను వేదములయందర్థవాదమందురు. ఏలయనగా ముక్కు-కన్ను-చెవి మాటాడలేవుకదా! మాటాడలేని వానిని మాటాడినట్లు నిరూపించుట హాస్యాస్పదమగును. కాని యివి యచట మాటాడినట్లు చెప్పబడినవి. ఎందుకయ్యా యనగా, నీ కథలో మనసుయొక్క ప్రాధాన్యము చెప్పబడుటకు చెప్పబడినదికాని మరి యొకందుకుకాదు.

ఇది యెందుకు చెప్పితిననగా వాడు గ్రుడ్డివాడనగా వాని మనస్సు వాని నేత్రేంద్రియమునంటి పెట్టికొనియుండలేదని యర్థము. వెనుక మనస్సు లేనిచో కన్ను చూడదు, చెవి వినదు, నాసిక ఆఘ్రాణించదు. ఇట్లుండగా నా మనస్సు యొక్క శక్తిని బట్టి యింద్రియములు పనిచేయును. మనస్సు పేదమనస్సైనచో వాడు సరిగా చూడలేడు. వినలేడు. లోకములో తర్కమనగా కార్యకారణ సంబంధము. ఆ కార్యకారణ సంబంధమును తెలిసికొనుట వివేకము. తెలిసికొనలేక పోవుట యవివేకము. లోకమునందుగల సర్వ విషయములు కార్యజాతములే. అన్నియు కారణజాతములే. మనుజుని వివేకమునుబట్టి వానికి గల కార్యకారణ సంబంధము విదితమగును. దానికి విద్యాబుద్ధులు కావలయును. జన్మలోనున్న రక్తమునందు నిష్ఠమైయున్న మహాగుణములు కావలయును, ఒక సంప్రదాయము కావలయును, పూర్వజన్మకర్మమునుబట్టి వాడిది యనుభవించుచున్నాడని లోకమునందందురు. ఒకడు పూర్వాపరజన్మములయందు విశ్వసించడు. వానికి నందుగల కార్యకారణభావము విదితమగుటలేదు. అట్టియొక జాతియున్నదనుకొనుము. వారికిని వివేకమునకు నెంతదవ్వు! వివేకమనగా నొకటి తెలిసి యొకటి తెలియక యుండదు. అన్నియును తెలియుటయే, అన్నిటికిని గల పరస్పర సంబంధమును గ్రహింపగలుగుటయే! పరులు చెప్పినది వినుటయే, నేనెప్పటికప్పుడు క్రొత్తగా నూహింతుననగా నేమి యూహింతును? ఊహ యనునదెట్టిది? ఊహ యనగా నేమి? ఊహ దానియంతట నది పుట్టదు. ఒకదానిని సంబంధించి యుదయించును, ఒకదానిని గురించి యూహింతువు, దేనిని గురించియు నూహలేనిచో నది జడముక్రింద లెక్క, ఊహలేకుండుట యొకటి, ఊహను చంపుట యొకటి. ఊహలేదనుకొమ్ము. దానిని ప్రాగభావమందురు, అది జంతువులయందున్న విషయము, ఊహను చంపితివనుకొనుము, దాని పేరు ప్రధ్వంసాభావము. అది యోగియందుండును. ఊహ కీ రెండు విషయములుండును, అవివేకి యీ రెంటినడుమనుండును.

స్త్రీ:-"అయ్యా! నేను నిన్న మిమ్ములను బ్రాహ్మణులా యని

యడిగితిని, మీరు నవ్వితిరి, మీరు చెప్పినవానిలో కొన్నిటిని నేను విన్నాను, తెలిసికొన్నాను. ఇప్పుడు మీనుండి మఱికొన్నిటిని తెలుసు కొనుచున్నాను. మీరు పండితులు. నిస్సందేహముగా బ్రాహ్మణులై యుందురు. మీ మెడలో యజ్ఞోపవీతము కన్పించుటలేదు. బ్రాహ్మణులు కానిచో నింత వివేకముండదు. మీరు చెప్పినవానిలో కొన్నిటిని నేను విన్నానని చెప్పితినికదా ! నేనెచ్చట విన్నాను ? నా తండ్రి ధనవంతుడు, ఉదారుడు, కొన్ని గ్రామములకు ప్రభువు. మేము క్షత్రియులము, నా తండ్రి వేదము చదివినవాడు, పండితుల నాదరించెడివాడు, పండితులు మాయింటికి వచ్చుచుందురు, నాకు వయసు వచ్చువఱకు నేను నా తండ్రియొడిలో కూర్చుండియో, భుజముమీద పండుకొనియో వారి వాగ్వాదములు చాల వినుచుండెడిదానను, నాకు వయసు వచ్చిన తరువాత మేము క్షత్రియులము గనుక నన్ను బయటికి రానిచ్చెడివారుకారు. మావారంతఃపుర మర్యాదలు పాటింతురు. ఆ దినములలో మా నాయనగారి దర్శనమునకు వచ్చెడి బహు పండితుల మాటలు నేను విన్నాను ఆ సంస్కారము నాలో చెడకుండ మరియొక సన్నివేశ మేర్పడినది. మా పురోహితుడున్నాడు, ఆయన వృద్ధు, ఆయన మాయంతఃపురములోనికి వచ్చుటకు నధికారము కలదు. నా తల్లి యాయనకు కూతురువంటిది, ఆయన మాకు నరణపుపండితుడు, మాది పెద్ద రాజ్యముగాదు. కాని, యన్నియు రాచపోకళ్ళు, చక్రవర్తుల యిండ్లలోని లక్షణములు మా యిండ్లలోగూడ పాటింపబడుచుండెడివి. నేను నా తండ్రి కల్లారు ముద్దుబిడ్డను. నాకు తెలియకుండ నా తండ్రి యే కార్యమును జేసెడివాడుకాడు. మహారాజుల యిండ్లలో పోయెడి పోకిళ్లు మా యిండ్లలో పోవుటవలన మా యాదాయము మాకు చాలెడిదికాదు, ఎప్పుడును చేవెలితిగనే యుండెడిది, నాలుగేండ్ల కొకసారియో, యైదేండ్ల కొకసారియో మా నాయనగారొక గ్రామమును విక్రయించెడివాడు.

ఇంతకును రాచపోకళ్ళ మాటను చెప్పితిని, అరణపు పండితుడు వచ్చెడునంత అతనిని తెచ్చెడునంత భోగము మాకు లేదు. మా తాతగారికిని లేదు, అయిన నా యాచారము మా యిండ్లను వదలిపెట్టి పోలేదు. ఆ పండితునకు మా అమ్మగారు కుమార్తెవంటిది

గనుక, ఆయనకు నేను మనుమరాలను. ఆయన మంచి పండితుడు. మా యమ్మగారితో నా పండితుడు వీరైనప్పుడెల్ల గొప్ప గొప్ప సంగతులు చెప్పుచుండును. నేను చిన్నప్పుడు నా తండ్రియొడిలో నెట్లు కూర్చుంటినో యా పండితుని యొడిలో నట్లే కూర్చుంటిని. నాకు వయసు వచ్చినతరువాత తక్కిన పండితుల యుపన్యాసములు వినకపోయినను మా పండితుని వాక్యములు వినుమనేయుంటిని. ఆయనకు నేనన్నచో పట్టరానంత ప్రేమ. ఇందులో నొక విషమస్థితి కలిగినది. మా యమ్మగారి వెంట నా పండితుడు వచ్చెననగా నతని కుటుంబ భారమంతయు మోయవలసినవారము మేమని యర్థము. ఆయన నివసించుటకు గృహమును మా నాయనగారిచ్చిరి. ఆయనకు సంతానమున్నది. వారును పెరిగి పెద్దవారైనారు. అతని యింటిలోని వ్యయము నాల్గురెట్లైనది. ఇచట మా నాయనగారి పనియే కొంత కొంతగా పచ్చియారనారంభించెను. మా నాయనగారా పండితునకిచ్చునవి కొన్ని వార్షికములు, కొన్ని మాసికములు, కొన్ని దైనికములు. వార్షికములెట్లో యట్లు చెల్లుబడియైనను, నెలతరబడి యిచ్చెడివి దినములతరబడి యిచ్చెడివి కొఱతపడుచుండెను. వారి యింటిలో నిబ్బందియగుచుండెను. ఆ పండితుడు మా యిల్లు వదిలి పెట్టి మా యూరువదలిపెట్టి మరల మా తాతగారివద్దకు పోవలయుననగా నది యెట్లుపొసగును? పాతికయేండ్లుగా మా గ్రామమున మమ్మాశ్రయించియుండి యిల్లువాకిలియన్నవి మా గ్రామములో నుండి నేడు గుడ్డదులిపికొని పోవలయునన్న సత్రములో పండుకొనిన వాడా? సత్రములో పండుకొనినవానికది సాధ్యమగును. వాడు లేచి గుడ్డదులిపికొనిపోవును.

కాని, యొకటున్నది. మా సంసారముయొక్క యిబ్బందులు మా తండ్రియొక్క చేవెలితియు నా పండితుడు చూచుచునే యున్నాడు. అందుచేత నాయన తన సంపాదన తానే చేసికొనుచుండెను. మా నాయనగారిచ్చినది తీసికొనుటయేగాని తొలినాటివలె తనకిది కావలయునని యడుగుటలేదు. క్రమక్రమముగా నేమైననగా నతనికుటుంబము మా కుటుంబముమీద నాధారపడియున్నదని చెప్పుటకే వీలులేకుండెను. కాని, యతడు మా తల్లియొక్క

యరణపు పండితుడనియు మా యాశ్రితుడనియు మా కొలువులోని వాడనియు నన్ను విషయము మానిపోలేదు. తొలినాడాయన మా యింటికి తఱచువచ్చుచుండెడివాడు. ప్రతిదినము వచ్చుచుండెడివాడు. చివరిదినములలో తనకు వీలైనప్పుడెల్ల వచ్చెడివాడు. ఆయన వచ్చినప్పుడెల్ల మా యమ్మగారు గృహములో నిబ్బందిగానున్నను కొన్ని సంభారములను సమకూర్చి యాయన వెంటపంపెడిది, అది యాయన కిష్టములేదు. ఆయన వచ్చినచో మా యమ్మగారిట్లు చేయునని యాయనకు తెలియును అందుచేత తఱచుగా మా యింటికి వచ్చెడి వాడు కాడు. ఆయన రాకపోయినచో మా యమ్మగారికి తోచెడిది కాదు. నాకు మరీ తోచెడిదికాదు, ఆయనయొడిలో పెరిగినదానను చిన్నప్పుడాయన చంకలో నుండినదానను, ఆయన కన్పించినంతనే ప్రాణములు లేచివచ్చెడివి, నా చిన్నప్పుడాయనరాగా. తాతగారు వచ్చిరని పోయి కాళ్ళకు పెనవేసికొనుట నాడు చెల్లినదిగాని వయసు వచ్చినతరువాత దానికి చెల్లుబాటుపోయినది. "తాతగారు వచ్చిరి"— అంతే. నేనుపోయి సమీపమునందు నిలుచుండుటయు తప్పే. తొలి నాటివలె పరాచికములాడుటయు తప్పే. నేనొక హద్దుదాటి మాటాడి నచో, ప్రవర్తించినచో నాయన వెళ్ళినంతనే తల్లియో, తండ్రియో, వారి మాటమీద నొక దాసియో నన్ను అట్లుచేయుట తప్పని మంద లించుట జరుగుచుండెడిది. కాని, యొక్క రహస్యము, అది నాకు తెలియును, ఆ పండితునకు తెలియును, అతడు తనకడుపునపుట్టిన కూతురుకంటె నన్నెక్కువ ప్రేమించుచుండెను. నా కాయనమీద గల ప్రేమ నిజానికి నాకు నా తండ్రిమీద లేదు, నా తల్లిమీద లేదు.

ఎక్కువసార్లు వారి కుటుంబము మాయింటికి వచ్చుచుండెడి వారు, మేము వారియింటికి పోవుట తక్కువ, మా నాయనగారు, మా యన్న, మా కుటుంబములోని పురుషులు వారియింటికెన్నడు పోరు. ఆయనయు నాయనకొడుకులును మా యింటికి వత్తురు. మా నాయనగారి దర్శనము చేయుదురు. వినయముగా ప్రవర్తింతురు-ఆ పండితుడు మా నాయనగారియందు మిక్కిలి వినయమును ప్రదర్శిం పడు. నా తండ్రితో సమానునివలెనే ప్రవర్తించును, నా చిన్నప్పుడు పండిత కుటుంబములోని స్త్రీలు మా కోటలో నే చిన్నియక్కలు

వచ్చినను వచ్చుటయు, నిబ్బడిముబ్బడిగా సొమ్ములు వస్తువులు కొని పోవుటయు కలదు. మా తల్లి కాని, మా కోటలోని మా రాజకుటుం బములోని స్త్రీలుగాని వారి యింటికెప్పుడో పోవుటకలదు.

నాకు వయసు వచ్చినతరువాత నేను పండితునితో తొలినాటి చనవు 'నెఱపుట మర్యాదా దూరమన్న విషయము తెలిసిన తరువాత నేనును నా వెంట నొక పరిచారికగా వారియింటికి పలుసార్లు పోవుట యారంభించితిని ఆయన కిద్దఱు కుమారులు, ఇద్దఱు కూతుండ్రు. అందఱకు పెండ్లిండ్లయినవి. పురుడో, పున్నమో, పండుగో, పబ్బమో ఎప్పు డేదియో యొకటి జరుగుచునే యుండెడివి నేను పోవుచునేయుండెడిదానను, మా తల్లి వద్దన లేదు, మా తండ్రికి తెలిసి కూడ మూకీభావము వహించెడివాడు. మా వ్యవహారము నుంత నుంత చిదికిపో నారంభించెను. ఒకటి రెండు సార్లాపండితుడే మా నాయనగారికి సాహాయ్యముచేసెను, మారాచబిడ్డ దాని నంగీకరించ దని యాయనకు దెలియును. అందుచేత నతడు రహస్యముగాచేసెను. అత డుపకారముచేసిన సంగతి మా తండ్రికి తరువాత తెలిసినది, ఆయనయు నెడదలో సంతోషించెను.

ఇది యిట్లుండగా, నా పండితుడు వృద్ధుడైనాడు. అదివఱ కతడు యాచించి యెఱుగడు, ఎవ్వరి నాశ్రయించెడివాడు కాడు. మా యాస్థానమునుండి పరుల నాశ్రయించుట మా రాజకుటుంబ మునకు తలవంపు. అందుచేత తత్పూర్వమునం దతడెంత పండితుడో ఎవరికిని తెలియదు. మా యాశ్రయము క్రమక్రమముగా సడలిన కొలది, యాయన దేశముమీదికిపోయిన కొలది యాయన సంగతి యందఱకు తెలియుటయు, నతనికొడుకులు కూడ పండితులగుటయు వారారుచేతులతో సంపాదించుచుండుటయు జరిగెను. వారారేండ్లలో మంచి ధనవంతు లనిపించుకొనిరి.

సామాన్య కుటుంబములవారు ధనవంతులనగా దాని యర్థము వేఱు. ధనవంతుడు పేదవాడునన్నమాటల కర్థములు భేదించు చుండును. సామాన్య కుటుంబములలో వ్యయము తక్కువ. ఒక్క క్రొత్త చీరనుకొన్నచో నది మంచి చీరయేకావచ్చును. గొప్ప చీర యనియే యనిపించుకొనును. దానివెల యొక దీనారములో పది

యవవంతుండును. మా కుటుంబములలో నాలుగైదు దీపారములు పెట్టినగాని మంచి చీరయన్నదిరాదు. ఆ పండితుని గృహము సంపన్న ముగా నున్నదనగా మాకు మిగిలిన సంపదలో నది పదియవవంతుం డదు. కాని వారు సంపన్నగృహస్థులు. మేము చిదికిపోయినవారము. వారివలె బ్రతుకుట యారంభించినచో మేము వారికంటె పదిరెట్లె క్కువ సంపన్నులము, ప్రొద్దుక్రుంకునప్పటికి మా యింట వంద దీపములుండును, వారియింట రెండు దీపములుండును. వారియింట మిక్కిలిగా లేచినచో పూటకు పదివిస్తళ్ళు లేచును, మాయింట పూటకు వందమంది తిందురు. అయినను మేము చిదికిపోయినవారము. వారు సంపన్నగృహస్థులు.

నేను వారియింటికి పోవుటకు మావాంఛ్రదభ్యంతరము చెప్ప లేదు. అందుచేత నేను వారియింటికి పోయినప్పుడెల్ల నేనాపండితు నితో చాలసేపు కూర్చుండి మాట్లాడెడిదానను, ఏవో ఏవో అడిగెడి దానను, చెప్పెడివాడు, అందుచేత నాకు చాల విషయములు తెలి యును, ఓయి! విద్వాంసుడా నేను పూర్వము విన్నవానికంటె నీ వొండు రెండు విశేషములు నాకెక్కువ చెప్పితివి. ఛాందోగ్యములోని కథ మా తాతగారు నా కెప్పుడును చెప్పలేదు. తాతగారనగా నా పండితుడని యర్థము. నీవలననే మొదటిసారి విన్నాను. అయనకు నాయం దెంత ప్రేమయున్నదో నేను నీకు చెప్పినచో నా రహస్య మంతయును చెప్పినట్లే, నా బ్రిదుకంతయు చెప్పినట్లే, నా యిప్పటి స్థితిని నీకు విశదపఱచినట్లే.

ఓయి! నా సంగతి చాలవఱకు నీవు నీ వివేకముచేత, నీ యను భవముచేత నేను చెప్పకుండనే తెలిసికొంటివి. నీ సంగతి నాకేమియు తెలియదు, నీవు నా కవిదిత పురుషుడవు, నేను నీకు నాసంగతి యంతయు చెప్పినచో నాజుట్టు నీచేతికిచ్చినట్లే, ఇది పురుషుడనెడి మాట. నేననుచున్నాను. నీవెవ్వడవో, నాకు చెప్పుము. సత్పురుషుల తోడి ప్రసంగము సుఖదాయి, అది నన్ను లోభపెట్టుచున్నది. మరి యొంకొకటి చెప్పెదను. ఆ పండితుని వాగ్వైఖరికిని నీయొక్క వాగ్వైఖరికిని చాల సామ్యముకలదు, నన్నది ప్రలోభపెట్టుచున్నది. నీ వెవ్వరవో చెప్పుము.''

వ్యక్తి:-ఆ పండితుని పేరేమి?
స్త్రీ:-సుదర్శనభట్టారకుడు.
వ్యక్తి:-ఆయనను నాకు చూపింతు॥

# 3

నీ వడిగినావు గాన చెప్పుతున్నాను. నీ వడిగిన దానికి సమాధానము చెప్పుట తేలికగాదు. దాని వెనుక పెద్ద కథ యున్నది. మా కుటుంబములో జరిగిన బహు విషయము లట్లుండగా వాని వెనుక నొక కథ యున్నది. అది మా నాయనగారు చెప్పగా నేను విన్నది. మా నాయనగారి పేరు 'కార్తవీర్యార్జున వర్మ'. మా తాతలనాడెప్పుడో మేము మహారాజునకు యుద్ధములో సాయపడినారమట! ఆయన మహా వీరుడు. ఆ మా పూర్వుని శౌర్యమునకు మెచ్చి యా మహారాజు మాకు మువ్వది గ్రామములమీద నధికారమిచ్చెను. మే మప్పటికి నిప్పటికి రాజబంధువులము గాము. ఈ నేపాళదేశమున మావంటి చిన్న చిన్న ప్రభువులు పలుమంది కలరు. ఒక రాజున్నాడు. ఆయనకు నలుగురు కుమారులు. పెద్దవానికి రాజ్యము వచ్చును. తక్కిన మువ్వురేమి కావలయును? ఆ రాజునకు సంతానము కలిగినచో వీరు పినతండ్రులు. ఆ సంతానమునకు సంతానము కలిగినచో వీరు పినతాతలు. ప్రపంచకమున నన్ని కుటుంబములకువలెనే రాజ కుటుంబములును, నాలుగైదు తరాలమీద నేమగుచున్నది? రాజ వంశమునకును వీరికిని సంబంధము లేకపోవుచున్నది. లోకములో చెప్పికొనుటలేదా? వారు మాకు జ్ఞాతులు. వారికి మాకు తరాలు తెగిపోయినవి గోత్ర మొక్కటియేగాని మాకును వారికిని సంబంధము లేదు. మైలలు, పురుళ్ళు లేవు. ఇట్లే రాజవంశములు కూడను. కొన్ని వంశములు మరియు దూరమైపోకుండ వారి మనుమరాండ్రనో మేనగోడండ్రనో రాజబంధువులకు చేసికొందురు. ఇట్టి సంబంధములు కలచోట నెప్పటికప్పుడు మహారాజులు మరియు దగ్గటి వంశముల వారికి దగ్గటి బంధుత్వము కలవారికి కొన్ని గ్రామము లిచ్చి వారిని ప్రభువులుగ చేయుదురు. అట్లు నేపాళదేశమున చాలమంది చిన్న చిన్న ప్రభువులు కలరు.

మా ప్రభుత్వమట్టిదిగాదు: నాలుగైదు తరాలక్రిందటి మా తాత యెవరో యాయన యొక్క శౌర్యార్జితము. అందుచేత నేమైన దనగా మా తండ్రి వఱకు మా పూర్వులందఱును మహారాజులు. మా తండ్రి మాత్రమే కాదు; కాదనగా, కాదో-అవునో నాకు తెలియదు కొన్ని వందల యేండ్లుగా రాజ్యము సుఖముగా నున్నది. యుద్ధములు లేవు. ఏ మూలనో, యెవడో నుంత యెదురుతిరిగిన జాడలేదు. అట్టి పరిస్థితు లేర్పడినచో శూరులు కనిపింతురు, లేనిచో కనిపి చరు. లోకమునందేదైన నంతియే కదా! రావణాసురుడు జనించలేదు. రాము డవతారమెత్తవలసిన యవసరమేలేదు. అది ప్రపంచమున కొక నష్టము. భారతీయులకొక యుపాస్యదైవము లోపించెడివాడు, మహాదైవము లోపించెడివాడు. అట్లే మా తండ్రి వట్టి క్షత్రియుడు. ధనుర్విద్యయు, ఖడ్గవిద్యయు తెలిసినవాడే. ప్రయోగావసరము లేనప్పుడు ఏ విద్య యొక్క లోతెట్టిదియో యెట్లు తెలియును? ఒక విద్యకు ప్రధాన ప్రయోగావకాశములేనిచో నా విద్య మఱియొక దారితీయును. అందుచేత, మా తండ్రికి వేటయందు మహానురాగము కలిగినది- ఆ వేట యన్నచో నాయన ప్రాణములను వదలును.

మా నాయనగారు తన యాస్తిని చాలవఱకు పాడుచేసిరని చెప్పితినికదా! దానికి కారణము ఆయన యొక్క మృగయావ్యసనము. గుఱ్ఱములు, కుక్కలు, వేటకాండ్రు, వలలు, బఱిగోలలు మా యింటినిండా సమృద్ధిగా నుండును. ధనుస్సులు, కత్తులు, డాళ్ళు చెప్పుటకు వీలులేదు. అయిదారేండ్లమీద వాని నన్నిటిని కొనుటకునై దారూళ్ళు అమ్మవలసివచ్చెను. ఇదికాక, ఆ వేటకాఱు నలుబది యేబది కుటుంబములవారు. వారందఱిని మా తండ్రియే పోషింపవలయును. మా యమ్మగారి యతణపు పండితుడు—సుదర్శనభట్టారకుడని చెప్పితినికదా! ఆయన కుటుంబమునకు దినవెచ్చము పంపుటకు లేదుగాని యీ మృగయుల కుటుంబములకు లోపము జరుగుటకు వీలులేదు. మా యింటినిండ పెద్దపులి చర్మములు, చిఱుతపులుల, లేళ్ళ, భల్లూకముల చర్మములు వందలు వేలు. కొన్ని యిండ్లలో కుడ్యములయందు దేవతల పటములు క్రిక్కిరిసియుండును. మా యింటిలో నివి యుండును. మా నాయనగారు గొప్ప వేటకాడని

ప్రతీతి. ఎగురుచున్న లేడియొక్క నాలుగుకాళ్ళ నొక్కసారిగా బాణ
ముతో ఛేదించగలడట! ఈ విద్యకు మా తండ్రియే ప్రథముడట
ఆయన ప్రతిష్ఠ యెట్టిదనగా మహారాజొకనాడు వేటకు వెళ్ళుచు
నీయనను తోడు పిలిపించెను. ఈయన వెళ్ళెను. ఒక నెలనాళ్ళు
రాజధానిలో నుండెను. రాజు గొప్ప గౌరవము చేసెను. కాని,
చివరకు మా తండ్రి యింటికి వచ్చువేళకు రాజిచ్చిన దేమున్నది?
ఏమియునులేదు. చేసిన గౌరవము మాత్రమున్నది. మా తండ్రి
యెడమచేతికి నుత్తరీయమును చుట్టి నోరు తెఱచిన పులినోటిలో
దోపి పిడిబాకుతో పులిని పొడిచి చంపగలవాడు. ఆయన సాహస
ముతో కూడిన కథలు వందకు మించి కలవు.

ఆయనను చూడవలయును. నిన్ను చూచినచో జనము భయ
పడుదురు కదా! అని నీవే చెప్పితివికదా! దానిని నేను ప్రత్యక్షముగా
చూచుచున్నానుకదా! నీ మూర్తిలోని భయంకరత్వము వేఱు; మా
నాయనగారి మూర్తిలోని భయంకరత్వము వేఱు, నీ మొగములోని
వికారము—వికారమనగా కన్నులు, జుట్టు, చెక్కిళ్ళు, దంతములు,
చిబుకము సామాన్య మానవుల ముఖములయందు కంటె భిన్నముగా
నుండుటలో నున్నది. ఒక స్త్రీగాని, ఒక పురుషుడుగాని ఆకర్ణాంత
విశాలనేత్రములు కలవారని చెప్పబడవచ్చును. కనుక పెద్ద నేత్రము
లుండుట ముఖవికారహేతువు కాదు. సౌందర్యమనియే చెప్పవల
యును. ఆ పెద్ద కన్నులే యెప్పుడు సుందరములు? యెప్పుడు
భయంకరములు? మొదలైనవి విచారించినచో సౌందర్యమనగా
నేమి? వికారమనగానేమి? యన్న ప్రశ్న పుట్టును.

"మనమందఱము నేపాలదేశస్థులము. ఈ భారతదేశమున
నెన్ని దేశములు కలవు. అన్ని దేశములలోని స్త్రీలు, అన్ని దేశ
ములలోని పురుషులు సమానముగా నుందురా? ఏదో సన్నని మార్పు
భిన్నజాతులయందు తోచుచునేయుండును. ఈ జాతిలోని పురుషు
లకు ముక్కు పొడుగు, ఈ జాతిలోని పురుషులకు కన్నులు చిన్నవి,
మఱియొకజాతి చెక్కిళ్లు లోనికి తోసికొనిపోవును. కాని, యే జాతికా
జాతి వారి జాతియొక్క శరీరలక్షణముల ననుసంధించి సౌందర్య
మునో, వికారమునో తాముదా నిర్ణయించుకొందురు. వికారము

గాని, సౌందర్యముగాని యీ నిర్ణయముమీద నాధారపడియుండును. ఇంతకుమించి యింకొకటున్నది - ఏ దేశమందైనను, ఏ జాతియందైనను నందఱు మానవులేకదా. కనుముక్కు తీరు, ఫాలము యొక్క వెడల్పు, చెక్కిళ్ళ పొందిక ఇవియన్నియు నుండగా ఒక కొంతమేర మానవుని కన్ను సహించగలదు. కొంతమేర సహించలేదు ఆ సహించలేనిదానిని రాక్షసరూపమందురు.

భగవంతుడు సృష్టించినప్పుడే మానవులకు గల ఇంద్రియములు వాని వానికి భిన్నభిన్నములుగాగల శక్తులయందు పరిమితి నేర్పఱచినాడు. మనది చలిదేశము. మన మెప్పుడు నున్నిదుస్తులను వేసికొని తిరుగుదుము. ఉష్ణదేశములో జను లోర్వలేనంత వేడిని మనమోర్వగలమేమో' వేడిమి యనగా రెండు విధములు: ఒకటి: సూర్యుని వేడిమి, రెండవది వస్తువులలోని వేడిమి. చలిదేశములలోని వారికి నుష్ణమండలములలోని గ్రీష్మకాలములయెండ సహింపరానిదగును. అచ్చటి జనులు వారి నిత్యకృత్యములు వారు చేసికొనుచునే యుందురు. స్నానార్థము వేడినీళ్ళు కలవు. ఆ వేడినీళ్ల యుష్ణత మన మోర్వగలిగినంత యుష్ణమండల జనులోర్వలేరు. అట్లే చెవి కొంత శబ్దమును వినగలదు. ఆ శబ్దము యొక్క ప్రమాణము మితిమీఱినచో చెవులు పగిలిపోవును. అట్లే మానవరూపమును గ్రహించి సహించగలుగునొక ప్రమాణము మానవుని బుద్ధిలో నున్నది. ఆ ప్రమాణము బుద్ధికే తెలియును. అది దాటినచో వానిని వికారాకారుడనియందురు మరల నిందులో కొన్ని భేదములున్నవి.

ఒకడు గొప్ప వీరుడు. మా నాయనగారు గొప్ప వేటకాడు. ఆయన వేటలోచేసిన మహాకార్యములనుబట్టి ఆయనను వికారాకారుడురు. ఆయన యంత వేటకాడు కాడు. అప్పుడా యననువికారాకారుడందనరు. నీవు నల్లనివాడవు, నాతండ్రి ఎఱ్ఱనివాడు. ఇది కొంత భేదమును చేయును. ఇదియంతయు నేనెందుకు చెప్పుచుంటిననగా మా నాయనను మెచ్చుకొనెడివారేగాని, యాయన దగ్గరకు వెళ్ళెడివారు లేరు. ఆయనతో స్నేహము చేసెడివారూ లేరు, ఆయనను ప్రేమించెడివారు లేరు. ఆయన ప్రకృతికూడ సహజముగానో, వేటవలన సంక్రమించిన అతఃణములచేతనో భీమమూర్తి, భీమ ప్రకృతి, కాంత ప్రకృతి కాదు.

మనోహరమైన స్వభావము కాదని యర్థము. ఆయనకు పది పండ్రెండేడ్ల క్రిందటివఱకు నొక్కడే స్నేహితుడు, ఇప్పుడా స్నేహితుడు కూడ లేడు. అతని పేరు 'గాలి', మా నాయన యెంత భయంకరమూర్తియో, యతడంత సాధుమూర్తి. నా చిన్నతనములో నే నతనిని చూచితిని మా కతడు చుట్టము కాదు, చుట్టమువలె కన్పించెడివాడు. నాకేమిటి అతని చిరునవ్వు, అతని సన్నని మీసములు, సంస్కృతములైన శిరోజ ములు వినయమును భాసింప జేయు వేషధారణము సర్వజనులకు హృద యంగమముగా నుండెను.

ఈ యిద్దఱికిని పొత్తు కుదిరెను. కుదురుటకు హేతువు కలదు. గాలియొక్క శరీరము మా తండ్రికున్న శరీరములో నాలుగవవంతు కాని మా తండ్రికెంత బలముండెడిదో, గాలికంత బలముండెడిది. మా తండ్రి యెంత సాహసుడో అతడంత సాహసుడు. మా తండ్రి యెంత వేటకాడో అతనంత వేటకాడు. వారి చెలిమి కిది కారణము. మరియు గాలికి నా తండ్రి దేవుడు, అవతారమూర్తి. అతడు లేడితో పరుగెత్త గలడు; ఏనుగుతొండమును పూని విరువగలడు. అతని మూర్తికి, అతని బలసాహసములకు సంబంధము లేదు. అడవిలో బహు జంతువు లుండునుగదా! సామాన్యముగా మనము పెద్దపులిని, సింహమును; క్రౌర్యమునకు, శీఘ్రలంఘనమునకు చెప్పుకొందుము. వాని జాతి జంతువులు కలవు. తోడేలు, సివంగి, చిఱుత మొదలైనవి. ఎవడు పులిని, సింహమును నవలీలగా నిర్జించగలడో వానికివి లెక్కయేమి? ఏనుగు మహాబలిష్ఠమైన జంతువు. మా తండ్రియు, గాలియు నేనుగును లెక్కచేసెడివారుకారు

అంత ప్రతిష్ఠలేని జంతువులు కొన్ని యడవులలో తిరుగు చుండును. అందులో నొకటి భల్లూకము. నల్ల యెలుగుగొడ్డు. నా తండ్రికి భల్లూకమనగా భయము; భయమని చెప్పుటకు వీలులేదు. అదియొక నిరాదరణ. కాని, దాని జోలికి పోయెడివాడు కాడట. దానిజోలి మన కెందుకని పరిహరించెడివాడట: లోకములో భయము చమత్కారముగా నుండును. ఒకడు పదిమంది తన్ను జుట్టుముట్టినను విదలించివేయగలడు. నిశ్చయముగా నడవులలో గూడ తిరుగగలడు,

కాని రాత్రిపూట నింటినుండి ఒంటరిగా బయటకు రావలెనన్న భయము.

నూట యేబదియేండ్ల క్రింద మన నేపాళదేశసైన్యమునకు మహాసేనాధిపతి యుండెడివాడట. ఆయన పేరు చక్రదండి. నీవు కూడ వినియుండవచ్చును. ఆయన చండప్రచండుడట, ఆయన ముందెంతటి శత్రువైనను. నిలువలేక కాలికి బుద్ధిచెప్పెడివారట! ఎంతటి శత్రువైన ఊడనిబాడుటయే. పారజూచిన రిపుసేన పాఱజూచెడి వాడట. అంతటి వానికి పిల్లియన్నచో భయమట. ఏమి చెప్పవలయును? వీనికి గారణములు మనము చెప్పలేము. శ్రీరామచంద్రుని తాతగారున్నారే అజమహారాజుగారు ఆయన భార్య ఇందుమతీదేవి. ఆమెమీద నొకనా డాకాశముమీదనుండి యొక పుష్పము పడినది. ఆ పువ్వు దెబ్బతగిలి యామె చనిపోయినదట. గగనపుష్పము ప్రాణముతీయుటకు నిదియొక్కటే-సృష్టి మొదలు సృష్టి చివరవర కుదాహరణ యనుకొందును.

మా నాయనగారును, గాలియు నప్పుడప్పుడు వీరిద్దఱే యడవిలోనికి పోయెడివారు. పోయి తిరుగుచుండెడివారు. గుఱ్ఱాలులేవు, వేటకుక్కలు లేవు, వలలు లేవు, జిగురుకండెలు లేవు, దీములు లేవు. అట్లొకనాడు తిరుగుచుండగా వారికి హఠాత్తుగా మనిసికి మనిసికి నెడములేనంతగా నొక భల్లూకము కన్పించినది. మా నాయనగారెంత యాజానుబాహువో ఆ భల్లూకము వెనుగాళ్ళమీద నిలుచుండగా నంతయెత్తున్నదట. అది వెనుగాళ్ళమీద నిలుచుండి ముట్టె తన నోటి యెత్తుననున్న పుట్టయొక్క రంధ్రములోపెట్టి చీమలను పీల్చుచున్నది. బ్రహ్మాండముగా పీల్చుచున్నది. దానినోటివెంట నొక వందతుమ్మెదలు మ్రోయగా నెట్టి ధ్వని యుద్భవిల్లునో యట్టి ధ్వని యుద్భూతమగుచున్నది. వీరిద్దరు దూరమునుండి యా ధ్వనిని విన్నారు. ఆ ధ్వనిని పోల్చికొనలేకపోయినారు. ఆ పుట్ట యెచ్చట నున్నది? వీరు పోయెడి త్రోవ కెడమవైపున నొక కొండకొమ్ము చొచ్చుకొనియున్నది. ఆ కొండకొమ్మున కెడమవైపున నీ వల్మీకమున్నది. ఎడమవైపున ననగా కొండకొమ్ము మలుపు తిరిగినంతనే యా పుట్టయున్నది. ఆ భల్లుకము వీరికి కన్పించుట లేదు.

ముందు నాయనగారు నడచుచున్నారట! వెనుక గాలి వెళ్ళు చున్నాడు. వారిద్దరు సమానబలులు, సమాన సాహసము కలవారు. ఇద్దఱును తమ బలమునందు తాము విశ్వాసము కలవారు, తమ బలమునందు తామెంత విశ్వాసముకలవారో రెండవవాని బలము నందుకూడ నంత విశ్వాసము కలవారు. ఇద్దఱివద్ద ఖడ్గములున్నవి. కాని, యొఱలలో నున్నవి. ఇద్దఱి బొడ్డులందు కైజారలున్నవి. కాని, బొడ్డులందేయున్నవి. మా తండ్రి కొండమలుపు తిరిగినాడు. ఒకరినొకరు కౌగిలించుకొనుటకు వీలైనంత ఎడములో భల్లూకమును డగ్గఱినాడు. భల్లూకమునకు తన మహాభోజన సమయ వ్యాఘాతము నకు, మధురభోజనవేళా సమాగతమైన విఘ్నమునకు బ్రహ్మాండమైన కోపము వచ్చినది కాబోలు! అది లేవనక్కఱలేదు. అదివఱకే లేచి నిలుచున్నది. పుట్టమీది ముట్టె మా తండ్రివైపునకు మరలించినది. బ్రహ్మాండమైన గర్జనచేసినది. మా నాయనగారి మీదపడినది. ఈయన కత్తిదూయుటకు లేదు. కైజారుదీయుటకు వీలులేదు. కౌగలించు కొన్నది. కదలుటకు వీలులేదు, ముట్టెతో గొంతును కసిక్కునకొఱికి వేయునన్నంతగా నున్నది. అప్పుడు గాలి చూచినాడు. ఏమి చేయును? దానినొక్క తన్నుతన్నినాడట! అతని తన్నునకు బలిసిన పెద్దపులివంటిది పోయి దూరముగా పడెడిదట! ఆ భల్లూకము కదల లేదు.

కాని అది మా తండ్రినివదలి గాలిమీదపడినది, మా తండ్రి పర్వతమంతవాడు. ఆయననుకంటె వీనిని సులభముగా జయించవచ్చు ననుకొన్నదో యేమో! లేదా అతడు తన్నినతన్ను దానికంత బాధ కలిగించినదో! అతడు బొడ్డులోని కైజారులాగి దానితో కలియబడి నాడు. ఇద్దఱు యుద్ధనుచేయుచున్నారు. ఆ భల్లుకము గాలియొక్క కత్తిపోట్లను లెక్కచేయుటలేదు. నిమేషాంశభాగమునందు మా తండ్రికి దిగ్భ్రాంతియు గాలియొక్క చేతిలోకైజారున్నదన్న ధైర్యము వెంటనే భల్లూకముమీదికి పోవలయునన్న యూహ కలి గించలేదు. మరునిమునమున గాలి క్రిందపడిపోయినాడు. దాని కౌగి లింతలో నున్న గాలియొక్క కత్తిపోట్లు దానియొడలినిండ నున్న జటిలరోమములయందు గ్రుచ్చుకొనుమన్నవిగాని, దాని కాపద కలి

గించుటలేదు. అప్పుడు మా తండ్రి కత్తిదూసి దానిపైకి వెళ్ళెను. దాని వెట్లుకొట్టుటకును వీలులేకుండెనట. దానిని కొట్టినచో దెబ్బ గాలికి తగులునేమో! ఎట్లయినను భల్లుకము గాలిని వదలిపెట్టి తన మీదికి వచ్చునట్లు చేయవలయునన్న తండ్రి ప్రయత్నము చాలసేపటికి ఫలించినదట. గాలియొక్క మెడను భల్లుకము పూర్తిగా కొఱికివేసిన దని చెప్పవలయును. తరువాత తండ్రి దానిని వధించినాడు. గాలికి మిగిలినది కొఱగింజయంత ప్రాణము. మా తండ్రి వాని ముప్పాతిక శవమును బుజాన వేసికొని యోజనము మేరయింటికి తిరిగి వచ్చినాడు. గుఱ్ఱమైనను లేదు, తొందఱగా వచ్చుటకు. ఇంటికి వచ్చెను. వైద్యు లేమిచేయగలుదురు? ఆనాటి రాత్రికి గాలి ప్రాణము గాలిలో కలిసి పోయినది.

నా తండ్రియొక్క దుఃఖమునకు మితిలేదు. ఒక్కగా నొక్క డైన స్నేహితుడు పోయినాడు. ఆయనకు లోకమంతయు నిర్మిత్రమై పోయినది. ఆయన దుఃఖము నెలవాళ్ళనుభవించినాడట. అప్పుడు తెలిసినది. ఆయనకు నా తల్లియందుకూడ నంతప్రేమలేదు. పిల్లల యందు మాయందులేదు. ఆ దుఃఖము తీరుట కాయన కారునెలలు పట్టినది. తరువాత వ్యవహారము చూచుటలేదు. మరల వేటకుపోవుట లేదు. అప్పటికే పేరునకు పదియూళ్ళుగాని ఋణములు తీరగా నాలుగూళ్ళయిన ప్రభుత్వము దానిదారి యది చూచుకొన్నది. మా యన్న యొకడున్నాడు. అతడు కొంచెె మనూయికుడు. ఆస్తి ఛిన్న భిన్నమైపోయినది. ఇంతయగుటకు పదియేండ్లు పట్టినది. కాని, మా నాయనగారి జీవితములో మిగిలిన యాశ యొక్కటియే. ఆ గాలి యొక్క కుటుంబమును రక్షించుట. ఆయనకు దేనిమీదను శ్రద్ధ యుండెడిది కాదు. ఆ కుటుంబము సరిగా గడచుచున్నదా లేదా? ఆ గాలి పోవునప్పటి కతనికొక కుమారుడు కలడు. అతని కేడెనిమి దేండ్లుండవచ్చును. నా తండ్రి వానిని వేయికన్నులతో కాచెడివాడు. వాడు మరల తండ్రియంతవాడగునని మా నాయనగారి యాశ. వాడు తండ్రివలె బక్కపలుచనివాడు. ఎఱ్ఱనివాడు. మంచి యంద మైన పిల్లవాడు. వారి కుటుంబము మా కోటవెలుపలనున్నను వాడు మాత్రము నిద్రించుట మా తండ్రి తొడలపైనుండెడివాడు. ఎప్పుడైనను

మా తండ్రి వానిని వదలినచో వానిని మా తల్లి కూడ ముద్దుచేసెడిది వానితోనే నాడుకొనెడిదానను.

ఇట్లుండగా, నీ గాలి యొక్క కుటుంబము కథ చెప్పవలయును. వారు తాము క్షత్రియులమందురు. వారికి వంశవృక్షములు లేవు. వారు క్షత్రియులగునో కాదో తెలియదు. వారి యాచారములు క్షత్రియుల యాచారములు కావు. తెలిసిన రెండు మూడు తరాల నుండియు వారు పాలు అమ్మి జీవించెడివారు. ఒక గోవులమంద పరిమిత సంఖ్యాకమైనదే. ఈ గాలి తండ్రి కాలములో నొక పశువ్యాధి వచ్చి గోవులు సగానికి సగము మరణించినవి. దానితో వారెత్తు పడిరి. అప్పటినుండి వారి సంసారములోని పురుషులు వేఱువృత్తుల నవలంబించిరి. గాలి తండ్రి మాత్రము కాంతారము సమీపమున నుండుటచేత నడవికిపోవుటయు, లేళ్ళు, కుందేళ్ళు, జింకలు మొదలైనవానిని వధించి తెచ్చి వానిని మా యూరిలోని క్షత్రియులకు, ధనవంతులైన శూద్రులకు నమ్మి జీవించెడివాడట. ఆ విద్యయే కొడుకునకు వచ్చెను. గాలి పొద్దునలేచినది మొదలు జీవితమంతయు రాత్రిపగలు వఱకు నడవిలోననే. నతనికి మా పురపరిసర కాంతారము నందు నెక్కడ నేమెుక్క యున్నదో ఎన్ని యడుగులు వేసినచో నెంతదూరము పోవుదురో తెలియును. అన్ని జంతువుల యలవాట్లును తెలియును. ఏ జంతు వెప్పుడు పైకి దూకునో, ఎప్పుడు పైకి దూకదో తెలియును.

అట్టివానికి తన్ను చంపిన భల్లూకము పుట్టలో ముట్టెపెట్టి చీమలను పీల్చుచుండగా నేల తలియలేదని మా నాయనగారి నడిగితిని. ఆయన యిట్లు సమాధానము చెప్పెను. 'మన యడవిలో భల్లూకములు లేవు. ఈ యడవిలో నాలుగామడ పోయినతరువాతగాని భల్లూకములుండవు. అందుచేత నతనికి భల్లూకములను గుఱించి యెక్కువ తెలియదు. అతనికి తక్కిన హింసమృగముల సర్వవిషయములు తెలియును. భల్లూకము సంగతి ఎక్కువ తెలియదు. మరియు నీ నాలుగామడ మేరధాత్రియొక్క లక్షణమెట్టిదనగా నెక్కువ శిలామయదేశము. వృక్షములు సమృద్ధిగానే యుండును. కాని, చీమలు త్రవ్వి పుట్టలు పెట్టవు. అందుచేత భల్లూకములిచ్చట యెక్కువలేవు.

మరియు మన యడవులలో పెద్ద కొండలులేవు, కొండకొమ్ములులేవు పెద్దపెద్ద తేనెపట్లులేవు, మరియును భల్లూకముల కొకదుంపయిష్టము' అదికూడ మన యడవిలో నుండదు. ఈ మూడు హేతువులచేత నాల్గుయోజనములు పొడవు నాల్గుయోజనముల వెడల్పుగల మన యరణ్యములో భల్లూకములు నివసించవు. భల్లూకము వల్మీకము యొక్క రంధ్రములలో నోరుపెట్టి పీల్చునప్పుడట్టి మోత జరుగునని నేనెఱుగను, గాలి యెఱుగడు, అది యింతకు నాతని యాయుర్దాయము పూర్తియయ్యెడు దినము అట్లు జరిగినది.'

ఆ గాలికి మా నాయనగారికి చిన్నప్పటినుండి స్నేహము. మా నాయనగారి చెలిమి బలిసిన తరువాత వారి యింట క్షీరము విక్రయించి బ్రతుకులక్షణము పూర్తిగా పోయినది. వారు కొన్నాళ్లు రాచగొల్లలమని చెప్పికొనెడివారు. మా నాయనగారితో పరిచయము బలిసిన తరువాత వారును రాజపోకళ్ళే ప్రారంభించిరి. ఉపనయనములు, యజ్ఞోపవీతములు మాత్రము లేవు. క్షత్రియులవలె కర్మలు చేయుటలేదు. మా క్షత్రియులలో నచ్చటచ్చట వేదాధ్యయనము చేయుట, సంస్కృతములో పాండిత్యము సంపాదించుట కలదు. అది మా వంశములోననే అంతరించినది. ఇంక గాలి వంశములో నెట్లుండును? గాలి కుమారుడున్నాడే! తండ్రి పోగా మిగిలినవాడు, మా తండ్రికి ప్రియమైనవాడు, నా తోడి ఆటగాడు. వీనిని క్షత్రియుల బాలకునివలె పెంచవలయునని మా నాయనగారు గాలితో చిన్నప్పుడనుచుండెడివారట. కాని, గాలి పోయినతరువాత ఆయనగారు ఆ ప్రస్తావనయే చేయలేదు ఆ మాట మూలపడినది. గాలియొక్క ఈ కొడుకుపేరు జితేదాస్తి

నేపాలరాజ్యము యొక్క తొలుతటి వంశములో ననగా భారతయుద్ధకాలమునాడు రాజ్యము చేసిన రాజుపేరు జితేదాస్తి: ఆయన కొడుకుపేరు గాలి మహారాజు, అప్పుడు జితేదాస్తి కొడుకు గాలి. ఇప్పుడు గాలి కొడుకు జితేదాస్తి, గాలి చనిపోవునాటికి జితేదాస్తికి పెనిమిదేండ్లుండును. నాకప్పటి కారేండ్ల వయస్సట! మేమిద్దరము కలిసి యాడుకొనుచుండెడివారము. చాప చెడినచో చదర కాదా యన్నట్లు, మా ప్రభుత్వ లక్షణములు చాలవఱకు నశించి

నను, కొన్ని నళించలేదు, కనీస మొకరిద్దరైన పరిచారికలుగాని, పరిచారకులుగాని యుండెడివారు. వారుగాని మరెవరైన చూచిన వారుగాని పడిపోయిన మా స్థితినిబట్టి నాకును, జీతేదాస్త్రికిని ఈడు-జోడుగా నున్నదని యనుకొనెడివారు. గాలిమీద నా తండ్రికి కలిగిన మైత్రిచేత, జీతేదాస్త్రియందున్న ప్రేమచేత, మా సంసారము చిదికిపోవుటచేత నన్నతనికిచ్చి పెండ్లి చేయుమరని కొందఱి కొందఱికి మాహా లుండెడివి. ఎప్పుడైన ఎవరైన నట్టి యూహా వ్యక్తపఱచి నచో మా అమ్మగారు నవ్వుచుండెడిది.

మా నాయనకు జీతేదాస్త్రి మీద నెంత ప్రేమయున్నను తొలినాటి గాంభీర్యము, చిరునవ్వు కూడ నవ్వకుండుట, నిట్టనిటా రుగా నడచుట, తీవ్రముగా చూచుట మొదలైన లక్షణము లెప్పుడును పోలేదు. వేటమాని పదియేండ్లయినను నా తండ్రియొక్క ముఖ మండలమునందు పేదఱికము కనబడలేదు, ఠీవి తగ్గలేదు, అప్పుడు నిప్పుడు నెప్పుడు కార్తావీర్యార్జునుడనగా నందఱకు భయమే. కాని, మానవజాతిలో నొక లక్షణమున్నది. క్రిందిబడ్డవాని నెవ్వడును లేవ దీయడు. ఇది నావంతు అన్నట్లు తానుకూడ నొక దెబ్బవేసిపోవును. ఒకడు గొప్ప దశ అనుభవించినప్పుడు తద్దశానుభవకాలమునందు చాల ధూర్తుడై యుండెనేని వాని కర్మజాలక, భగవంతు డనుగ్రహిం చక చెడ్డరోజులు వచ్చినచో జనము వానిమీద పూర్వముగల కోపము నంతయు తీర్చికొందురు. అప్పుడు జానిసలవలె, తొత్తులవలె ప్రవ ర్తించినవారే ఈనాడేకుమేకై కూర్చుందురు. ఆ నా డితనిమీద వారి కింత కోపమున్నదని ఎట్లు తెలియును? వారు ప్రకటించెడు భయము, వారు ప్రదర్శించెడి భక్తి, వారు నెఱపెడు వినయము సర్వమును కృతకమే. వారికి కీవికల ధనవంతుని మీద నధికారి మీద నిజముగా నున్నది కోపము, తిరస్కారము. సాగదుకనుక పైకి వినయము, గౌరవము! వాడు పడిపోయినంతనే వారి గుండియలలోని ప్రధాన గుణములు బహిష్కృతములగును;

ఇది యొకటి యిట్లుండగా మరియొకటి కలదు, ఆ యూరిలో మాకు చాల బలగమున్నది. మా పినతాతల కుటుంబములు, మా తల్లివైపు చుట్టాలు, మా పినతండ్రుల కుటుంబములు మొత్తము

మీద శదివదేను కుటుంబములున్నవి. మా నాయనగారు ప్రథానులు, ప్రథమ వంశమువారు, శ్రేష్ఠవంశములో శ్రేష్ఠులు, అందుచేత పదియూళ్ళ రాచరిక మాయనకు వచ్చినది. అయినను మా బందుగులైన తక్కిన రాచవంగడములవారు పేదలుకారు వారును ధనవంతులే, ఏ కొంచెమో ఖడ్గవిద్యా నైపుణ్యము తెలిసినవారే. ప్రథానముగా ఖడ్గజీవులే. మా నాయనగారు పడిపోయిన తరువాత వారందరు మొలత్రాడు కట్టిన మగవాండ్రైరి. తొలినాటి వినయము లేదు, ఆశ్రయింపు లేదు, గౌరవము లేదు. వారి యిష్టమువచ్చినట్లు మాటాడుట, లెక్కలేకుండ ప్రవర్తించుట.

కాలవశమున నాకు పదమూడు పదునాలుగేండ్లు వచ్చినవి మా బంధువులలో నెన్నియెన్ని మాటలు పుట్టినవి? 'వారికేమున్నది? వారి పిల్లను మేము చేసికోము' అని యొకగు, వారి నెవరో చేసికొమ్మని యడిగినట్లు, అప్పటికి మా కింకను గ్రామమొకటున్నది. కొంత సొంతవ్యవసాయమున్నది. పైపరామరిక చొప్పడకపోవుటచేత పంట సరిగా వచ్చుటలేదుగాని పొలమున్నది, ఒక గ్రామమున్నది. ఒకడు తనకా గ్రామమును, పొలమును నిచ్చినచో నన్ను చేసికొందునన్నాడట; మరియెవ్వరో 'అది కోతి. దానిని మానవుడెందుకు చేసికొనును?' అని, కాని. వరుసయైన ప్రతివానికి నన్ను పెండ్లాడవలెనని యేయున్నది. మా నాయనగారు పోయి వారి నడుగవలయునట! వారప్పుడు విచారింతురట! మాపిల్లకు పదునాలుగేండ్ల వయస్సు అప్పుడే పెళ్లికొందర ఏమున్నదని మా యమ్మ యనుచుండెడిది. గాలి పోయినతరువాత నప్పటికి యెనిమిదేండ్లు గడచినవి. అందులో సగము నాలుగేండ్లు, ఆ నాలుగేండ్లు గడవక కూరుచుండునా? అవి కూడ గడచినవి. నాకు పదునెనిమిదేండ్లు వయస్సు వచ్చినది. ఇంక మా బందుగులలో వరుసయైనవారందరు నన్ను పెండ్లాడుదమని కూర్చున్నవారే' వచ్చిన యిబ్బంది యెక్కడననగా మాకు మిగిలిన గ్రామమును, మా సొంత వ్యవసాయమును వారి కీయవలెను; ఇచ్చినచో చేసికొందురు!

ఇది యిట్లుండగా - జితేదాస్తి కిరువదియేండ్లు వచ్చినవి, అతని సౌందర్యము పట్టరానిదిగా నున్నది. వయసులో నున్న మమ్మ్మి

ద్దరను కలిసి తిరుగనిచ్చుట మా తల్లి కిష్టములేదుగాని, మా తండ్రి యేమియు మాటాడడు. జీతేదాస్తి యొక్క విలక్షణమైన ప్రకృతి. అతనిని రాచగొల్లయని కూడ ననరాదు. రాచయన్న శబ్దము వానికి తగదు.

# 4

గాలి చనిపోవకముందు జీతేదాస్తి మాయింటికి వచ్చుచుండెడివాడు. ఒక్కొక్కప్పుడు తండ్రియు, మరియొకప్పుడు తల్లియు చంకన వేసికొని తీసికొనివచ్చెడి వారు. నేనతనికంటె చిన్నదానను కదా! నేను చిన్నప్పుడు చాల అల్లరిపిల్లనట. ఇప్పుడగుదునో కానో నాకు తెలియదు. నేనతనికంటె చిన్నదానను అతనిని చూచినచో నందఱకు పట్టరాని ముద్దు. నా యల్లరిని నన్ను చూచి యందఱకు నేవగింపు. అతని నందఱు ప్రేమగా చూచి నన్ను కసరుకొనుటతో నా కతనిమీద కోపముగా నుండెడిది. జీతేదాస్తి యెంత ముద్దయిన పిల్లవాడో అంత మొద్దయినపిల్లవాడు. అతడు తెలివికలవాడే. అతని తెలివి నాకు తరువాత తరువాత తెలిసినది. చిన్నప్పుడు మొద్దబ్బాయి యనుకొనెడివారు. కాని, వానిదుంపతెగ! వానిమొగమే చాలును వాని నందఱిచేత మోహింపజేయుటకు. మాకోటకు వచ్చినను వానిని క్రింద నిలువనిచ్చెడివారుకారు. వాడొంటరిగా కనిపించవలయుననియు వానిని గిల్లియో రక్కియో యేడిపించవలయునని నాకుండెడిది. వాని నింకొక విధముగా నేడిపించుటకు వీలులేదు. వానిచేతిలో నేదియైన వస్తువుండెడిదనుకొనుము. దానిని మనము లాగుకొందుము. ఇతరులైన పిల్ల లేడ్తురు. వాడేడ్వడు. ఆ వస్తువును మనము లాగికొన నక్కఱలేదు. వాడేయిచ్చును. మనము వాని నేడిపించుట యెట్లు? గిల్లవలయును. రక్కవలయును.

వాడొంటరిగా నా కెప్పుడో కన్పించెడివాడు. అప్పుడు నెత్తురు కారెడునట్లు గిల్లెడుదానను. వాడు లబోదిబో అని మొత్తుకొనెడివాడు. మా అమ్మగారు వచ్చెడిది నన్ను చివాట్లు పెట్టెడిది. నాకు బాగుగా జ్ఞాపకము. నేనొకసాఱి వానినట్లు చేయగా గాలి

వచ్చి చూచినాడు. ఆ గాలి నన్నేదైన యనునేమోయని నేను భయ పడితిని. గాలి పకపకా నవ్వినాడు. "మంచి పని చేసితివమ్మా! మంచి పని చేసితివి! వీడు వట్టిమొద్దు. ఏడిపించవలయునన్నను వీడేడ్వడు. వీని నేడిపించకలదానవు నీవొక్కతెవే నాకు కన్పించితివి. వీనినెప్పు డెల్ల నేడిపింపుము." అని తన దారిని తాను పోయినాడు.

గాలి యిట్లనుట పరిచారికలు వినిరి. మా అమ్మవిన్నది. నే నిక్లేడ్పించుట అవ్యాహతముగా సాగుచున్నది. గాలిపోయిన తరువాత మరల నెప్పుడో జితేదాస్తి మా నాయనగారి తొడను వదలిపెట్టి వచ్చినప్పుడు, నేను వానిని మరల నేడ్పించితిని. ఇట్లు రెండుమూడుసార్లేడ్పించగా నీ వార్త మా నాయనగారికిఁ దెలిసి నది. ఆయన నన్నేమియు ననలేదుగాని, తత్పూర్వము నామీద నాయనకుండెడి ప్రసన్నత తగ్గినది. జితేదాస్తి నేనింత గిల్లి యేడ్పిం చుచున్నను, నాతో నాడుకొనుటకే వచ్చెడివాడు. నావద్దకు పోవల దని వారు చెప్పెడివారు. నా వద్దకు రానిచ్చెడివారుకారు. అతడే చాటుమాటుగా నా వద్దకు వచ్చెడివాడు. ఆడినంత సేపాడెడి వాం ఛ్రమ. ఏదో ఆటలో పెట్టి నేను చివరకు వానిని కొట్టెడిదానను.

నాకు పంద్రెండేండ్లప్పుడతనికి పదునాలుగేండ్లు. అప్పుడు కూడ నాతో స్త్రీలాడుకొనెడి గచ్చనకాయలు మొదలైనవి యాడెడి వాడు. నేనాటలో నన్యాయము చేయుట, అతనికి కోపము రాక పోవుట. నీకెందుకు కోపమురాదని నేను వాదించుట. వాడూర కుండుట. చిన్నప్పుడేడ్చెడివాడు. ఆ వయస్సులో నేడ్చెడివాడు కాడు. నేను వానిని కొట్టుటమాని వేసితినని తక్కినవారనుకొనెడి వారు. మా కోటలో మాత్రము మా స్థితియెట్లున్నను, నేను వానిని పెండ్లి చేసికొందుననిగాని, వానికి నన్నిచ్చి పెండ్లిచేయవలయునని గాని యెవ్వరు ననుకొనెడివారుకారు నేను రాణిని అతడు మాసేవ కుడు. వానిమీద మా నాయనగారికున్న యభిమానమేగాని వాడ న్నయు నేను చెల్లెలినని కూడ మా యింటిలో నెప్పుడు నెవ్వరు ననలేదు. అది మా కుటుంబ మర్యాదకు భంగమైనమాట. తక్కిన గోలంతయు నూరిలో బలసినది. చుట్టాలలో వెలసినది. నా కేడాది కేడాది పైబడుచుండగా నేను వానితోగలసి యాడుకొనుటకూడ

మాయమ్మ అంగీకరించలేదు. కాని మేము కలిసికొనుచునే యుండెడి వారము. మాటాడుమనే యుండెడివారము. వాడు [illegible] ను. వాని సౌందర్యము తరుగుటలేదు.

బాల్యముదాటి యౌవనావస్థా సౌధము ముంగిటనున్న బాలురకు తొలినేవళము చెడును. మొగమున నన్నని నన్నని మొటిమలు పుట్టును. ఒడలు గఱకుదేలును. నుంత వెకిలి నవ్వుదయించును. నడకలో నొక యొయ్యారము ముద్భవించును. వాడు పెరిగినాడు, ఒడలు వచ్చినది. అంతియేకాని వానిలో నే లక్షణము వయసు పేరి రాచకొలువునకు మన్మథునకు చూపుదారుగా నుండు లక్షణములు కలుగలేదు. అందుచేత వాడును నేనును కలిసియుండుటకు మా యింటిలో పెద్ద యభ్యంతరములు లేకపోయెను.

ఇప్పటికప్పుడే గాలి చనిపోయి ఆరేండ్లయినది. మానాయన గారు జితేదాస్తికి వాయుధములు పూనుట ప్రయోగించుట నేర్ప వలయుననుకొనిరి. వాడు మృచ్ఛకటికములోని శకారునివంటివాడు. కత్తికి పిడియున్నదనియు, పిడివద్ద పట్టుకొనవలయుననియు వానికి తెలియదు. కత్తి చివరపట్టుకొన బోయెనట! ఆయన తన ప్రయత్నమును విరమించుకొనెను. మరియు నతనికి చదువు చెప్పించవలయునని మా నాయనగారు ప్రయత్నించిరి. నెలనాళ్లు ప్రయత్నము చేయగా వానికక్షరములు రాలేదు. అతనిని నన్ను కలిపి వివాహభావముదయించుటకు గూడ మా యింటిలో వీలులేకపోయినది. సుదర్శన భట్టారకునివద్ద నేను చాల చదివితిని. రామాయణ భారతములు చదివితిని. మహాకవి కాళిదాసుయొక్క మూడుకావ్యములు మూడు నాటకములు చదివితిని. మృచ్ఛకటికమును చదివితిని. భాసుని నాటకములు చదివితిని. చదువుటయేకాదు నాకా గ్రంథములలోని పలుకావులు కంఠస్థములుగా నుండెడివి. నాకు పదునాలుగేండ్లువచ్చు నప్పటికి నేను పండితురాలను. వాడు వట్టిమొద్దు. వట్టి ఉత్సవ విగ్రహము.

మా యింటి స్థితియెంత చిదికిపోయినను మా నాయనగారికి వానిమీద నెంత మమకారమున్నను దిసికొనిపోయి వానికి కట్టబెట్టుదురా? వర్ణముచేతగాని వంశగౌరవముచేతగాని వివేకము చేతగాని

వాడు నాతో తులదూగడు, ఊరిలోనను బంధుగులలోను తలకు మాసినవారి తలలలో పుట్టిన జాడ్యమేగాని మా కోటలో వట్టిమాట లేదు. నేను పెద్దదాననైన కొలది వానిని గిల్లుటయు కొట్టుటయు నెట్లు చేయుదును? నేను వానిని వెక్కిరించెడి దానను. ఎగతాళిచేసెడి దానను. తిరస్కరించెడిదానను. కాని వాడు నా కోసమే వచ్చెడి వాడు. ప్రతిదినము కొంతసేపు నా వద్ద కూర్చుండి వెళ్ళినగాని వానికి ప్రొద్దుకుంకదు. నాకే యచ్చెరువుగా నుండెడిది. ఎందుకు వీడు నా వెంట పడి తిరుగును? కాదయ్యా! నాకు కొంత వయస్సు వచ్చినది. వానికిని వచ్చినది. వానికి నంతరాంతరములో నామీద వాంఛయున్న దేమో యన్న యూహ నాకొకటి రెండుసార్లు కలిగినది. వాని మనస్సెట్లున్నదో చూడవలయునని నేను రెండుమూడుసార్ల తనితో కొంత స్త్రీ పురుష సంబంధమైన ప్రసంగము చేసితిని. అతడు దానిని పట్టించుకొనలేదు. ఆ యూహను నేను పరిత్యజించితిని.

వాడు ప్రతిదినము నావద్దకువచ్చుచుండును. ఇంక నీవు నా వద్దకు రావలదని వానితో జెప్పుటకు నాలుగైదుసార్లు నిశ్చయించి కొంటిని. కాని వానిమొగము చూచినంతనే నా నిశ్చయము సడలి పోయెడిది. నేను వానిని వెక్కిరింతును. వాడునవ్వును. వాని నవ్వు జగన్మోహనముగా నుండెడిది. వానిమొగము నందము జూచుచు. వాని నవ్వులోని దళమినాటి వెన్నెలలను చూచుచు, వానికి పసినాటి నుండి పదునెన్మిదేండ్లు వచ్చువఱకు నుంతబీఱువోని వాని శరీర సౌకుమార్యము చూచుచు, వానివరమ సాధుత్వమును చూచుచు, 'నీవింక నావద్దకు రావల'దని నేను చెప్పలేక పోయితిని. వానిస్థితియే నాకాశ్చర్యము! అతడేమి మానిసి! నిష్క్రియుడు. కొట్టవచ్చెడి చుఱుకుదనములేదు. మనకనులు విశాలముగా తెఱపించు వివేకము లేదు. అందుకని వాడొక కాష్ఠముకాడు. అందరివలెనె తిరిగెడి వాడు. అందరివలెనే మాటాడెడివాడు. మా యింటిలో నందఱకు నున్నను లేకపోయినను వాని భోజనము మాత్రము సుకుమారముగా రాజయోగ్యముగా నుండవలయును. ఇది మా తండ్రిగారి నిశ్చయము. వాని రాచతనమంతయు వాని భోజనములో నుండెడిది. ఒకటి రెండు వస్తువులు కొఱవడినచో వాడు సరిగా నన్నము దినెడి

వాడుకాడు. రెండు దినములలో చిక్కిపోవును. మా నాయనగారు వెంటనే యింటిలో నలువురను కోపించి పరిచారికలను గద్దించెడివాడు. అందఱు నేమని చెప్పికొనెడివారు! వీని తండ్రి మా నాయనగారి ప్రాణమును రక్షించెను. ఆయన బ్రతికినన్నాళ్లు గాలి యందలి తన కృతజ్ఞత వీనినిట్లు పోషించుటగా పాలించునని యనుకొనెడివారు.

ఇట్లుండగా నొకనాడు—వానికి పదునెనిమిదేండ్లు వచ్చినవి. నాకు పదునారేండ్లు వచ్చినవి. నా గురువైన సుదర్శన భట్టారకులు ప్రక్కనేయున్నారు. నేను జితేదాస్తితో నిట్లన్నాను. "ఓయీ! చిన్నప్పుడు నిన్నొకసారి నేను గిల్లి యేడ్పించితిని అపుడు మీనాయన బ్రతికియున్నాడు. ఆయన చూచినాడు. ఆయన యేమన్నాడో తెలియునా? "నిన్నేడిపించవలసినదేయన్నాడు. నీ కేడ్చుటకూడ చేతకా"దన్నాడు. నీ కేడ్చుటకూడ చేతకాదు అని నేనగా జితేదాస్తి యిట్లన్నాడు: "ఎందుకు చేతగాదు. చేతనగును. ఏడ్చుట చేతగాని మానవులుండరు ఏడ్చుట మానవలక్షణము పసిపిల్ల తల్లిగర్భము నుండి వెలికివచ్చినంతనే యేడ్చును. ఏడ్చినదనగా బ్రతికియున్నదని యర్థము. ఏడ్వక పోయినచో మంత్రసాని గిల్లి యేడ్పించును. అనగా బ్రతికి యుండుట యనగా నేడ్చుట యని యర్థము. నేను బ్రతికి యున్నానుగదా! ఎందుకేడ్వను? ఏడువననగా వచ్చిపోతినని యర్థము నేను చావలేదుకదా"—అతడీ మాటలనగా నేను నివ్వెఱపోయితిని. నా గురువు దిగ్భ్రాంతి పొందినాడు, సుదర్శన భట్టారకుడు "నీవు జితేదాస్తివేనా! నీవు జితేదాస్తివేనా!" అని రెండుమూడుసార్లు పలికి వానివంకనట్లే చాలసేపు నివ్వెఱపోయి చూచి వెడలిపోయినాడు. నేనేమి చేయవలయును? నాకెందుకో తెలియదు. నాకేడుపు వచ్చినది. వట్టి యేడుపుకాదు బిగ్గఱగా నేడ్చితిని. మా అమ్మగారును వారును వచ్చిరి. వారికేమియు నర్థముగాలేదు. పైగా నచట నేనును జితేదాస్తియు నిద్దరమేలేము. సుదర్శన భట్టాచారకులున్నారు. మా యిద్దఱి నడుమ నేదైన జరిగెననుకొనుటకు వీలులేదు. వాడు నాయందు తన కోర్కె తెలుపుటయు నేను దానికి దుఃఖించుటయు నని యర్థము చెప్పుటకుకూడ వీలులేదు.

వారు. నన్నడిగిరి. నేనేమియు లేదంటిని. జితేదా స్త్రీ తన దారిని తాను పోయెను. నేను తరువాత నాకు దుఃఖమెందుకు వచ్చినదని నాలో నేను విచారించుకొంటిని. నాకిట్లు తోచినది. నాకు వానిమీద ప్రేమయున్నది. వానినిన్నాళ్లు నేను బ్రతికియున్న శవ మనుకొంటిని. వాడు శవముకాడు. బ్రతికియున్నాడు. అందుచేత నాకానందము గలిగినది. ఆ యానందము నాకు దుఃఖముగా బహిష్కృతమైనది. ఇది నాకు నేను నాలో చెప్పికొన్న సమాధానము. నాటినుండి జితేదా స్త్రీని నేనెప్పుడును ఎక్కిరించలేదు. ఎకసక్కెము లాడలేదు. తిరస్కరించలేదు.

ఇద్దఱము కలిసికొనెడివారము. ఏదో మాట్లాడెడివారము. లోక విషయములతడును నందఱివలెనే మాటాడును. నాయనగారికి ప్రియమైన జాగిలము తీవ్రదంష్ట్రిమన్నది యున్నదా? దానినిగూడ నమ్మివేసిరా? అని నేనడిగినచో జితేదా స్త్రి యొకనాడిట్లన్నాడు: "మీ నాయనగారికి మిగిలిన ప్రేమ వస్తువులు రెండే! ఒకటి తీవ్ర దంష్ట్రిము, రెండు జితేదా స్త్రి. నా తండ్రిపోయినచో నోర్చినాడు. కాని, నేను పోయినచో నోర్వలేడు. తీవ్రదంష్ట్రిము మిక్కిలి ముసలి దైనది. అది యెప్పుడో పోవును. అప్పుడు మీ నాయనగా రేమగుదురో నాకు తెలియదు." అతడిట్లనగా నేనతని వివేకమును తెలిసికొనుట కిది మూడవసారియగుటచేత నేనబ్బురపడలేదు. అబ్బురపడితిని. మొదటి రెండుసార్ల యబ్బురము పడలేదు.

నేనిట్లంటిని: "ఆయన ఏమైననైనచో నీవేమగుదువు!" అని. అతడు నవ్వి యిట్లనెను: "మేము గొల్లలము, మా నాయన రాచ గొల్ల, నేను వట్టి గొల్లను, నేను పాలమ్ముకొని బ్రతుకుదును." అనగా, నాకు దుఃఖము వచ్చినది. ఆనందము కలిగినది. ఆశ్చర్యము వేసినది. నేను మరల నడిగితిని. నీవు నిజముగా గొప్ప యూహాశాలివి. లోతుగా విషయములు తెలిసినవాడవు. నీ తెలివికి నా గురువే యబ్బురపడినాడు, నీ విన్నాళ్లుగా మూర్ఖునివలె నెందుకుంటివి? నీ వెందుచేత చదివికొనలేదు?"

అనగా నతడు "నేను గొల్లవాడనుకదా! గొల్లవానికి సాహిత్యమేమిటి! గొల్లని సాహిత్యవిద్యయు కోమలియొక్క నిజమును సృష్టిలో నుండవు."

అనగా నేను "నీవీమాట నెచ్చటనేర్చితివి?"

అతడు: నేనే యనుచుంటిని.

నేను: ఏదో గ్రంథములోని మాటవలె నున్నది.

అతడు: నేనే అంటిని. నాకు గ్రంథముల గొడవలేదుకదా! భవిష్యత్తులో నెవడైన నిది వ్రాయునేమో! కవులు లోకములోనున్న మేలి మాటలను దీసి మేలి యర్థములను దీసి మంచి మాటలతో చెప్పుదురంతే!

ఆనాటి రాత్రి జితేదా స్త్రీమీద నాకు ప్రేమయున్నది కాబోలు ననుకొన్న యొక యూహ "ఆకాశాద్వాయుః వాయోరగ్నిః"గా పరిణమించినది. తరువాత నాకు నతనిచే వలపించుకొనుట యెట్లను ప్రశ్న పుట్టెను. తొల్లిటికంటె వానిదెస నా ప్రవర్తన నాకే తెలియదు. మిక్కిలి హార్దముగా, మిక్కిలి చనవుగా, వాంఛాస్ఫోరకముగానుండుటయేకాక నా మాటలలో కూడ దూరముగా వానికా భావము కలుగునట్లు నాకు తెలియకుండగనే జరుగుచుండెను. ఎవరైన చూచెడివారికి వానితో నా పూర్వప్రవర్తన, నా పూర్వ ప్రసంగము, నేటి ప్రవర్తనా ప్రసంగములు భిన్నములుగా నున్నవని తెలియును, తెలియక తప్పదు. అందుచేత పరులున్నప్పుడు వాచేత నేనే కొంత నియమమేర్పరించుకొనవలసి వచ్చెడిది. ఇది యంతరంగ కథ. అప్పటినుండి బహిరంగ కథ ప్రారంభమైనది.

పూర్వము మా యింటికి రాజవంశయువకు లెక్కువమంది వచ్చెడివారుకారు. ఇప్పుడు రానారంభించిరి. దానికి పెద్ద కారణము కలదు. మా సంసారపు బాధ్యతలన్నియు సుదర్శన భట్టారకుడు తన నెత్తిమీద వేసికొన్నాడు. మా యన్న అమాయికుడు, క్రమక్రమముగా నూరిలోని రాజకుమారులకు నన్ను బెండ్లియాడినచో మిగిలిన యాస్తి వారివశమగునని యూహ పుట్టెను. ఒక ప్రభువు, పెద్ద అట్టహాసములేనిచో మిగిలిన యాస్తికూడ లోభనీయమైనదే, ఒక గ్రామమున్నది. దానిమీద సుంకము సంవత్సరమునకు తేలికగా రెండు మూడువందల దీనారములు వచ్చును. కాని, వానిని అడిగెడువాడు లేడు. స్వీకరించెడివాడులేడు. అప్పటికే చాలమంది కొన్నియేండ్లుగా నప్పుపెట్టిరి. ఆ లెక్కలు సరిగాలేవు. ఎవడో గణికుడు. రౌతుకొద్ది

గుణ్ణము. అతడు సరిగా వ్యవహారమును నిర్వహించుటలేదు. సొంత వ్యవసాయమున్నది. సరిగా చేసికొన్నచో దానిమీద మరల మూడు నాలుగువందల దీనారములు వచ్చును. అంతయు కలిపి అయిదారు వందల దీనారములు. అదియంత తక్కువది కాదు. ఎవరికి కాదు! సామాన్య సంసారికి కాదు. పదియూళ్ళు, వంద వేటకుక్కలు, వంద మంది మృగయులు, దినమునకు వందమంది తినెడివారున్న కొలువున కది యాదాయము కాదుగాని సామాన్యులకు మంచి యాదాయము.

అప్పటి మాస్థితి ఈ యాదాయము సరిగా వచ్చినను గ్రాస వాసోదైన్యము లేకుండెడిదే! పదిచోట్లకు వెళ్ళి రాబట్టెడువాడు లేక ఎక్కడిదక్కడ హరించిపోవుచుండగా సుదర్శన భట్టారకుడు కూర్చుండి గణకునిచేత లెక్కలు కట్టించి లెక్కలుతేల్చి, ప్రాతఋణములే రెండువేల దీనారములక్రింద తేల్చెను. వానిని రాబట్టుట యెట్లు? ఈయన వెళ్ళి యడుగగా, నితడు బ్రాహ్మణుడని వాళ్ళు లెక్కచేయలేదు. గణకుడుకూడ గురువుగారిని కాదనుటకు వీలులేక, ఇవ్వడీ కానికార్యమును చేసెను. అప్పుడు సుదర్శన భట్టారకుడు నలుగురు సామంతులైన క్షత్రియ కుటుంబములవారితో మా స్థితిని చెప్పి "కార్తవీర్యార్జునినివలన మీరు పూర్వము చాల ఉపకారములు పొందినవారు. నేడు వారిస్థితి చెడిపోయినదికదా! ఉన్నదికూడ సరిగా చూచుకొనలేకున్నాడు. తేలికగా ప్రాతఋణములే రెండువేల దీనారములున్నవి. ఈ సంవత్సరము గ్రామముమీద మూడువందల దీనారములు సుంకము రావలెను. వ్యవసాయమున్నది. కృషికులు ఎక్కడిదానినక్కడ హరించుచున్నారు. ఆయన కుమారుడు మెదకుడు. ఆ గణకుని తొలగించి నేను నా కుమారున కాయుద్యోగ మీయగలను. కాని యాగణకుని తొలగించుట కష్టముగా నున్నది. వాడు తినమరగినవాడు. పైగా కులముచేత వాడు క్షత్రియుడు. వాని కుటుంబమేమో తిండికికూడలేనట్లు బాధపడుచున్నారు. మీరు నలుగురు నాకు దండగా నిలచినచో నేను వారి వ్యవహారమును పొసగ ద్రోసెదను" అని చెప్పి తనయందు వారికిగల మొగమాటమి నుపయోగించి కార్యమును సాధింప నారంభించెను.

భట్టారకుడనగా గ్రామములో నొక పలుకుబడి యున్నది.

ఆయన చదువుకొన్నవాడు. శుభాశుభములు చెప్పెడివాడు. మంచి చెడ్డలు నిరూపించువాడు, కొంత ఉపాసకుడు, ఎవరిని యాచింపడు. తన మర్యాద తాను నిలబెట్టుకొనును. ఉన్నంతలో చేయివిదల్చును. అందుచేత, నా సంపన్నగృహస్థులైన నలుగురు క్షత్రియులు వారి వెనుకనుండగా నేడాదిరెండేండ్లలో భట్టారకుడు మా కుటుంబమును సరిదిద్దెను. మా నాయనగారితో చెప్పి తొల్లింటివలె వ్యవహరింప రాదని యొప్పించెను.

ఇదియంతయు జరుగునప్పటికి తేలికగా రెండేండ్లు పట్టినది. ఈ రెండేండ్లలో మా గ్రామములోని యా నాల్గు క్షత్రియ కుటుంబములలోని యువకులేగాక మరి యయిదారుగురు క్షత్రియ యువకులు గూడ నేదో పనిమీద భట్టారకునితో మాటాడుటకో, కొన్ని వ్యవహారములలోని రహస్యములు మా తండ్రిని కనుగొనుటకో వచ్చుచునే యుండిరి. ఎప్పుడో అప్పుడు జితేదాస్తితో నేను మాటాడుచుండుట నా మాటాడెడి లక్షణములో మిక్కిలి చనవు కనబడుట వారు గ్రహించిరి.

ఒకానొక స్త్రీయొక్క సౌందర్యము నిట్టిదని చెప్పరాదు. కొందఱు స్త్రీలవదనములు కనుముక్కు తీరుచేత, మందహాసములోని రామణీయకముచేత నీమె సౌందర్యవతియని వెంటనే యనిపించును. స్త్రీలయందుగాని పురుషులయందుగాని యౌవనము వచ్చినంతనే మునుపులేని సౌందర్యము కనిపించును. ఆ సౌందర్యము స్త్రీయందలిది పురుషులకు పురుషులయందలిది స్త్రీలకు బాగుగా తెలియును. బొమ్మకలవాడు, దండలుకలవాడు సన్నని పిక్కలుకలవాడు బిగిసిన శరీరముకలవాడు యౌవనమునందు పురుషుడైనచో స్త్రీలనేత్రములకువాడు సుందరుడుగా కన్పించును. సుందరుడోకాడో అభిలషణీయుడుగా కన్పించును. అట్లే స్త్రీకూడ యౌవనము వచ్చినతరువాత కఠినకుచద్వయీ భాగముకలది, సమున్నతజఘనభాగ, సన్ననిమధ్యము కలది బిగిసిన యొడలుకలది యైనచో పురుషులామెయందభిలాష వహింతురు. యౌవనము సర్వమానవజాతి సమానము. అచట స్త్రీ పురుష విభేదములేదు. కాని వచ్చిన యౌవనము సర్వపురుషులయందు సర్వస్త్రీలయందు కొట్టవచ్చినట్లు కన్పించదు. కొందఱియందే కన్పిం

చును. నా యౌవనము, అనగా నా యౌవన చిహ్నముల యొక్క సంపద వారు తెలియును. స్త్రీనైన నన్ను నేను వర్ణించుకొనరాదు. ఒకటి క్షత్రియులందు జన్మించుటయే నా శరీరదార్ఢ్యమునకు హేతువు. రెండవది నాకు తోచనప్పుడెల్ల పోయి మా యింటిలోని కత్తులను, కటారులను గ్రహించి మిగిలియున్న మా సేవకులలో వాని సంగతి తెలిసినవాని యొద్ద నెల్ల నేను వానితో సవ్యాసముచేయుచు వచ్చితిని. తెలిసినంతవఱకు ప్రతిదినాభ్యాసము జరుగుచుండెను. క్షత్రియరక్తముచేత సహజముగా సన్నిహితశక్తికమైన నాశరీరము నిత్యతదభ్యాసముచేత మరియు బిగిసి, దృఢమై, పటిష్ఠమై నాశరీరము యౌవనదశాప్రావిర్భావమువలన కలిగిన యవయవముల సౌష్ఠవ్య మును కనులుకొట్టవచ్చినట్లు చూపుచుండెను. ఆ క్షత్రియ కుమారులు మా యాస్తిమీద దృష్టితోపాటు నా యౌవనముమీదకూడ దృష్టిని నిలిపిరి.

మాకు మాలో అనగా నాకును జితేదాస్తికిని నెట్టి యూహ లున్నవో మాకే సరిగా దెలియవు. కాని వారికి నేను జితేదాస్తిని ప్రేమించుచున్నాననియు, వాడు కులహీనుడనియు వానిని నేను పెండ్లి యాడినచో క్షత్రియవర్ణమునకు వర్ణమునకే యవమానమనియు నని పించెను. వారిలో కొందరు నావంక కోరచూపులు చూచుట, కోపపు జూపులు జూచుట జరుగుచుండెను, నేను వారి నెప్పుడును లెక్కచేయ లేదు. నేను లెక్కచేయకపోవుటచేత వారికి నాయందుగల కామము వృద్ధి పొందకొచ్చెను.

వారిలో నొకరిద్దఱిలో నొక మార్పుగూడ వచ్చెను. వాతో భట్టారకులు చెప్పిరి. వారిట్లన్నారట: 'మాకెందుకయ్యా! ఆమె యా గొల్లవానిని చేసికొనుచున్నట్లున్నది; ఆమె యేమో క్షత్రియస్త్రీ. ఆ తండ్రి యింటిలో పెట్టుకొని పెంచినాడుకదా! ఈ యూహాతోడనే చేసి యుండును. భావమంఅదికి తానండగా నిలువవచ్చును. విగ్రహపుష్టి వివాయకనష్టి. ఇద్దఱు నిద్దరే! వాడు చంద్రమొద్దు: వీడు మంచి గంధపు మొద్దు! మాకేమి పట్టినది,' అని.

ఈ మాటల వెనుక నేమి యర్థమున్నది? ఇది యిట్లుండగా ముగ్గురు రాజకుమారులు దమ మనసులో నున్న భావములను ప్రత్య

తముగా చెప్పిరి, భట్టారకునితో చెప్పిరి: 'అయ్యా! పోయి మీ దొర గారితో చెప్పుడు. ఆడపిల్లయైన తరువాత నే యయ్య చేతిలోనైనా పెట్టవలయునుగదా! ఇంకొక పది యూండ్ల ప్రభువుకొడుకున కీమె నిచ్చి నాలుగూండ్లిచ్చెడి సంపత్తి నేడు మీ దొరకు లేదుకదా. మాలో నొక్కని కిమ్మనుము. మే మా కుటుంబమును చూచుకొందుము. ఆయనగారి యొక్క పిచ్చికొడుకు నన్యాయము చేయము. తనకును తన భార్యకును లోపము రానీయము. కాని, వాడున్నాడే మేడి పండు. పండిన పిచ్చి పుచ్చకాయ! వానిని దఱిమివేసెదము. వాని తండ్రి తన్ను రక్షించిన మాట నిజమే! ఇది యెక్కడైన నున్నదా? అందుచేత తన కులముగాని కులమువానిని దెచ్చి యింటిలో పెట్టి కొని మేపుచు, చూపుడు గుఱ్ఱమునువలె సాకుచు. చివరకు తన కూతును వానికంటగట్టునా? నలుగురు మొగమున నంబాకృతి చేయరా?' అట్లనగా భట్టారకుడు వారిని నిలువదీసి యడిగెను: 'ఊరకే చేసికొందురా? మాకంత కావలయు నింతకావలయునని యడుగరాదు. మీరు కట్నము అడిగినచో మీకు తగినంత వారీయ లేరు. పిల్లను మీరు ప్రేమించి చేసికొన్నచో తక్యంతరములేదు. ఆమె విద్యావతి. వివేకవతి, వివేకమనగా సామాన్యమైన వివేకము కాదు. ఆమెకు నేను చదువు చెప్పిన గురువను. ఆమెకు తట్టెడంత లోక జ్ఞానము కలదు. వారు బ్రదికిన బ్రదుకువలన, తమ యింటి మర్యాద వలన నామె బయటికి వచ్చుటలేదు. వచ్చినచో నేనే సాహాయ్యము కార్తావీర్యులవారికి చేయుచుంటినో ఆమె దాని నంతను తనంతట తాను చేసికొనగలదు. ఇప్పటికిని వారి క్షేత్రములను పండించువారిలో కొందఱు తప్పనిసరిగా వారికి పంటలో సగమైన నిచ్చుచున్నారనగా నది యామె వివేకమే! ఆమె నేర్పే! ఆమె పొలములమీదికి పోగలదు. నా కప్పుడప్పుడు సందేహము కలుగును: ఈమె స్త్రీగా గాక పురుషుడై జన్మించినచో పెద్దవారి కష్టములు కష్టములుగా నుండెడివి కావు. ఆమె తండ్రి నడుపులో పెట్టెడిది. వారికి రావలసిన కప్పము నుగాని, పంటలుగాని బయటకు ముద్దదబ్బు కూడ పోవుటకు వీలులేదు. ఒకటి రెండుసార్లు తండ్రితో చెప్పినది. అయన యంగీక రించలేదు. తల్లికూడ నంగీకరించలేదు. లోకములో నిదియొక విచి

శ్రమ. బ్రతికిచెడ్డవారి జీవితములు దుర్ఘటములు, తొలినాటి పోకళ్లు దుర్లభములు. ఇప్పుడుకూడ నవియే యెత్తులెత్తెదరు; దానితో దుఃఖపడెదరు. కనుక మీరు ఆమెను, వారి కుటుంబమునందలి గౌరవము చేత, నభిమానము చేత నామె నూలుక పెండ్లియాడుడు. మీరు తెలివారు కారుగదా' ఆమె తల్లిదండ్రులు వచ్చి నేడు మీ పంచన బ్రతుకుట వారికి తలవంపులుకదా!

ఇట్లు భట్టారకులు చెప్పగా వారెందుకొప్పుకొందురు? కనీసము మాకు మిగిలిన గ్రామమునైన వారికి వ్రాసి యిచ్చినచో వారొప్పుకొందురు — అంతట నొక గూడుపుఠాణి జరిగినది: మా గ్రామముమీది సుంకముగాని, పొలాలమీది పంటగాని భట్టారకుడును వారి కుమారులును సరియైన మార్గములో పెట్టిరి. అది యట్లు జరుగుటకు ప్రధాన కారణము వారి కుమారులు. ఆయన కులముచేత బ్రాహ్మణుడేగాని వృత్తిచేత క్షత్రియుడా యన్నట్లుండును! క్షత్రియ కుమారులతో గలిసి విల్లు, కత్తి, బల్లెము,బలిగోల,వడిసెల,గద మొదలైన సర్వాయుధములు నుపయోగించుటయందు సమర్థుడయ్యెను. దేహపుష్టియు కలవాడు. వచ్చిన యిబ్బంది యేమనగా నతడు దేనిని పట్టించుకొనడు.తండ్రి మావ్యవహారమునందు తలమున్కలుగానుండగా నతడు తండ్రికి సాయపడి క్రమముగా నీ వ్యవహారమంతయు తానే చూడనారంభించెను. అతడొక విచిత్రమైన పురుషుడు. కప్పములు రాబట్టును, పంట లీయుపోనీయడు. నా పెండ్లి, యితర రాజకుమారుల పట్టుదలలు వీనిని పట్టించుకొనడు. వారందరతనికి స్నేహితులు. వారితో పోరుపెందులకు? తండ్రిని చూచుకొననిమ్ము. ఈ లెక్కలో నుండెను.''

# 5

నాస్తికులను బ్రహ్మకూడ మార్చలేడు. వారు ప్రత్యక్ష ప్రమాణవాదులమందురు. ప్రత్యక్షమనగా నేమి? వారికి ప్రత్యక్షమనగా నొక్కకంటితో చూచునది. ప్రత్యక్షమనగా నింద్రియ

గోచరమగునది. వారికి తక్కిన యింద్రియములు పనికిరావు. కాని, కంటితో చూచునది యనగా చూడగలవేర్పండ వలయును. కన్ను దెఱచియే యుండును, చూడలేదు. చూచుటకు నిత్యము మనస్సు సన్నిహితమై యుండవలెను ప్రాధాన్యము మనస్సుదికదా! మనస్సునకు ప్రాధాన్యమంగీకరించినచో నొక్క ప్రత్యక్షమే యక్కఱలేదు, మనస్సు లేకుండ ప్రత్యక్షము లేదు. దీనిని గురించి చాల యున్నది. ఎందుకు చెప్పుచుంటిననగా. కంటితో చూచిన దానికి చాల ప్రాధాన్యము కలదు. 'నేనేమియు నందగత్తెను కాను. మా అన్నయు కాడు. మా తల్లి సౌందర్యవతి. కాని, స్త్రీ యుత్తము రాలైనచో భర్తయొక్క యిష్టానిష్టములే యామె యిష్టానిష్టము లగును. నా తండ్రియొక్క రూపమును గూర్చి చెప్పితినికదా' ఆయ నకును నీకును మిక్కిలి భేదములేదు. ఒక్క శరీరచ్ఛాయయే భేదము. ఇట్లుండగా నా తల్లికి నా తండ్రి పరదైవము. ఆయన మిక్కిలి యందగాడు. అందగాడో కాదో ఆమె యతనినే ధ్యానిం చును. ఇంక మా తండ్రి వేనిని ధ్యానించును? అడవిలోని జంతువులను ధ్యానించును, ఇంక మా తల్లిదండ్రుల కడుపున నేనుగాని, మా యన్నగాని సౌందర్యవంతులము పుట్టుట యెట్లు సాధ్యము?

ఒక కథ యున్నది - ఇద్దఱు పండితులున్నారట' ఒకడు వేద పండితుడు; ఒకడు బౌద్ధ పండితుడు. వారి వారి మతములను వదలి పెట్టి తర్కవ్యాకరణములం దిద్దఱు సమానులైన యుద్దండులు వేద పండితుడు తపస్వి. అతని నోట నబద్ధము రాదు. అబద్ధము రాదనగా నబద్ధము చెప్పడని కాదు; ఆయన యూహా చేయకుండగనే పర మేశ్వర సంకల్పము చేత నతని మహాతపశ్శక్తిసంపన్నతచేత వాని నోట నిజమే వచ్చును. ఈ సంగతి పలుమందికి తెలియును. బౌద్ధ పండితునకు కూడ తెలియును. అందుచేత, బౌద్ధపండితునకు వేద పండితుడన్నచో మిక్కిలి గౌరవము. కాని, పాండిత్యమునందు విరో ధియే. ఆ వేదపండితుడొక మహాగ్రంథమును వ్రాయగా బౌద్ధ పండితుడు దానిని చదివి యొకచోట విమర్శ చేసెను. తాను చేసిన విమర్శ తన శిష్యుని ద్వారా వేదపండితునకు తెలియజేసెను. తన పేరు చెప్పలేదు, ఎవరో యిట్లు విమర్శించిరని చెప్పించెను. వేద

పండితుడు దానివి విని నవ్వి 'ఇది యెవ్వడురా? వీడు చాకలివాని వలె నున్నాడే!' అన్నాడుట. ఈ మాట శిష్యుడు బోయి బౌద్ధ పండితునితో చెప్పెను! అతడు సంసార పరిత్యాగము చేసి బౌద్ధ సన్యాసి యైనవాడు. అతనికి, నతని తల్లిదండ్రులకు సంబంధము లేదు. కాని, చమత్కారము కొడుకు మతాంతరుడగును. సన్యాసి యగును, బంధువులు వానిని వదలిపెట్టరు. పోయి చూచివచ్చుచునే యుందురు. వీడును చాటుమాటుగా నా తల్లిదండ్రులయందు నను రాగమును పూర్తిగా మానివేయలేదు. అప్పుడతని తల్లి వానిని చూచుటకు వచ్చినదట. ఆ బౌద్ధపండితుడు తల్లి నడిగినాడు. 'ఇది యేమమ్మా! ఆ మహాపండితునినోట నబద్ధము రాదు. నా మాట చాకలివాని మాటవలె నున్నదన్నాడేమి? ఈ రహస్యము నీకు తెలియ వలయును, చెప్పుము' అని. ఆమె యిట్లన్నదట: 'నాయనా! నా యందేమియు దోషములేదు. నేనొకనాడు ఋతుస్నాతనై మీ నాయనగారి దర్శనము ప్రప్రథమమున చేయవలయునని బయలుదేఱి తిని. అది యేమి కర్మమో! నేను మీ నాయనగారి ముఖసందర్శనము చేయకపూర్వమే యుతికిన గుడ్డలను బూని చాకలివాడు మన ఇంటికి వచ్చెను. వా డాజానుబాహువు, అందగాడు. మంచి మీసములు మందహాసవదనారవిందుడు. స్నానముచేసి మొగమునిండ విభూతి ధరించి నాకు గన్పించినాడు. నేనేమి చేయుదును? నేను వానిని పరి హరించి మీ తండ్రివద్దకు బోయితిని. ఇంతకు మించిన పాపము నేను చేయలేదు.'

ఈ సృష్టి యింత చమత్కారమైనది. ఋతుస్నాతయైన స్త్రీ యొక్క ప్రథమ దర్శనము నందింత దుష్టత్వమున్నచో కంటిని శాసిం చెడి వాడెవ్వడు? మనస్సును శాసించెడి వాడెవ్వడు? కనుక నేను చెప్పుచున్నాను. మనస్సు నెవ డరికట్టగలడు? మనస్సు నరికట్టగల వాడు యోగి. అందుచేత మా తండ్రిని మా తల్లి నిత్యము ధ్యానము చేయుచుండుట చేత, నాయనసర్వథా వనజంతువులను భావించుటచేత నేనును, నా యన్నయు వికారముఖములు కలవారమైనాము. మేమిద్దఱ మొకటేలచ్చు. కాని, నా తండ్రికి నా మీదకంటె నా యన్నమీద నెక్కువప్రేమ. నేను తెలివిగలవాడను. అతడు మేదకుడు. ఇట్లుండగా

నొండు రెండు హేతువులచేత నేనన్నతో నా తండ్రి కేమియునిష్టముం డెడిదికాదు. ఈ యనిష్టము మరియొక ప్రబలమైన కారణముచేత ద్విగుణీకృతమైనది.

"ఆయన వేటమానివేసి పదియేండ్లయినది కదా! ఈ పదియేండ్లలో నాయన కారాధనీయమైన విషయమేమి? ఆ కత్తులు, ఆ విల్లులు, ఆ బరిసెలు, గోడలకు వ్రేలుచున్న చిఱుతపులులు, పెద్దపులుల తలలతోడి చర్మములు, ఆయనకన్నియు లెక్క. కత్తులలో పాతిక ముప్పది రకములుండును. ఏ రకమెన్ని కత్తులున్నవి. దిన దినము లెక్క చూచుచుండును. ఇట్లుండగా నాలుగైదుసార్లు వానిలో కొన్ని కత్తులు, కొన్ని కటారులు, నొక విల్లు నడుమ నడుమ కనుపింపకుండ వచ్చినవి. వాని నన్నిటిని నేను దొంగలించితినని నాతండ్రి యూహ. నేనీయభ్యాసము చేయుచుంటినని నీకు చెప్పితినికదా! ఆయన నన్నడుగవచ్చును. "నేను తీయలేదు నాయనగారు!" అని చెప్పియుండును. నే నబద్ధము చెప్పనని యాయనకు తెలియును. అడిగినచో తేలిపోయెడిదే! కాని ఆ విషయమునమాత్ర మబద్ధము చెప్పితినని యనుకొనవచ్చును.

వాని నెవరు దొంగిలించిరో తెలియదు. పూర్వమాయనతో వేటకు వెళ్లెడివారు మా నాయనగారితో మాటాడుట కప్పుడప్పుడు వచ్చెడివారు. వారిలో నెవడు దొంగిలించెనో! దొంగిలించెడివాని కేమటిలెడివాడు తోడా అందురు. ఏమైననేమి! దొంగను నేనని నా తండ్రి నిశ్చయము. దీనివలన నాయనకు నా మీదనున్న వ్యతిరేక భావన మరియు బలిసినది. నా వివాహము విషయమాయన పట్టించుకొనలేదు. మా తల్లి ప్రస్తావన చేయును. ఆయన యూరకుండును. ఇంతలో సుదర్శన భట్టారకుని కరుణవలన మా కుటుంబమునకు సుఖముగా నాల్గువ్రేళ్లును లోనికి పోనారంభించెను. ఒకప్పుడు మా తల్లి మరల నా వివాహ ప్రస్తావన చేయగా, "భట్టారకుడున్నాడు గదా! ఆయనతో చెప్పుము: నాతో నెందుకు?" అన్నాడు: అది కోపముతో నన్నమాటయే. కాని, వేఱుమార్గములేదు. అందుచే మా తల్లి నా వివాహ విషయము భట్టారకునితో చెప్పి బ్రతిమాలినది. ఊరిలోని రాచకుమారులు వారి పోకిళ్ళనన్నియు నీకు తెలియ

చెప్పితిని కదా! వారిలో నందఱును నా యౌవన విభవమును జూచి మోహపడినవారే తప్ప మా వంశమునుబట్టిగాదు. నా కులము గొప్ప దనమునుబట్టి గాదు. నా పాండిత్యమును జూచికాదు, నా మొగమును జూచి యెప్పుడునుగాదు. కాని, నా శరీరచ్ఛాయయు, తనూనైగ నిగ్ర్యమును, చెక్కిళ్ళ నునుపును, కన్నుల వైశాల్యమును నేనందకత్తె నేమోయని తొలుత భ్రాంతి కల్పింపవచ్చును. పదిసార్లు చూచినవాని కా సందేహము పటాపంచలగును. పైగా, వారిలో నొక్కడు నన్ను పెళ్ళి చేసుకొనుననుము. దేనికొఱకు చేసికొనును! చెప్పితినికదా! మిగిలిన మా యాస్తికొఱకు చేసికొనును,ఆ సంగతి వారేమి దాచను లేదు. భట్టారకునకా సంగతి తెలియును.

"భట్టారకున కింకొక సంగతి తెలియవచ్చెను. జితేదాస్తి తొలు తటి నుండి మేమనుకొన్నట్లు వివేకహీనుడుగాడు. అతడు చదువలేదు కనుక నపండితుడనిగాని, అతడు పండితులకంటె అధిక వివేకవంతు డని తెలియవచ్చెను. అట్లు తెలిసినది మేమిరువురమే. భట్టారకుడును, నేనును. జితేదాస్తి రాచగొల్లడునుకాడు. పట్టిగొల్ల ఇది యెట్లు పొసగును. నన్నతనికిచ్చి పెండ్లి చేసినచో నూరిలో రాచవారికి మా మీదమన్న కచ్చె రెండింతలగును. మమ్ము వెలివేయవచ్చును. ప్రత్య క్షముగా వైరము పూనవచ్చును. ఈ సంగతి మా నాయనకు తెలిసి నచో నతడంగీకరించడు. మా తల్లియు నంగీకరించదు. అంగీకరించదు నరికదా! నింతవఱకు జితేదాస్తిని ప్రేమగా చూచుచుండెడిది. అది "వైరీభవతి సౌహృదమ్." కనుక దీనినంతయు రహస్యముగా నిర్వ హింపవలయునని భట్టారకుడు నిశ్చయించెను. "నెమ్మది నెమ్మదిగా నా కవళికలు కనుగొన్నాడు. జితేదాస్తియందు నాకు ప్రేమభావన లేకపోలేదని గ్రహించినాడు. దీనిలో నింకొక పెద్ద చిక్కుగలదు. నన్ను జితేదాస్తి కిచ్చి పెండ్లిచేయుదు. తరువాత నేమగును? అతని వివేకము మహావిషయములకు సంబంధించినది. అతడు తత్త్వపరిజ్ఞాత గాని, లౌకిక విషయములందు పరిజ్ఞానముకలవాడు కాడు. మా కుటుంబ వ్యవహారములను సర్దుకొని రాగలడా? ఊరిలోని పదిమంది రాచయువకులతో నెదురు తిర్చి నిలువగలడా? భట్టారకుని పెద్ద కొడుకున్నాడు. అయనపేరు నాగేశభట్టు. అతని సాహాయ్యము

తోడనేకదా నా తండ్రి మా పొలములు గ్రామము గుఱించిన వ్యవహారము పొనగడోసికొని వచ్చినాడు. ఆ వాగేశభట్టు సాహాయ్యముతో జితేధాస్తి కానిదియంతయు నిర్వహించుకొనగలదా యన్నది ప్రశ్నయైనది. జితేదాస్తికూడ సహజముగా వీరుదైనచో గ్రుడ్డిలో మెల్లగా నడిపించవచ్చును. ఇతనికి కత్తికి పిడియున్నది. దానినచ్చట పట్టుకొనవలయుననియే తెలియదాయె.

భట్టారకుడు మరియొక యూహ చేసినాడు. ఆయనకు మొదటినుండియు గాలి క్షత్రియుడనియే నమ్మకము, రాజ్యాలు పోయి కులమర్యాదలు పోయి యందఱు మంచి వంశములవారు బ్రతుకుటకు సామాన్యవృత్తుల నవలంబించి తరాలుగడచునప్పటికి వారాకులమువారు కాదనిపించుకొందురు. ధనముతోనున్న గొప్ప కులమువాడు. వానిదే గొప్పకులము. ధనములేనివాని కులమెవ్వరికి కావలెను? ఆ కులాభిమానముకలవానికి గూడ నక్కఱలేదు. అందుచేత గాలియొక్క వంశవృత్తమును వెదకినచో అతడు క్షత్రియుడై యుండును. దానిని వెదుకవలయును. పదియూళ్ళు పోయి, వీరి పది వంశములవారిని కలసికొని జాడలు తీయవలయును. తీసి జితేదాస్తి క్షత్రియవంశమువాడని నిరూపింపవలెను. దాని కేడాది పట్టవచ్చును; రెండేండ్లు పట్టవచ్చును. ఈలోపుగా నా పెండ్లి నెత్తినవచ్చి కూర్చున్నది.

దానికి భట్టారకు డిట్లాలోచించెను, నేనును జితేదాస్తియు నూరిలో లేకుండ లేచిపోయినచో నేమగును? నేను వానిని లేవదీసికొని పోయితి ననుకొందురు. అప్రతిష్ఠ నాకు వచ్చును, కుటుంబమునకేమియు భంగములేదు, ఇంటిదగ్గఱి వ్యవహారము దానియంతట నది సాగుచుండును. కాని చెప్పికొనుచుందురు. ఎంత బ్రతుకుబ్రతికి యేమి లాభము? చివరికతని కూతురు గొల్లవానిని లేవదీసికొనిపోయినది, తల్లిదండ్రులకు తెలిసియే యీపని జరిగియుండును. వారెరుగనట్లు నటించుచున్నారని. ఇట్టి మాటలచేత, వదంతులచేత మా వ్యవహారము భంగముకాదు,

ఇది మా తల్లిదండ్రులకు తెలియరాదు, నేను దీనికిమాత్రము పూర్తిగా నంగీకరింపవలెను. ఒకస్త్రీ ఒకనిని పెండ్లిచేసికొనుట కిష్ట

తడుసుగాని వానితో లేచిపోవుట కిష్టపడునా? అందులో నెటువంటి వానితో! శృంగారరసముయొక్క ముక్కు మొగము తెలియని వానితో! ఏదియైన యాపదవచ్చినచో తనవెనుక నక్కెడివానితో! భట్టారకుడు నాతో నీ వ్యవహారమంతయు చెప్పెను. నేనావని చేయ నని ఖండితముగా చెప్పితిని, ఆయన నన్ను నాలుగునెలలు పీడించెను. నాకు నచ్చజెప్పెను. ఇతడు సుక్షత్రియవంశుడైనచో చేసికొందువా? అని యడుగగా నప్పటిమాట విచారింతునంటిని.

'మీరిద్దఱు నిచటినుండి వెడలిపోదురు, ఇద్దఱు కలిసిపోయి రని నమ్మకమేమి? నీవతనితో లేచిపోయితివని చెప్పుటయెట్లు? తన మూలముగా తండ్రి వ్యవహారము చిక్కులలో బడినదని తాను లేనిచో తండ్రికి బాధలేదని తండ్రికి బాధ తొలగించవలయునని యామె లేచి పోయినది, ఎచ్చటికిపోయినదో తెలియదు! ఏ నూతిలోపడినదో! గోతిలోపడినదో! నిజముగా నామెకు జితేదాస్తిమీద ప్రేమ యున్నచో నా సంగతి యిన్నాళ్ళు రహస్యముగా నుండునా? ఇంటిలో నున్న పరిచారికలకైన తెలియదా? అతడెవరు? కులముమాట యట్లుంచి వాడొక మొద్దు, అందమైనమొద్దు, మంచి గంధపు చెక్క, వానివేస్త్రీయు పెండ్లియాడదు, ఆడినచో నాలుగవదినమున విడాకు లిచ్చును, అది యెట్లు సంభవించును? ఆమె యట్లు చేయదు, ఆమె యెచ్చటికోపోయి యాత్మహత్య చేసికొనియుండును, దానికి మన యూరిలోని రాచవీరులందఱు కారణము. మీరందఱు వారి యాస్త్రిపైన చూపుగలవారే కాని యామెమీద కన్నువేసిన వారు కారు! అని నేనును నా కొడుకులును నా కిష్టమైన కొందఱమును చెప్పుచుందుము. అచ్చముగా వారిమాటకు విలువయుండదు,'' అని భట్టారకుడు నాతో చెప్పెను.

నేనంటినికదా!'నిజమే!స్వామీ!అతడు సుక్షత్రియ వంశమువాడే యగునను కొందము. భర్తచనిపోగా వాని బొమ్మ గీయించి,దానివంక చూచుచునొక స్త్రీ జీవితశేషమును గడుపవచ్చును. అట్లు కడపుటకు వానితో కొన్నాళ్లు సంసారము తాను చేసెను. గతించిన సుఖము, ఆ సుఖముయొక్క సంస్మృతియున్నది. ఇది యేమయ్యా! ఎక్కడనో హృదయము లోపల నాకు వీనిమీద ప్రేమయున్నమాట నిజమే! ఆ

ప్రేమ యుదయించినపుడు లోకములో ప్రేమకొక పరిణామమున్నది. ఆ పరిణామము జరుగునన్న యాశతో కూడ కదా, ఆ ప్రేమ యుద్భ వించును. కనుక ఆ ప్రేమలో రెండు భాగములున్నవి. ఆ ప్రేమ యొక్క ప్రథమ స్వరూపము పట్టి యార్ద్రత. రెండవది యాపరిణామము యొక్క భిన్నాంశములతో కూడిన పదార్థము. ఆ యంకురించుట యన్న స్థితి వి త్తనము వేయగా, నంకుర మాకు వేయుటవంటిది. అది పదినములలో నశించవచ్చును. ఇచ్చట నశించిపోవునన్నది విస్పష్టమైన విషయము. అట్టి ప్రేమ నా హృదయములో నంకురించినదనగా నా వి త్తనములోనుండి యంకురము వచ్చుట వంటిదే. అది నేల యొక్క లక్షణము. నీటి యొక్క లక్షణము. నీటితో తడసిన నేల కా లక్షణ మున్నది. స్త్రీయై జన్మించినంత మాత్రమున పురుషవాంఛ యుండును. ఆ పురుషుడెవ్వడు? అచ్చటినుండి ఈ ప్రేమాంకురము యొక్క పరి ణామ రూపావిష్కరణము ప్రారంభించును. అందుకనియే లోకము నందు సంబంధములు వెదకుదురు. స్త్రీయై జన్మించినంతనే పురుష వాంఛ యున్నది. పురుషులు పందలు వేలు లక్షలు కలరు. పురుషుడై పుట్టినంతనే స్త్రీవాంఛ యున్నది. స్త్రీలును లెక్కలేనంతమంది కలరు. ఇది యడవి కాదుగదా!

మరియు స్త్రీ పురుషుల కామస్వరూప మెట్టిది? దుర్వాంఛయే గాని యేకవారమున బహు స్త్రీ సంగమము పురుషుడు చేయలేడు. బహుపురుష సంగమము స్త్రీ చేయలేదు. చేసినచో వాతము క్రమ్మి యిది చచ్చును. క్షయపుట్టి వాడుచచ్చును. పరమేశ్వరుడు స్త్రీపురు షులను సృష్టించినప్పుడే వారి సర్వేంద్రియ శక్తులను పరిమితముగా చేసెను. వారు తమ యీ కామమును నియమించికొని, యేక విషయ లగ్నముచేసి, ధర్మమును పాలించి, స్వర్గమును పొందవలయును. అందుకోసము భగవంతుడు మానవుల శక్తులను పరిమితముగా చేసి నట్లు కన్పించును. ఆ రహస్యము తెలియనివారు పశువులకంటె హీనులు, ఏలయనగా పశువులు ఋతుకాల సంగమము మాత్రమే చేయును. వీరు తమ యారోగ్యము, కీర్తిప్రతిష్ఠలు, స్వర్గము నీ మూడింటి నొక్కసారి నాశనము చేసికొనుచున్నారు. కనుక స్వామి' స్త్రీ గాని, పురుషుడుగాని సహజమైన ప్రేమను సహజమైన కాము

మును ధర్మమునకు లోకమునకు రెంటికి చెడకుండ తొలుతనే తీర్చి కొనవలయును. ఇతనిని నా కంటగట్టినచో నేను పైన చెప్పిన మూడింటికి చెడుదును." అనగా భట్టారకుడు, తానిట్లనెను: "ఓ! యమ్మా! నాకు తెలిసినంతవఱ కిచ్చట పురుషప్రయత్న మేమియు లేదు. లోకమునందు పురుషప్రయత్నము కన్పించుచున్నను దైవ మనుకూలించినప్పుడే ఫలవంతమగుచున్నది. ఇది మీ కుటుంబము నకు సంధికాలము. ఊరియొత్తిడికి మనము లొంగిపోదుము. అప్పుడే మగును? వాడు నీతో సరిగా సంసారము చేయడు. మీ యన్నను పరాభవించును. లెక్కచేయడు, నీ తలితండ్రులు పడెడిపాట్లు కుక్కలు పడవు. ఏదో కొంత తీవి మీ యింట నిప్పుడును గలదు. అదికూడ నుండదు ఆలోచించుకొనుము. నాకు మాత్రము సంపూర్ణమైన విశ్వాసమున్నది; (దానికి కారణములుగూడ గలవు.) జితేదాస్త్రి మహక్షత్రియకుల సంజాతుడని. ఇంకొక రహస్యమున్నది. అతడు మనము కొయ్యయనుకున్నాము; తాయియనుకొన్నాము. అంతటి పరిశీలనాబుద్ధి యని మనకు హఠాత్తుగా తెలిసినది. అట్లే వాడు పురుషుడేమో! ఆ సంగతి మనకు తెలియదేమో! వాడును నీవు నొక్కచోనుండి వానిని నీవు కోరుట సంభవించినచో వానియందలి పురుషత్వము తెలియునేమో! నీ తండ్రియొక్క స్థానముననుండి నేను చెప్పరాదు. నీ మనస్సును చెదరనీయకుము. వానిని పరీక్షించుము. ఇంతకంటె నేనేమి చెప్పగలను?"

ఎట్లయిననేమి! జితేదాస్త్రియు నేనును కలిసి యెవ్వరికి తెలియకుండ నొకనాటిరాత్రి లేచిపోవుట స్థిరమైనది. ఎక్కడికన్నది ప్రశ్న. దీనిలో కొన్ని యిబ్బందులు కలవు. ఊరిలోని రాచకొడు కులు జితేదాస్త్రి చనిపోయినచో నీ వ్యవహారము పరిష్కారమగునని రెండుమూడుపార్లు ప్రయత్నించిరి. అతనిని నాగేశభట్టు రక్షించెను. అతనిని మా యిల్లు రక్షించుచున్నది. మేము లేచిపోయినచో నీ రక్ష లేదు.

భట్టారకులిట్లు చెప్పగా నాకాయన మాటలు చాలనచ్చినవి. నేను దాని కంగీకరించినట్లు గురువుగారికి తెలిపెను. లేచిపోవుట యొక్కడి కన్నది ప్రశ్న. ఎక్కడికి పోయినను వారు భటులను పంపియో, తామ్మ

గాలించియో కనుగొందురు. నేడు కానిచో రేపు పట్టుబడుదుము, నన్నేమి చేయుదురు? అనేదాస్త్రీని చేయుదురు. దుర్మార్గులై నన్ను పరాభవించినచో పరాభవించవచ్చును. స్త్రీకిని పురుషునకును భేద మున్నది. దుర్జనులవలన పురుషులకు ప్రాణభంగము మాత్రమే జరుగును. స్త్రీలకు ప్రాణమానభంగములు రెండును జరుగును. కాని నేను వారివలెనే కత్తిసాములు మొదలైనవి నేర్చినదానను. నన్ను వారేమియుచేయలేరని నాకు ధైర్యము. అనేదాస్త్రీ యొంటరిగా జిక్కినచో నతడేమి కావలయును? నాకాభయము కలిగినది. నా భయమును గురువుతో చెప్పితిని.

ఆయన యిట్లనెను, "నేను దానినిగూడ ఆలోచించియే యట్టి పెట్టితిని. ఇచ్చటి కేబది యోజనముల దూరమున నొకచోట పాడు పెట్టబడిన యొకపట్టణము కలదు. అదియొక కథ, పూర్వమున నాపట్టణము జనపదముల మధ్యనే యుండెడిది. కాని యాపట్టణము పాడు పెట్టబడిన యంతనే దానిచుట్టున నున్న జనము లేచిపోయిరి. దాని చుట్టు నొక మహారణ్యము పెరిగినది. వన్యమృగములు విహరించు చున్నవి. ఇప్పుడెవ్వరు నచ్చటికి పోరు. మేమెప్పుడో యొకసారి యేయూరో పోయి వచ్చుచు నా యడవిలోనుండి వచ్చితిమి. మన యూరికది చాలదవ్వు. మీ నాయనగారు వేటకు పోయినను మన పురసమీపముననున్న పదియోజనముల వైశాల్యముగల యడవి లోనికే పోవుదురు. మన యడవికి యీ శిథిలపట్టణము చుట్టున లేచిన యడవికి నడుమ జనపదములున్నవి. మన ప్రాంతమువారటు పోనేపోరు.

ఆ శిథిల పట్టణమొక చమత్కారముగా నుండును. కొన్ని వందల యిండ్లు పునాదులుమాత్రమే-కొన్ని వందల యిండ్లు గోడలు మాత్రము లేచినవి. వానిలో చాలభాగము పడిపోయినవి. కొన్ని రాజవంశములు నివసించుటకు నిర్మింపబడినవి. కొన్ని గృహ ములు పెద్ద యధికారులు నివసించుటకు నిర్మింపబడినవి. చిత్రమే మనగా వేనికిని పైకప్పులులేవు. ఎచ్చటనైన పదిగృహములు కట్టినచో ముందు కొన్ని యిండ్లు పూర్తిచేయుదురు. తరువాత, తక్కినవాటి కొఱకు పోదురు. ఆ పట్టణములో కొన్నివేల యిండ్లున్నవి. అన్నియు

నొక్కసారి పూర్తి కావలెయు నన్నట్లు అన్ని సంసారములు వచ్చి యొక్కసారి నివసింపవలయునన్నట్లు తత్పట్టణము నిర్మింపబడి యున్నది. రాజవీథులు విశాలములైనవి. అంత మహానగరము పరిత్య జింపబడినది. ఇప్పుడనేక గృహముల గోడలలో నుండి చెట్లు మొలచి నవి. రాచబాటలన్నియు ముళ్ళకంపలతో నడవిలోని చెట్లతో నిండి యున్నవి. జనమచ్చటికి పోరు. అది యేదో శాపము తగిలి ఆ నగర మును నిర్మించినవారు పరిత్యజించి పోయిరని యచటికి పోవుట యశుభమని జనములు దానిని పరిహరింతురు. అది కొన్నాళ్లు చోరు లకు స్థావరముగా నుండెను. మిమ్మచ్చటకు దీసికొని పోయెదను. అచ్చటికి జనమెవ్వరును రారు." అనగా నేను "స్వామీ అట్టి స్థలము నకు పోయి చచ్చుట యెందులకు వలసినచో నిద్ద ఱమిచ్చటనే చత్తు" మంటిని.

ఆయన నవ్వి "అది కాదమ్మా! మీరు చనిపోవలయునని నా కున్నచో నచ్చటికెందుకు తీసికొని పోవుదును? అది భద్రమైన స్థలము. ఆ శిథిల నగరమునకు తుట్టతుద నొక గుమ్ముగా పెరిగిన చెట్ల గుంపులో నొకయోగి కొన్నాళ్లు నివసించెను. అచ్చోటి కెవ్వరు రారు. జల సమృద్ధికలదు. నేను పదునేను దినములకో, నెల నాళ్లకో మీకువలసిన గ్రాసాదికము మీకు చేర్పింతును. మీరచ్చట నున్నారని బ్రహ్మకు తెలి యదు. మిమ్మచ్చట నొకయేడాది యుంతును. మహా అయినచో నిం కొక ఆరు నెలలుండురు. ఈ లోపుగా నేను జితేదాస్తి వంశవృత్త మును సంపాదింతును; " అని, ఎట్లయిననేమి నన్ను ఒప్పించెను.

"చివర కాయన చేసిన రీతి యేమనగా ముందు నన్ను మా కోటలోనుండి తరలించెను. పది దినాలలో నేను కోటలోనుండి వెడలి పోయిన వార్త మా గ్రామములోనే కాక చుట్టుపట్లనున్న పది గ్రామ ములలోకూడ దెలిసెను. నేను వెడలిపోయిన తరువాత జితేదాస్తిని సం హరింపవలయునన్న ప్రయత్నములు బలిసినవట! అప్పుడు జితేదాస్తి నొక యర్థరాత్రమున సుదర్శన భట్టారకుడు తొలగించెను. అతడు ప్రాణభీతిచే పారిపోయెనన్న వార్త పొక్కించెను. మరి నే నెందుకు పారిపోయినట్లు? నేనుండుట మూలముగా మా కుటుంబమున

ఇబ్బందిగా నున్నదని, నేను లేకపోయినచో మా యిల్లు చక్కబడునని నేసీ పని చేసితినని చెప్పికొనునట్లు చేసెను.

"తరువాత కొన్నాళ్ళకు జితేదా స్త్రీయు, నేనును కలసి యీ పాడుబడ్డ మహానగరమున, మనిసియన్న వాడు కనిపించని యీ మహా నగరమున వన్యమృగములకు నిలయమైన యీ మహానగరమున, భూతప్రేతములు నివసించు ఈ మహానగరమున నివసింప నారంభించి తిమి.

"మేము వచ్చి యారు మాసముల పైన గడచినది. మొదటి రెండు నెలలు మా బ్రదుకు కష్టముగనే యుండెను. జితేదా స్త్రీ మాటాడడు, మొద్దువలె కూర్చుండును. ఎప్పుడో యేదో మహా విషయమడిగినచో సమాధానము చెప్పును. తక్కినవానికి మాటలేదు; పలుకులేదు. కాని, మానవప్రవృత్తియు ప్రకృతియు చిత్రములైనవి. దేని కలవాటు పడినచో నదియే. రెండు నెలలనుండి మేము కొంత భయముతీరి యీ మహానగరమున నందు నందు తిరిగిచూడవలయునని సంకల్పించితిమి. నేనిచట ఖడ్గమును పూనియే తిరుగుచుందును. మా గురువు నాకు చెప్పినట్లే మేము కూటికి గుడ్డకు లేదనుకొనకుండ నెట్లు చేర్చుచున్నాడో నాకు తెలియదు.చేర్చుచున్నాడు. రెండునెలలుగా మే మీ నగరమున చాలాచోట్లు చూచితిమి, చూచుట కేమున్నది? చూచి నదే చూచుట! కాని, స్థలము వేఱగుటచేత చూడనిది చూచినట్లుం డుట. సృష్టి యొక్క స్వరూపమే ఇది. అందఱి బ్రతుకులు నొక్క టియే,అదే బ్రతుకు ఎవనిది వానిదే! మేము చీకటిరాత్రులందు పోము. మా యాశ్రమములో దీపములున్నవి. మేము నిద్రించువేళ భద్ర ముగా నుండుట కేర్పాట్లు చేసికొన్నాము.

"పూర్ణిమనాడీ రాజభవనములను చూడవలయునని సంకల్పించి కొంటిమి.నీవు కన్పించితివి.నీతో నేను నా రహస్యములెన్నియో చెప్పి తిని. ఒక స్త్రీ మరొక పురుషునితో చెప్పరాని విధముగా చెప్పితిని! నాకు దెలియును. ఇంత నిర్లజ్జముగా చెప్పుచున్నదేమా? యని, నీవనుకొనవచ్చును, అనుకొనవు - పలయనగా, నీ వెవ్వరవో జితే దా స్త్రీకి తెలియును! జితేదా స్త్రీ నడిగితిని: ఇత డెవరై యుండునని.

అతడిట్లు చెప్పినాడు: 'అతడు మానవుడై యుండడు. అతడొక భూతమై యుండును. నా కదియే యనుమానము,' అని.

'మరి నీకు భయము లేదా?' యనియడిగితిని.

జితేదా స్తి భయమన్నది యెఱుగడు. ఎందుచేతననగా నెవరికి పోయినను ప్రాణమే కదా ' యనును.

''నిన్ను గుఱించి చాల చెప్పెను, రేపు పంచమి, రేపు కూడ వత్తుము.''

# 6

''నీవు నాతో మాటాడవు. నేను నీతో నెన్ని చెప్పుచుంటిని? చిన్నప్పుడు మా అమ్మ నాకు వస యెక్కువ పోసినదని చెప్పుదురు. సుదర్శన భట్టారకుని దయవలన కొంత చదువు వచ్చినది కనుక నీ వాగుడు కొంత బాగుగనే యున్నది యనిపించవచ్చును. లేనిచో నా యంత వాగుడుకాయ యుండదని చెప్పుకోవలెను. అయినను నేడు పంచమి కదా! ఈ పది దినములు మరల పది దినములు నిరువది దినముల వఱకు మేము రాకూడదంటివి కదా! అప్పటివఱకు నేను మాటాడెడిదిలేదు. అప్పుడు వచ్చినను మాటాడెడిది లేదు. నా కథ చెప్పవలసినదంతయు చెప్పివేసితిని. నిజానికి నేడు చెప్పవలసినది లేదు. నీవు భూతమవని జితేదా స్తి చెప్పుచున్నాడు ఐనచో నీవు మాకంటె తెలివిగలవాడవై యుందువు. విషయములు మాకు తెలిసినవానికంటె నీ కెక్కువ తెలిసియుండును. లోకములో పూర్వజన్మ జ్ఞానముండదు. భూతములకుండునందురు. కడచిన జన్మయొక్క లక్షణము వారికి తెలియునేమో? తెలియుటకు వీలున్నది. వారింకొక జన్మయెత్తలేదుకదా! ఎత్తిన తర్వాతగాని పూర్వజన్మయొక్క సంగతి మఱచిపోరు.

"ఒకడు బ్రతుకును. చనిపోవును, ఏ కారణముల చేతనో భూతమగును. అది యింకొక జన్మయే కాదు. అందుచేత తాను భూతము కాకమున్ను బ్రతికిన బ్రదుకులోని విషయములు జ్ఞాపకముండవచ్చును. అట్టి సందర్భములో నొక భవిష్యజ్జన్మలోని సంగతి కూడ తెలియు

నేమో? నా కింకొక యూహ తోచుచున్నది. ఒక జన్మ పూర్వము, మరియొక జన్మ పరము. ఈ మాత్రమే యేల తెలియవలయును? ఎక్కువ జన్మల సంగతియే తెలియవచ్చును. సర్వమనుష్యులయందు జీవుడున్నాడు కదా! ఆ జీవుడా జన్మ యెత్తినప్పుడు తచ్ఛరీరగత సకలేంద్రియములయందు నిష్ఠుడై తదింద్రియముల ద్వారా సుఖమనుభవించవలయునని మనసు వెలికి త్రిప్పికొని వానికి సహజముగ నున్న లోచూపును విస్మరించును. అట్టి జీవునకీ యభిలాష లేదు. వానికి శరీరమున్నప్పుడు కదా శరీరగతేంద్రియముల ననుసరించి సుఖము సంపాదింతమన్న యూహ!

"శరీరము లేనప్పుడు తదూహ లుండవు: సహజమైన లోపలి తెలివి భాసించుచుండు ననుకొందును. వాడును మరియొక జన్మ యెత్తవలయును. తాను పూర్వ మనుభవించని సుఖము లనుభవింత వలయునన్న యూహ పొందుచునే యుండును. అందుచేత వాని జ్ఞానముకూడ పరిమితమై యుండును. శరీరి యొక్క జ్ఞానము పరిమితమై యున్నంత యుండనక్కఱలే దనుకొందును. 'మరి మేము భూతములము. మాకు కూడ శరీరము లున్నవికదా; మా జ్ఞానము కూడ పరిమితముగానే యుండు' నని నీవు తప్పించుకొందువేమో!

"నేను దాని కొప్పికోను. ఏలననగా మీకు శరీరములు లేవు. శరీరమనగా జారిపోవునది. ఛిన్నమగునది. శీర్యత ఇతి శరీరమే' అట్లే దేహమనగా దహింపబడునది యని యర్థము. 'దహ్యాత్ ఇతి' తగుల బెట్టబడుచున్నది, నాకు నవ్వు వచ్చుచున్నది. కొందఱు చనిపోయిన తరువాత వారిని తగులబెట్టరు, వారిని పాతిపెట్టుదురు. వారివి శరీరములు కావచ్చును గాని దేహములు కావేమో!మీవి—?నీవు జితేదాస్తి చెప్పినట్లు భూతమవే నైయెనచో దేహములు కావు, శరీరములు కావు. భూతాకృతిగా నెన్నాళ్ళుందువో యన్నాళ్లుందువు, మావలె తల్లి కడుపున పుట్టుటయు, పెరుగుటయు మీకుండదు, అందుచేత మీ శరీరములు జీర్ణావస్థను పొందవు. శరీరములన్న మాట ప్రసంగయోగ్యత కొఱకు వాడుచున్నాను. చనిపోయినంతనే కొందఱి యాశాబలమున భూతాకృతి దానియంతట నది వచ్చును, తదనుగతకర్మ నశించినంతనే భూతాకృతియు నశ్లే పోవును. మీ కున్నది వట్టి యాకృత

విశేషము. కాని, మీకు కొన్ని శక్తులుండును. మీరు తేజోమయ భూతులు కారు. మీ రూపము యొక్క లక్షణము నాకు తెలియదు. పట్టి గాలిలో వాతాబలముచేత జీవులకు రూపమువలె నేర్పడునా? అట్లేర్పడిన రూపమునకు శక్తి యుండునా? శక్తి యన్నది పాంచ భౌతికమైన శరీరమందుండుటకు వీలున్నది. బొమికెలు, మాంసము, నరములు, రక్తము, చర్మము అట్లేర్పడిన హస్తాదులతో త్రోయుట, లాగుట, పైకెత్తుట, క్రిందికి దింపుట మొదలైన క్రియ సాధ్యమగును. ఈ పాంచభౌతికమైన శరీరము లేనప్పుడది యెట్లు సాధ్యమగును?

''అవును. మిమ్ము దయ్యములందురు. 'గాలి' యందురు. గాలికి వృక్షాదులను కదల్చెడి శక్తి కలదు. అట్లు మీకు గూడ కలదేమో! నేనింత మాటలాడుచుండగా నీవవుననవు - కాదనవు. మీ రహస్యములు మాకు తెలియనీయరాదో! పోనిమ్ము. నేను నేడు నిజముగ వత్తమనుకొనలేదు. పంచమినాటి వెన్నెలలు కూడ నిజముగ వెన్నెల లనుటకు వీలులేదు. ఇవి యింత ప్రొద్దు పోయి వచ్చును. గ్రుడ్డిగా వచ్చును. నేను వెన్నెలనగుదునో కాదో యన్న సందేహము దానికే యున్నట్లున్నది. మాకు నిది నిద్రావేళ. నీవు భూతమవైనను నీవు సత్పురుషుడవని యందును. భూతములు ఇతరుల మీదపడి హింసించును. నీవట్లు చేయుటలేదు.

''నీవు మంచి భూతమవు. నిన్ను సత్పురుషుడని యందును. సత్పురుషులతో సత్పురుషులకు సమాగమము పూర్వపుణ్యముచేత జరుగును. ఆ పుణ్యము నొక దినమున వదలిపెట్టుకొనుట యేలయని వచ్చితిని. నిజానికి నీకు చెప్పనక్కఱలేదుగాని చెప్పవలయునన్న మోహమువలన వచ్చితిని. నేనును, జితేదాస్త్రీయు నిచ్చటికి వచ్చి యారునెలలు దాటినది. సర్వము నీకు చెప్పితిని కదా! ఇతడు పురుషుడా కాడా అన్న సంగతి నేను తేల్చికొనవలయును. ఇప్పుడే తెలిసికొనవలయునా? ఆగి తెలిసికొనవలయునా? అన్న ప్రశ్న కూడ నున్నది. ఓయి! భూతరాజా! నీ పేరు తెలియకుండ నీతో మాట్లాడుట కష్టముగా నున్నది. మానవులు ప్రసంగించునప్పుడు వేనితో మాటాడుచుందురో వాని పేరు తెలియనిచో మాటాడుట కష్టము. ఎందుకనగా, నడుమనడుమ వారిని సంబోధించుచుండవలయును. ఆ

సంబోధన లేనిచో మాటకు తూకము పోవును. మాట యొక్క పాటు తప్పిపోవును. ఆ సంబోధన వాక్యాలంకారము వంటిది, అది ప్రసంగ మున కొక సౌందర్యమును తెచ్చును. కనుక నీ పేరు చెప్పరాదా? మొదట నాతో రెండు మూడు మాటలు మాటాడితివి కదా! ఇదియు నట్టిదే యనుకొనుము. నీవు నీ పేరు చెప్పినచో నాకు ధైర్యము కూడ వచ్చును. నీవు నేనన్నచో కొంత సద్భావము కలవాడవని యును నాకు తెలియును. నీతో యేమో చెప్పవలెనన్న దానితో పాటు, సముత్సాహము కూడ కలుగును"—

అనగా నతడు తన పేరు 'కాలాభట్టు' అని చెప్పెను.

ఆమె మరల నిట్లనెను: "బాగుగనే యున్నది, కాని, కొన్ని నామములలో నొక వైలక్షణ్యముండును. మా గురువు పేరున్నది. ఆయన పేరు సుదర్శన భట్టారకుడు, లోకములో మర్యాదకలవారి నామము లుచ్చరించుచున్నప్పుడు గౌరవము కొఱకు కొన్ని యుప పదములను చేర్తురు. ఆయుపపదములు వారి వారి భాషల కనుకూల ముగా నుండును. ఆర్యుడు, ఆచార్యుడు, 'జీ', 'గారు' మొదలైనవి. ఈ యుపపదములు వాడనిచో నగౌరవపఱచినట్లగును. భట్టారక శబ్దము దానియంతట నదియే యుపపదలక్షణములు కూడ సంపా దించికొనెను. సుదర్శన భట్టారకా! అని సంబోధించిన చాలును, ఆర్య! సుదర్శన భట్టారకా! యననక్కఱ లేదు. కానీ. నీ పేరట్టిది కాదు, ఆర్య! కాలాభట్టా! యనుటయు బాగుండదు. కాలా భట్టార్యా' యనుటయు బాగుండదు. ఈ భట్టు శబ్దము సగమటు, సగమిటు నుండి వాడరానిదిగా నున్నది.

"పోనిమ్ము. నీవు బ్రాహ్మణుడవని తెలియుచున్నది ఎఱ్ఱమాదిగ వానిని నల్లబ్రాహ్మణుని నమ్మరాదందురు. నీవు నల్లని బ్రాహ్మణు డవు. నిన్ను నమ్మవచ్చునో నమ్మరాదో తెలియదు. ఈ నల్లదనము భూతలక్షణమేమో' నీవు బ్రతికియున్నప్పుడింత కాఱునలుపు కాదేమో! నీవు నిస్సంశయముగా విశ్వసనీయుడవు. కాదనుకొమ్ము. నీవు మను ష్యుడవు కాదుగదా! నీవు పోయి నలువురితో చెప్పెడిదిలేదు, దాని వలన నేను నీతో చెప్పెడి రహస్యములకు భంగములేదు. సిగ్గుపడవల సిన అవసరము కూడ లేదు.

"తొలుతటి దినములలో నిద్దఱ మా యోగిచేత పరిత్యజింప
బడిన యాశ్రమములో నుంటిమి, జితేదాస్తి కొన్నిటికి నవ్వును.
సమాధానము మాత్రము దేనికిని లేదు. వండుచుంటిని - పెట్టు
చుంటిని; అతడు సమృద్ధిగా నారగించును. వానికి కొన్ని పదార్థ
ములు మిక్కిలి యిష్టము. నా గురువు వానినే నాకు సమకూర్చి పెట్టి
నాడు. ఒక్కొక్కప్పుడు నా కతని మీద కోపము వచ్చెడిది. పసిపిల్ల
లాటబొమ్మలతో నాడుకొందురు, అవి పలుకవు, కులుకవు. నేను పసి
పిల్లను కానుగదా! పైగా నా యాటబొమ్మలు తినవు. మనకు
వ్యయములేదు. శ్రమలేదు. ఈ బొమ్మ యట్లుగాదే!

"ఈ బొమ్మతో నాకు మరికొన్ని యిబ్బందులు కలిగినవి.
ప్రేమయో! బాధయో! మరియెన్నియో! మానవుల యొక్క
విచిత్రమైన యాశలు. భార్యాభర్త లొకరినొకరు మిక్కిలి
ప్రేమించుచున్నారు; వారి నొకరొకరు విడివడి ఒక్క క్షణముండరని
యందురు. తక్కినప్పుడు సరే. కాలకృత్యములు నెఱవేర్చవలయును
గదా! అప్పుడెడముగా నుండక చత్తురా? మానవుల మాటలలో
నెన్నియో యుత్ప్రేక్షలుండును. ప్రధానమైనది చెప్పుదురుగాని
యప్రధానమైనది చెప్పరు. ఆ ప్రధానమైన దానికి పట్టాభిషేకము
చేయుదురు, చదివెడివారు, వినెడివారు తాము వంచింపబడుటకు
సిద్ధముగా నుండి చదువుదురు, విందురు, కొందఱు యథార్థమును
వ్రాయుదుమందురు, వాల్మీకియు, వ్యాసుడు, కాళిదాసు నా మహా
పురుషుల జీవితములను వ్రాసిరి, వారి శరీరధర్మములను గూర్చి
వ్రాసినట్లులేదే! అవి యక్కఱలేదా? మొట్టమొదట శరీరధర్మము
జరిగిన తరువాత కదా! నీ కార్యమో! నీ ప్రేమయో! నీ దుఃఖమో!

"ఈ జితేదాస్తిని నేను పది కన్నులతో కాచికొనవలసివచ్చెను.
అతడు కాలకృత్యములు నిర్వర్తించుటకు పోయినప్పుడు నా రక్షణ
యేమైనది? అతడొకచోట నిద్రించును. నేనొకచోట నిద్రింతును.
కొంత దగ్గఱగానే పండుకొనియుండ మనుకొనుము. నేను నిద్రపోవు
వేళ వానిని నేనేమి రక్షించుకొనగలను? వానిదాక నెందులకు!
నేను నిద్రపోవువేళ నన్ను నేనేమి రక్షించుకొనగలను? అప్పుడు భగ
వంతుడు రక్షించవలయును. ఈ జ్ఞానమున్నచో మేల్కనినప్పుడు

గూడ భయములేదు, రక్షించెడివాడు వేఱు, మన కేమి? అన్న ధైర్యము స్థిరముగా నున్నచో నంతకంటె జ్ఞానము వేఱే కావలెనా? అతేదా స్తి కాలకృత్యములు నిర్వర్తించుటకు పోయెడివాడు.

"మొదటి దినములలో నతనిని గూర్చి నేను చాల దిగులుపడి తిని. అతడు ప్రొద్దుననే పోయి ప్రొద్దెక్కివచ్చెడివాడు. 'నీ విట్లొంట రిగా పోయినచో నచట నీ కెవరైన కన్పించినచో, వారు నిన్ను వధించుటకు వచ్చినవారైనచో నీవేమి చేయుదువు? గురువుగారి ప్రయత్నమంతయు వ్యర్థమగును కదా' నా వచ్చిన యీ రాక నిరుప యోగమగును కదా! నీ విట్లు వెళ్ళరాదు' అని నేననగా, నతడు నవ్వెను. నేను చేసెడిదేమి? అతడడవులలో చాలదూరము నడచియో పరుగెత్తియో యుండునని నేననుకొనెడిదానను. అతని యొడలం తయు చెమటపోసి యుండెడిది. మేమింటివద్ద నుండగా నతని గుడ్డలు పరిచారిక లుదికెడువారు. ఇప్పుడా దశ నాకు పట్టినది. అతనిని, బతిమాలి, బామాలినగాని నిన్నకట్టిన దోవతి యూడదీయడు. నిన్న తొడిగిన యంగీ వదిలిపెట్టడు. మరి యింకొక చమత్కార మున్నది. అతడు ప్రాగుడ్డలు వదలి, క్రొంగుడ్డలు ధరించునపుడు నేనచట నుండరాదు.

"నాకు తెలియలేదు. ఇతడు నపుంసకుడా? ఆ రహస్యము నాకు తెలియకుండుటకు నీ లజ్జనభినయించుచున్నాడా? రెండు నెలలు కడచిన తరువాత నతడు ప్రాతఃకాలముల యందు పోయి చాల నేపుండి వచ్చుటనా కలవాటైనది. ఎన్నాళ్లు మేమిద్దఱము కదల కుండ కూర్చుందుము' తరువాత నిద్దఱమును గలసి యడవులలో శిథిల ములలో తిరుగవారంభించితిమి. అతడు నేను బయలుదేరుమన్నచో బయలుదేరును. తక్కినప్పుడు "యం బ్రహ్మ విదోవదంతి" ఏదైన భయహేతుకమైన స్థలమునకు పోవుదుము. అతడు వెంటనే నా వెనుకకు తగ్గును. నేనొకసారి యంటిని. ఏమయ్యా! వెనుకకు తగ్గెదవు' భయము ముందునుంచియే రావలయునన్న నియమ మున్నదా? అప్పుడు తక్కాలమున ముందునుంచి వచ్చునేమో యన్న సందేహము కలిగినది గాని భయము సర్వదిశల నుండి వచ్చును.

అనగా నతడిట్లనెను: ''కాదు. కాదు. భయమేదిశ నుండియు రాదు. మనలోనుండి వచ్చును." నన్నేమిచేయుమందువు. ఇతడు పిఱ్ఱికివాడనుటకు వీలులేదు. అవిజ్ఞుడనుటకు వీలులేదు. వేత్తయగు నేమో తెలియదు. కావచ్చుననిపించును. ఇట్లు తిరుగనారంభించితిమి. చెప్పితిని కదా! నా చేతిలో నెప్పుడును ఖడ్గముండును. ఈ యారు దినముల నుండి చూచుచుంటిని. అతడుకూడ నింకొక ఖడ్గమును దెచ్చినచో బాగుగా నుండునని నా యభిప్రాయము. ఉపయోగమునకు రాని యాయుధమెందుకని యతడు. ఉపయోగించగలుదుము, లేము. ప్రశ్న యదికాదు. చూచెడివారి కది భయహేతువుకదా! మనమేమి యని యేమి లాభము? అతడు నవ్వును.

అతని కొంత స్వరూపము నాకొకనాడు తెలిసినది. నాకేమ్యగ మన్నను భయములేదు గాని భల్లూకమనినచో భయము. దానికి కారణము నా తండ్రి కథయై యుండును. ఆ కథయంతయు చెప్పితిని కదా! మా కప్పుడప్పుడు కాంతారమునందు భల్లూకములు కన్పించుట కలదు. దూరముగ భల్లూకములు కన్పించినచో నేను వానిని చక్కగా పరిహరింతును. పుట్టలు తేనెపట్టులుకల స్థలములను గూడ పరిహరింతును. ఎందుకు వచ్చినది. వానినాశ్రయించి భల్లూకములుండవచ్చును. మనమేమి పరిహరింతుము? తెలిసినది పరిహరింతుము, ప్రత్యక్షముగా కన్పించిన దానిని పరిహరింతుము. అప్రత్యక్షముగా నున్నదానిని పరిహరించుట యెట్లు? ఆనాడు నా తండ్రియు, గాలియు నచట భల్లూకమున్నదనుకొనలేదుగదా' వారికిభల్లూకము కన్పించలేదుకదా! పరిహరించుటయెట్లు! కాని, వారికొక పెద్ద వంద తుమ్మెదల ఝుంఝుం వినిపించినది. అదియేమై యుండునని వారు వెళ్లిరి. అందుచేత నా యాపద వారికి కలిగినది. నేననవసరముగా నాత్రోతయేమి? అక్కడ నేమియుండును? అది యేమై యుండును. మొదలైన ప్రశ్నలు పెట్టుకోను.

కొన్ని నెలలుగడిచినవి. నాపద్ధతి యెంత నేవటికి "శేషావ్యాపాన్ గమయ" అన్నట్లుగా నుండును. కాని "లోచనే మీలయిత్వా" మాత్రము చేయను. చేయననగా నాకు తెలిసినంతలో చేయను, ఆ దైవమున్నాడే! తెలివియన్నచో వానిది తెలివి! మనము దేనిని పరి

హరించుచుండుము వాడు దానిని మనకు సన్నిహితముగా చేయును. అవి చీకటిదినములు. ప్రొద్దుక్రుంకవచ్చుచున్నది. ఈ శిథిలములలో కొన్ని కొన్ని యాకర్ష కములుగానుండి జాగుచేసితిని. చీకటిపడబోవు చున్నది అర్థక్రోశమైన నడచిన గాని మా యాశ్రమమునకు చేరము. నేను తొందరగా నడచినచో జితేదాస్తి తొందరగా నడుచును. నేను నెమ్మదిగా నడచినచో నతడును నెమ్మదిగా నడచును.ఆ నాడు తాను నా వెనుక దూరముగా నడచి వచ్చుచుండెను. అతనిని కలిపికొని పోవుటకు నేను మాటిమాటి కాగవలసి వచ్చుచుండెను. అదిగో యిదిగో మా యిల్లన్నంత దవ్వులో నున్నాము.

నేను సామాన్యముగా నచ్చటనొక గుట్టయున్నదే! దానికి దూరముగానే పోవుచుందును. చీకటిపడినది కదా! ఇది దగ్గఅయని నాడు గుట్టకు నమీపముగా వెళ్లుచుంటిని. ఆ గుట్ట మలుపు తిరుగ వలయును. ఇతడు దూరముగా నున్నాడు. గుట్టమలుపు తిరిగెడి చోట నే నితని కొఱకాగితిని. ఆగుట్ట వెనుక నుండి భల్లూకము వచ్చినది. నా పై ప్రాణములు పైన పోయినవి. ఖడ్గముతో భల్లూ కము నేమైన చేయుట కష్టము. అది కాళ్లపై లేచి నిలుచున్నచో పొట్ట క్రింద రోమములు తక్కువ గనుక ఖడ్గముతో దాని పొట్టలో పొడువ వచ్చును. ఈ లోపుగా నది తనముంగాళ్లు మన ఱొమ్ముపైననో భుజ ములపైననో వేసి గోళ్ళతో చీలును.ముట్టెతో మన మెడ కొఱుకును. నుంత యెడముగా నున్నచో ఖడ్గముతో దాని నోటిలో పొడువ వచ్చును. కాని, అది ఖడ్గమును నోటితో విఱుచును. మనము నిరా యుధుల మగుదుము.మా వేటకాండ్రొక సామాన్యోక్తి చెప్పెడివారు. మన యెడమ చేతికి మోచేయి వఱకు గుడ్డ దట్టముగా చుట్టి తెఱచిన దాని నోటిలో చొప్పించి దానిని ఖడ్గములో పొడువ వలయునని. నీవు ప్రత్యేకముగా భల్లూకములను వేటాడుటకు పోయినచో నట్లు చేయవచ్చును. వేటయన్నచో ముక్కు మొగ మెఱుగనివాళ్లు చాల మాట లిట్టివి చెప్పుదురు.

ఎవడో బుద్ధిమంతుడు నల్లుల బాధ పడుచుండగా నల్లులను చంపుటకొక యుపాయము చెప్పెనట.దానిని పట్టుకొని దాని దౌడలు తెఱచి దాని నోటిలో మందు వేయవలయునట. అట్లుండును. ఈ

భల్లూకమునకు నేను దూరముగా నున్నచో నది దాని దారినదిపోయెడి
డిదే! మిక్కిలి సమీపముగా నెట్టయెదురుగా నుంటిని. సర్వ జంతు
వులకు ప్రాణభయము. నేను దానినేమియో చేయుదునని గుఱ్ఱు పెట్టి
నామీదికి వచ్చినది.

అపుడు దూరముగా నున్న జితేదాస్తి కానొక ధ్వని చేసెను.
దానిచూపు నన్ను వదలిపెట్టి వానిమీద పడినది. అతడు పరుగెత్తి
వచ్చి దాని వెనుక భాగమునకు చేరెను. దానికేమి చేయుటకును తోచ
లేదు. నన్ను వదలి వెనుకకు తిరుగవలయునా? తిరిగినచో నేనేమి
చేయుదునో! తిరుగనిచో నతడేమి చేయునో! మనకెందుకని ముం
గాళ్లువొంచి పారిపోవునా? అది రెండు వైపుల నుండి తెచ్చికొన్న
యాపదయగును. రెండు శత్రుస్థానములలో నొకదానినైన పరిహ
రించుట మేలనుకొనెనేమో! నీతిమంతుడు తాను సాధ్యమనుకొనిన
శత్రుస్థానమును నిర్జించుటకు ప్రయత్నించును. దానికి నేను స్త్రీనని
యతడు పురుషుడని తెలిసెను కాబోలు! స్త్రీని సులభముగా నిర్జించ
వచ్చునని నా వైపునకే మళ్లినట్లున్నది. మరియు భల్లూకము వెనుగాళ్ళ
మీద నెంతసేపో నిలచి యుండలేదు. దగ్గఱ నే నుంటిని. నా మీదనే
పడబోవు చున్నది.

జితేదాస్తి దాని వెనుక వైపునకుబోయి తనయెడమచేయి
మోచేతివఱకు దానికంఠము క్రిందికిపోనిచ్చి దానిని తన పొట్టకు నదుము
కొని దాని గొంతును నొక్కెను. అతనికంత బలమున్నది కాబోలు!
దానినోటినుండి యూపిరి యాడని గుఱ్ఱు వచ్చినది. అతడు పిడికిలి పూని
దాని నెమర కణతను పెద్ద ముష్టిఘాతమును చేసెను. ఆదెబ్బకది తల్ల
డిల్లి పోయెను. ఇతడు తన యెడమచేతిని లాగుకొని దానినొక
త్రోపు త్రోసెను. అది దూరముగా పడిపోయెను. ఇద్దఱము చూచుచు
నిలుచుంటిమి. అదికొంతసేపటి వఱకు లేవలేదు. తరువాత నెమ్మదిగా
లేచెను. మా వంక గూడ చూడలేదు. దాని దారి పడి పోయెను. నేను
దిగ్భ్రాంతురాలనై పోతిని. ఇతడేమి యేనుగా! సింహమా! ఇతడింత
బలశాలియా! అవును నిజమే! అతనికి ఖడ్గమెందులకు? ఇద్దఱము
నడుచుచుంటిమి. ఇతడే ముందు నడుచు చున్నచో నేమి యయ్యెడిది?
వెనుకనుండి పట్టిన యీ పట్టు ముందు నుండి సాధ్యముకాదు గదా!

దాని గొంతుక యెడమ చేతితో పట్టుకొనెడి వాడా? దాని గొంతు పిసికెడి వాడా?

ఇల్లు చేరితిమి. ఇద్దఱము స్నానము చేసితిమి. భోజనములు చేసితిమి. పరుంటిమి. నాకు నిదుర రాలేదు. అతడు చక్కగా గుఱ్ఱు పెట్టి నిద్రపోవుచుండెను. ఇప్పుడతనిమీద నాకింకొక యభిప్రాయము కలిగెను. అతడు గొప్పమేధావిఅన్న భావమే పూర్వముండెడిది ఇప్పుడు మహా బలశాలియన్న భావముకూడ నేర్పడినది. ఈ రెంటిని మించి యతడు నాకు ప్రాణదాత. నాకు నిదురపట్టుటలేదు అతనిని మేల్కొల్పితిని. అతడు లేచి నావంక చూచుచుండెను. అతనితో చెప్పితిని నాకు నిదురపట్టుటలేదు. నీవు నేడు నా ప్రాణమును రక్షించితివి. అతడిట్లనెను. "భల్లూక జాతియన్నచో నాకు విరోధము. నాతండ్రిని భల్లూకము సంహరించినది. దానిని చూచినంతనే నాకెక్కడ లేని బలము వచ్చినది. అంతకు మించి యేమియు లేదు" అని మరల నిదుర నారంభింపబోయెను.

మేమిద్దరమిట్లు లేచివచ్చుట నాగురువుచేత నుపదేశింపబడక పూర్వము నేను నీతో చెప్పితినికదా! మాటలలో, చూపులలో ప్రవర్తనలో నేనుశృంగార రసమును వెలార్చుచుండెడుదానవని. మా గురువు ఈ కథ చెప్పినతరువాత మానివేసితిని. ఇచట కొన్ని నెలలు కలసి నివసించినను జితేదాస్తితో నేనెన్నడును నట్లు ప్రవర్తించలేదు. మాటాడలేదు. నవ్వలేదు. నవ్వినను నైన నా యర్థము వచ్చునట్లు నవ్వలేదు. ఆ సమయమునందు కృతజ్ఞతా పరిపూర్ణమైన నా హృదయము, తద్బాహుబలప్రశంసాభరితమైన నా హృదయము, పురుషునితో నేకాంతముగా కొన్ని నెలలొకచోట నందులో మహారణ్యమధ్యమునుండి యొంటరితనము తట్టికొనలేని నా హృదయము, తన్ను దానోర్చుకొనలేకపోయెను అతనిని నేను హఠాత్తుగా కౌగిలించితిని. అతడు తన రెండుచేతులను నా కంఠమునందో నా భుజముల మీదనో వాకటిభాగములందో చేర్చినన్ను తనయెడద కొత్తికొనునని నేను భావించితిని. అతడట్లు చేయలేదు. నేనే నా కౌగిలిని శ్లథపరుపవలసి వచ్చెను. వెంటనే కౌగిలింతకు పూర్వము నాయెదయెంత పొంగినదో ఇప్పుడు నాయెద యంత క్రుంగినది.

ఏమిరా; అవివేకము చేసితి ననిపించినది. నేనిట్లు చేసితినని ఎవ్వరు నెఱుగరుకదా అన్న తృప్తి యేమియున్నది. మనమనస్సునకు మనమే సాక్ష్యము. మనలనుగూర్చి ఎవ్వరో చెప్పికొనిన దానికి మనము దుఃఖపడుదుము. నిజమే! ఎవరును చెప్పికొనుటకు వీలులేని దానిని, ఎవ్వరును చూడని దానిని మనము సిగ్గుపడవలసిన దానిని మనము చేసి లోలోన పడెడి బాధకు పరులు చెప్పికొన్నచో పడెడి బాధకు సంబంధములేదు. లోనిబాధ వెలిబాధకంటె పదిరెట్లు.

నేను లజ్జావనత వదననై యుంటిని. నాకనుల వెంట జోరున బాష్పములు కారుచున్నవి. కాని, గుండెలో కోపము పట్టరానిదిగా నున్నది. ఇట్టి వానికొఱకు నేనెందుకింత సాహసము చేసితిని? నా మనస్సు కల్లోలితమగుచున్నది. నా యుద్దేశ్యములో నతడు నాస్థితిని పట్టించుకొనకుండ మరల నిద్రపోవుచుండునని. ఇంతలో నతడు నన్ను పేరుతో పిలిచెను. నేను తలయెత్తి చూచితిని.అతడు నన్నెప్పుడును పిలువనేలేదు. నేనెప్పుడు నతనిని పేరుతో పిలువలేదు, నేనేదైన నతనితో చెప్పవలయుననగా సంబోధనలేకుండ చెప్పుదును. అతడు నమాధానము చెప్పును. నన్ను పేరుతో పిలుచుటయేమి! నన్ను పేరుతో నెవరు పిలుతురు? నాతండ్రి నన్నెన్నడును పేరుతో పిలువ లేదు. నాతల్లి నన్ను అమ్మా' యని పిలుచును. నాగురువు నన్ను బిడ్డా! అని పిలుచును. పరిచారికలు పరిచారకులు చిన్న దొరసాని యందురు. జితేదాస్తికి నా పేరెట్లు దెలియును? అదియేనాకబ్బు రము ఆ పిలిచిన పిలుపులో నెంత యాదరమున్నదో!ఎంత భయ మున్నది? ఎంతజాలియున్నది?

మరు నిమిషములో నాకొక సందేహము వేసెను. ఈ భావము లన్నియు నేను కల్పించుకొన్నవా?అతడు నా వంక చూచు చుండెను.అది యర్ధరాత్రము. దీపము వెలుగు చున్నది. దీపపు వెలుగు వాని ముఖ మున బడుచున్నది. నా కన్నులలో నీళ్లున్నవి అతని ముఖము నాకు కన్పించుటలేదు. అతని కన్నులలో నే భావము తొణికిసలాడు చున్నదో! నేనర్ధము చేసికొన జాలకుండ నా కన్నులలో నీళ్లునిండి యున్నవి. చీర కొంగుతో కన్నులు తుడుచుకొనుట చేయవలయును? చేయుట నా కిష్టము లేదు. అది నన్ను నేవగౌరవ పఱుచుకొనుట

యనిపించినది. వెంటనే లేచి నా ప్రక్కమీద నేను పండుకొన వలయు ననిపించినది. కాని యతని కంఠస్వరములోనున్న యొక లాలిత్యము నన్ను కదలనీయలేదు

అతడిట్లనెను. "నేను నిన్ను తిరస్కరించితిననియా? నీవును సుదర్శన భట్టారకుడును వేసిన పథకము నాకు తెలియును. నాకు శాస్త్రీకజ్ఞానమున్నంత లౌకికజ్ఞానము లేదనుకొనుచున్నావు. నన్ను మీగ్రామములో క్షత్రియ యువకులు వధింపనెంచినారు. నాగేశ భట్టును, భట్టారకుడును నన్ను వెలికి పోనీయలేదు. నా బ్రతుకే విచిత్రమై పోయినది. నేను నిర్వ్యవసాయుడను. మీనాయనగారు నన్ను రక్షించిరి. నేను నిన్ను ప్రేమించినచో నేను కృతఘ్నుడననౌదునేమో! ఆయన చేత పెంపబడి తక్కువ కులమువాడనై నేనాయన కూతును ప్రేమించి యాయనకు తలవంపు తెప్పింతునా? తరువాత తరువాత నీవు నన్ను ప్రేమించు చుంటివని నాకు తెలిసినది. నేనీసందిగ్ధావస్థలోనున్నాను. నేను సుక్షత్రియుడనైనచో నా మనస్సు నీకు తెలియజేసెడి వాడను. అనులోమ విలోమములని రెండున్నవి. ఇది విలోమము. అధికజాతి స్త్రీ అథమజాతి పురుషుని పెండ్లాడినచో కన్న సంతానము నీచ సంతానమగును. వారేమి రాజ్యము లేలుదురా? ఏలినచో నందు ధర్మముండునా? ఈనాటి నేను చేసిన భల్లూక వధమును బట్టి నీ యెడద మిక్కిలియు నార్ద్రమైనది. దానిని తట్టుకొనలేక పోయినావు. నేను సుక్షత్రియుడనని సుదర్శన భట్టారకుడు నిరూపించ గల్గినచో మన యూరిలోని క్షత్రియ కుమారులు నాకు లెక్కలేరు. వారందరిని నేనొక్కపిడికిలిలో పట్టుకొనగలను. నాకు ఖడ్గవిద్యయు తెలియును. మీ నాయనగారి యాయుధములు దొంగిలించినది నేను. ఆయనకు నీమీద ననుమానము కలిగెను. నేనూరకుంటిని. ఊరకుండుటలో నేను కొంత ద్రోహముచేసితిని. నీమీదనాయనకు సంపూర్ణముగా నాగ్రహము వచ్చినచో తక్కువకులమువాడనైన నన్ను నీవు పెండ్లాడితి వనగా నీ తండ్రి యంత పట్టించుకోడు. అచట నా స్వార్థమున్నది. నేనెంతసేపు ఘాటాడినాను! ఇంత సేపెవ్వరితోడను మాటాడలేదు. నామనస్సు విప్పిచెప్పితిని. అందుచేత నీవు నాయందాశ పెట్టుకొనకుము. నేను సుక్షత్రియడను కానిచో నిన్ను నేను పెండ్లా

డను. నేను మిమ్ము వదలి లేచిపోవుదును. ఎచటికో! ఎందుకో! నేను సుక్షత్రియుడనైనచో, అని భట్టారకుడు నిరూపింపగలిగినచో నేను నీకిప్పుడు తెప్పించిన కన్నీళ్లు ఆనాడు నా పెదవులతో తుడిచెదను. నేనెదురు చూచుచున్నాను. నీవు నెదురు చూచుచుండుము. నేను నీకు ప్రాణదాతనన్న కృతజ్ఞత యెందులకు? ఎట్లయినా నక్కఱలేదు. సేవకుడనైనచో నక్కఱలేదు కదా! మఱి నీవనుకొన్నట్లయినచో నసలక్కఱలేదు. పోయి పండుకొనుము నీవొక వెగడివి. నేనొక వెగడిని. మంటరారాదు. కుమ్ములు పెట్టినట్లుండవలయును. అంతే!”

# 7

‘‘ఓయి! కాలాభట్టా! ఇది మా కథ. ఆనాటిరాత్రి చీకటి. మేము పడుకొన్నచోట వెన్నెలలు కాయుచున్నవి. దీపము వెలుగుచున్నది. ఆ వెన్నెలలలో దీపపు వెలుతురు నాకు తృప్తి కలిగించలేదు. దానిఁవార్పితివి. గదియంతయు చీకటైయునదని యనుకొనకుము. నాకంతయు వెన్నెలమయముగా నున్నది. నా మనస్సులోనున్న యానందముచేత నాకట్లనిపించినదనుకొనకుము. అట్లుకాదు. నిజముగా నా పటకుటీరములో వెన్నెల కాయుచున్నది. నేను కనులతో చూచుచుంటిని. కాదనుటయెట్లు? ఇప్పటికి చాల ప్రొద్దుపోయినది. నేనప్పటి మాట చెప్పుటలేదు. నేటిమాటయే చెప్పుచున్నాను. అయ్యా భూతరాజమా! ఈ వెన్నెల యేమి వెన్నెల! తఱుకులేని వెన్నెల. ఇదియంతయు నేనెందుకు చెప్పితిననగా నీజితేదాత్తివి నీవు గొల్లవాడనుకొన్నావు. నిజమే! నీవెట్లు గ్రహించితివో నాకు తెలియదు. అయ్యా! ఇతడు సుక్షత్రియుడు కావలయునని నా కోరిక. నీవాగతానాగతవేదివి. ఇతడు నిజముగా గొల్లవాడైనచో మా యిద్దఱి బ్రతుకులును బండయెక్కినట్లే. ఇతడు సుక్షత్రియుడని నీవు నాకు చెప్పినచో నాకు ధైర్యముగా నుండును.

నీవు భయంకరమూర్తి నెదుట కన్పించినంతనే యితడు వెనుకకు తగ్గెను. అతడు పిఱికివాడని నీవనుకొంటివి. కాదయ్యా! కాదు!

నీవు నన్నేమైనను చేసినచో నతడు నన్ను రక్షించుటకు వెనుకకు తగ్గెను. అప్పుడత డేమిచేసియుండెడివాడో నాకు తెలియదు నీకు తెలి యదు. అయినను నీవు భూతమవు, నిన్నత డేమి చేయగల్గును? అది యట్లుంచి మేము లోపకిపోయి చూడవలయుననుకొన్నాము. నీవు మమ్మాపితివి. మాసంగతి నీకు చెప్పితిని. మమ్ముగూర్చి నీకనుమాన మక్కరలేదు. నేను నీచకులస్త్రీనికాను. మర్యాదతెలియని దానను కాను. అప్రవేశ్యురాలనుకాను.

కాని యిప్పుడు చాల ప్రొద్దుపోయినది. నేనిప్పుడు లోనికి పోవుట నాకు నిష్టములేదు. నీవు రేపటినుంచి మమ్ము రావద్దన్నావు. మరల వచ్చు శుక్లపక్ష దశమినాడు వత్తును. అప్పుడు లోనికి పోనిత్తారా?

కాలాభట్టు: అప్పుడు నిన్నుమాత్రమే పోనిత్తును ఇతనిని పోనీ యను లోన నతఃపురస్త్రీలున్నారు పురుషులు పోరాదుకదా! పోనిచ్చినచో దౌవారికునిది లోపమగును నీభర్తయైన యితడు పోవు టకు వీలులేదు.

ఆమె: నీనోటివెంట నితడు నాభర్తయని వచ్చెను. అట్లుజరు గునా? మహాపురుషుల నోటివెంట వచర్థములైన మాటలు రావుగదా!

కాలాభట్టు! నేను భూతమను. ఇతడు చెప్పినాడుకదా! 'నీకతని మాటయందే విశ్వాసముకదా! భూతమైనవాడు సత్పురుషు డెట్లగును?''

ఆమె:- నిస్సందేహముగానగును నన్నెందుకు మోసముచేసెదవు. నీనోటవచ్చిన మాటను నిజము కానిమ్ము.

కాలాభట్టు:- నామాటతో మీరు భార్యాభర్తలగుదురేని నాకే మియు నభ్యంతరములేదు. ఈ శిథిలమైన నగరమును మీరు మరల నిర్మించుకొనుడు. దీనిని బాగుచేసికొనుడు. ఈ యంతఃపురము మీది యగును. దీనిలోపలికిపోవుటకు వీలులేదనుటకు నేనెవడను? అప్పుడు నేను వచ్చినచో నన్ను లోనికిపోనీయకుడు.

అని కాలాభట్టు అంతర్ధాన మందెను.

# 8

ఈ శిధిలములకు కొంత దూరములో క్రాంతిపురమని యొక పట్టణము కలదు. అచట నందఅు క్షత్రియులే. పూర్వము విక్రమార్క చక్రవర్తి నేపాళ దేశమునకు వచ్చెను. అది యెప్పటిమాట? కలి దాటిన తరువాత మూడువేల నలుబదినాల్గవ సంవత్సరము మాట. ఇప్పుడు మూడువేల అయిదువందల సంవత్సరములు గడచినవి. అనగా నప్పటినుండి యిప్పటికి నయిదువందల యిరువది సంవత్సరములు గడచినవని యర్థము. మూడువేలకు పూర్వము నేపాళదేశమును సూర్యవంశపు రాజులు పాలించుచుండెడివారు. వారు ముప్పది యొక్కమంది రాజులు. వారిలో చివరివాడు. విశ్వదేవవర్మ. ఆవిశ్వ దేవవర్మకు పుత్ర సంతానములేదు. ఠాకూరు రాజవంశ సంజాతుడైన యంశువర్మకు తన కూతునిచ్చి పెండ్లిచేసెను. అంశువర్మ నేపాళదేశమునకు రాజయ్యెను.

అప్పటి నుండి నేపాళదేశ మీఠాకూరు వంశ రాజులచేతఁ బరిపాలింపబడు చుండెను. ఈ యయిదువందల యరువది యేండ్లలో నేపాళమును తొమ్మండుగురు రాజులు పరిపాలించిరి. ఇందులో నిద్దరు రాజులు తొంబదియేండ్లకు మించి పాలించిన వారున్నారు. అంశువర్మ కుమారుడు కృతవర్మ యెనుబదియేడేండ్లు పాలించెను. మరిముప్వురు రాజులు యరువదియారేండ్లరువదియారేండ్లు పాలించిరి. అధునిక విమర్శకులు నేటి కాలపు లెక్కల ప్రకారము రాజొక్కొక్కడు పాతికయేండ్లు పాలించుననియు నందుచేత నయిదువందల యరువది యేండ్లలో నిరువది యిద్దఱైన రాజులు పాలించి యుండవలయుననియు, గావున పురాతన కాలము నుండి మన దేశములో సంప్రదాయ సిద్ధముగావచ్చు చున్న నేపాళరాజ్య వంశావళి ఎవరి చేతనోకల్పితమై యుండుననియు గొన్ని సిద్ధాంతములు లేవదీసి మన పూర్వరాజ వంశముల చరిత్ర యంతయు తారుమారు చేసిరి. దేనికయ్యాఇంత తారుమారనగాదాని వెనుకనైదారు రహస్యములున్నవి.

మన దేశములో నిప్పుడుపలభ్యమానమగుచున్న మనపూర్వ

రాజవంశ చరిత్రలు ప్రధానముగా మూడున్నవి. ఒకటి మగధరాజ
వంశ చరిత్ర. రెండు కాశ్మీర రాజ చరిత్ర. మూడు నేపాళ రాజవంశ
చరిత్ర. ఈ మూడింటి ప్రకారము అయిదువేల యిరువదియేండ్లకు
పూర్వము జరిగిన భారతయుద్ధ పూర్వకాలమునకు నీ యీ రాజ్య
ములలో నెవరెవరు పాలించుచుండిరో చెప్పబడినది. అప్పటినుండి
కలియుగము ప్రవేశించిన తరువాత నాలుగువేల యేండ్లు దాటు
వఱకు వరుసగా రాజులు, మారిన వంశములు, నా రాజుల రాజ్య
కాలము చక్కగా పేర్కొనబడుటయేకాక భారతయుద్ధకాలము నాటికి
పూర్వపు రాజ్యముచేసిన యాయా వంశముల పూర్వరాజుల పేర్లు
కూడ చెప్పబడినవి. భారతయుద్ధమిప్పటి కయిదువేల యిరువదియేం
డ్లకు పూర్వము జరిగినచో తత్పూర్వము వేయియేండ్లనుండి యెవ
రెవరు రాజ్యము చేసిరో యీ రాజ వంశావళులు చెప్పుచున్నవి.

భారత రచన క్రీస్తు పూర్వము రెండువేల క్రిందట ననియు
రామాయణ రచనము భారతమునకంటె పూర్వమో అర్వాచీనమో
యని సందేహములు పుట్టించిరి. మన దేశములోనున్న చాలమంది
మనుష్యులను చీకాకు పఱచి భ్రష్టత చేసిన పాశ్చాత్య చరిత్రకారులు
కాలము నిట్లు తగ్గించుటకు కారణమేమనగా వారికి వారి సంస్కార
ములకు మూలస్తంభములైన గ్రీసు రోము సామ్రాజ్యములే క్రీస్తు
పూర్వము వేయియేండ్ల నాటినుంచి యున్నవేమో! వారు మోసము
చేసియో, దైవ మనుకూలించియో, భారతీయుల పాపములు
పండియో మన దేశమును రెండువందలయేండ్లు వారు పాలించుట
జరిగెను. మానవుల లక్షణమేమనగా నది సంపన్నమైనస్థితియైనచో నది
శాశ్వతముగా నుండుననుకొనుట. అథస్థితిలో నున్నవాడు కాల
మెప్పుడు నిట్లేయుండునా? కొన్నాళ్లు శుక్లపక్షము-కొన్నాళ్లు కృష్ణ
పక్షము. కొన్నాళ్లు శుక్ల పక్షము ననుకొనును. అన్నియు బాగుగా
నున్నవాడు శుక్ల పక్షము మేకు వేసికొని తనవద్ద యుండుననుకొనును.

ఆంగ్లేయులట్లే యనుకొనిరి. అనుకొనుటలో తప్పులేదు గాని,
మనచరిత్ర, మనసంస్కృతి, మన ధర్మము సర్వమును పాడుచేయుట,
దుర్భావములు కలిగించుట, మానవులను భ్రాంతిమంతులను చేయుట
మొదలైనవి భగవంతు డోర్వరాని విషయములు. ఇప్పుడేమైనది?

మార్యాద న్రమించని బ్రిటిష్ సామ్రాజ్యము తన యంతట తనే యస్త మించినది. అమెరికా యొక్క యండ లేనిచో నేడు ఇంగ్లడునకు దిక్కు మొక్కు లేదు. మానవుని జీవితములో నెట్లో జాతుల జీవితము లకు కూడ నట్లే! 'చేసిన పాపముల్ తగిలి తీరును' చేసినవాడు చూడక పోవచ్చును. వాని వంశ మనుభవించును. వాని జాతి యను భవించును.

వారి లెక్కల ప్రకారము సృష్టిజరిగినదే క్రీస్తుపూర్వము మహా అయినచో రెండు మూడు వేల సంవత్సరములు కావచ్చును. తాము భారతదేశమును పాలించుచుండిరి. తమ నాగరికత కొన్నివందల యేండ్లకు మించిపోదు. తమ క్రిందనున్న దేశము యొక్క నాగర కత వేలు కాదు లక్షల తరబడి యేండ్లనుండి యున్నదన్నచో వారి కెంత మర్యాద! అందుచేత మన చరిత్ర వ్రాయుచు వారి యిష్టము వచ్చిన మార్పులు వారు చేసిరి. వారు వ్రాసినది చరిత్ర. అది విద్యా శాలలలో బోధింపబడును. అందు తీర్ణులైన వారికే యుద్యోగము వచ్చును.

పైగా మానవుని మనస్సు తనకు పరిచితమైన దానినే విశ్వ సించు చుండును. ఇది సృష్టిలోని రహస్యము. దీనిని రాజనీతిజ్ఞులు తెలిసి తమ యిష్టమైన చదువు ప్రజలకు చెప్పించు చుందురు. పూర్వము భారతీయులైన రాజులు నిట్లే చేసిరి. అది రాజనీతియే! కాని యందులో సదసద్వివేక ముండవలయును, అట్లే యింగ్లీషు వారు మనదేశముచేత వారి చదువులన్నింటితో పాటు వారు కల్పించిన కృతక భారతీయ చరిత్రను చదివించిరి. ఏపాడచిలుక ఆ పాడపలుకు పలుకునట. బ్రాహ్మణులయింట పెంచబడిన చిలుక "అయ్యా! రండి! స్వాగతము! స్వాగతము!" అనగా కసాయివానియింట పెరిగిన చిలుక 'కొట్టు, చంపు' అనును.

అట్లు మన నేటి చరిత్రకారులు భారతీయులై యుండి కూడ కసాయి చిలుకవలె పలుకుచున్నారు. అదే! ఇది రాజనీతి, ఎవని చదువు వాడు చెప్పును. కడచిన మూడు నాలుగువందల యేండ్లుగా పాశ్చాత్యులు తమ సిద్ధాంతములే నిజములని మనకు నేర్పిరి. నేడు రహస్య మేమిచేయ [illegible] దే? ఇప్పుడు విలకవిరి వచ్చిన పైనా వేడు

చేయుచున్నది? ఈ విషయము భారతీయులు గ్రహించి మన యథార్థ చరిత్రను గ్రహించవలయును, వ్రాయించుకొనవలయును.

అది యట్లుంచి యంశువర్మ మొదలు నేటివరకు అనగా కలి ప్రవేశించిన తరువాత అయిదువందల యరువదియేండ్ల వరకు అంశు వర్మ వంశములోని తొమ్మండుగురు రాజులు పాలించిరి. శివదేవ వర్మ తనకూతు నంశువర్మ కిచ్చునప్పుడు నాడు కొంత యల్లరి జరి గెను. అంశువర్మకే తనకూతునిచ్చుట ఠాకూరువంశములోని పలు పుర కిష్టములేదు.

అప్పుడే రాజ్యములో కొంత యలజడి జరిగినది. కాని, యుజ్జయినీ మహాప్రభువు, నవరత్నపురుషుడు, శకకర్త, మహాపండి తుడు, మహాశేత, కాళిదాసాది మహాకవులకు నాశ్రితుడునైన విక్ర మార్క చక్రవర్తి యంశువర్మ రాజ్యము చేయుచుండినప్పుడు నేపాళ రాజ్యమునకు వచ్చి యంశువర్మ నాదరించి యతని రాజ్యము నంగీక రించుటచేత ప్రతిపక్షుల బలము తగ్గిపోయినది. ఈ క్రాంతిపురములో నా యంశువర్మయొక్క దాయాదుల వంశములు నేటికి నున్నవి. వారు నివురుగప్పిన నిప్పులవలె నుండిరి. ఎప్పుడెప్పుడేరాజు బలహీను డగుచుండెను, అప్పుడప్పుడెల్ల వారు తలయెత్తుచునే యుండిరి. నేపాళ రాజ్యమంతయు తమదనియు, అంశువర్మ సంతతి పాలించుట ధర్మ విరోధమనియు నిట్టి భావములు వారిండ్లలో పసిపిల్లలకుగ్గుపాలతో పోయుదురు.

ఒకరాజు తొంబది యేండ్లు పాలించెననగా, కాదు పదిమంది రాజులు నాలుగైదువందల యేండ్లు పాలించిరనగా సర్వదేశము, సర్వరాజ్యము సుభిక్షముగా, శాంతముగా నున్నదనుటకు వీలులేదు. క్షామములు వచ్చును, విప్లవములు చెలరేగును, ఇవి జరుగుచునే యుండును. మరల రాజ్యము సాగుచునే యుండును.

అంశువర్మ తరువాత వారసరాజైన వీరదేవుడన్న వాడు కలడు. ఆయన కలి గడచిన తరువాత మూడువేల నాలుగువందలవ యేట రాజ్యాధిపతి యయ్యెను. ఆయన పాలిమ్మెదునొక స్త్రీని ప్రేమించెను. అది పెద్ద గందరగోళము. దేశమునందు విప్లవము

జరిగెను. ఆ రాణియొక్క యిష్టదేవత పేరు మణియోగిని, ఆ మణియోగిని లలితాదేవతా స్వరూపము.

వీరదేవుడు సమర్థుడు. అల్లరుల నణచివాడు. కాని, తాను ప్రేమించిన స్త్రీని నిలబెట్టుకొనలేకపోయినాడు. ఆమె పేర ఒక పెద్ద పట్టణమును నిర్మింపతలచినాడు. ఆ పట్టణము సగము నిర్మాణమైనది. అంతలో నా ప్రియురాలు చనిపోయినది. ఆ పట్టణము పరిత్యజింపబడినది. ఆమె పోయిన తరువాతగూడ వీరదేవు డేబది యేండ్లు రాజ్యముచేసెను. అతడు సమర్థుడు, గొప్ప రాజనీతివేత్త, గొప్ప సేనానాయకుడు అందుచేత నతనికాలములో నతని శత్రువులు విజృంభింపలేకపోయినారు.

అతని కుమారుని పేరు చంద్రకేతువు. అతడు తండ్రియంత సమర్థుడుకాడు. అచ్చముగా నసమర్థుడుకాడు. తండ్రి శత్రువులందఱు నితనికాలములో తలలెత్తిరి. ఈ చంద్రకేతువు తక్కువ రోజులు పాలించలేదు. ఇతడు నలువది యారేండ్లు పాలించెను. ఎప్పుడు ఎదురుతిరుగుటలు, ఎప్పుడు శత్రువు లూళ్ళను దోచికొనుటలు, ఇట్లు జరుగుచునే యుండెను. రాజ్యము సుఖితముగా లేదనియే చెప్పవలయును.

అతని తరువాత నతని కుమారుడైన నరేంద్రదేవుడు రాజ్యమునకు వచ్చెను. అతడు వచ్చిన తరువాత కొంత యలజడి తగ్గినది. విక్రమార్క చక్రవర్తి కాలమునందు దేశమంతయు వేదమతముతో నిండియుండెను. అంశువర్మ తొల్లిటి రాజుల రాజధానిని వదలిపెట్టి తాను 'మధ్యలఖు' నగరమును రాజధానిగా చేసికొనెను. నాటి నుండి నేటివఱకు నేపాళదేశపు రాజధాని మధ్యలఖు నగరము. ఈ యయిదువందల యేబదియేండ్లలో దేశమునందు బౌద్ధమతము ప్రబలిపోయెను.

ఏ మతమైనను చమత్కారమే! ఆదియందు స్వచ్ఛముగా నుండును. నదులవలెనే యుండును. పోనుపోను సపంకమగును. ఎప్పటికప్పుడు తొలినాటి మతమునందున్న సూత్రములు తరువాతి పండితులచేత వ్యాఖ్యాతములై విశేషార్థములను తెచ్చుకొనును. ఆచారములు మారును. సర్వమానవులు కామక్రోధాది దూషితులు.

వారి ప్రవర్తనవలన నేమతమును తొలినాటి స్వచ్ఛతను నిలుపుకొనలేదు. సనాతనమతమునందు భగవంతుడు తాను నిర్మించినవని చెప్పినవి నాలుగు వర్ణములు. కాలము గడువగా గడువగా కొన్నివందల వర్ణము లేర్పడినవి. కనీసము కులము లేర్పడినవి. అట్లే బౌద్ధమతమును. బౌద్ధమతములో కొన్నివందలశాఖ లేర్పడినవి. ఎవరి యాచారములు వారివి. ఎవరి సిద్ధాంతములు వారివి.

అంతదాక నెందుకు? నేడు ప్రపంచమునందు చెలరేగుచున్న క్రైస్తవమత మొక్కటియా? దానిలో రెండువందల యేబదిశాఖలకు మించియున్నవి కొందర రేసుక్రీస్తునే నమ్మరు. నేడు పాశ్చాత్య దేశములలో క్రైస్తవమత ప్రధానములైన దేశములు గనుక మామతమంతయు నొక్కటియే నందులో భేదములేదందురు. అంతకంటె నబద్ధముండదు. భేదములు ఉండకతప్పదు. మానవులలో వర్ణాల సంఖ్య యెక్కువ. దున్నపోతీనినదిరా యనగా దూడనుకట్టివేయుమను వారే యెక్కువ.

నేపాళదేశములో నానాడు బౌద్ధముకూడ వెఱ్ఱితలలువేసెను. పలుకుబడి, అధికారము కావలసినవారందరు, బౌద్ధమతమును స్వీకరింప నారంభించిరి. ఇటు బౌద్ధమతములో వంద తెగలు అటు వేదమతములో వందతెగలు, బౌద్ధ విహారములు నీతికి చెడిన ప్రదేశములైనవి. స్త్రీ పురుషుల కామ ప్రవృత్తికి నునికిపట్టు లయినవి. అందుచేత దానిలో పలుమంది చేర నారంభించిరి.

రాజ్యము ధర్మమయముగా నున్నచో రాజునుబట్టి ప్రజలుందురు. అధర్మము ప్రబలినచో ప్రజలనుబట్టి రాజుండును. రాజు తానసమర్థుడై ప్రజలు ముక్కుతాళ్ళు పోసి లాగుచుండగా, తాను పోవుచు, తాను రాజు ననుకొనును. తాను పాలించుచుంటి ననుకొనును. ఇట్లు నేపాళ దేశమున బౌద్ధులది పైచేయి కాగా తన తండ్రియైన చంద్రకేతు దేవుడు తాను రాజ్యముచేసినన్నాళ్ళు మిక్కిలి యిక్కట్టులనుపొందగా, నీ నరేంద్రదేవుడు తన రాజ్యమును తాను సుఖముగా పాలించుటకొఱకు తాను బౌద్ధమతమును స్వీకరించెను. బంధుదత్తాచార్యుడని పేరుగల యొక బౌద్ధమత గురువువద్ద తాను బౌద్ధమతమును స్వీకరించెను. లోమిదేవి యను నొకచోట శిక్షణపొందుచున

రెండవ విహారమును నిర్మించెను. దానిని తన గురువైన బంధుదత్తున కర్పించెను. దేశములో పలుకుబడి కలవారందరు బౌద్ధులగుటచేత నరేంద్రదేవుని రాజ్యము శాంతముగా నడచుచుండెను.

కాని వేదమతమునకు కొన్ని గట్టి స్థానములు కలవు. దేశ మంతయు నొక మతము ప్రబలముగా నున్నప్పుడు తక్కిన మతస్థులు తమ మతములోని మూలసూత్రములను పరిత్యజించకపోయినను తమ యాచారములను, విశ్వాసములను ప్రబలముగానున్న మతము వైపునకే మరలించుకొందురు. అట్లు మరలించుకొనకుండుటకు కొన్ని తీవ్రమైన యాశలుండవలెను, లేదా కొందఱు మహాపురుషులు తమ దేవతల నుపాసించి పొందిన యమోఘమైన యనుభవము లుండ వలెయును.

శాంతిపురమునందలి క్షత్రియులు మాత్రము క్షత్రియులుగానే యుండిరి. ఆ యూరిలో బౌద్ధమత మనునదిలేదు. ఆ పట్టణమును చూచినచో చాలమందికి కన్నెఱ్ఱ. కాని, యా మహానగరమున నున్న మహాయోధుల సంఖ్య చాల యున్నది. ఆ యోధుల శౌర్య పరాక్రమము ప్రశంసార్హముగా నుండును. అబ్బురము కలిగించును. భయమును పుట్టించును. ఈ శాంతిపుర క్షత్రియులట్లు వేద మతమునే నిలువద్రొక్కుకొనుటకు ప్రబలమైన కారణము కలదు. నేపాళదేశము నేలు రాజు క్షత్రియుడై యుండి తీరవలయును. అక్షత్రియునకు రాజ్యాధికారము లేదు ఈ సంప్రదాయము పరంపరగా వచ్చుచున్నది. తాము తమ మతమును వదలిపెట్టినచో, వర్ణ మును వదలిపెట్టినచో తమ శాఖలోనివాడెవడో భవిష్యన్నేపాళ దేశాధిపతి కాకపోవును ఇది పెద్ద కారణము.

ఈ శాంతినగరమున ధనవంతులున్నారు, మహావీరులున్నారు, వారికి కొన్ని యేండ్లనుండియు నొక యాశ కలదు. వీరదేవుడు తాను ప్రేమించిన గోపికయొకతె పేరున పట్టణము నిర్మించదలచెను. ఆ పట్టణమంతయు గోడలు లేచిన తరువాత వాగిపోయెను. అది వంద, వందయేండ్లనుండియుగా శిథిలావస్థలో నుండెను. తత్పట్టణ నిర్మాణ మునకు వీరదేవుడు కొన్నికోట్ల దీనారములు వ్యయపెట్టెను. మరల [illegible] నన్నికోట్లను వెచ్చించినగాని యాపట్టణము పట్టణము

కాదు. ఆ శిథిలనగరము తమ క్రాంతి పట్టణమునకు సమీపములో నున్నది. శిథిలనగరమంతయు నరణ్యమై పోయినది. దాని చుట్టుపట్టుల నంతయు నరణ్యము.

ఆ శిథిలనగరమును బాగుచేసి తమ రాజకుటుంబములను దాని యందు ప్రవేశపెట్టి దానినిగూడ మహానగరమును జేసినచో తమ క్షత్రియవంశములకు బలము చేకూరును. రెండు మహానగరములు తమక్రింద నుండును. ఎప్పుడో వీలైనప్పుడు మధ్యాలఖు నగరము పాడుచేయవచ్చును. ఆ యంశువర్మయొక్క రాజవంశశాఖను నిర్మూలించి తమ పూర్వుడైన కామదేవునియొక్క శాఖను నేపాళరాజ్య సింహాసనాధిపతిగా చేయవచ్చును. అందుచేత నా క్రాంతిపుర క్షత్రియులు తమ వంశమువా రెచ్చటెచ్చట నుండిరో! వెదకుచుందురు. వారిని దీసికొనివచ్చి తమ నగరమున నుంతురు. అంశువర్మనాటినుండి యిప్పటివరకు నైదువందల యేబదియేండ్లు గడచినవని చెప్పవచ్చును. ఇంతకాలములో రాజులు పదిమందియే నడచిరి. కాని సామాన్యప్రజలలో పాతిక తరములుకూడ కడచిన వంశము లుండవచ్చును.

కులమునకు క్షత్రియులే! తిండి సాగుట యెట్లు? ఆస్తులెప్పటిప్పటికి పంచికొని పోవుచుండును. ఒకప్పుడు పంచికొనిన యాస్తి యుదర పోషణమునకు చాలదు. జనులు పరగ్రామములకు పోదురు. ఇతర గ్రామములకు పోదురు. దూరదేశములకు పోదురు. పొట్ట దేనివలన గడచునో యావృత్తి నవలంబింతురు. తాత సైన్యములో పెద్ద యుద్యోగము చేసెను. మనుమడు పొలము దున్నుకొని బ్రతుకుచుండును. మరియొకడు దళారివృత్తి చేయును. ఇంకొకడు భిక్ష మెత్తుచుండును. ఆ క్రాంతిపుర క్షత్రియులకు వేదమతస్థులందరికి వలెనే జ్యోతిషమునందు మిక్కిలి నమ్మకము. సాముద్రికమునందు నమ్మకము. యోగసిద్ధులందు నమ్మకము. భవిష్యత్తును నిరూపించి చెప్పెడివారి యందభిలాష. వారిలో నందఱకును కలసిన యొక్క వాంఛయున్నది. శిథిలమైన సమీప నగరమును పునరుద్ధరింప వలయును. అట్టి శక్తిగల జాతకము కలవాడు తమ వంశములో నెవ్వడు?

ఇట్టి స్థితిలో సుదర్శన భట్టారకుడు క్రాంతిపట్టణమునకు పోయెను. అచట పదిదినము లుండెను. మహాధనవంతులై ఈ విశ్వ యము మిక్కుటముగా నున్న కొందఱు క్షత్రియుల యిండ్లలో తాను తనపాండిత్యమును ప్రదర్శించి వారి యాదరాభిమానములను గౌరవ మును చూఱగొనెను. వారి యభిప్రాయముల నన్నింటిని తెలిసి కొనెను. తెలిసికొని తన వచ్చిన పని వారితో చెప్పలేదు. ఉదయసాయం కాలము లందు తావాయూరిలో శాంకర భాష్యమును చెప్పుటకు వారిచేత నిర్ణయింపించికొనెను. సుదర్శన భట్టారకు డా క్రాంతి పురమున నెలయో, రెండు నెలలో యుండవలయును. ప్రస్థానత్రయ భాష్యమును చెప్పవలయును. ఈయన యంగీకరించి, "అయ్యా! రెండు నెలలుకాదు, మూడు నెలలు పట్టవచ్చు. నడుమ నడుమ నేను పోయి వారము పది దినములు నా కుటుంబమును చూచి రావల యును గదా! నెలకు పది దినములు నన్ను వదలిపెట్టినచో మూడు నెలలు కాదు. నాలుగు నెలలుండును" అనెను.

ఇది యెందుకనగా సుదర్శన భట్టారకుడు తన గ్రామము పోవుటకు గాదు; తన దొర కూతురును, జితేదాస్త్రియు వీరిద్దఱికి గ్రాసము నందిచ్చుటకు. వారి యునికి భద్రముగా నున్నదో లేదో విచారించుటకు. క్రాంతిపురమున సుదర్శన భట్టారకుడు చేరక మున్ను వానికై దారు నెలలు వీరికి గ్రాసాదులను సమకూర్చుట కృచ్ఛ్రమయ్యెను. ఇచ్చట చేరిన తరువాత చాలసులభముగా నుండెను. భట్టారకునకు క్రాంతిపురమున గ్రాసవాసో మహాసమృద్ధి కలిగెను. మొదటి నెలయే జితేదాస్త్రియు, దొరకూతురు గల చోటికి మూడు నెలలకు సరిపోయెడి భండారమును జేర్చెను కాని భట్టా రకునకు తన వచ్చినపని వారికెట్లు తెలియ జేయవలెనో తెలియలేదు. ముందు వారి లోతుపాతులు కనుగొనవలయును. అతడు క్రాంతి పురమున రెండు నెలలుండు నప్పటికి పది పదునొకండు కుటుంబము లతో మిక్కిలి పరిచయ మేర్పడెను. ఇతని సౌశీల్యము, నిరాడంబరత, మంచితనము, దురాశాగ్రస్తుడు కానితనము, పరోపకార పారీణత మొదలయిన వన్నియు వారికి నచ్చినవి. ఇచ్చట లభించిన ధాన్యాదులు భట్టారకుడు తన యూరు తీసికొనిపోవుట లేదనియు

నెవరికో పేదవారి కందిచ్చుచున్నాడనియు వారికి లీలగా తెలిసెను. అదియొక గౌరవహేతువయ్యెను.

ప్రస్తుతము నేపాళదేశమును పాలించెడివాడు నరేంద్రదేవుడు. అతడు బౌద్ధమతస్థుడు. రాజేమతస్థుడైనను తామా మతస్థులు కాకపోయినను కొందటిలో రాజభక్తి యుండును. రాజుయొక్క గుణగ్రామము ననుసంధించి యతనివలన ప్రజలకు గలుగు మేలును పురస్కరించుకొని ప్రజలు రాజును గౌరవింతురు, రాజభక్తి కలిగియుందురు. ఇతడట్టివాడా? ఇతడు బౌద్ధమతమునకు చాల వ్యతిరేకి. అందుచేత రాజభక్తి యంతగా గలవాడు కాదని చెప్పవచ్చును.

క్రాంతిపురమున యొక నలుగురు ధనవంతులైన క్షత్రియులు కలరు. వారు సంవత్సరమునకో, రెండు సంవత్సరములకో యొకసారి రహస్య సమాలోచనము చేయుదురు. వారొక సంఘముగా నేర్పడిరి. ఈసంఘమొక అయిదువందల యేండ్లకు పూర్వము స్థాపింపబడినది. ఆ సంఘముయొక్క ధర్మ మేమనగా అయిదువందల యేబది సంవత్సరములకు పూర్వము నేపాళమునకు రాజైన అంశుమంతునికి దగ్గఱ దాయాదియైన వామదేవుడను వానికి రావలసిన రాజ్యము అంశుమంతునకు వచ్చెను.

ఠాకూరు వంశమునాటి నుండి రెండు శాఖలైనది. అంశుమంతుని శాఖ యొకటి, వామదేవుని శాఖ యొకటి. ఈ వామదేవుని శాఖలోని వారికి తమ శాఖలో నెవ్వడో యుద్భవించుననియు వానికి నేపాళ రాజ్యము వచ్చుననియు పరమ విశ్వాసము. అట్లు వచ్చినచో తమ శాఖకూడ ఔన్నత్యమును పొందును. ఈ సంగతిని గూర్చి పరంపర చావకుండ నిన్నివందల యేండ్లుగా నా సంఘ మొకటి పనిచేయుచున్నది. ఒక్కొక్కప్పు డది నిద్రపోయినను మఱియొకప్పుడు జాగ్రదవస్థలో నుండును. ఆ సంఘ మేర్పాటైనప్పుడే యెవడో మహాయోగి చెప్పిన కొన్ని సిద్ధాంతములమీద నాధారపడి యా సంఘ మేర్పరుపబడినది.

ఆ యోగి రెండుమూడు కాలములను చెప్పెనట: ఒకటి: కలి మూడువేల నాల్గువందల నుండి మూడువేల నాల్గువందల లోపలిదైయెడు నలుకు నొక రాజు రాజ్యము చేయును. ఆ లోపలి

రెండేండ్లలో సంఘము [illegible] పడిపోవుటయును, వామదేవునికాల
రాజ్యాధికారము వచ్చుటయును జరుగునన్నదని ఆ యోగి చెప్పెనట.
అప్పుడది జరుగనిచో మరియొక కాలమును చెప్పెను. మూడువేలఐదు
వందల పదునేడు మొదలు మూడువేలఆరువందల తొబ్బది యొకటి
వరకు వీరదేవుడన్న రాజు పాలించును. అది డెబ్బది నాలుగేండ్ల
కాలము. అందులో ప్రయత్నము ఫలించవచ్చును. అది తప్పినచో
మరల మూటయెబది యేండ్లు పోయినగాని వీలుకుదరదు. అప్పుడు
నిస్సందేహము. అప్పుడు ఏలుకొనెడి రాజు పేరు మరల వామదేవుడే
యగును. అది తప్పదు. ఈలోపుగా వామదేవుని శాఖవారు రాజ్య
మునకు వచ్చుటకు రెండు కాలములు అనువుగా నున్నవి. ఒకటి వీర
దేవుని కాలము. రెండు అతని మనుమడైన వీరదేవుని కాలము.
ఇప్పుడు రాజ్యము చేయుచున్నవాడు నరేంద్రదేవుడు. ఇతని కుమా
రుడు వీరదేవుడు. నరేంద్రదేవుడు వృద్ధుడు. కొంత ముసలివాడై
నాడు. అతడెప్పుడు పోయినను పోవచ్చును. పైగా, నరేంద్రదేవుడు
వ్యాధిగ్రస్తుడని వినికిడి. నరేంద్రదేవుని రాజ్యకాల మప్పుడే యేబది
యేండ్లయినది. అతడు రాజ్యమునకు వచ్చునప్పటికే యేబదియేండ్ల
వాడు.

ఈ సంఘము యొక్క చరిత్ర యీ యయిదువందల యరువది
యేండ్లును వ్రాయబడియున్నది. వీరదేవుడు నేడో రేపో రాజు
కావచ్చును. సంఘము మేల్కొన్నది. దానికొఱకు ప్రయత్నము
చేయవలెను. తమ వంశములో గొప్పజాతకము కలవానిని వెదుకవలెను.
వాడు మహాయోధుడు కావలెను. మహామేధావి కావలెను. రాజు
కాదగిన లక్షణములు కలవాడై యుండవలెను. శ్రాంతిపురములో
చాలమంది క్షత్రియకుమారు లున్నారు. అందఱును యోధులే!
మహామేధావులని చెప్పుటకు వీలులేదు. తత్త్వవేత్తలని చెప్పుటకు
వీలులేదు. ఇతడు మహారాజగును. కలిన మొక మహానగరమునకు అధిపతి
యగునని చెప్పదగిన జాతకము కన్పించలేదు.

ఈ సంఘము నాలుగేండ్ల క్రింద నొకసారి కలిసికొన్నది. తమ
వంశములో నెంత తొందరగా ఎవరు చీలిపోయిరో తెలుపు చెప్పుట వంటివి
జాతకములన్నియు కనుగొనుటకు కొందఱిని నియమించినది.

వారు కొన్నిచోట్లకు పోయిరి; కొన్నిచోట్లకు పోలేదు వంశవృత్తములు సిద్ధము చేయబడినవి. వారలుగైదు చోట్లకు పోయిన క్షత్రియ కుటుంబ ముల యొక్క వైనము తెలియదు. ఇట్టి పని చేయుటకు కొంత శ్రద్ధయు, కొంత పట్టుదలయు కావలయును. లోకమున నండఱు స్వార్థపరులు తనకు లాభము లేకుండ నెవ్వడు నే పనియు చేయడు.

కాని కొందఱు కొన్ని సిద్ధాంతముల యందు తీవ్రత నవలం బింతురు. ఈ పని కట్టివాడు కావలయును. అట్టివాడు తత్పూర్వ క్షత్రియ వంశములలో నెవ్వడును లేడు. "నీవీ పనిచేయుము. నీకింత యిత్తును" అన్నచో చేసెడువాడు కలడు. ఇట్టిపనికి నెవరో ధన మును వ్యయము చేయవలెను. అది నలుగురిమీద నమకూర్చవలెను. ఇందులో కొంత పట్టుదలయైనను కలవారిలో నొక్కడే కలడు. అతనిపేరు 'మానదేవుడు', మానదేవ వర్మ. ఈ సంఘము యొక్క యాజమాన్యము రెండుమూడు తరములుగా మానదేవవర్మ వంశ ములో నున్నది. తత్ప్రసంగము వచ్చినచో మానదేవవర్మయందు తీవ్రతయు కన్పించుచుండును. అతడే నలువురను సమావేశపరచెను. ఈ సమావేశము నందెందుకో సుదర్శన భట్టారకుని కూడ పిలువ వలయునని యొకరిద్దరభిప్రాయపడిరి. తప్పేమి! అతడు బ్రాహ్మ ణుడు. వేదమతస్థుడు. అందులో తీవ్రాభిప్రాయములు కలవాడు. నరేంద్రదేవ మహారాజును గూర్చి పెద్ద యభిమానమేమియు లేని వాడు. అతనినికూడ పిలిచిరి.

సభ సమావేశమైనది. సభాదియందు సుదర్శన భట్టారకు డిట్లనెను: "అయ్యా! మీరందరు నాయందు ప్రేమచేత నన్నీ రహస్య కార్యమునకు పిలిచితిరి. నా యందు మీకు గల యాదరాభిమానము లకు మిక్కిలి కృతజ్ఞుడనని మనవి చేయుచున్నాను. కాని, యీ సభ దేనికో, దీని తాత్పర్యమేమియో నాకేమియు తెలియదు కదా! మీరు నాకు దీని సంగతి కొంత చెప్పి నా వలన యేదైన లాభమున్నచో తెలిసికొనవచ్చును. అంతేగాని, మంత్రములు చదువుచుండగా దేవా లయములోని విగ్రహము వలె నేను కూర్చున్నచో మీ కేమి ప్రయో జనమని" అనగా వారు మొగాలు మొగాలు చూచుకొని [illegible] [illegible] [illegible] యయ్యెను గదియలో [illegible] వరకు [illegible]

అంతయు నయిన తరువాత భట్టారకు డిట్లనెను: "మీరు కొందఱిని విడిపోయిన రాజవంశముల వారిని వెదకించితిరి. మూడు వాళ్లు స్థలములకు పోయిన వారిని వెదికించలేదు. వారినికూడ వెదకించవలయును గదా! నేనెందు కనుచుంటివనగా మాది మైథిలీ నగరము. జ్వాలాపురమునుండి యొకశాఖ చీలి మైథిలీపురము పోయినదని పోయి య్యాకళుఁగొన్న వాడు చెప్పెనంటిరి కదా! తొలుత జ్వాలాపురము పోవలయును. మైథిలీపురము పోయినవారి కథ కనుగొనవలెను. మైథిలీపురములోనున్న రాజకుటుంబములన్నియు నాకు పరిచితములే. నే వెఱిగియున్నచో నచ్చట మీకు సాయము చేయుదును. నాకు తెలిసినంతలో నంబువర్మ సంతతివారమని గాని, మాది శాకూరి వంశమనిగాని చెప్పెడి వారచ్చటలేరు. సూర్యవంశీయ రాజులున్నారు. సోమవంశయు లున్నారు. ఒకటి రెండు గృహములు కిరాత వంశ క్షత్రియులవి కలవు. మరి రెండహిర్వంశ క్షత్రియులవి కలవు. శాకూరి వంశ క్షత్రియులు మా పురములో లేరనియే చెప్పవలయును. మా యూరిలో రెండుమూడు కుటుంబములు కలవు. వారు క్షత్రియులో కారో తెలియదు. వారు పాలమ్ముకొని జీవింతురు. ఆవులను పెంతురు. వారి నందఱును గొల్లలందురు. వారుమాత్రము మేము క్షత్రియుల మందురు. కొందఱు వారినే రాచగొల్లలందురు. వారు మా యూరికివచ్చి యెక్కువ సంవత్సరములు కూడ కాలేదనుకొందును. ఒక డెబ్బదియేండ్లకు పూర్వము వచ్చి యుందురు. అప్పుడు నాకు చిన్నతనము. ఈ సంగతి నాకు జ్ఞానమువచ్చిన తరువాతగాని కలుగలేదు. ఒకవంశము కలదు. వంశమనుటకన్న ఒక్కటే కుటుంబ మనదగును. మిథిలాపుర ప్రభువునుగూర్చి మీరు వినియుండ వచ్చును. ఆయన మృగయాశీలి. మృగయావ్యసనుడు. దానితో పది యూళ్ళ దొరతనమును పాడుచేసికొన్నాడు. ఆయన యహిర్వంశ క్షత్రియుడు. ఆయనవద్ద గాలి యన్న యొకడుండెడివాడు. అతడు మహాబలశాలి. మహాసాహసుడు. గొప్పవేటకాడు. అతని శౌర్య సాహసములును, వానిబలమును చెప్పుటకు వీలులేదు. కాని యతడు మా మిథిలాపుర ప్రభువును రక్షించుటకు తన ప్రాణమును బలియిచ్చినాడు. అతడు క్షత్రియుడైనచో కిరాత వంశీయుడు కావలయును:

పేరయనగా నతని పేరు 'గాలి'. మహాభారత యుద్ధకాలమునాడు నేపాళ రాజ్యము పాలించిన రాజు పేరు జితేదాస్తి. ఆయన కొడుకు పేరు గాలి. ఈ గాలి తన కొడుకునకు జితేదాస్తియని పేరు పెట్టినాడు !"



తరువాత పది దినములకు సంఘమువారు భట్టారకుని పిలిచి "మీరా వంశమును గూర్చి కనుగొని మాకు చెప్పుదురా?" యని యడిగిరి. ఇతడు "చెప్పెదను గాని దానికి నే నొక్కడను పోయిన బాగుగా నుండదు. మీ రెవరైన సమర్థులైనవారు, పలుకుబడికలవారు పదిమంది యెఱిగినవారు నాతో వచ్చినచో బాగుగా నుండును. మా యూరిలో గొన్ని పరిస్థితులు గలవు. ఒకవేళ యీ గాలి మీ యంశు వర్మ శాఖవాడని రుజువైనచో నేను దీని నంతయు కల్పితము చేసితి నని నా నెత్తికి వచ్చును. నేను మీకు కావలసిన విషయములు చెప్పె దను, కావలసినంత సాహాయ్యము చేసెదను. దీనికి నేను తెర వెనుక నుండుటయే మంచిదని నా యభిప్రాయము.

"మరియు నా కొక్కటి తోచుచున్నది. సంప్రదాయానుగుణ ముగా మీకు వచ్చిన యభిప్రాయములను గూర్చిగాని, మీరు వెదకెడి పురుషుని గూర్చిగాని నాకా వ్యవహారము పొసగునని నాకు తోచదు. గాలియు, గాలి కుమారుడు జితేదాస్తియు కిరాతవంశమువారు కాక పోవచ్చును. శాకూరివంశమువారే కావచ్చును. భారతకాలమునాటి రాజుల పేర్లు మన ధర్మమునం దభిలాషచేత, భారతకాలమునందలి మొగ్గుచేత పెట్టుకొనియుండవచ్చును. ఆ గాలి చనిపోయినాడు. బ్రతికియున్న వాని పేరు జితేదాస్తి అతడిప్పుడు మిథిలాపురములో లేడు. ఎక్కడికో లేచిపోయినాడని ప్రతీతి! దానికేమి? యెక్కడికి లేచిపోవును? ఆకాశములోని కెగిరిపోలేడుగదా? ఎచ్చటనో యచ్చట పట్టుబడి తీరును. మీ విషయము నాకు తెలియదుగాని అతడును క్షత్రియవంశమువాడని తెలిసినచో మిథిలాపుర ప్రభువైన శాస్త్రి పిర్యోని వంశమునకు మేలు కలుగును.

"వైగా వాడు పరాక్రమవంతుడు కావలయును, ప్రతిభా వంతుడు కావలయును, మేధావి కావలయును, రాజనీతివేత్త కావల యునని మీరు చెప్పుచున్నారు; చీనమొక మహానగరాధిపతియైన వాడ గిన లక్షణములు వానిలో నుండవలెనని మీరనుచున్నారు. వాడు తెలిసి నంతవరకు నీ జితేదాస్త్రీ యని యేమియును కాడు. అగునో-కాడో తెలియుట కూడ సాధ్యముకాదు. అతనిని నేను అతని చిన్నప్పటి నుండి వానికి పదు నెన్మిదేండ్లు వచ్చువఱకు నెఱుగుదును. చిన్నప్పు డతడు జనముద్దైన పిల్లవాడు. ఆ సౌందర్య మప్పటి కిప్పటి కట్లే యున్నది. వానిని చూచినంతనే మన్మథుడు తన నల్లదనమునకు దా వనహ్యించుకొని ఎఱ్ఱనిమేనితో పుట్టినాడనిపించును. అంతటి యంద గాడు. కాని, శుద్ధమొద్దు! ఎప్పుడైనను నవ్వును, పలుకరించినచో బాగుగ నే మాటాడును. నిర్వ్యవసాయుడు మా పెద్దదొర వానితండ్రి యందలి కృతజ్ఞతచేత వాని నుత్సవ విగ్రహమువలె పెంచినాడు. మేమందఱము వానినొక యందమైన బొమ్మగా చూచుచుందుము.

"ఇట్లుండగా రెండు మూడేండ్ల క్రిందటినుంచి మాకు నాలు గైదు విషయములలో వాడు మూర్ఖుడు కాడని తెలిసినది. మూర్ఖుడు కాకపోవుటయే కాదు; మహా మేధావి యని తెలిసినది. ఎప్పుడును మాటాడడు. తన కేమియు తెలియనట్లూరకుండును. అతనిని గురించి నాకొక సందేహమున్నది. ఈ మేధావి లక్షణము వానిలో నెట్లు దాగి యున్నదో! శౌర్యమును, నీతియు కూడ వానియందు దాగియున్న వేమోయని' అతడు చదువుకొన్నవాడు కాడు. అతని నెవరు చదివించిరి? అతడొకటి రెండు విషయములను గూర్చి మాటాడగా నేను వినుట తటస్థించినది. అతని యా తెలివితేటల ముందు చదువెందు కనిపించినది!

"ముఖ్యమంత్రిగారూ! అతనిని పరీక్షించవలయును. పరీక్షించవల సిన యవసరము నాకు లేదు. నేను చేయలేదు. మీకున్నది. మీరు చేయవచ్చును. మీరన్నచో నాకెంతో గౌరవమున్నది. దానిని పురస్కరించుకొని నేను చేయవచ్చునుగాని మా యూరిలో కొన్ని ఇబ్బందులున్నవి. నేను మా దొరయైన నా భర్తవీర్యాని పక్షమువాడను. అంతటి పరిస్థితుల యొక్క తీవ్రత పెట్టినవగా నేనతడు ముఖ్యమంత్రియు దని నిరూపించినచో కొంపవచ్చి నా నెత్తిన కూలును. కాని, మీకి

పయమును పరిత్యజించరాదని, ప్రయత్నము చేయవలెనని నా కున్నది.

"ఇందులో కొంత మీకు లాభము. కొంత నాకు లాభము. మీలో నెవరితోనైన నేను జ్వాలాపురమునకు వత్తును. అచ్చటనుండి మైథిలీపురమునకు వెళ్ళిన యా వంశమువారేమో, యతని పేరేమో ఏ స్థితిలో వెళ్ళిరో కనుగొన్నచో ఆ వెళ్ళినవాడు గాలిచంద్రుడైనచో వ్యవహారము తేలిపోవును. అప్పుడు జితేదాస్త్రిని గురించి కనుగొన వచ్చును. జితేదాస్త్రియొక్క యానుపానులు నాకు తెలియును. అతని పుట్టుపూర్వోత్తరములు నాకు తెలియును. అతడు కైలాస పర్వతము మీద కాలభైరవుని గుహలో నున్నను నేను తీసికొనివచ్చి మీకు ఒప్పచెప్పగలను. అతని మేధావిత్వమునకు నేను పూట యుండును. అతడు మేధావి మాత్రమే యైనచో సుక్షత్రియాలని స్థిరపడును గనుక మా దొరకు నేనుపకారము చేసినవాడ నగుదును. అతడు శౌర్యవంతుడైనచో, బలాభిరాముడైనచో, రాజనీతిజ్ఞు డైనచో--ఏమియైనను వాని పూర్వజన్మ సంస్కారముచే కావలసినదే గాని. చదువుసంధ్యలచే నైనది కాదు, పెంపకముచే నైనది కాదు; అభ్యాసముచేత నైనది—మీకు కావలసినచో నుపయోగించుకొనుడు.

"ఇందు తొలిభాగము నాకొఱకు, మలిభాగము మీ కొఱకు. ఒకవేళ పూర్వమా యోగి మీ పూర్వులకు చెప్పినట్లు కొలదిదినము లలో వీరదేవుడు రాజ్యమునకు వచ్చునుగదా! అప్పుడు మీరు ప్రయ త్నము చేయవచ్చును. ఇత డుపయోగపడునేమో చూచికొన వచ్చును. మీలో నెవరైన సామాన్యుడు కానివాడు నాతో జ్వాలా పురమునకు రండు. అక్కడ కనుగొందము. అచ్చట జరిగెడి కథను బట్టి మీరు మిథిలాపురమునకు గూడ పోవలయునుకొన్నచో వచ్చటి వార్తలన్నియు చెప్పి మిమ్ము పంపింతును. నేనుమాత్రము రాకూడదు.

"మరి యింకొక మాట చెప్పక తప్పదు. మిథిలాపురమునకు పోవునప్పుడు సామాన్యులు పోరాదు. మీలో పెద్దలైనవారు, విద్యావంతులైనవారు, ధనవంతులైనవారు, మీరు మీరని లోకముతో నలుగురితో తెలిసినవారు పోవలయును."

ఆ నఱుపురిలో నౌశాయన పేరు శుకదేవవర్మ. సుదర్శన భట్టారకుడు శుకదేవవర్మ కొంత సత్పురుషుడని, యహంకారము తక్కువవాడనీ శాపాయనతో కొంత చనువుగా నుండవచ్చునని పూర్వమే తెలిసికొన్నవాడు. తానును, శుకదేవవర్మయు జ్వాలా పురము వెళ్ళుదమని యతడు చెప్పెను. శుకదేవవర్మకు చేతికక్కఱకు వచ్చిన బిడ్డ బిడ్డరున్నారు. సంసారపుతని యాయన యెక్కువ చూచి కొనవక్కఱలేదు. ఆయన యెక్కువ కాలము బంధువులను చూచి వచ్చుటతోడను, తీర్థయాత్రలు చేయుటతోడను గడపును. జ్వాలా పురము పోవుటకు నాయన వెంటనే తూగెను. శుకదేవవర్మతో సుదర్శన భట్టారకునకు మరికొంత చనవు కలదు. క్రాంతిపురములో కనీసము వందయిండ్లలో స్త్రీలు అసూర్యంపశ్యలుగా నుందురు. అంతఃపురము దానికి తగిన మర్యాదలు సాగుచుండును. ఆ యిండ్లలో శుకదేవవర్మ యిల్లు కూడ నొక్కటి,

శుకదేవవర్మ కెనుబదియేండ్ల వయస్సు. ఆయన దృఢముగ నుండును, అరువదియేండ్లవానివలె కన్పించును. ఆయన భార్యకు డెనుబదియేండ్లు. వారు దగ్గరి చుట్టాలు. చిన్నప్పుడే యామె నీయ నకు గట్టిరి. వారి వడుమ కొన్ని నెలలు వాఱడి. ఆమె పే రనసూయా దేవి. శుకదేవవర్మ పెద్ద చదువుకొన్నవాడు గాడుగాని, అనసూయా దేవి చదువరి. క్రాంతిపురమున నా క్షత్రియకుటుంబములో వంద యేండ్లు దాటినను స్త్రీ అసూర్యంపశ్యలే! అనసూయాదేవి మాత్రము కొంత స్వాతంత్ర్య మవలంబించును. ఊరి వెంటబడి తిరుగదు. కాని, తన యింటిలో మాత్రం యథేచ్ఛగా సంచరించును. ఎవరైన వచ్చినచో మాటాడును, నవ్వును, పేలును. వరుసయైనవారితో పరాచికము లాడుచుండును. ఆమె నందఱు గౌరవించుచుందురు. అంతఃపుర మర్యాద లామెవలన చెడిపోవుచున్నవని క్రాంతిపురమున నెవ్వ రను కొనరు. ఆమె పెద్ద ముత్తైదువ. మంచి చెప్పును. చెడ్డ చెప్పును. పోయి శుభాశుభములకు పొఱుగిండ్లలో నాదుకొనును. కాని, సుదర్శనభట్టారకుడు శాస్త్రము చెప్పుచుండగా పోయి యా వది మందిలో కూర్చుండి వినదు. కాని, వినవలెనని యున్నది. అందువలన సుదర్శనభట్టారకుని యింటికి పిలిపించి యాయనవలన యీ వ్యాఖ్యానం గముగు వినుచుండును.

ఆ యూరిలో మహాధనవంతుడైన వలుపురిలో శుకదేవవర్మ యొకడు. కలిగిన సంసారము. శుకదేవవర్మ గుప్పిట బిగపట్టినవాడే కాని, యనసూయాదేవి యొక్క చేతిలో నెముక లేదందురు. సుదర్శన భట్టారకున కనసూయాదేవి యొక యండ. అతడేది కోరిన యామె యది యిచ్చును ఆ రహస్య సంఘ సమావేశమునకు సుదర్శనభట్టార కుని వారు పిలిచినచో దాని వెనుక నామె యున్నది. అనసూయాదేవి చేత శుకదేవవర్మ కతడు చెప్పించెను. శుకదేవవర్మ చెప్పగా తక్కిన మువ్వు రంగీకరించిరి. ఇప్పుడు జ్వాలాపురమునకు శుకదేవవర్మతో తాను వెళ్లుచుండెననగా భట్టారకు డనసూయాదేవివలన సాధించిన కార్యము.

కాని, సుదర్శనభట్టారకుడు తన రహస్య మామెతో చెప్పలేదు. అనసూయాదేవి యింత మంచిదై, యామెవద్ద నొక యహంకారము కలదు. పేదవారైన క్షత్రియులు తమకు బంధువులగుట యామెకు నచ్చదు. ఒక్కొక్క జీవి యొక్క లక్షణ మొక్కొక్క విధముగా నుండును. మహాపర్వత ముండును. నీటిబొట్టు కన్పించదు. కాని, యెచ్చటనో యొక దొన యుండును. ఆ నీర మెచ్చటనుండి వచ్చునో తెలియదు. అట్లే సముద్రములలో లంకలుండును. అందుచేత సుదర్శన భట్టారకుడు తన పని యామెతో చెప్పలేదు.

శుకదేవవర్మయు, సుదర్శన భట్టారకుడును జ్వాలాపురము పోయిరి. పూర్వము వెళ్ళి వచ్చిన వానిని కనుగొని సూటిగా సా వామదేవునిశాఖలో నుండివచ్చిన క్షత్రియ కుటుంబికుని చెప్పికొనెడి వారి యింటికే పోయిరి జ్వాలాపురములో శుకదేవవర్మను చాలా మంది యెఱుగుదురు. అందరు గౌరవించిరి. కొందఱు వారి ననుసరించి సూటిగా త్రినేత్రుని ఇంటికిపోయిరి ఆ ఇల్లుగలవాని పేరు త్రినేత్రుడు. ఆ త్రినేత్రుని తండ్రి పేరు జ్వాలాముఖుడు. జ్వాలాముఖుని తండ్రి పేరు తెలియదు. జ్వాలాముఖుని తండ్రి తరములో వారీయూరు వచ్చిరట. ఏ యూరినుండి వచ్చిరో తెలియదు, జ్వాలాముఖుని తండ్రి సామాన్య సంసారి. తనవెంట కొంత ధనము తెచ్చికొని వ్యాపారము మొదలు పెట్టెను. వారిద్దఱన్నదమ్ములు. ఇద్దఱును లేచివచ్చిరి. అతని తమ్ముడు వయసుచేత చిన్నవాడు. అన్నగారి మాట వినెడివాడు కాడు. అత

తన్న గారిని వదలి పెట్టి తెచిపోయెనట. తరువాత జ్వాలాముఖుని వంసారము కొన్నాళ్లు బాగుగానే జరిగినది. జరిగినదనగా వ్యాపారము బాగుగా లాభించినది. అతని కుమారుడు త్రినేత్రుడు. త్రినేత్రుడు వర్తకమును పాడుచేసినవాడు.

శాంతిపురరహస్యసంఘమువారు పూర్వము పంపించిన మానిసి వచ్చి వీరి కుటుంబమును చూచినప్పుడు త్రినేత్రుడు బాగుగనే యున్నాడు. ఇప్పుడతడు చనిపోయినాడు. వీరి వెంటవచ్చిన జ్వాలాపుర గ్రామవాసులు శుకదేవవర్మతో నీసంగతులన్నియు చెప్పిరి, అందఱును వారి యింటికి పోయిరి, ఇల్లు బాగుగనే యున్నది. అనేకదశములు కలవారి యిల్లువలెనే కనిపించుచున్నది. లోనికి పోగా నెవ్వరునులేరు. గ్రామవాసులలో నొకడా యింటిలో కొంత చనవు కలవాడు, లోనికి పోయి యిద్దఱు స్త్రీలతో చెప్పి వారిని తీసుకొనివచ్చెను. వారిద్దఱు విధవరాండ్రు ఒకామె మిక్కిలి వృద్ధురాలు, ఒకామె యౌవనవతియు కాదు, వృద్ధురాలు కాదు, ఇద్దఱును చెరియొక తలుపుచాటున నిలు చుండిరి. సావడిలో నొక యరుగున్నది. ఆ యరుగుమీద చాపలు పఱచియున్నవి. దానిపైన దుప్పట్లున్నవి. ఆ వృద్ధురాలు లోనికివెళ్లి వరిచయస్థునితో దుప్పట్లు పఱచి వారిని గూర్చుండబెట్టుమని చెప్పెను. ఆ మర్యాద జరిగినది.

సుదర్శన భట్టారకు డిట్లనెను: "అమ్మా! త్రినేత్రుడుగారు పోయినారని విన్నాము. మీకు చాలా యాపద వచ్చినది."

స్త్రీ లిద్దఱును కన్నీళ్ళు పెట్టుకొనిరి.

మరల భట్టారకు డిట్లనెను: "వీరి పేరు శుకదేవవర్మగారు. వీరిది శాంతిపురము. గొప్ప ప్రభువులు, ఉదారులు. వీరిది గొప్ప వంశము. అయిదువందల యేబదియేండ్లకు పూర్వము శాకూరు రాజవంశమునందు రెండు శాఖ లుండెడివి. ఒక శాఖ కంతుమంతు డన్నాయన ముఖ్యుడు, రెండవ యాయన వామదేవుడన్న పేరు కల వాడు. శాంతిపురమునందుగల క్షత్రియులందఱు వామదేవునిశాఖ వారు. వీరు శాకూరీరాజవంశమువారు. వామదేవునిశాఖవారు. మీకా సంగతి తెలియునా?"

అనగా వృద్ధురా లిట్లనెను: "అయ్యా! ఇవియన్నియు ధనవమ

కలవారికి. పేదవారికి నాల్గువ్రేళ్లు లోనికిపోవుట యెట్లా? అన్నటి
వ్రేళ్ళు. త్రినేత్రుడు నా కుమారుడు. అతడు పడివయస్సులోనకే
పోయినాడు. వానితండ్రి వాడు బ్రతికినన్నాళ్ళు సుఖముగా నుండు
టకు కొంత యిచ్చియే పోయినారు. నా కొడుకు దుర్వ్యయము
చేసినాడు. ఇతనికి సంతానములేదు, మేమున్నాము. మా యిల్లు
మిగిలినది. దీని నెవరికైనను విక్రయించి మా యత్తాకోడండ్రము
బ్రతుకవలయునని యూహించుచున్నాము. మీరు పెద్దలుకదాయని
వావిడచి చెప్పుచున్నాను. మేము క్షత్రియులమే, క్షత్రియులమన్న
మాట నాకే తెలియును. నేను కాపురమునకు వచ్చినప్పటినుండియు
మేము వైశ్యవృత్తినే యవలంబించితిమి. ఈ నాకోడలు క్షత్రియ
స్త్రీ యగునో కాదో నాకు తెలియదు. నా కొడుకైన త్రినేత్రు
డీమెను పెండ్లియాడెను. వారు పూర్వమెప్పుడో క్షత్రియులట, ఏమి
చేయవలయును? వర్ణాశ్రమధర్మములు రాజు పాలించినచో పాలించ
బడును. అన్నోదకము లున్నచో నిలుచును."

శుకదేవవర్మ:—"అవునమ్మా! మేము వచ్చినది దీనికికాదు.
ఎవరి కష్టములు వారికుండును. ఎవరైన దయావంతుడున్నచో నొక
దీనారమిచ్చును. రెండు దీనారములిచ్చును, పడిపోయిన సంసారముల
నుద్ధరింపలేదుకదా! ఏనుగెత్తుమన్నచో ఏనుగే లేవదీయవలెను;
కొన్ని యేనుగులు పెఱయేనుగును లేవదీయవు. మేము వచ్చిన
దెందుకనగా మీవారి పేరు జ్వాలాముఖులు. ఈ యూరికి మీరు
జ్వాలాముఖుని తరములో వచ్చితివా, అతని తండ్రి తరములో వచ్చి
తిరా? ఎచ్చటినుండి వచ్చితిరి? మీకాసంగతి యేమైన తెలియునా?"

వృద్ధురాలు:—అయ్యా! మేము మా తరములో రాలేదు.
మావారి తండ్రితరములో వచ్చినామట!

సుదర్శ:—మీ మామగారి పేరు మీకు తెలియునా?

వృద్ధు:—భర్త పేరును మామగారి పేరును పేర్కొనరాదు.
కాని, మావారు తన కొడుకునకు తన తండ్రిపేరే పెట్టెను.

సుదర్శన:—అనగా వారిపేరు త్రినేత్రులన్నమాట, వారు
వచ్చిన నాటి కథలేమైన మీకు తెలియునా ?

వృద్ధు:—మా యత్తగారు బ్రతికియుండగా కొన్ని విషయ

మృతు చెప్పెడిది. అవి వినుటయేగాని శేనేమియు నెఱుగను. మా పూర్వులు క్రాంతిపుర నివాసులుట! ఆ పేరు నేను మఱచిపోయితిని. కాని, ఈ వచ్చిన పెద్దలు క్రాంతిపుర నివాసులని మీరు చెప్పగా నాకు జ్ఞాపకము వచ్చెను. ఆ క్రాంతిపురమును మా పూర్వులు వదలి యెన్ని తరములైనదో మాకు తెలియదు. ఇక్కడికెక్కడనో చాలదూరాన గంధగిరిపురమని యొక గ్రామమున్నదట. ఈ ప్రాంతమున నెవ్వరును దాని పేరుకూడ వినలేదు.

శుకదేవవర్మ:— ఉన్నదమ్మా! ఉన్నది! నేనెఱుగుదును. అచట మా శాఖవారు కలరు. వారిలో కొందఱు బాగుగనే బ్రతుకు చున్నారు. వారివద్ద మా వంశవృక్షములు కూడ కలవు. మీరు గంధ గిరినుండి వచ్చితిరన్నమాట!

వృద్ధురాలు:-నా కొడుకుతో మా వ్యవహారము చెడిపోయిన తరువాత రెండు మూడుపార్లు చెప్పితిని. ఓయయ్యా మనది పూర్వము గంధగిరి గ్రామమట. అచటికి మనము పోదము. అచట మనకుదుడు వారు చాలమంది యుందురు. అచటికి పోవుదమని, కాని యతడంగీక రించలేదు.

సుదర్శన భట్టారకుడు: "మీ మామగారైన త్రినేత్రవర్మగారు ఇక్కడికి వచ్చినప్పుడు తానొక్కడే వచ్చెనా? ఎట్లు వచ్చెను? ఎందుకు వచ్చెను? మీకే సంగతులేమైన తెలియునా?"

వృద్ధురాలు:— తెలియునవగా తెలియును. మా యత్తగారి యత్తగారుండెడిది. "నేను కాపురమునకు వచ్చిన తరువాత నా మె యేడెనిమిదేండ్లు బ్రతికియున్నది. ఆమె యప్పుడప్పుడు కొన్ని చెప్పు చుండెడిది. మా యత్తగారికి కూడ నెక్కువ తెలియవు. మా మామ గారిచ్చటికి వచ్చిన తరువాతనే వారు వివాహము చేసికొనిరట! మా మామగారి తండ్రి గంధగిరిపురములో బాగుగా బ్రతికినవారట! ఆయన గొప్ప వీరుడు, నందదేవుడన్న రాజు మధ్యలఖులో రాజ్యము చేయుచుండగా వారాయనవద్దనున్న సేనాపతులలో నొకరట! ఆ నందదేవుడు భీమార్జున మహారాజుగారి కుమారుడు. భీమార్జున మహా రాజుగారనగా సంకువర్మ మహారాజుగారి మనుమడు. మా మామ గారి తండ్రి పేరు భాస్కరదేవవర్మ. ఆయన యుద్ధములో నొకిపోయి

పాతిక యేండ్లప్పటనే యుండెనట! ఆ నందదేవవర్మ రాజ్యముచేసినది
పాతిక యేళ్లు. చేసిన పాతిక యేళ్లు శత్రువులు, వివాదములు, వల్లరులు,
రాజ్యము మిక్కిలి దుర్ఘటముగా గడచెనట. తరువాత నిద్దరు
రాజులు పాలించిరట! వారి పేరులుగాని, వారి కాలముగాని సరిగా
తెలియదు. ఒక మాటయిరువదియేండ్ల కాలమట్లు గడచెను. మా
క్రాంతిపుర ప్రభువులు తత్కాలమున కాశ్మీరరాజ్యమును సంపా
దించుటకు చాల ప్రయత్నములు చేసిరట! మేము అందఱము వర్త
కుల భార్యలముగాని మా యత్తగారి యత్తగారు క్షత్రియ స్త్రీ.
ఆమె యెప్పుడు నీ కథలే చెప్పుచుండెడిది. నేనప్పుడు క్రొత్తగా
కాపురమునకు వచ్చితిని, నేనెప్పుడు నామె కబురులు చెవులుదోరగా
పెట్టుకొని వినుచుండెడిదానను. మా మామగారి తండ్రి భాస్కర
దేవవర్మగారు మహాయోధులట, ఆయన యంశవర్మ మహారాజు
యొక్క ముమ్మనుమడైన నందదేవ మహారాజు పక్షమున యుద్ధము
చేయుట గంధగిరిలోగాని క్రాంతిపురమునగాని మా పూర్వులెవ్వరికిని
నిష్టములేదట! ఆ భాస్కరదేవవర్మగారు తన యుద్ధనీతిచేత, బలపరా
క్రమములచేత నందదేవవర్మ మహారాజును నాలుగైదుపార్లు శత్రు
వులచేతికి చిక్కకుండ గాపాడెను. గంధగిరి క్షత్రియులందఱు వారి
మీద కత్తిగట్టిరి. ఈ సంగతి భాస్కరదేవవర్మగారికి తెలియును,
తెలియదు. ఆయన భార్యపేరు రుద్రాణి, నేనెఱిగియున్నప్పటి
కామెకు దంతములులేవు; తన పేరు రాణియని మాత్రమే చెప్పెడిది.
మొదటి యక్షరముకూడ చక్కగ వినిపించెడిదికాదు. ఆమె మాట
లవిస్పష్టముగా నుండెడివి. కాని, మేము జాగ్రత్తగా విని మరల
చెప్పించుకొనుచు సావకాశముగా వినెడివారము. నందదేవ మహా
రాజు చనిపోయిన తరువాత భాస్కరదేవవర్మగారు గంధగిరి తిరిగి
వచ్చిరట! ఆయన యింటికి వచ్చిన తరువాత నొడలిగాయములు
నవారోగ్యము మిక్కిలి దుర్దశలో నుండెనట; దెబ్బతిన్న పాముమీద
గడ్డలువేయుట యెంత సులభము! భాస్కరదేవవర్మగారు యుద్ధము
నకు పోకముందే మా మామగారు వారికి కలిగిరి. అప్పటికి మా
మామగారికి నాలుగైదేండ్లు, పిల్లవానిని వదలిపెట్టి పోవద్దని రాణమ్మ
గారెంత చెప్పినను వినక వారు వెళ్ళిరట! ఆ భాస్కరదేవవర్మగారు

తిరిగి వచ్చుటకు ముప్పదియేండ్లు పట్టినదట! మా మామగారు తండ్రి లేనిదినములలో పడిన కష్టములకు లెక్కలేదు. గ్రామస్థులంత యేడ్పించిరి. ఆస్తి కనిపించలేదు. ఇల్లున్నది, ఇంటిమీద వప్పున్నది, దైవదుర్వశముచేత వారింటికి తిరిగి వచ్చిన తరువాత వారికి మరియొక పుత్రుడు కలిగెను. అంతలో భాస్కరవర్మగారు చనిపోయిరి. ఆయన యింటికి తిరిగి వచ్చిన తరువాత నయిదారేండ్లు బ్రతికిరట! అప్పుడు గ్రుడ్డిలో మెల్లగా నున్నది. మా మామగారైన త్రినేత్రుడు పై నదుపు లేక, పాలించెడివాడు లేక, కత్తివిద్య నేర్పినవాడు లేక, నాలుగక్షరములు చెప్పించినవాడు లేక, ముప్పదియేండ్లు తల్లిని పోషించుట యెట్లో తెలియక, దానికి తోడు కొంపనిండ తిండికిలేని చుట్టాలెక్కువగా నుండుటచేత తన తెలివి యెందుకును పనికిరానివాడై పోడు. తండ్రి తిరిగి వచ్చెనన్న సంతోషమేగాని తమ్ముడొకడు పుట్టెను. తనకు తమ్మునికి మధ్య నలుబదియేండ్లు, భాస్కరదేవవర్మగారు చనిపోయిన తరువాతగూడ వారు పదియేండ్లు గంధగిరిలోనే యుండిరి. మావారికి వివాహము కాలేదు, ఋణదాతలు ఇల్లువేసికొనిపోయిరి. పదునేనేండ్ల తమ్ముని తీసికొని యేబదియైదేండ్ల వయసుగల తాను మా మామగారు జ్వాలాపురమునకు వచ్చిరి. వర్తకముతో బ్రతుక నారంభించిరి. తరువాత చాల కథలు జరిగినవి. నా భర్తయేమేము క్షత్రియులము కాము పొమ్మనెడివారట! నా కొడుకునకు తన పూర్వులు క్షత్రియులో వైశ్యులో! గోపాలకులో! వానికి తెలియదు. మా సంసారమిట్టి స్థితిలోనుండెను. మాతోడివారు నాలు గావులను పెట్టుకొని పాలమ్ముకొని బ్రతుకుచుండిరి. ఆ పని చేయుటకు మా మామగారుగాని, మావారుగాని, నా కొడుకుగాని యంగీకరించలేదు.

సుదర్శన:—"సరే! ఆ త్రినేత్రుని తమ్ముని పేరేమి? అతడేమైనాడు."

వృద్ధురాలు:—"అతని పేరు నేను మఱచిపోయితిని. నోటిలో నాడుచున్నది. బకారముతో మొదలు పెట్టును, బల, బల.

భట్టారకుడు:—బలరాముడు.

వృద్ధు:—"కాదు-కాదు-బలవర్మ—కాదు."

భట్టారకుడు:—బలదేవుడా?

వృద్ధు:—''ఆఁ! బలదేవవర్మ! ఆయన అన్నగారి మాట లెక్క-చేసెడివాడు కాడట! అన్నగారు చిన్న చిన్న వ్యాపారములుచేసి తల్లిని తమ్ముని పోషించుచుండెడివాడు, ఈ తమ్ముడు కొంటెకాడై కొయ్యయయ్యెను. అతడెప్పుడును దూరపు టడవులకు పోవుటయు లేళ్ళను, కుందేళ్లనుకొట్టి తెచ్చుటయు వండిపెట్టుమనుటయు. అన్నగారు మాంసాహారమును విసర్జించినారు. రాణమ్మగారికికూడ నలవాటు తప్పిపోయెను. ఆమెకు రెండవకొడుకన్నచో చెప్పరానంత ప్రేమ. ఇంతలో నన్నగారు నన్ను పెండ్లాడిరి. నాది వేరే కథ, అరువదియేండ్లు వచ్చినవి. పెండ్లి యెందుకని తమ్ముడు, అదియొక గోల. చివరకతడు లేచిపోయెను. మావారు చాల వెదికించిరి. మావారు పోయిన తరువాత నాకు తెలిసినవార్త యేమనగా నతడు మైథిలీ పురమునకు పోయెనని, ఎంతవఱకు నిజమో!

# 10

అంత శుకదేవవర్మ పోవుదమన్నట్లు సుదర్శన భట్టారకునకు సంజ్ఞ చేసెను. భట్టారకుడు కదలలేదు.

భట్టారకుడు:- ఏమమ్మా! మీవారు పోయిన తరువాతనైన మీ మఱదిని గుఱించి నీ వింకను కనుగొనలేదా?

వృద్ధు:- "అప్పుడు కనుగొనలేదు గాని నా కొడుకు పోయిన తరువాత నీ నడుమనే అచ్చటకు నిచ్చటకు పోవుచున్న వారితో నా మఱది యేమైనాడు? పెండ్లియైనదా? వారి కుటుంబమెందున్నది? సంతానమున్నదా? మొదలైన విషయములు చాల మందివలన కనుగొనుటకు ప్రయత్నించితిని. అతడు మైథిలీ పురమునకు పోయెనని నాకెప్పుడో తెలిసెను. ఆయూరు ఎవ్వరు పోవుచున్నను వెన్నియోచెప్పి పంపింతును అందఱు యువకులు. వారికేమి పట్టినది? వారడిగినచో యువకుల నడుగుదురు, వారికేమి తెలియును? వృద్ధుల నడుగవలయును. ఇది తేలికగా డెబ్బది యెనుబది యేండ్ల క్రిందటి నాటిమాట. అతడు పెండ్లియాడినచో సంతానము కలిగినచో వారి

వరకో కూడ తెలియదు. ఆ బలరాముడు-కాదు-బల దేవుడే-అయ్యా!
నా కెవ్వుడు నతని పేరు జ్ఞాపకముండదు. మా యూరిలో మైథిలీ
పుర మెరిగిన వొక వృద్ధ పండితుడున్నాడు, ఆయన యొకప్పుడు
మైథిలీపురము పోవుచుండగా నే వాయనతో చెప్పితిని.

ఆ వృద్ధ పండితున కొక్క-తెయే కూతురు. ఆమె నొకయయ్య
కిచ్చి యల్లుని తన యింట నుంచి కొనవలయునని యత్నించినాడు.
మైథిలీపుర బ్రాహ్మణుడొకడు తన కెవ్వరు లేరని కానిచ్చుటనే
యుందునని నమ్మించి యామెను పెండ్లి చేసికొన్నాడు. ఏడాది తిరు
గకముందు తన భార్యను తాను తీసికొని పోయినాడు. ఈ వృద్ధుడు
తన యిల్లు తాను వదలిపోలేదు. ఈ యింటనే పుట్టినాను. ఈ
యింటనే పెరిగితిని. నా శవ మీ యింటనే వెళ్లవలయునని యాయన
కోరిక. కాని, కూతుమీది మమకారము చంపుకొనలేదు.

ఆ మైథిలీపుర మిచ్చటికి చాల దవ్వట, గుఱ్ఱాల మీద గుఱ్ఱపు
బండ్ల మీద, వడిగల యెడ్లుగట్టిన శకటముల మీద పోవుదొరలకు దూర
మేల తెలియును? వారికి తెలియనట్లే తక్కువజాతివారికిని దూర
ములు తెలియవు. నాగరకులకు నాల్గు దినములు ప్రయాణమగుచో
వారు ప్రొద్దున లేచి యా యూరుపోయి రాత్రి కింటికి తిరిగివత్తురు.
బాధ ఎవరికి? ఈసృష్టిలో సర్వ దేశములందు సర్వకాలము లందు
అటు నిటు గాని సంసారులకు.వారి సంపద గోచికి పెద్దది,గావంచాకు
చిన్నదిగా నుండును. రాజకీయ సాంఘికాది సర్వవిప్లవములు వారి
మీదికి వచ్చును. ఆ బ్రాహ్మణుడు వృద్ధుడు. నాల్గు దినముల ప్రయాణ
మాయనకు పది దినములు పట్టును. కూతువద్ద పట్టుమని పది దినము
లైన నొకసారి యుండలేదు. ఆయన వాయందు దయతో నచట నెంత
మందిని కనుగొనవలయునో యంతమందిని కనుగొనెను. పరము
వృద్ధులను గూడ కనుగొనెను.

కాని,బల దేవుడన్న పేరు గలవాడు డెబ్బది యెనుబది యేండ్లకు
పూర్వ మెవ్వడును మైథిలీపురమునకు పోలేదట. అన్ని యేండ్ల
క్రిందట మైథిలీపురమునకు పర దేశములనుండి వచ్చిన వారి కుటుంబ
ములు పది పాడేను కలవు. వారిలో బల దేవుడన్న పేరు గలవాడొక్క-
డును లేడు. నా ముఱది చిన్నప్పుడు చాల వెట్టి వేషములు వేసెని

కాదని చెప్పితిని కదా! ఆ వెఱ్ఱి వేషములో నొక్కటి యెవరైన
తన పేరడిగినచో నింకొక పేరు చెప్పెడి వాడు. కానట్లు చెప్పిన
పేర్లు రెండు మూడు నాకు తెలియును. నా కూరకే జ్ఞాపక మున్నవి.
అప్పుడతడన్నచో నా కేమియు పలెడిది కాదు. తన యన్నగారు
నన్ను పెండ్లి చేసుకొనుటయే యతనికిష్టములేదు. కంచములో నే
నన్నము వడ్డించినచో తినకుండ లేచిపోయెడివాడు. మా యత్త
గారు వడ్డించవలయును. తినవలయును. అన్నగారియెదుట పడుటకు
భయము. అన్నగారు రెండుమూడుసార్లు కోపపడగా నెచ్చటికో
లేచిపోయెడివాడు. ఆయన వెదకించెడివారు. అతడు కనిపించెడి
వాడుకాడు. ఇంటిలో మా యత్తగారేడుపులు పెడబొబ్బలు.
ఎచ్చటికో పోవును. మాది జ్వాలాపురము. మా యన్నగారి పేరు
త్రినేత్రుడు అని చెప్పినచో వారితనిని తిరిగి పంపించవచ్చును.
తాము క్షత్రియులమని చెప్పెడివాడు కాదట! మేము వైశ్యుల
మనియూ చెప్పెడువాడుకాడు.

వైశ్యుల వృత్తి మేము చేయుచుండెడివారము. మేము
గోపాలకులమని చెప్పెడువాడు. తన పేరొకప్పుడు వాసుదేవుడు.
ఒకప్పుడు త్రిపురారి. శివకేశవులకున్న నామములలో తన కెప్పుడేది
తోచిన నది చెప్పెడివాడు. ఒక యేడాదిక్రింద నీ వృద్ధ బ్రాహ్మణుడు
మరల మైథిలీపురమున కేగెను. ఈసారి నేను తిరిగిరాను. నేనచటనే
చచ్చిపోవుదును అని చెప్పి వెళ్లుచుండెను. నే నాయనతో స్వామీ!
మీరు మరల తిరిగివచ్చినచో నాతో చెప్పుదురుగాని, రానిచో నేనేమి
చేయుదును? ఆ డెబ్బది యెనుబది యేండ్లకు పూర్వము గొల్లవాండ్లె
వరైన యాయూరునకు క్రొత్తగా కాపురమునకు వచ్చిరా? ఆ
వచ్చిన కుటుంబాధిపతి పేరు శివకేశవుల నామములలో నేదియైనను
సరేయగునా! ఇంకను తెలిసికొన వీలున్నచో నతడు పొట్టివాడు,
నల్లనివాడు. కన్నులు మాత్రము పెద్దవి. పెద్ద వేటగాడు కాడు
గాని వేటయందభిమానము కలవాడు. ఏది ఏమైననునసరే! లేడి
మాంసము కుందేటి మాంసము అడవికోళ్ళ మాంసము లేకుండ ముద్ద
ముట్టడు. అట్టి వాడెవరైననున్నాడా? ఈ సంగతు లడిగినచో నెవ
రైన విసిగికొందురు. ఓపికగా నడుగవలెను. వృద్ధుల నడుగవలెను.

అప్పుడువచ్చిన పదికుటుంబములున్నారే ప్రతికుటుంబములోనికి పోయి పనిపెట్టుకొని యీ యారాలు తీయవలెను.

"మీరు పెద్దలు. మీ కిద్దఱు మనుమలున్నారు. మీ యల్లుడు గాని మీ మనుమలుగాని వారికి తీరికయున్నప్పుడే విషయములను కనుగొనవచ్చును. మీరు తిరిగివచ్చినచో నాకు చెప్పుడు" అని చెప్పి పంపించితిని. ఆ పండితుడు వృద్ధుడు. పదాదియైనది ఆయన తిరిగి రాలేదు. ఆయన పేరు రమాకాంత దేశికుడు. స్వామీ! మీరు మైథిలీ పురము పోవుట తటస్థించినచో నీ రమాకాంత దేశికుని కనుగొనుడు- కొంత తెలియవచ్చును. ఆయన యల్లునిపేరు నాకు తెలియదు. ఆయన కూతురుపేరు నాకు తెలియును. ఆమె పేరు ధర్మాంగద. జ్వాలాపురము త్తవారట. ఆయన కొక్కతియే కూతురట మొదలైనవి యడిగినచో రమాకాంతదేశికుని యిల్లు కనుగొనవచ్చును.

సుదర్శన:-"నీవెందుకమ్మా ఆ మఱదికోసమింత తిప్పలు పడెదవు?"

"వృద్ధు:-స్వామీ నేను వృద్ధురాలనైతిని. యీ నాకోడలు చిన్నది. ఆమె కడుపున నొక్కకాయ కాయలేదు. మా శాఖ యిట్లు నశించి పోవునని నా భయము. ఆ మఱది కుటుంబమున్నదని నాకు తెలిసినచో మేమచ్చట చేరినచో వారైనను కొంత బాగుపడినచో నీ యిల్లమ్మి యీ నా కోడలును వారిచేతిలో పెట్టినచో వారు మా వారికిని నాకును నా కొడుకునకును నీళ్ళు వదులుదురేమోనన్న యాశ. భాస్కరదేవవర్మ యొక్క కుదురు చెడిపోకుండ నుండవలయునని నా కోరిక.

సుదర్శన:-"అమ్మా! నేను మైథిలీపురమునకు పోవలసిన యవసరమున్నది. కొలది దినములలో నేనచ్చటికి పోదును. అప్పుడు నీ మఱది కుటుంబమును గూర్చి కనుగొందును"

వృద్ధు:-"నాకెట్లు తెలియును?

సుదర్శన:-నేనువచ్చి చెప్పెదనుగదా!

వృద్ధు:-"అయ్యబాబు! అంత యనుగ్రహమా! అంత శ్రమ తీసుకొందురా? అట్లే కానిండు. మీరేమియు ననుకొనకుడు. ఒక్క మాట చెప్పెదను.ఆ బలదేవుడు పెండ్లియాడెననుకొందము.నిజముగా

కేగొల్ల దానినో పెండ్లి యాడినచో స్వామీ యతనికి కలిగిన సంతా నము క్షత్రియులగుదురా! మా స్థితి వీరదేవవర్మ మహారాజు స్థితి వంటిదగును.

సుదర్శన:-"అది యేమి! ఆ కథ నాకు తెలియదే!

వృద్ధు:-స్వామీ! నన్నెందుకు ప్రశ్నింతురు! మీరు పండితులు. మీకు తెలియకుండ నెందుకుండును? మా యత్తగారు నాకిట్టి విష యములు చెప్పెడిది. ఓసి కోడలా! మనము క్షత్రియులము. మన క్షత్రియ రక్తము చెడిపోకుండ చూచుకోవలయును. నీ మామగారి మీద గంధగిరి క్షత్రియులు కత్తికట్టిన దెందుకు? ఆ సంగతి నీతో నెప్పు డును చెప్పలేదు. కొన్నివందల యేండ్ల క్రిందటి మనవంశము నేడు వామదేవవంశమని పిలువబడుచున్నది. అప్పుడిది శాకూరివంశమని పిలువబడుచుండెడిది. ఒకప్పుడిద్దఱు గొప్ప వీరులు, ఇద్దరు దగ్గఱి జ్ఞాతులు. ఒక్కాయన పేరు అంశుమంతుడు. రెండవ యాయన పేరు వామదేవుడు. మన వంశమంతయు రెండవ యాయననుబట్టి వచ్చినది. తత్పూర్వపు రాజు సంతానములేక నిజముగా తన కూతును వామ దేవునకిచ్చి రాజ్యమతనికీయవలసి యుండగా నంశుమంతున కిచ్చెనట! అందుచేత మన వామదేవవంశీయులు నేడు నేపాళదేశమును పాలించు రాజులతో విరోధము కలవారు. ఆ గంధగిరివాసులు మమ్మిట్లు చేయుటకు మీ మామగారు వీరుడై యావంశపు రాజునకు సాహాయ్యము చేయుటయే. వట్టి సహాయము చేయుట కాదు. ఆ రాజును నిలబెట్టెనట! నాలుగైదుసారు లతని ప్రాణమును రక్షించె నట! మా యత్త యిట్లుచెప్పినది స్వామి! అందుచేత నా మఱది చివరి కేగొల్లదానినో, యే వల్లెదానినో చేసికొన్నచో నే నచ్చటికి పోను. నా కోడలిని పోనీయను. మాకు వారితో సంబంధములేదు.

సుదర్శన:-"అమ్మా! చాలప్రొద్దెక్కినది. మేముపోయి భోజ నముచేసి మధ్యాహ్నము దాటిన తరువాత మరల వత్తుము.

వృద్ధు:-"అయ్యా! స్వామీ! మేము చెడిపోయినను దొరల మయ్యా! దొరలము. మేము వస్తువరుండియైన యతిథుల కన్నము పెట్టెదము. అది మా ధర్మము. మా యింటిలో మగవాడు లేడుగనుక మమ్ములను ధర్మభ్రష్టలను చేయకుడు. మా కోడలు లోపల వంట

తలయుచున్నది. ఆ పెద్దదొర మా యింట నాతిథ్యముచేసి తిరవల యును. మా పొరుగిల్లు బ్రాహ్మణులది. స్త్రీ కచ్చట నేర్పాటుచేయించి తిని—అనగా సుదర్శన భట్టారకుడు శుకదేవవర్మ వంక చూచెను. శుకదేవ వర్మయు తలయూచెను. ఆయన కొంత సేపటికిమున్నే లేచి పోవుద మనుకున్నాడు. ఉండుట మూలముగా మరికొన్ని విషయ ములు తెలిసినవి. మరలనింకేమి చెప్పుదు! ఒక్కొక్క స్త్రీ దేశ భాగ్యమూర్తి. పూర్వవంశ చరిత్రలు కుటుంబముల యొక్క చరిత్రలు వంశు స్థితిధర్మము మొదలైనవి స్త్రీలయందు నిండియుండును. వారు సంప్రదాయమైన కొంపలో పెరిగియున్నచో పరిజ్ఞానఖనులు. ఈమె కెంత చదువువచ్చును! ఎంత జ్ఞానము! ఎంత సౌశీల్యము! ఎంత సంప్ర దాయ వేతృత్వము

భోజనాలైనవి. విశ్రాంతి తీసికొన్నారు. మరలవచ్చి వృద్ధు రాలు తలుపు చాటున నిలుచున్నది.

సుదర్శన భట్టారకు డిట్లనెను: అవ్వా! నీవు ప్రొద్దుట నంతయు నట్లే నిలుచుండి మాటాడితివి. నామాట మన్నించి మా కెదురుగా నంత దూరముగా కూర్చుండి మాటాడుము.

అనగా నామె కదలలేదు.

శుకదేవవర్మ:- "అమ్మా! మీపేరు చెప్పలేదు. మీరు మిక్కిలి వృద్ధులు. వృద్ధత్వము వచ్చిన తరువాత నింత మర్యాద యక్కఱలేదు. నా భార్యయున్నది. మీ వయస్సెంత యుండునో ఆమె వయస్సు నంతయే యుండును. ఆమె చిన్ననప్పు డనూర్యంపశ్యగావచ్చును. నేడు మా యింటిలో యథేచ్ఛముగా తిరుగును. అందఱితో మాటా డును. మీరువచ్చి మా కెదురుగా కూర్చున్నచో నా కెట్టి యిబ్బందియు లేదు"... 

తోచదు. ప్రొద్దుట మీ మాటలు విన్నప్పటి నుండి మీరన్నచో నా కెంతయో గౌరవము కలిగినది. ఏమి యాతిథ్యమిచ్చితి రమ్మా! ఏమి యాతిథ్యము! మీ కోడలెంత రుచ్యములైన పదార్థములను చేసినది! నా మూలమున మీ రెంత కష్టపడి యా వస్తువులను సంపాదించిరో తెలియదు. మిమ్ములను చూచినప్పటి నుండి నా భార్యను తీసికొని వచ్చితినికాదే యనిపించు చున్నది. ఆమె మిమ్ము చూచినచో నెంత సంతోషించెడిది! ఆమె పేరు అనసూయ. తమరి పేరేమి?"

వృద్ధు:- "మా అత్తగారి పేరవమాయ. మా కోడలిపేరు గీర్వాణి. కాని మేమా పేరు మార్చికొని యామె నవమాయ యని పిలుచు చుందుము. అందుచేత మీ భార్య నాకొక తైన పూజ్యారాలు రెండవదైన ప్రేమ స్థానము. అట్లే కూర్చుందుము."—

అని వచ్చి కూర్చుండెను.

సుదర్శన:- "తమరి పేరు చెప్పలేదు."

వృద్ధు:-"స్వామీ నా కథ చాలయున్నది. మేమహిర్వంశక్షత్రియులము. అహిర్వంశమనగానే నందఱకు తెలియక పోవచ్చును. భారత యుద్ధము జరిగిన నాడు నేపాళదేశమును పాలించిన వారు కిరాత వంశీయులైన రాజులు. భారత యుద్ధమునాడు పాలించిన రాజు పేరు జితేదాస్తి. ఆయన కుమారుని పేరు గాలి. జితేదాస్తి పూర్వము నేపాళదేశమును కిరాత వంశీయులైన రాజులారుగురు పాలించిరి. తత్పూర్వము పాలించిన వారు ముగ్గురు. వారహిర్వంశము వారు. వీరి పూర్వము గోపాలరాజ వంశమని యుండెడిదట. ఈ నేపాళదేశ చరిత్రము భారత యుద్ధమునకు పూర్వము వేయి యేండ్ల నుండి తెలియుచున్నది. మా యహిర్వంశపు రాజుల పేర్లు తెలియవు. కాని, యా వంశపు వారు నేటికి నాలుగు వేలయేండ్లు గడచినను మేమహిర్వంశము వారమని చెప్పుకొనుచుందురు.

బ్రాహ్మణులలో చూడుడు. మేము గౌతమసగోత్రులము కాశ్యపసగోత్రులము, విశ్వామిత్రసగోత్రులము, హారితసగోత్రులమని చెప్పికొందురు. చెప్పికొనుటయేమి! ప్రతిదినము సంధ్యావందనము లందు చెప్పుదురట, మా క్షత్రియులు సంధ్యావందనము చేయుదురు, గోత్రమును చెప్పుదురు. మామామగారి తండ్రి తండ్రి నిత్యకర్మానుష్ఠానము చేసెడివారట. ఆయన, వామదేవసగోత్రః, అని చెప్పెడి వాడట. వామదేవుడన్న ఋషికలడు. ఆ వామదేవుడో! అంశుమంతుడన్న మహారాజు జ్ఞాతియైన వామదేవుడో! తెలియదు. ఇట్లుండగా మాయహిర్వంశ క్షత్రియులు నాల్గువేలయేండ్లలో నూటికి తొంబది తొమ్మిది పాళ్ళు క్షత్రియులమన్నమాటయే మఱచిపోయిరి. మా వంశము నాదినుండియు నీ ప్రాంతములలో లేదు. హిమవత్పర్వతము కడుపులో నొక పట్టణము కలదు. దాని చుట్టుపట్ల పది పల్లెలు

కలావు. అప్పటి కెన్ని కులములున్నను వారందఱు పూర్వమహిర్వంశ జాతులు, కొందఱు శూద్రులైరి. కొందఱు వైశ్యులవలె నుండిరి. మఱికొందఱుమరియు నీచకులస్థులై పోయిరి. నిజానికి నే నీ యింటికి కోడలుగా రాకమునుపు నాకీ గోల యేమియు తెలియదు.

"నన్ను మా యత్తగారిట్లు మార్చిరి. ఆమె యొక దేవతామూర్తి. ఆమె యే మహారాజునకో భార్యగా కావలసినది. ఒక గొప్ప వీరునకు మాత్రము భార్యయైనది. చివరకు గడ్డి కరచినది. అంత పేదతనములో నన్ని యిక్కట్లలో నామె కొడుకులను వదలిపెట్టలేదు. కోడలిని నన్ను వదిలిపెట్టలేదు. తన విజ్ఞానమంతయు మాయందు వెదజల్లినది. మామఱది తేచిపోయినాడు. అతనితో నెన్ని సంగతులు చెప్పినది? అతడు నిరక్షర కుక్షి. కాని, యతనికి తన తల్లి యన్నచో పరదైవము. ఆమె చెప్పిన కథలు అతడు గ్రామము వెంటపోయి చెప్పెడివాడు. మొదట మా మామగా రిచ్చటికి వచ్చినప్పుడు మేము క్షత్రియుల మనగా నిచ్చటి వారు నమ్మెడివారు కారట. మా మఱది చెప్పెడి కథలనుబట్టి వారికి విశ్వాసము కుదిరెను. మా కోడలికి మరల ననసూయ యన్న పేరు పెట్టిన దిందులకే! ఈమె మా వంశపు కథలు మఱచిపోరాదు. కాలమును బట్టి సిరి వచ్చును, పోవును. మన మర్యాద, మన యభిమానము చంపుకోరాదు.

నా కథ కొంత యున్నది. నా తల్లి చిన్నప్పుడే చనిపోయి నది. ఆ కొండ కడుపులో నున్న ముద్దలలో నొక్కటియు మా పోటికందలేదు. నా కప్పటికి ముప్పదియేండ్లు దాటినవి. నాకు తెలిసి నంతవరకు నా కప్పటికి నలుబదియేండ్లు. మా నాయన నాకు ముప్పదియేండ్లనియే చెప్పుచుండెడివాడు. నన్నెవరికో యొకరికి పెండ్లి చేయవలయునని యతని కోరిక. నలుబదియేండ్లన్నచో నెవ్వడును తాగడని యాయన భయము. ఆయన నన్ను దీసికొని దక్షిణ దేశములకు వచ్చినాడు. మేము బ్రతుకవలయును, బ్రతుకుటయే దుర్ఘటముగా నుండెను. అందులో నన్నోదరములు. కలవాని నెవని కైన నన్నిచ్చి నాకు పెండ్లి చేయవలెను. మరియు నతడు క్షత్రియుడు కావలెను.

మేము నాకు తెలిసినంతవఱకు మా యూరిలో క్షత్రియుల

ముగా బ్రతుకలేదు. 'మనము క్షత్రియుల'మని 'మనది యహిర్వంశ'
మని నా తండ్రియే చెప్పుచుండెనా? అతనికుమించి నాకు తెలియదు.
అచటి మా బంధువులకు తెలియదు. నా తండ్రికి కూడ విన్నతప్పుడు
తెలియదట. నా కిది యెప్పుడు నాశ్చర్యము. ఒక జాతి, ఒక మతము
ఒకవళము సంపూర్ణముగా నెవ్వడును నశింపచేయలేడు. అది నాశనము
కాదు. అది పరమేశ్వర సంకల్ప మనవలయును. ఒక జాతి జాతి
నిర్మూలము చేయబడును. ఎవరో కొందఱు మిగులుదురు. వేయు
యేండ్లు గడువవచ్చును. వాని దయ యున్నచో మన జాతి మరల
పైకి వచ్చును. ఆ వర్ణము మరల వృద్ధిపొందును. మా యహిర్వంశ
ములో నందఱిట్లు విశ్లథధర్ములు కాగా, శ్లథమానధర్ములు కాగా
వారిలో రెండు లక్షణములు మాత్రము పోవు.

మొదటిది వారందఱును ఖడ్గధారులు. రెండవది మా నగరము
మా చుట్టుపట్లనున్న పది పల్లియలు. ఇందులో నెవ్వడో యొకడు
ఒక్కొక్కప్పు డిద్దఱు ముగ్గురు తా మహిర్వంశక్షత్రియులమని యుబ
నీకు లగుదురు, కర్మలు చేయుచుందురు. తక్కినవారికి చెప్పుచుందురు.
ఒకటి రెండు కుటుంబముల నాది నుండియు నిట్లున్న వనుటకు వీలు
లేదు. ఒక రెండువందల యేండ్లలో నీ ధర్మములు పాలించెడి
కుటుంబము మానివేయ వచ్చును. మరి యొకచోట నింకొక కుటుంబ
మిది మొదలు పెట్టును. తక్కిన వారు కామాచరింపరు. వీరిని గౌర
వించుదురు. వీరన్నచో నభిమానము నొలుక పోయుదురు. ఈ
కుటుంబమునుబట్టి తక్కిన కుటుంబములోనివారు కొందఱు నోటితో
నూఱకయు మేమహిర్వంశములోని వారమందురు. మా నగర
మన— అది నగరమనుటకు వీలు లేదు; నాల్గువేల యేండ్ల క్రింద
నగరమేమో తెలియదు. అది పది పదేను చిన్న చిన్న గ్రామములు.
అన్నిటిని కలిపి దానినొక నగరమందురు. మరల నేపల్లియ కాపల్లి
యదే, యుద్ధావసరము వచ్చి నప్పుడు వారందఱొక్కటియే.

ఒకటి రెండు కుటుంబములు గలవు. వారు క్షత్రియుల
మందురు. క్షత్రియోచిత కర్మలు చేయుదురు. మా నాయన కాన
హిర్వంశ క్షత్రియుడనని వారి వద్ద తెలిసికొనెను. అప్పటి నుండి
యాయన కదిపట్టుదల. నా కూతును క్షత్రియునకుగాని యీయనని.

మరియు భ్రష్టుడైనవానికీయనని.- మా నగరమున నందతివలెనే నా తండ్రియు ఖడ్గధారి. యుద్ధవిద్యానిపుణుడు. తాను మధ్యలఖు నగరమునకు పోయి యుద్యోగమును సంపాదించ వచ్చును మా యమ్మ బ్రతికి యుండగా నాయన యా పని చేయలేదు. తల్లి దండ్రుల ప్రేమను గూర్చి చెప్పవచ్చునో చెప్పరాదో నాకు తెలియదు. మా అమ్మ రుక్మిణి. తాను శ్రీకృష్ణదేవుడు. నడపికొన్న శృంగారము. శ్రీ కృష్ణ సత్యభామలనడిమి శృంగారము. ఆమెను వదలి తాను పోదలచ లేదు. ఏమియులేని సంసారము. కత్తితో బ్రతుకు గడువని యూరు! ఎచ్చటికో పోవుట, కొంత సంపాదించి తెచ్చుట, దానితో కొన్నాళ్లు బ్రతుకుట-మా తల్లిదండ్రులొకరిని వదలి యొకరుండలేక పోయెడివారట.

కాని బ్రతుకవలయును కదా! ఆయన యెచ్చటికో పోయి, యేదియో తేవలయును గదా! నడుమ నడుమ కొన్నాళ్లెడబాటు తప్పకుండెడిది. మా అమ్మ నన్ను కన్నది. నేను మగబిడ్డనైన కాక పోయితిని. నా కయిదారేండ్లు వచ్చినంత నామె చనిపోయినది. నా తండ్రి రెండు మూడు సార్లాత్మహత్య చేసికొంద మనుకున్నాడు. నేనడ్డము వచ్చితిని. మేమట్లే బ్రతుకు చుంటిమి ఆయురన్నం ప్రయచ్ఛతి. నాకు పది యేండ్లు వచ్చినవి. ఇరువది యేండ్లు వచ్చినవి, ముప్పది వచ్చినవి. ఇంకను. కొన్ని సంవత్సరములు గడచినవి. ఎట్లు గడిచినవో నాకే తెలియదు.

మా నగరములో నన్నెవరో యెవరో చేసికొందుమన్నారు. వారెవ్వరును మేము క్షత్రియులమని నోటితోనైన ననెడివారుకారు. చివరకు నా తండ్రి విసుగుపుట్టి నన్ను తీసికొని దేశాటనము బయలు దేరినాడు. అక్కడ నా స్త్రీయున్నదా! ఇక్కడలేదా! వండుకొన్నమ్మ కొక్కటియే కూర, అడిగికొని తినునమ్మ కన్నియుకూరలే! నిజానికి దేశాటనము ప్రారంభించిన తరువాత మేము తిండికిలేక ఇబ్బంది పడిన పూటలేదు. ఎవరో పిలుతురు, ఎందుకో అన్నము పెట్టెదరు. మా తండ్రిచేత పనులు చేయించుకొనెడివారు.

నా తండ్రి పోటరి. ఒక గ్రామములో నొక ధనవంతునివద్ద మేము రెండేండ్లుంటిమి. నా తండ్రికేమియు పనిలేదు. గ్రామములో

నతని గృహమునకు రక్షణముగా నుండుటయే పని - ఆయనకచ్చట విరోధులు కలరు. వారు తననెప్పుడో చంపుదురని యతని భయము. నా తండ్రి కత్తి నతడు విలిచికొని రెండేండ్లు పోషించినాడు.

చివరికీయూరు వచ్చితిమి. దైవమట్లున్నది. వీరియింటికే వచ్చితిమి, మా యత్తతో నా తండ్రి మా కథయంతయు చెప్పినాడు. ఆమె తన పెద్దకొడుకునకు నన్నిచ్చి పెండ్లి చేసుకొందుమన్నది. అప్పటికి నా భర్త కరువదియేండ్లు దాటినవి, నేను మాత్రము పసిపిల్లనా? నాకు నలుబదియేండ్లు, నా భర్త యీయూరు వచ్చిన తరువాత కొంత బాగుపడినారని చెప్పితినికదా! కాని యాయనకు క్షత్రియు లెవ్వరు తమ పిల్లనీయమన్నారు. ఇది మా సంసారపు కథ.

మా కోడలు క్షత్రియవంశ సంజాత, అప్పటికి మా పని కొంచెము వచ్చిగానే యున్నది. నేను పటుబట్టి నా కొడుకునకా పిల్లను చేసికొంటిని. మా మొగమున లేదు. దానికడుపున నొకకాయ కాయలేదు. నా కొడుకు దుర్వ్యయముచేసినాడు. వ్యాధిగ్రస్తుడై నాడు. అయ్యా! మీరు మైథిలీనగరముపోయినచో, నచట నా మఱదిజాడ తెలిసినచో, వారివద్దకు మేము పోవుటకు వీలున్నచో మాకెంతయో మేలుచేసినవారగుదురు. మా యిల్లు చెడియమ్ముకొన్నను మూడువందల దీనారములు వచ్చును. జాగ్రత్తగా వాడు కొన్నచో నాదేమున్నది? నేనెప్పుడో రాలిపోదును, నా కోడలి బ్రతుకు తెల్లవాఱును. మా మఱది విడిపోయినను మా కుదురంతయు నొక్కటియే కదా! అచ్చటికి పోదుము. ఎవనినో దత్తతచేసికొందమన్నను ఇచ్చట నేమియున్నది? ఎవరు తమ బిడ్డను దత్తతయిత్తురు? ఇంక కాదన్నచో మరల గంధగిరి పోవలయును. ఉట్టికెగురలేనివాడు స్వర్గానికెగురునా? నాకు తెలిసిన వార్తలనుబట్టి యిచ్చటికి మైథిలీపుర మెంతదవ్వుగలదో గంధపురి దానికి రెట్టింపుదవ్వట.

అని యామె కన్నీళ్ళు పెటుకొనుచు నుంత కూర్చుండి లేచి వెడలిపోయెను.

అంతట వారిద్దరును లేచి, "అమ్మా! వత్తుమ"నిరి. సుదర్శన భట్టారకుడు, "కనీసము నాలుగైదు నెలలలో మరియు గానిచో నారు నెలల్లో తాను తప్పకుండ వచ్చి యామె మఱదియొక్క కుటుంబ

మచ్చటనున్నచో వారి వార్త లీమెకు తెలియజేయుదు''నని యామెతో పదిసార్లు చెప్పెను. వారు వెడలిపోసాగిరి.

శుకదేవవర్మ పది దీనారము లామె కిత్తుననెను. సుదర్శన భట్టారకు డామె గ్రహింపదేమో యనెను. శుకదేవవర్మ యెట్లయిన నామె వీనిని గ్రహించునట్లు చేయుమని పది దీనారములు భట్టారకున కిచ్చెను.

భట్టారకుడు మరల నామెను పిలచి, "ఊఱకే యడుగుచున్నాను. మీ రిప్పుడెట్లు బ్రతుకుచున్నారు?" అనెను.

వృద్ధః—ఎట్లేమిటి స్వామీ' నారుపోసినవాడు నీరుపోయడా? ఇల్లున్నది కదా! దీనిమీద నెచ్చటనో యచ్చట నాల్గురాళ్ళు పుట్టించుకొనివత్తును, మేమిద్దఱమే కదా!

భట్టారకుడు:—అట్లు కాదమ్మా! రేపు మీ మఱది కుటుంబము జాడ తెలియుననుకొనుము, వారిలో నెవరో యుందురు, మీ రచ్చటికి పోవుదురు, మీ యిల్లమ్మిన నాలుగురాళ్ళయిన వారిచేతిలో పెట్టినచో మీకుదురునందు మీకున్నంత యభిమానము వారికుండక పోవచ్చును గదా' వారు మిమ్ము సరిగా చూడకపోవచ్చును. మీరి యింటిమీద నప్పుచేసి బ్రతుకుట నా కిష్టములేదు. నేను మరల నాలుగైదు నెలలలో తప్పక వత్తునంటినికదా! ఈ పది దీనారములు తీసికొనుము. కాదనకుము, అనరాదు. మేమిపుడు మీకు బంధువులము వంటివారము కదా! నామాట యట్లుంచుము, శుకదేవవర్మగారు వామదేవశాఖీయులు, మీరు వామదేవశాఖీయులు. పదితరాలు గడువనిమ్ము, జ్ఞాతులుకదా! ఇది నా డబ్బు కాదు, వారిడబ్బు, నేను మరల వచ్చినప్పుడు మరల గొంతయిత్తును, అప్పటికి పరమేశ్వరు డనుగ్రహించినచో మీ మఱది కుటుంబము కనిపించునేమో! ఆ మాట యెందుకు! నీవు కాదనరాదు. ఇదిగోయని యతడు పది దీనారములను ఆమె చూచుచుండగా గడపమీదనుంచి మరల నెలవుతీసికొని వెళ్లెను.

ఆమె మాటాడలేద, కన్నీళ్ళతో నిలుచున్నది, వారు వెళ్ళిన తరువాత దీనారములను తీసికొన్నది, కోడలి కిచ్చినది.

శుకదేవవర్మయు సుదర్శన భట్టారకుడును తిరిగి క్రాంతిపుర మునకు బోవుచుండిరి.

శుకదేవవర్మ యిట్లనెను:—"స్వామీ! మీరుకూడ క్రాంతిపుర మెందులకు? మీరు మైథిలీపురము పోరాదా?"

భట్టారకుడు:—ముందు మనము క్రాంతిపురమునకు బోయి యిదియంతయు తక్కినవారితో చెప్పవలయును. నాకు మైథిలీపుర ములో వీరి కుదుటివారున్నారని నమ్మకము లేదు.

శుకదేవవర్మ:—అదియేమి! స్వామీ! అట్లనెదరు! నాకున్నది.

భట్టారకుడు:—ఎందుచేత?

శుకదేవవర్మ:—ఎందుచేతననగా నామె చెప్పిన మాటలలో నొకటి నా మనస్సునకు చాల నచ్చినది. ఆమె మఱది బలదేవుడన్న వాడు, ఈమె తన యత్తగారివద్దనుండి యెన్ని సంగతులు విన్నదో చిన్నప్పుడన్ని సంగతులు విన్నవాడు. మీరు చెప్పితిరి కదా! మైథిలీ పురములో జితేదాస్తియన్న కుఱ్ఱవాడున్నవాడని, యతని తండ్రి పేరు గాలియని. ఆ బలదేవుడు తన పేరు మార్చికొనెడివాడే! కాని యభిమానము లెచ్చటికిపోవును? తన కొడుకునకు గాలి యని పేరు పెట్టి యుండును. మనుమనికి జితేదాస్తియని పెట్టుమని యుండును. ఈ గాలి తండ్రి పేరేమి? మీకు తెలియునా?

భట్టారకుడు:—తెలియును. అతని పేరు ఫాలాతుడని నాకు గుర్తు.

శుక:—ఇంకనేమి! అది శివుని పేరు—

అని శుకదేవవర్మ తాము వచ్చిన ప్రయత్నము ఫలించినట్లు అట్టే నిలిచి ఆనందపడుచుండెను.

# 11

సుదర్శన భట్టారకుడు క్రాంతిపురములో నిలువలేదు. శుక దేవవర్మ వామదేవశాఖా పునస్సంస్థాపనా రహస్యసంఘము నలు పురిలో నొకడు. అధ్యక్షుడు వేఱు. ఆయన యింతకంటె గొప్ప వాడు. గొప్పవాడనగా నింతకంటె ధనవంతుడు. సంతానము లేని

వాడు. లేదన్న దిగులులేనివాడు. శుకదేవవర్మకంటె వయస్సెక్కువ కలవాడు. శుకదేవవర్మ యెనుబదియేండ్లుండి యరువదియేండ్లవాని వలె కన్పించుచున్నచో నతని కెనుబదిరెండేండ్లుండి యేబదియేండ్ల వాడుగా కన్పించువాడు, శస్త్రవిద్యా సర్వరహస్యము లెటిగినవాడు. మిక్కిలి యహంకారి. తానే యంశుమంతునిశాఖను దిగద్రొక్కి నేపాళరాజ్యము నేల యాక్రమించలేను, మొదలైన యూహలు కలవాడు. తనమాట యందఱు విని తీరవలయునన్న పట్టుదల కల వాడు, తక్కినయందఱును పిల్లలు మేకలు సంసారములతో నుండి ధనవంతులైనను కాలము గడుపుకొంద మనుకొనుచుండి పోనీలే సాటి వాడు కదా, అతనినే యధికారము చేయనిమ్మని కొంత యాదాసీ న్యము వహింపగా నది తన యాధిక్యమని కొంత విఱ్ఱవీగువాడు, అతని పేరు యాలంబరవర్మ.

శుకదేవవర్మయు, సుదర్శన భట్టారకుడును క్రాంతిపురము వచ్చి జ్వాలాపుర వార్తలన్నియు చెప్పిరి. ఈ వార్తలు కనుగొను టకు వెళ్ళినవారు తిరిగి వచ్చి యాయా పట్టణములలో గ్రామములలో నున్న వామదేవశాఖియులైన క్షత్రియులలో పెద్ద సమర్థులైనవారు గాని పూర్వము యోగి చెప్పిన లక్షణములు కొన్నిగాకపోయినచో, కొన్నియైన గలవాడు లేడని విన్నప్పుడెల్ల యాలంబరవర్మ సంతో షించినట్లే కన్పించును. అది యేదో చివరకు నా యదృష్టమంతయు వచ్చి తన భుజావతరణము చేయునన్న యాశ యాయనకు హృద యాంతరాంతరములందులేదని చెప్పుటకు వీలులేదు. సుదర్శన భట్టార కుడు తాను మిథిలాపురమునకుపోయి యా బలదేవవర్మ యొక్క కుటుంబము జాడ దీయుదుననెను.

యాలంబరుడు "తొందరయేమి" అనెను.

సుదర్శనః—"నేను మున్ను మీతో చెప్పితిని-మా యూరిలో గాలియు, గాలి కుమారుడు జితేదాస్తియు నున్నారని; జితేదాస్తి మంచి తత్త్వవేత్తయేగాని తక్కిన లక్షణములు లేనివాడని, వా రప్పుడప్పుడు రాచగొల్లలమని చెప్పికొనుచుండుట కలదనియు, వారీ బలదేవవర్మవంశము వారైనచో, నతడు జ్వాలాపురములోని త్రినేత్రుని తమ్ముడగును. త్రినేత్రుడు భాస్కరదేవవర్మ కొడుకని

గంధగిరిపురములో తెలియును. వారు సుక్షత్రియులని రుజువగును. దానివలన మా దొడ్డదొర కార్తవీర్యార్జునుని కుటుంబమునకు మేలు కలుగును. మున్నే మనవిచేసితినిగదా! నా కిందులో కొంత స్వప్రయోజనమున్నదని. జీతేదాస్తి సుక్షత్రియుడైనచో మీకేమి నష్టము?''

యాలంబరుడు:—మాకు నష్టమని మాలో నెవరమన్నాము?

సుదర్శనః—అయ్యో' అదియేమి మాట! మాటపాటుగా నన్నానుగాని మీకు నష్టమని మీరన్నారని యన్నానా? నష్టములేదు. సరిగదా లాభము కూడ నుండవచ్చును. ఆ జీతేదాస్తిని గూర్చి మన మిట్లని చెప్పలేము. అతడు పదునాలేండ్లు వచ్చువఱకు సామాన్యుని వలెనుండి హఠాత్తుగా తన మహా వివేకమును వెల్లడించినవాడు. ఆ వెల్లడించుటమాత్ర మెవ్వరికి తెలియును? నాకు తెలియును. మా దొరకూతునకు తెలియును. అట్లే యతడు మరియేమి శక్తులు కల వాడో! వాని నెప్పుడు బహిరావిష్కారము చేయునో! కాక సామాన్యుడో! చెప్పితినిగదా! అతని సౌందర్యము మాత్రము లోకోత్తర మైనది. నేను పోయి విచారించి వత్తును. మీకేమి నష్టము? మరల నదేమాట యనుచున్నాను. మీకు నష్టములేదుగాని నాకు మాత్రము నష్టము. మొన్ననే పదిదినములు పోయినవి, మరల పది పదేను దిన ములు పోయినచో నాకు మీయ దటీ దయవలన వచ్చెడు రాబడి లోపించును.

అనగా నందఱును 'పోయి' రమ్మనిరి, యాలంబరియు 'సరే' యనెను.

సుదర్శన భట్టారకుడు తానచటనుండి శిథిలనగరమునకు బోయెను. వారికి కావలసిన సామగ్రియు, నదియు నందిచ్చెను. అతడు వారున్న యాశ్రమమునకు నాడు ప్రాతఃకాలమున బోయెను. జీతేదాస్తి యింటిలో లేడు. అత డేమైనాడని యాదుర్ధావడెను.

కార్తావీర్యుని కుమార్తె నవ్వుచు ''అంత భయపడవలసిన యవసరములేదు. నేనును తొలుత భయపడితిని. అతని తత్త్వజ్ఞాన సహిత మైన బుద్ధి హఠాత్తుగా మనకు నెట్లు గోచరించినదో యతని బలపరాక్రమములు కూడ నాకొకనాడు తెలిసినవి,'' అని జీతేదాస్తి భల్లూకమును మెడ విగించిపట్టి చంపుటను చెప్పెను. అతడన్న మాటలను

గూడ చెప్పెను. మైథిలీపురమునందలి క్షత్రియ కుమారులందఱు తన గుప్పిలిలోనికి రారనియు, వారన్నచో తాను భయపడుచుండుట లేదనియు నతడన్న సంగతి చెప్పెను.

సుదర్శనభట్టు బ్రహ్మానందపడెను. తాను జితేదాస్తి సంగతి తెలియకుండ క్రాంతిపుర క్షత్రియ సంఘముతో నతనియందేమి శక్తులు దాగియున్నవో యని వట్టి చమత్కారమునకు చెప్పిన మాటలు చాల వఱకు నిజమగుట భట్టారకున కానందము కలిగించెను.

భట్టారకుడామెతో క్రాంతిపురములోని విషయములన్నియు చెప్పెను. జితేదాస్తి వామదేవశాఖీయుడని నిరూపించుటకు చాల యాశ కలదనియు, తాను మైథిలీపురమునకు పోయి పదిచోట్ల కను గొనవలయుననియు, నంతవఱకు మీరిచ్చట భద్రముగా నుండుడనియు వామెతో చెప్పుచుండగా జితేదాస్తి వచ్చెను.

అతడు సుదర్శన భట్టారకుని జూచి తన మొగములోని విప్పును తగ్గించుకొనెను. నిడివిగా నిలిచియుండి నడచి వచ్చుచుండెడివాడు, కొంచెముగా భుజములందు వంగినట్లు నటించెను.

సుదర్శనుడు దీనిని గుర్తుపట్టెను. ఇట్లనెను: "ఓయీ, జితేదాస్తీ! నీవు మన యూరిలో మీ నాయన పోయినతరువాత పది యేండ్లయిన నుంటివికదా! ఎప్పుడైన మీ యింటికి పోయితివా? మీ తల్లిని చూచితివా? మీ నాయనమ్మ యున్నదా? నేనెప్పుడు నడుగ లేదు. మీ సంగతి నాకు తెలియదు."

జితేదాస్తి:—"మీ కెంత తెలియదో నాకు నంత తెలియదు. కార్తవీర్యార్జునులు నన్ను దొరవలె పెంచిరి, నేను మా యింటికి పోయినచో సామాన్యుడ నగుదును. దొరకు కోపము వచ్చునేమో! ఇతనిని గుఱించి మనమింత శ్రద్ధ తీసికొనుచుండగా వీని ప్రేమ తల్లి మీదనే యున్నదని యాయన యనుకొన్నచో నేను వడ్డించిన విస్తరిలో విసము నొలికించుకొనుటకదా!"

సుదర్శన:—మీ యమ్మ బ్రతికియున్నదా?

జితేదాస్తి:—నే నిచ్చటికి వచ్చి యెన్నాళ్ళయినది?

సుదర్శన:—పదు నెలలైనది.

జితేదార్ స్త్రీ:— అప్పటివఱకు బ్రతికియున్న దనుకొందును. లేనిచో నాకు వార్త వచ్చెడిదే కదా ?

సుదర్శనః—మీ నాయనమ్మ బ్రతికియున్నదా?

జితేదార్ స్త్రీః—ఆమె నేను పుట్టకముందే పోయినది.

సుదర్శన:—మీ తల్లి యెట్లు బ్రతుకుచున్నది?

జితేదార్ స్త్రీ:—ఇది బాగున్నది, నేనెట్లు బ్రతుకుచున్నాను? అపుడు దొర పెట్టగా బ్రతికితిని, ఇపుడు దొర కూతురు పెట్టుచున్నది.

సుదర్శన:—నీకామె పెట్టుటలేదయ్యా! మీ యిద్దఱికిని నేను పెట్టుచున్నాను.

అనగా జితేదార్ స్త్రీ నవ్వెను.

భట్టారకుడు "నవ్వెద వెందుల" కనెను.

జితేదార్ స్త్రీ యిట్లనెను:-"అయ్యా! నేను సుక్షత్రియుడనగుదునో కానో యెంతవఱకు వచ్చినది?"

సుదర్శనః—ఈమెతో నా సంగతి నీకు చెప్పవలదంటిని. ఏమి చెప్పినదా?

ఆమె:—స్వామీ! నేను చెప్పనేలేదు. అతడే గ్రహించెను. అత డన్నియు గ్రహించును, మనమే యతనిని గ్రహింపలేకున్నాము!

సుదర్శన:- ఇంకను తేలలేదు. మీ నాయనమ్మగారు బ్రతికి యున్నచో కొంత బాగుగా నుండెడిది, ఆమె లేదంటివి.

జితేదార్ స్త్రీ:- ఆమెను కనుగొనవలయుననియా? నా కొక్కటి తెలియును. చెప్పుదునా?

సుదర్శన:- చెప్పుము.

జితేదార్ స్త్రీ:- ఆమె బ్రతికియుండెడిది. ఆమె మనస్సులో నొక దుఃఖము పట్టినది. ఆమె దానితో చచ్చినది. నేనప్పుడు చిన్నవాడనే, కాని, ఇంటిలో జరిగెడి కథలు తెలిసికొనునంతటి మాత్రపు తెలివి నా కుండెడిది.

సుదర్శన:- ఆమెకు పట్టిన దిగులేమిటి?

జితేదార్ స్త్రీః- ఆమెకు తాను సుక్షత్రియవంశసంజాతనని యహంకారము గలదు, మా తాత కాడని ఆమె విశ్వాసము , మా తండ్రి పుట్టిన తరువాత నామె మా తాతతో సంసారము చేయలేదట! ఆ

దిగులుతో నామె చనిపోయినదట, ఒకటి రెండుసార్లు తాను నీచ కులస్థునితో సంసారము చేసి కొడుకును కంటినని నా తండ్రిని చంపుటకు గూడ ప్రయత్నించినదట.

సుదర్శన:— మరి మీ తాత యామెతో తాను సుక్షత్రియుడనని చెప్పలేదా?

జితేదాస్తి:- మా తాతగాని, తండ్రిగాని తాము క్షత్రియులమని చెప్పెడివారు కారు, మా తాత సంగతి నాకు తెలియదుగాని నా తండ్రి మాత్రము తాను క్షత్రియుడ ననెడివాడుకాడు. మేము రాచగొల్లల మనెడివాడు. నా తండ్రిలోకనీసము మృగయా నైపుణ్యమైన నుండెడిది, తాను రాచగొల్ల ననుకొన్నచో నష్టములేదు. నావద్దనదియు లేదుకదా! నేనందుచేత వట్టి గొల్లను.

సుదర్శనః- మరి మీ యమ్మ యున్నదికదా! ఆమె యే కులముది?

జితేదాస్తి:- నాకు తెలియదు. ఆమెయు తాను రాచగొల్లననెడిది, నా తండ్రి వివాహముగాని నా తాత వివాహముగాని యెప్పుడు జరిగినవో, యెట్లు జరిగినవో నాకు తెలియదు.

సుదర్శన:- ఏమియు లేదయ్యా! పూర్వము నీతో నే నేమియు చెప్పలేదు, నీవు బుద్ధావతారమ వనుకొంటిని. చెప్పి ప్రయోజనము లేదనుకొంటిని. ఇప్పుడు నీవు కల్క్యవతారమ వేమోనని సందేహముగానున్నది. నే నొక మహాకార్యములో నిమగ్నుడనై యున్నాను. మిమ్మిచ్చటికి తెచ్చిన నా ప్రయత్నము వేఱు, ఇప్పటి నా ప్రయత్నము వేఱు. నేను గడచిన మూడు నాల్గునెలలుగా క్రాంతిపురమునందుండుచున్నాను, అక్కడికి వెళ్ళినతర్వాత నా యూహాలన్నియు మారిపోయినవి పూర్వము నీవు సుక్షత్రియుడవని నిరూపించి నీకు నా దొరకూతు నిచ్చి పెండ్లిచేసి, యూరిలోని రాచకొడుకుల యాటలు కట్టించి, నా దొర సంసారమును, కుటుంబమును వంశమును నిలబెట్టుటయే నా యూహ. అప్పటి నా ప్రయత్నమంతయు దాని కొఱకే. ఇప్పుడు తత్ప్రియత్నము మీద మరియొక ప్రయత్న హేతువు లేచినది. అది తరువాత చెప్పెదను, మీ తాత యెవరు? ఆయన పెండ్లి యెట్లైనది? మీ తండ్రియొక్క పెండ్లి యెట్లయినది? మీ కుటుంబము మైథిలీపుర మెప్పుడు వచ్చినది? ఈ సంగతులు నాకు తెలియవలయును.

జితేదా స్తి:- శ్రీరామచంద్రుడు కౌసల్యా గర్భమునందు పడి నాడు. ఆ గర్భములో నున్న పిండము వద్దకు పోయి 'ఓయీ! శిశువా! నీ విక్ష్వాకువంశమునం దుదయింపబోవుచున్నావు. ఈ వంశము యొక్క కథయంతయు నీకు తెలియునా?' యని యడిగి నట్లున్నది.

సుదర్శన:-అందులో తప్పేమియు లేదే. ఆ గర్భస్థపిండమునందు నారాయణు డున్నాడు. ఆయనకు నిస్సంశయముగా నన్నియు తెలి యును, చెప్పెడివాడు.

జితేదా స్తి:- పోయి యడుగుము.

సుదర్శన:- నేనటువంటి పనియే చేయుచున్నాను.

జితేదా స్తి:- నేను దొరవద్ద పెరుగుచున్నను, దొర వద్దకు కొందఱు వచ్చుచుండెడివారు, ఎప్పుడో నూటికి, కోటికి వచ్చు చుండెడివారు వారిని దొర యెఱుగడు. అందులో నొకడు ప్రత్యేకముగా నన్ను చూచుటకు వచ్చెడివాడు. నాతో మాటాడెడి వాడు కాడు. దొరతో నతడు మాటాడెడిదేమియు లేదు. దొరకు దండము పెట్టి దొర నీ వెవ్వరవని యడుగగా, దొరను చూచిపోవుద మని వచ్చితినని చెప్పి నావంక నిదానించి చూచి వెళ్లెడివాడు. మొదట నాకు తెలియలేదు, మూడవసారి తెలిసెను, ఇతడు నాకొఱకు వచ్చుచున్నాడని. నాకెందుకో అతడెవరో తెలిసికొనవలెననిపించినది. అతడు మిక్కిలి వృద్ధు. అతనికి నూటయిరువదియేండ్ల వయస్సునకు తక్కువ యుండదు. రెపట. ఇనుపచువ్వ. మిక్కిలి పొట్టివాడు. ఆట వికుడు 'నీ పేరేమి?' యని యడిగితిని, అతని పేరు ఫోకో. మైథిలీ పురమునకు నాల్గు యోజనముల దూరమున పెద్ద యడవి యున్నది కదా! ఆ యడవిలోననే భల్లూకము దొరమీద పడినది. నా తండ్రి దొర కొఱకు తన ప్రాణము లొడ్డినాడు. ఆ యడవికి మరల దక్షిణమున నాలుగు యోజనములు జనపదము లున్నవి. అచట మరల నడవు లున్నవి. ఫోకో ఆ యడవులలోను నుండును. అచ్చటనొకచోట నొక శిథిలమైన దేవాలయము. అది పూర్వమెప్పుడో గొప్ప స్థితి ననుభ వించినదట. దానిప్రక్క పుష్కరిణి దానిప్రక్క చిన్న బోయెపల్లె. అత డందులో నుండును. అచ్చటనుండి మైథిలీపురమునకు వచ్చుటకు

విరామము లేకుండ దివారాత్రములు నడచినచో నీ వాటవికుడవైనచో థోకోవంటి గాలిబొమ్మవైనచో పదునేను దినములు పట్టవచ్చును. అతనిని పోయి కనుగొనగలవా? మా తాత సంగతి వానికి బాగుగా తెలియును. నా తండ్రి పెండ్లి చేసినది కూడ నతడే! ఇంక నీ యిష్టము.

సుదర్శన:- అతడు మరల నెప్పుడైన వచ్చునా?

జితేదాస్తి:- నాకేమి తెలియును? ఏడు నెలలనుండి యిచ్చట నుంటిని. ఈలోపుగా మైథిలీపుర మెప్పుడైన వచ్చెనేమో! మరల నన్ను చూచుటకు వచ్చియుండును. నేనచ్చట లేనుకదా: నిరాశపడి తిరిగిపోయి యుండును.

సుదర్శన:- ఈ సంగతి మున్ను నాకేల నీవు చెప్పలేదు?

జితేదాస్తి:- నేను కల్క్యావతారమను గాన చెప్పలేదు.

సుదర్శన:- నన్నచ్చటికి తీసికొని పోగలవా?

జితేదాస్తి:- ఆదారి నాకు మాత్రము తెలియునా? మరి మన మిద్దఱమును పోయినచో నీమెయేమి కావలయును? ఈమెను మైథిలీపురములో దించుదమా? పది తోడేళ్ల నడుమ ఒక యాడ లేడిని వదలిపెట్టినట్లే."

ఆమె:- "నేనాడలేడిని కాను ఆడపులిని"

జితేదాస్తి:- వారు తోడేళ్లుకారు. మగసింగములు-నడుమ నున్న యొక్క యాడుపులి యేమి చేయును?

సుదర్శన:- మీ తాత పేరు బలదేవుడు. ఆయన తన పేరును ఫాలాక్షుడని మార్చికొనెను. వారిద్దఱన్నదమ్ములు. అన్న పేరు త్రినేత్రుడు. వీరిద్దఱు గంధగిరి గ్రామముననున్న భాస్కరదేవవర్మ కుమారులు. భాస్కరదేవుడు మహాయోధుడు. అంశువర్మ మహారాజు ముమ్మనుమడైన నందదేవ మహారాజునకు యుద్ధములలో తోడు నీడై నిలిచినవాడు. త్రినేత్రుడు తల్లితో తమ్మునితో జ్వాలాపురము వచ్చెను. మీ తాత బలదేవుడు. చాల చిత్రమైనమానిసి. అతనికి నన్నగారికి నడుమ నలుబదియేండ్ల తారతమ్యమున్నది. ఈ బలదేవుడు లేచిపోయెను.

జితేదాస్తి:- లేచి యడవులలోనికి పోయి యుండును. థోకోతో కలిసి యుండును. థోకో మా తాత యొక్క సర్వమైన యాను

పానులు తెలిసినవాడు కావలెను. థోకో మా తాతకు పెండ్లి చేసి యుండవలెను. మా నాయన పెండ్లి కూడ థోకోయే చేసి యుండు నేమో! థోకోను కలిసికొనిచో నివియేమియు తేలవు.

సుదర్శ:- థోకో యాటవికుడు. వాడు చెప్పినమాట మైథిలీ పురములో ప్రమాణమా?

జితేదాస్తి:— నేను బ్రతికియున్నాను కదా! కనిపించు చున్నాను కదా!—

సుదర్శన భట్టారకుడు నవ్వెను.

మరల జితేదాస్తి యిట్లనెను:- థోకో చెప్పిన మాటలు మైథిలీ పుర క్షత్రియులు వినరు, క్రాంతిపుర క్షత్రియులు విందురా?

సుదర్శన:- విందు రనుకొందును.

జితేదాస్తి:- విన్నచో సరిపోవును. క్రాంతిపుర క్షత్రియులు ధనవంతులు. పలుకుబడి కలవారు. శూరులు. నలుగురు మైథిలీపురము వచ్చి మేము తమ వంశీయులమని చెప్పి మాయాతిథ్యము గైకొని నచో మైథిలీపుర క్షత్రియు లంగీకరింతురు.

సుదర్శన:— మరి థోకోను కలిసికొనుట యెట్లు?

జితేదాస్తి :- రెండే మార్గములు. ఒకటి మనమచటికి పోవల యును. రెండవది మైథిలీపురము పోవుదము. మనమచట నుండగ థోకో యెప్పుడైన మరల వచ్చినచో వానితో మరల మాటాడ వచ్చును.

సుదర్శన:- ఇంత వ్యవధి యున్నదా?

జితేదాస్తి :— ఒక ప్రయత్నమున కవధియని యుండునా?

సుదర్శన:- నీవింత యాలోచనాపరుడవు, ఇంత పండితుడవు నెట్లయితివి? ఇంతటి శూరుడ వెట్లయితివి? నా కేమియు తెలియుట లేదు.

జితేదాస్తి:- లోకములో నెవ్వరును ప్రత్యక్షమైన దానిని సందేహించరు. కొడుకునకు తండ్రి పెద్దయాస్తి నప్పగించెను. నా తండ్రి దీనినెట్లు సంపాదించెనని వాడు విచారించుచు కూర్చుండునా? రానే వచ్చినది కదా! యని యనుభవించును.

సుదర్శన:- మనమిద్దఱము థోకో కొఱకు పోయినచో దొర కూతురేమగును?

జితేదా స్తి:— మైథిలీపురమున విడిచి పోదము.

సుదర్శన:- ఆమె నట నూరిలోని క్షత్రియ కుమారులు భద్రముగా నుంతురా'

జితేదా స్తి:-కార్తవీర్యార్జునులవారి కోటచుట్టును నా కత్తి పెట్టి గిరి గీసెదను. లోనికి వెళ్ళినవానిని నేను తిరిగి వచ్చిన తరువాత గిరి మీద పెట్టి నఱకెదను.

సుదర్శనభట్టు నివ్వెఱపోయెను: "ఏమిది! ఏమిది! నీవెవరవు? మీ రిచ్చటనే యుండుడు, నేనొక్కడను ఫోకోకొఱకు పోయెదను. నేను ఫోకోను తీసికొని వచ్చెదను. మీ తాత సుక్షత్రియుడని రుజువు పరచెదను. ఓయి! జితేదా స్తీ! నీవెవరవు! నీవెవరవు?"

అని సుదర్శన భట్టారకుడు భయపడిన వానివలె నచటినుండి వెడలిపోవుటకు లేచెను.

జితేదా స్తి యతని కడ్డముపోయి యిట్లనెను: "అయ్యా! భట్టారకా! నేనింతవఱకు మిమ్మెప్పుడును గౌరవించి మాటాడలేదు. ఇపుడు గౌరవించి మాటాడుచున్నాను. ఇంతవఱకు మీరు నడపిన కథ ఇంక నేను నడపెడి కథ. ఈమెను మైథిలీపురమున దించుదము. మనము పోవుదము."

ఆమె:-నేను రాను. నా కిచ్చట పనియున్నది. నేడు శుక్లపక్ష నవమి, రేపు శిథిలనగరమున రాజాంతఃపుర ప్రదేశమునకు పోయి చూడవలెను, నాకు పదిదినములవఱకు తీరికలేదు.

జితేదా స్తి:-ఆ పదిదినములైన తరువాతనే పోవుదము.

సుదర్శన:—మీ యిద్దటి వ్యవహారము నాకు తెలియుట లేదు.

జితేదా స్తి:—ఈమె వ్యవహారమును నాకు తెలియుటలేదు.

సుదర్శన:-ఓయి! జితేదా స్తీ! మనము మైథిలీపురము పోవుదము. హఠాత్తుగా నిన్నింత వీరునిగా, నిన్నింత పండితునిగా నచటివారు తెలిసికొన్నచో వారేమనుకొందురు?

జితేదా స్తి:-ఈ యేడునెలలలో నేను చదువుకొంటి ననుకొందురు. నేను కత్తివిద్య నేర్చితి ననుకొందురు.

ఆమె:-మీ రిద్దరు పొండు. ఈ పదిదినములు నేనిచ్చటనుండి తరువాత వత్తును.

జితేదాస్తి:-బాగుగనే యున్నది. ఇక్కడ నే భయము నాకు కన్పించుటలేదు. ఆమె నన్ను రక్షించుచున్నదిగాని నేనామెను రక్షించుటలేదు, తాను మరొకరిని రక్షించవలసిన బాధ్యత లేనప్పుడు మరియు సుఖముగా నుండవచ్చును కదా!

ఆమె:-నాకు భయములేదుగాని నేనొక్కర్తె నిక్కడనుండను.

జితేదాస్తి:-అయినచో సుదర్శన భట్టారకు లిందుందురు. నేను పోయి ఫోకోను తీసికొనివత్తును.

ఆమె:-నేనును నీవును మాత్రమే యుండవలయును. గురువుగారు మైథిలీపురము పోవుదురు. ఫోకో రాకపోవునా? వచ్చినచో వారే కలిసికొందురు.

జితేదాస్తి:-నా యుద్దేశ్యములో ఈ శిథిలనగరస్థరాజాంతః పురమును నేడే చూడవలయునని యేమున్నది! తరువాత నెదుకు చూడరాదు? నాకు నేను సుక్షత్రియవంశ్యుడనని నిరూపించుకొనుట చాల ప్రియమైన విషయముకదా! నీకు శిథిలనగరాంతఃపుర దర్శనము వట్టి వినోదము, నాకు ప్రాణాపనోదము, నేను నీతండ్రికి దాసుడను. నీకును దాసుడను. నీవెట్లు చెప్పినచో నట్లు నడువలసినవాడను.

ఆమె:-నీవు సుక్షత్రియుడవైనను, కాకపోయినను నాకభ్యంతరములేదు. నీ వంగీకరించినను, అంగీకరించకపోయినను నేను నీ భార్యను. ఆ సంగతి నీకు తెలియును. సుదర్శన భట్టారకు డాశ్చర్యపోయిన యాశ్చర్యపోనిమ్ము. మన రెండు కత్తులున్నవి. నాకిప్పుడు భయములేదు. మైథిలీపురము పోవుదము. నీవన్నట్లు శిథిలాంతఃపురము తరువాత చూడవచ్చును.

జితేదాస్తి:-కాదు, కాదు తొందరలేదు. పదిసంవత్సరములు గడచినచో లేదుగాని, పదిదినములలో వచ్చినదా?

"కాదు, కాదు, తరువాతనే చూతము" అని ఆమె యనెను.

జితేదాస్తి:-కాదు, కాదు, రేపే వెళ్ళుదము. ఈ పదిదినములు చూతము. పదిదినములు చూడనక్కరలేదు. రేపొక్కనాడు వెళ్ళినచో చాలును, రేపు కాలాభట్టుతో మాటాడుదము. భట్టారకులు కూడ మనతో నుందురు. అంతఃపురములోనికి పోవుట తరువాత చేయవచ్చును. నీవొకర్తుకవు పోవచ్చును. నీకు భయములేదుగాని వెంట

నెవరినైనను తీసికొని రావచ్చును. శుక్లపక్షమును చూచియే వత్తువు గాని యప్పుడు దశమి వదలిపెట్టి యేకాదశినాడు రావచ్చును. ఒక నాటిపని రేపు ముగియుచున్నదికదా!

భట్టారకుడు:-ఓయి! జితేదాస్త్రీ' ఇప్పుడు నీవు మాటాడిన మాటలలో నా కర్థమేమియు నగుపడుటలేదు. ఇంతాకటి మాటలు మిక్కిలి వివేకమును వెలిబుచ్చుచున్నవి. ఈమాటలు వెఱ్ఱి వాడు మాటాడినట్లున్నవి. నాకు పొసగుట లేదు.

జితేదాస్త్రీ:- మనసులో నాకు మాత్రము పొసగుచున్నవా? ఇచట రెండు విషయములున్నవి. ఒకటి నా విషయము. రెండవది కాలాభట్టు విషయము.

సుదర్శన:- కాలాభట్టెవరు?

జితేదాస్త్రీ:- ఎవరో తెలిసికొనుటకే రేపిచ్చట నుండునది.

సుదర్శనః- అతనిమాట తరువాత చూచి కొనవచ్చును. మనము మైథిలీపురము పోవుదము

జితేదాస్త్రీ:- కాదయ్యా! కాదు' ఆ జీవుడు బాధపడు చున్నాడు. వానికి మీరేదైన యుపకారము చేసి పెట్టవలయును. అది యొకనాటితో జరుగునది కాదు. మీరు దయతో చేసినచో నాలుగైదేండ్లు చేయవలసిన పని.

జితేదాస్త్రియన్న మాటలు వారిద్దరికి నర్థముకాలేదు.

జితేదాస్త్రి మరలనన్నాడు! రేపు రాత్రి కాలాభట్టును కలిసి కొందము. ఎల్లుండి మైథిలీపురము పోదము. థోకో నాతో చెప్పి నాడు. ఇది యే మాసము? పుష్యమాసము. పుష్యమాసములో శుక్ల పక్షత్రయోదశి నాటికి తాను మైథిలీపురము మరల వత్తునన్నాడు. అతనిని మీకప్పజెప్పెదను. ఏమందురు?

వారిద్దరు నంగీకరించిరి.

ఆమె యిట్లనెను:-ఈ యాత్రమములో నా గదిలో నీవు నేనెడ మెడముగా పండుకొనుటకే స్థలము చాలదు. గురువుగారెచ్చట పండు కొందురు? పైగా, వారి వంట వారే చేసికొనవలయును.

జితేదాస్త్రీ:- మనకు వంట యిల్లున్నది. గది యున్నది. వారు వంట యింటిలో పండుకొందురు.

సుదర్శన:- ఇచటికి యోజనార్ధములో నొక గ్రామమున్నది. నేనచటికి పోదును. రేపు ప్రొద్దుక్రుంకువేళకు వత్తును. నా సమస్య లేదు.

జితేదాస్తి యామెను జూచి నవ్వెను. సుదర్శన భట్టారకుడు వారిద్ద ఱిదివరకే భార్యాభర్తలేమో యనుకొనెను.

ఆనాటి రాత్రి ఆమెయు జితేదాస్తియు యథాప్రకారముగా బండుకొనిరి. దీపము వెలుగుచున్నది. జితేదాస్తి నిదురపోవు చుండెను ఆమె యతనిని తట్టి లేపినది. అతడు లేచి యెందుకు లేచితి వని యడిగెను.

ఆమె:-నీకెట్లు నిదురపట్టుచున్నది ?

అతడు:- నీవు నన్ను రక్షించెడిదానవున్నావు కదా! నేను నిర్భయముగా నిదురించు చున్నాను.

ఆమె:- గురువుగారున్నచో నాయన వంటయింటిలో నిదురించుట యేమి? మన మిచ్చట నిదురించుట యేమి? నీవు నాయనయు నిచ్చట నిదురించెడివారు. నేను వంటయింటిలో నిదురించెడిదానను.

జితేదాస్తి:- అప్పుడు నీవు వచ్చి నన్ను మేల్కొల్పుట బాగుగా నుండదు. ఆయన యేమైన ననుకొనెడివాడు,

ఆమె:- అనుకొనునది యింందాకనే యనుకొన్నాడు. నీవు సుక్షత్రియుడవని నీకు తెలియునుకదా! ఎందుకు దాచితివి?

జితేదాస్తి:- మనకు తెలిసినది మనకు తెలిసిన మాత్రముతో చాలదు. పరులకు కూడ తెలియవలయును. అప్పుడు మనకు తెలిసినది పరిగణింపునకు వచ్చును.

ఆమె:- అంతవఱకది రహస్యముగా నుండును.

జితేదాస్తి:- ఇందులో కొంత రహస్య మెందులకు, కొంత బట్ట బయలెందులకు?

ఆమె:- రహస్యము మనకొఱకు; బట్టబయలు పరులకొఱకు.

జితేదాస్తి:- మన రహస్యము మనకు తెలియునుగదా!

ఆమె:- మన నడుమ రహస్యమేమియున్నది? మన మిద్దఱము ఎప్పుడును భార్యా-భర్తలమే!

జితేదాస్తి:- మన మెప్పుడు పెండ్లి యాడితిమి?

ఆమె:- గాంధర్వవివాహమని యొకటున్నది, అది మనకు జరిగినది.

జితేదాస్తి:- రాక్షస వివాహమని మఱియొకటున్నది.

ఆమె:- అది పురుషులవలన జరుగును.

జితేదాస్తి:- రెండును పురుషులవలననే జరుగును.

ఆమె:- అనగా మనకు వివాహము జరుగలేదన్న మాట?

జితేదాస్తి:- అదియో, యిదియో నేను జరుపవలెను.

ఆమె:- నీవు నా తండ్రి కోటచుట్టు గిరి గీసెదవా? ఆ గిరి దాటినవాని నచ్చట నఱుకుదువా? నీవు కత్తి పుచ్చుకొనుట నేనెన్నడు నెఱుగను.

జితేదాస్తి:- మీ తండ్రి యాయుధములు దొంగిలించినది నేను. అనుమానము వచ్చినది నీ మీద. ఇప్పుడే వివాహము చేసికొమ్మందువు?

ఆమె:— రాక్షసము చేసికొమ్ము. నీవు రాక్షసుడవేమో?

జితేదాస్తి:- నేను రాక్షసుడను గాను, గంధర్వుడను. నీ కొక రహస్యము చెప్పుదును. నీవు నా భార్యవనినచో చెప్పుదును రహస్యములు పరస్త్రీలతో చెప్పరాదు.

ఆమె:- చెప్పినచో వెంటనే స్వస్త్రీ యగునేమో?

జితేదాస్తి:- చెప్పకముందే యైనదేమో!

ఆమె:- అయినచో చెప్పుము.

జితేదాస్తి:- విక్రమార్కచక్రవర్తి పేరు విన్నావా?

ఆమె:- నేను కాళిదాసత్రయమును చదివినాను.

జితేదాస్తి:- ఒక దానిలో యక్షుడున్నాడు, గంధర్వుడు లేడే? పోనీ విక్రమార్కు డొక గంధర్వుడు. అతడు శివుని యాజ్ఞవలన భారతదేశమునందు ధర్మమును స్థాపించుటకు మ్లేచ్ఛులను వధించుటకు విక్రమార్కచక్రవర్తిగా నుదయించినాడు. ఆయనకు తాను గంధర్వుడనని తెలియదు.

ఆమె:- ఆయన యక్షుడే! అందుకనియే కాళిదాసు మేఘసందేశమున యక్షుని గూర్చి వ్రాసినాడు . అది విక్రమార్కుని కథయే!

జితేదాస్తి:- యక్షులకు, గంధర్వుల కెక్కువ భేదములేదు. సూర్యవంశక్షత్రియులు చంద్రవంశక్షత్రియులవలె. నేను గంధర్వుడనని నాకు తెలియును. నాకు పూర్వజన్మ స్మృతి గలదు. ఇది నా రహస్యము.

ఆమె:- ఇది యందఱకు తెలిసినచో తప్పేమి ?

జితేదాస్తి:-అందుకనియే స్త్రీలు రహస్యము దాచలేరందురు

ఆమె:- నేను తప్పేమియని యడిగితిని?

జితేదాస్తి:- మనము భార్యాభర్తలమని తెలిసినచో తప్పేమి?

ఆమె:- మనమింతవఱకు కాదుగదా!

జితేదాస్తి:- ఎంతవఱకు?

అతడు తరువాత నామెను చాల ప్రొద్దుపోవువఱకు నడుమ నడుమ నాగి యాగి యింతవఱకు చాలునా? ఇంతవఱకు చాలునా? అనుచు నడిగి యడిగి...యిద్దఱు సొమ్మసిల్లి నిదురపోయిరి.

# 12

శిథిలానగరరాంతఃపురద్వారమున కాలాభట్టును, వారు ముువ్వురును నిలుచుండిరి.

ఆమె:- అయ్యా! వచ్చితిమి, ఇతరులు లోనికి పోవచ్చునా?

కాలాభట్టు:- ఇతరు లెప్పుడును పోవుటకు వీలులేదు.

ఆమె:- మే మితరులమా?

కాలాభట్టు:- ఈయన సుదర్శన భట్టారకుడా? నీ భర్త పేరేమి?

ఆమె:- ఎన్నిసార్లు చెప్పితిని? ఆయన పేరు జితేదాస్తి.

కాలాభట్టు:- నీవు కథలో కలిపి చెప్పితివిగాని యితడు జితేదాస్తి యని నిజముగా నొక్కసారి గూడ చెప్పలేదు. "ఏమయ్యా! జితేదాస్తి! నేను భూతమనంటివిట కదా! భూతము మానవునిపై బడి పీకికొని తినును.

జితేదాస్తి:- నీవు మా ప్రాణము తీసినావు. మమ్ము లోనికి పోనీయలేదు.

కాలాభట్టు:- నేను భూతమనని నీకెట్లు తెలియును?

జితేదాస్త్రి:- నీవు భూతమవని తొలుత నీవంగీకరించినచో నప్పుడు నీయీ ప్రశ్నకి యర్థమున్నది. నీకు ప్రతిదియు ప్రత్యక్షముగా చెప్పవలయునుగదా!

కాలాభట్టు:- అప్పుడు నీవొక్కడివే వచ్చితివి, మీ రిద్దరే వచ్చితిరి. ఇప్పుడు సుదర్శన భట్టారకుని కూడ తెచ్చిరి, సుదర్శనభట్టారకా! నిన్ను నేనొకటి యడిగెదను, దాచకుండ చెప్పుదువా?

భట్టారకుడు:- ఈ కలయిక నా కర్థమగుటలేదు. నీవు భూతమ నగుట యేమి? వీరు నిర్భయముగా నీ వద్దకు వచ్చుటయేమి? నా రహస్యము నీకునెట్లు తెలియును? నేను ధైర్యశాలినే యగుదును. నీవు భూతమవని తెలిసినతరువాత నాకు భయము వేయుచున్నది.

కాలాభట్టు:- నేను వారిని తినలేదు. నిన్ను తినలేదు.

సుదర్శన:- వారిని నీవు తినలేవు. వారు క్షత్రియులు. నన్ను తినవచ్చును. నేను బ్రాహ్మణుడను.

కాలాభట్టు:- నేనును బ్రాహ్మణుడను, బ్రాహ్మణులను తినను.

సుదర్శన:- నన్నేదో యడిగెదనంటివికదా? యడుగుము.

కాలాభట్టు:- నీవద్ద నొక మంత్రమున్నది.

సుదర్శన:- నాకెప్పుడు కనబడలేదు.

కాలాభట్టు:- నీవు దానిని చూడవలయుననుకొనలేదు. నీ తండ్రి నీ చిన్ననాడు నీకు దాని నుపదేశించెను. ఒకసారి యుపదేశము నను పొందిన మన్త్రమును త్యజించినచో దారిద్ర్యము సంఘటిల్లును కావున నీవుదానినిత్యజించలేదు. ప్రతిదినము పదిసార్లు జపింతువు. దానిశక్తి నీకు తెలియదు.

సుదర్శన:- ఓహో ఆ మంత్రమా! దాని శక్తియేమి?

కాలాభట్టు:- దానిని కోటి పర్యాయములు జపించినచో జపించి తత్ఫలము నిన్నెవడైన నడిగినచో వానికి ధారాదత్తము చేసినచో వానికి బ్రహ్మరక్షస్త్వము తొలగును.

సుదర్శన:- నాకు విశ్వాసములేదు. నాకు తీరికలేదు.

కాలాభట్టు:- నీకు పది దినముల తరువాతనుండి తీరికయే! నాటినుండి సర్వమును జితేదాస్త్రియే చూచికొనును. నీవు నాకి

యుపకారమును చేసిపెట్టుము. నాపేరు కాలాభట్టు. మాది అయాస్య గోత్రము. అయాస్యుడని యొక ఋషి. నిత్యము నా గోత్రమును నా పేరును చెప్పి నీవు దినమునకు పదివేలయిన తక్కువకాకుండ జపముచేసిన కోటిపూర్తయిన తరువాత నిచ్చటికి వచ్చి తత్ఫలము నాకు ధారాదత్తముచేసినచో నాకీ బ్రహ్మరక్షస్త్వము తొలగి పోవును. నేను దీనిని ప్రార్థించుచున్నాను.

సుదర్శన:-నాకు, నా దొర సంసారమును బాగుచేయవల యును. అది ప్రధానము.

కాలాభట్టు:-అయ్యా అదియైనను దీనిమీదనే యాధారపడి యున్నది. నా బ్రహ్మరక్షస్త్వము పోయినగాని మీ జితేదాస్తికి పట్ట వలసిన దశ పట్టదు.

సుదర్శన:- నా దొర సంసారమునకు జితేదాస్తికి సంబంధము లేదు.

కాలాభట్టు:- నీ దొర కొక కొడుకున్నాడు ఈమె చెప్పినది అతడెందుకును పనికిరాని వాడని. అతనినొక బ్రహ్మరాక్షసుడు పట్టి నాడు. వాడు నేనే!

సుదర్శన:- నిన్ను నాశనము చేసెదను.

కాలాభట్టు:- అదియే నేనడుగుచున్నాను. నీవు నా యీ భూతత్వమును నశింపజేసినచో నీ దొర కొడుకు బాగుపడును. మరల నతడు కార్తవీర్యుడు మృగయావ్యసని కానప్పటి స్థితినిపొందును.

ఆమె:- నాకిన్నాళ్ళు నీవేల చెప్పలేదు? మేము మా యన్న కేదియైన చికిత్స చేయించుకొనియుండెడివారము.

కాలాభట్టు:- మీ యన్నను నేనేమి చేసితిని? వట్టి యెద్దుమొద్దు స్వరూపమును చేసితిని. అతని కే బాధయును లేదు. అతనినొక భూత మావహించినదని కూడ నెవ్వరికిని తెలియదు. నాకు ప్రయోజన మున్నది. అది యిట్లు యీనాటికి పొసగవలసియున్నది.

ఆమె:- పదునెన్మిదేండ్లు మా యన్న వ్యర్థుడుగా నుండలేదా?

కాలాభట్టు:- నేనీ పదునెన్మిదేండ్లు గూడ బ్రహ్మరక్షస్సుగా నుండలేదా? పదునెన్మిదేండ్లు జితేదాస్తి వ్యర్థుడుగా నుండలేదా? ఇది

యంతయు నొక సంపుటి. నీవు, మీయన్న. జితేదా స్తి - ఈ శిథిల నగరము - సుదర్శన భట్టారకుడు — మనమందఱ మొక పూర్వజన్మ కృత విచిత్ర కర్మవ్యూహాలగ్నమైన సంపుటిలో నున్నాము. ఈ జితే దా స్తి గంధర్వుడు. అతని కిప్పటికిగాని నిష్కృతిలేదు. ఇతడును మీ యన్నవలెనే బుద్ధునివలె నున్నాడు. కర్మపరిపాకమగుచున్నకొలది తానెవ్వడో క్రమక్రమముగా తెలియజేసికొన్నాడు. అతడు కడచిన రాత్రి తన సర్వరహస్యమును నీతో చెప్పినాడు. మీరిద్దరు నిజముగా భార్యాభర్తలెరి.

ఆమె:— బ్రాహ్మణులకు లౌకికము తెలియదు.

కాలాభట్టు:— అందులో దయ్యము' ఓయీ, సుదర్శన భట్టారకా! మా యీ కర్మసంపుటి యొక్క నిష్కృతియన్న నాటకములో కడచిన రెండు మూడేండ్లు నీ పాత్ర యొక్క ప్రయోజనము తక్కువ. ఇకముందుకూడ తక్కువయే నాకెప్పుడు బ్రహ్మరక్షస్త్వము వదలునో అప్పుడు జితేదా స్తికి ప్రభులక్షణము పట్టును. నాకు వాగ్దాన మిమ్ము మీరు రేపు మిథిలా పురమునకు పొండు. ఈమె రెండు మూడేండ్లు గడచిన తరువాత ఇచ్చటికి వచ్చును. లోనికి పోవచ్చును. తన కథయంతయు నాకు చెప్పినది. ఈలోపల 'యీామె పేరుగల స్త్రీ మరియొక్కర్తుక యున్నది. ఆమె కథయంతయు నీమెతో చెప్పును. అప్పుడందఱకు శాపావసాన మగును. కర్మపరిపక్వ మగును.

సుదర్శన:— వాగ్దానము చేయుచున్నానయ్యా! చేయు చున్నాను. నీవింత ముడి పెట్టినప్పుడు కాదనుట యెట్లు?

కాలాభట్టు:- నేను పెట్టలేదు. భగవంతుడు పెట్టినాడు. సృష్టిలో నేది యెట్లు జరుగునో యది యట్లు జరుగును. నావంటివారు చెప్పినప్పుడు విడ్డూరముగా నుండును.చెప్పకపోయిన నట్లే జరుగును. చెప్పినచో విడ్డూరము చెప్పకపోయినచో జరిగినది, విశేషములేదు. ఏమి లోకము? రేపు మీరు మైథిలీపురము పొండు. ఇంతే!

అంతట కాలాభట్టు కనిపించలేదు.

మరునాడు వారు ముప్వురును మైథిలీపురమునకు బయలు దేఱిరి. భట్టారకుడు వారితో కలిసి రానసెను. తాను తరువాత వత్తు ననెను.

ఆమె:- స్వామీ! మీరు మాతో వచ్చినచో మాకు గొంత రక్షగా నుండునుగదా!

భట్టారకుడు:- మీకు రక్షయేగాని నాకు శిక్ష. నేనీ పథకము వెనుకనుంటినని వారు నామీద కత్తి దూయుదురు.

జితేదాస్తి మాటాడకుండ నడచుచుండెను.

ఆమె:- ఈ జితేదాస్తి మరల మౌనవ్రతమూనునేమో! కథ అట్లున్నది.

జితేదాస్తి నవ్వెను.

ఆమె:- యంతవఱకు నయమే!

జితేదాస్తి:- పూర్వము నీవు ముందు నడువగా నేను వెనుక నడిచితిని. ఇప్పుడు నేను ముందు నడుచుచుంటినిగదా నీకేమి భయము?

జితేదాస్తియు, దొరకూతురును మైథిలీపురము పట్టపగలు జామెక్కి వారి కోటకు వెనుకనుండి యెవ్వరు చూడకుండ పోగల్గిన మార్గమున్నను, గ్రామము చివరనుండి నట్టనడివీథిలో నడచుచు పో సాగిరి. వారిని కొంద ఱెఱుగుదురు. కొంద ఱెఱుగరు దొరకూతును చాలమంది యెఱుగరు. జితేదాస్తిని కొంతమంది యెఱుగుదురు. ఏమి యెఱుగుదురు? అతడందగాడని చెప్పుకొనగా నతని యంద మెట్టిదో చూడవలయుననిపోయి చూచినవా రెఱుగుదురు. ఒకడంద గాడని పోయి యెంతమంది చూతురు? ఒకానొక సౌందర్యపిపాసకల వారు పోయి చూతురు. అదికూడ భావుకత్వలక్షణములలో నొకటియే యని చెప్పవచ్చును. కాని, యూరిలో మాత్రము వారిద్దరును లేచి పోయిరన్న యపనింద యున్నది. ఎవడో యెఱిగినవాడు 'అదుగో, దొరకూతురు! అతడే గాలి కొడుకు'! ఇద్దఱు లేచిపోయిరి. ఇప్పుడు తిరిగివచ్చుచున్నా' రనగా జన మొద్దువిఱిగి చూడ నారంభించిరి.

అది పెద్ద వీథి. వీరు నెమ్మదిగా నడచుచుండిరి. ఈ మాట మిక్కిలి తొందఱగా క్షత్రియకుటుంబములలో, రాచకుమారులలో వ్యాపించెను అందఱు కోపముతో కత్తులతో, కటారులతో వచ్చిరి. వచ్చినవారు నిలుచుండి చూచుచుండిరి. వచ్చెదునప్పుడు పెద్ద పెద్ద యూహాలతో వచ్చిరి. ఆమెను నడివీథిలో నిలబెట్టి, పరాభవించి

కోటకు పంపవలయునని; జితేదాస్తిని నిలువున నట్టనడితెలువులో నఱుకవలయునని వచ్చిరి. మైథిలీపురము ప్రవేశించినంతనే ఆమె ముందు నడువనారంభించెను. ఆమె తన కోకను కాసెపోసికట్టి చేతిలో ఖడ్గముతో నడచుచుండెను. ఇదియేమి? తక్కినదెట్లున్నను ముందొక డామెక త్తికి బలి కావలయునుగదా!ఆమె క త్తియుద్ధమును నేర్చినదా? తండ్రి నేర్పెను కాబోలు. వారిత్రోవ కెవ్వరు నడ్డము రాలేదు.

వారు నడచుచునే పోవుచుండిరి. కొంతదూరము సాగువఱకు వారిలో వారేమి కూడబలికికొనిరో వెనుకనున్న జితేదాస్తిని వెనుకనే తొలగింతుమనుకొనిరో! నలువురైదుగురు జితేదాస్తిని చుట్టివచ్చుచున్నటుల కన్పించినది. జితేదాస్తి గ్రహించెను. అతని నడుమునకు పట్టాక త్తి బిగించియుండెను. దానిని నదలించి యాకాశమున ఝళిపించెను. ఆ ఝళిపించుటలో వాని చంక్రమణము వాని క త్తి యాకాశమునందు క్రమ్మిన క్రమ్మిక చూడగా చుట్టివచ్చెడివారి ధైర్యము తగ్గిపోయినది.

వీడెవడు! జితేదాస్తియా! బుద్ధస్వరూపమా! ఏడునెలలలో నింత వాడెట్లయినాడు. వీడు గొల్లవాడు. వీనిని లేవదీసికొని యీమెయేపోయెను. వానికి గత్తివిద్య నేర్పినదా? వీరు కోటకు పోదురా? ఇంక నా కోటకు మనకు సంబంధములేదు. తల్లిదండ్రు లీమెను రానిచ్చిరా; మనకాయన దొరకాడు. వారిది పెద్దవంశము కాదు తలచుకొన్న పనిచేయలేని యసమర్థులెన్ని యూహలు చేయుదురో యన్నియూహలు చేయుచుండిరి. మాటాడుకొనుచుండిరి. వారిద్దరు కోటలోనికి పోయిరి.

కార్తవీర్యుని పాదములకు నమస్కరించిరి. అతడు వారిని చూచెను మాటాడలేదు పలుకాడలేదు. అతని మొగమున చిరునవ్వైన లేదు. పోయి తల్లికి నమస్కరించిరి. ఆమె తన పాదములను వారిని తాకనీయలేదు. కాని వారాయింటిలోననే యుండిరి. పరిచారికలు వారియందు తొల్లింటివలెనే ప్రవర్తించుచుండిరి. స్త్రీలలో నొక విలక్షణమైన మనఃప్రవృత్తి యుండును. ఎవ్వతెనో, ఎవ్వడో లేవదీసికొని పోయెను. వారియందు పురుషులు చూపించెడు నంత విముఖత స్త్రీలు చూపించరు. స్త్రీలలో నెవ్వతెయో యొకర్తుక తీవ్రమైన

ధర్మాభిలాష కలది వారిని పురుషులకంటె నెక్కువ పరిహరింతురు. తక్కిన స్త్రీలు లేచిపోయిన స్త్రీతో మాటాడవలయునని యుత్సుకత వహింతురు. ఆమె యేదో యొక భోగము ననుభవించుచున్నది. ఒక విలక్షణమైన మనోరామణీయకము, మనస్సౌకుమార్యము నామె యందుండి యుండును. ఆమెయొక్క భోగము వాంఛనీయముగా నుండును. ఇట్టి భావములు స్త్రీలయొక్క మనస్సులం దాడుచుండును.

ఆచిన్న కోటలో పరిచారికలు వారికి సేవలు చేయుచుండిరి. రెండుమూడు నాళ్లు గడిచెను. ఆమె తల్లిని దినదినము పోయి చూచు చుండెను. తల్లి తొలినాటి నిరాదరణ చూపకపోయినను సంపూర్ణ ముగా ప్రసన్నురాలు మాత్రము కాలేదు. సుదర్శన భట్టారకుడు త్రయోదశినాడు రాత్రికి మైథిలీపురమువచ్చెను. భోకో వచ్చియుం డును. తనకోసమాతనిని వారాపుదురని యనుకొనెను. వారు వచ్చి నదే త్రయోదశినాటి ప్రొద్దుటికి. భోకో కృష్ణపాడ్యమినాడు వచ్చెను. ఈ లోపుగా నూరిలోని క్షత్రియవీరు లందరు పదిసార్లు సమావేశ మైరి. వృద్ధులెక్కువ జోక్యము కలిగించుకొనలేదు. యువకులందఱును కలసిపోయి కార్తవీర్యుని కలిసికొని యిది కోటకు మర్యాదకాదని చెప్పనెంచిరి. కొందఱు వృద్ధులుకూడ—అంత వృద్ధులుకారు — తాముకూడ వత్తుమనిరి.

ఆనాడు కోటలో పెద్దసభ జరిగెను. కార్తవీర్యుడుండెను. పరి చారికా పరిచారకలు సమకూడిరి. కార్తవీర్యుని భార్యకూడ బల వంతముచేత వచ్చినది. ఊరిలో చాలమంది ప్రోగువడిరి. ఒకవృద్ధుడు కార్తవీర్యునితో నీ సంగతియంతయు చెప్పనారంభించెను. అతడు కొంత చెప్పి యీ జితేదాస్తి సుక్షత్రియుడుకాడు. క్షత్రియుడేకాడు. అని లేచి నిలుచుండి బిగ్గరగా ననుచుండెను.

సుదర్శన భట్టారకుడు తానిట్లనెను: "అయ్యా: ఆసంగతి మనము గట్టిగా చెప్పలేము. మొన్న త్రయోదశినాటికే యొకతడు రావలసియుండెను. అతడెందుచేతనో రాలేదు. అతడు వచ్చినచో జితేదాస్తి సుక్షత్రియ వంశీయుడని నిరూపింపగలము" అనుచుం డగా, నొక బక్కపలుచని ప్రేగువంటి పొట్టి యినుపతీగవంటి భోకో లోనికి త్రోసుకొనివచ్చెను. అతడు నేనే వాడను. వచ్చితిని.

త్రయోదశినాటి కిచ్చుటకు వచ్చుటకు నాకు వీలులేక పోయెను. వచ్చెడి వాడనే! ముందు క్రాంతిపురము పోయితిని. అచటి వారందరు క్షత్రియులు. వారు ఠాకూరీ వంశీయులైన క్షత్రియులు. వారిలో కొందరు పెద్దలున్నారు. యాలంబరవర్మ వారికి నాయకుడు. మరియొక నాయకుడు శుకదేవవర్మ. వారిద్దఱను నావెంట రమ్మంటిని. వారికేవో పనులున్నవట. రెండు దినములలో వత్తుమన్నారు. నేడు కృష్ణపాడ్యమి. ఎల్లుండి తదియ. ఎల్లుండికి వారు వత్తురు. అప్పుడు నేను జీతేదాస్తి ఠాకూరీ క్షత్రియవంశీయుడని రుజువు చేయుదును.

వారు వామదేవశాఖీయులు. ఇతడు వామదేవశాఖీయుడు. ఇతని తండ్రి గాలి. గాలి తండ్రి ఫాలాతుడు, ఫాలాతుని పేరు బలదేవుడు. అతడు తన పేరును మార్చికొన్నాడు. బలదేవుని భార్య క్షత్రియస్త్రీ. పెండ్లి చేసినది నేను. గాలి పెండ్లి చేసినది నేను. వంద సాక్ష్యము లున్నవి. గాలి భార్య బ్రతికియే యున్నది. నేనామెను చూచియే వచ్చితిని. తదియనాటికి నేను చెప్పెడు విషయములన్నింటిని రుజువుపఱచుటకు కొంతమంది నిచ్చటికి రమ్మంటిని. అంతదాక నెందుకు ఫాలాతుడన్న బలదేవుని యన్నగారి పేరు త్రినేత్రుడు. వారిద్దరు భాస్కరదేవవర్మ కుమారులు. భాస్కరదేవవర్మ పేరెఱుగని వారెవరు? ఆయన వీరదేవవర్మయొక్క తండ్రి. నేటి నరేంద్రదేవవర్మ మహారాజుయొక్క తాతగారు. నందదేవవర్మచేసిన యుద్ధములలో మిక్కిలి సాయముచేసినవాడు. నరేంద్రదేవుని రాజ్యము నిలువబెట్టిన వాడు. మీలో వయసుమీరిన వారికీ విషయము తెలిసియుండును. లేదా వినియుందురు

ఇంత సభ జరుగునని నేననుకొనలేదు. లేనిచో త్రయోదశినాటికే వచ్చెడివాడను. నేనాటవికుడను. నాకు నూట యిరువదియేండ్ల వయస్సు. నేను వీరదేవవర్మ నెఱుగుదును. ఎఱుగుదు ననగా సరిగా నెఱుగను. ఆయనను గూర్చి బాగుగా తెలియును. అప్పటి చరిత్ర కొంత క్లిష్టముగా నున్నది. ఒక వందయేండ్లు నేపాళరాజ్యమంతయు నల్లకల్లోలముగా నుండెను. ఇతని తాతయైన బలదేవుని వదినెగారు గంగాదేవి యిప్పుడు జీవించియున్నది. ఆమె కోడ లనసూయాదేవి యున్నది. ఆ యిద్దఱు తదియనాటి కిచ్చటికి వత్తురు. వారిని సుద

ర్మనభట్టారకు డెఱుగును. క్రాంతిపుర నాయకులలో శుకదేవవర్మ యెఱుగును. వారిచేత రుజు విప్పింతును.

ఫాలాక్షునకు నాకు నేమి సంబంధము? అతని భార్య క్షత్రియు రాలని నేనెట్లెఱుగుదును? అదియొక కథ. గాలి పెండ్లి నేనెట్లుచేసితిని? అదియొక కథ. వారిద్దఱును క్షత్రియస్త్రీ లనుచుంటిమికదా! వారి కుటుంబముల వారినికూడ రమ్మంటిని. వారు వత్తురు. ఈ తీర్మాన మిప్పుడు జరుగదు. జరుగరాదు. వారందఱు వచ్చిన తరువాత జరుగ వలయును. నన్ను పెద్దదొర యెఱుగును. నేను చాలసార్లిచ్చటికి వచ్చితిని. ఏమి దొరా! నీవు నన్నిదివఱకు చూడలేదా!

కార్తవీర్యుడు:- చూచితి నీ వెవరవో నాకు తెలియదు. ఎందుకు వచ్చితివో తెలియదు.

ఛోకో:- జితేదాస్తిని చూచిపోవుటకు వచ్చుచుండెడివాడను. నాకు ఫాలాక్షుడు పెద్దనేస్తము. అతని మనుమడితడు. ఈ పిల్లవానిని చూడకుండ నేనుండలేను. దానికి కారణమున్నది. ఎల్లుండికి చెప్పెదను గదా! నేను జితేదాస్తితో మున్నెప్పుడు మాటాడలేదు. ఈ జితేదాస్తి యెట్టివాడు? మీరెవ్వరు నతని నెఱుగరు. అతడు నన్నెఱుగడు. నేనెప్పుడతనితో మాటాడలేదు. అతడు నాతో మాటాడలేదు. అతడు నన్ను రెండు మూడుసార్లు చూచెను. నేనెవ్వరనో అతనికి తెలియును. ఎట్లు తెలియును? అతడు నీళ్ళలో దిగకుండ లోతులు చెప్పును. మొగములు చూచి వీడు వీడని తెలిసికొనును అతని జాతకమట్టిది.

మా బలదేవుని వంశములో వంశ మెందులకు, నతని మనుమ డిట్టివాడై పుట్టునని యెనుబదియేండ్లక్రింద మాబోయపల్లెలో నొక గణాచారి యుండెడిది; ఆమె చెప్పినది. ఆమె యిప్పుడు చనిపోయి నది. ఆమె చెప్పిన యే మాటయు వ్యర్థముకాలేదు. ఇతడు నవమన్మ థునివంటి యాకారము కలవాడుగా పుట్టునని యామె చెప్పెను. చిన్నప్పుడు బుద్ధదేవునివలె మాటాడకుండునని చెప్పెను. ఆ రెండును నిజమా! అబద్ధమా? అని తెలిసికొనుటకు నేను రెండు మూడుసార్లు వచ్చితిని. ఆమె చెప్పినట్లే యితడు కన్పించెను మీకు నామాటల యందు నమ్మకములేనిచో నెల్లుండిరండు. ఎల్లుండికానిచో పంచమి నాడు రండు. గంగాదేవియు ననసూయాదేవియు వచ్చుటాలస్య

మగునేమో! జితేదాస్త్రి తల్లి బ్రతికియున్నది కదా! ఆమె పేరు మీ కెవ్వరికైనా తెలియునా? తెలియదు. ఆమె పేరు వాలాంబ. ఆమెయు వారు వచ్చునప్పుడు వచ్చును.

అయ్యా! మీరందఱు సుక్షత్రియులు, ఖడ్గవిద్యానిపుణులు. నేనాటవికుడను. కాని వేటలో నాయంతదిట్టరియుండడు. గాలి యంతటి వేటకాడైనా డనగా నావలననైనాడు. అతడు నా రహస్యము నెవరితోడను చెప్పలేదు. మేమందఱము ఖడ్గవిద్యానిపుణులమని మీరు జితేదాస్త్రిమీదకు పోవద్దు ఆతడనశస్త్రవిద్యుడనుకొనవద్దు. కత్తిమాట అటుంచి యతడు వట్టిచేతులతో మిమ్ము పదిమందిని ధృతరాష్ట్రుడు భీముని చేసినట్లు చేయగలడు. అతని శరీర సౌకుమార్యమును చూచి మోసపోకుడు. నేను, నా దంపతులు మేము ముప్వురము నిలుచుండగా నీ యూరిలోని క్షత్రియ యువకులందఱు కలిసికూడ మమ్మేమియు చేయలేరు."

త్రయోదశినాడు జితేదాస్త్రి కత్తిని ఝుళిపించిన విషయము జ్ఞాపకమునకు వచ్చి యువకులైన క్షత్రియవీరులు తమలో తమరు దాగికొనిరి. థోకో మాటలు వారికి కోపమును కలిగించెను. థోకో ఆటవికుడు. వానికి లౌకికమేమి తెలియును. ఈ మాటలు సాధువుగా చెప్పవచ్చును. సృష్టిలో నొక రహస్యమున్నది. జనసామాన్యము యొక్క మనస్సు ద్విధాభూతముగా నుండును. సాధువుగా చెప్పినచో వినరు. ఖండితముగా చెప్పినచో కోపము తెచ్చికొందురు. మాయోపహతులు!

అంతట నందఱు నెమ్మది నెమ్మదిగా జారిరి. మైథిలీపుర మంతయు గగ్గోలయ్యెను.

తదియనాడు వారు రాలేదు. పంచమినాటికి వచ్చిరి. పెద్ద సభ జరిగెను. ఆ సభ కోటలోని సావడిలో జరుగలేదు. అచట జనము పట్టరు. కోటలోపల చావడిముందు పెద్ద నెరాజాస్థలమున్నది. తొలుత గంగాదేవి తన కథనంతయు చెప్పెను. శుకదేవవర్మ యంగీకరించెను.

అపుడు థోకో యిట్లనెను: "ఫాలాతుడును నేను మిక్కిలి నేస్తములము. అత డన్నమీద కోపగించి నావద్దకు తేచివచ్చెను. మేమిద్దఱము వేటాడి బ్రతుకుచుంటిమి. ఇట్లుండగా మా కడవిలో నొక

చోట రహస్యముగా నివసించుచున్న యిద్దఱు స్త్రీలు కన్పించిరి. ఒకతె కొంత వృద్ధురాలు. రెండవ యామె పడుచుది. వారిని కను గొనగా నా పడుచుపిల్ల పేరు కాళింది. వృద్ధురాలు దాసి. మాబోయ పల్లెకు దూరమున జాలంధరపట్టణమున్నది. అచట సూర్యచంద్ర వంశ్యపు రాజు లున్నారు. వారికివారికి పడదు. కాళింది తండ్రి వీరుడు. చంద్రవంశ్యుడు. జాలంధరమున చంద్రవంశపు రాజుల యిండ్లు నాలుగే. తక్కినవారందఱు సూర్యవంశ్యులు. కాళింది తండ్రియొక్క పరాక్రమమువలన, నీతివలన, సూర్యవంశీయులు పెక్కుఉన్నను వారందఱు నాలుగిండ్లవారైన చంద్రవంశ్యుల నేమియు చేయలే కుండిరి. వారి విరోధములెంత బలిసినదనగా, కాళిందియొక్క తండ్రిని చంపినగాని వారి సంఖ్యాబలము పనికిరాదన్నట్లుండెను. కాళింది తండ్రిపేరు-ఉగ్రసేనుడు. అతడు ముప్పురు నలువురు సూర్యవంశ్య క్షత్రియులను పూర్వము వధించుటయు జరిగెను. వధించుట న్యాయ ముగానే వధించెను. వారు దొమ్మిగా వీరి యింటిమీదకు వచ్చుట, ఇత డాత్మరక్షకొఱకు వారిని వధింపక తప్పకయు నైనదట.

వారందఱు నుగ్రసేనుని కుదురు నాశము చేయవలయునని పట్టుబట్టి కూర్చుండిరి. ఒకసారి యింటికి నిప్పుపెట్టిరి. అప్పుడుగ్రసేను డూరిలో లేడు. అతని నడవిలో వందమంది చుట్టుముట్టి వధించిరి కాళింది తల్లిని సంహరించిరి. చెల్లెంద్రను చంపిరి. తమ్ములను వధిం చిరి. కాళింది తల్లి కాళిందిని పరిచారికనిచ్చి యచటికి కొంతదూర మునన్న మేనమామల యింటికి పంపెను. తత్పూర్వమే పంపెను. ఆ పరిచారిక చాల తెలివికలది. ఆమె యిచ్చటి వార్త యెట్లు తెలిసి కొనెనో తెలిసికొనెను. కాళింది కప్పుడు పదునెన్మిదేండ్ల వయస్సు. ఆమె తిరిగి వచ్చుననియు వచ్చినప్పుడామెకు మానభంగము చేయించి యామెచేత భిచ్చమెత్తించవలయుననియు కూర్చుండిరి. ఆ పరిచారిక కీవార్త దారిలో తెలిసెను. కాళిందిని మరల మేనమామల యింటికి తీసికొనిపోవుటయా! పోకపోవుటయా! యన్నది ప్రశ్న.

ఆ మేనమామలు సామాన్యులు. వారు కాళిందిని రక్షించలేరు. కాళింది సాహసురాలు, దురభిమానవతి. తాను మరల జాలంధరము పోవుదునని యుండెనట. పిల్లకాకికేమి తెలియు నుండేలు దెబ్బ! ఆ

పరిచారిక కాళిందిని బతిమాలి,బామాలి,నచ్చచెప్పి కొన్నాళ్లీయడవిలో నుందము. ఈ యడవిలో క్రూరమృగ సంచారములేదు. ఒకనెల యైనను చూచిపోదమని యామె నొప్పించినది, అడవిలో ఫలములు తిని గుంటలనీళ్ళు త్రావి వారు బ్రతుకుచున్నారు.

ఆ పరిచారిక నాకీకథ చెప్పగా నేను వారిని మా పల్లెకు తెచ్చితిని నేను జాలంధరము పోయితిని. ఆమె మేనమామల యూరు పోతిని. అన్నియు కనుగొంటిని. యాథార్థ్యము తెలిసికొంటిని. పరిస్థితులు విచారించితిని. కాళింది జాలంధరము పోరాదు. మేనమామల యింటికి పోరాదు పోరాదు సరిగదా! మా యడవులలో నుండరాదు. అయ్యుగ్ర సేనునిమీద వారి కోపములెట్లున్నవి? వాని కుదురు నిలువరాదు. కాళింది బ్రతికియుండరాదు. ఆమెకు సంతానము కలుగరాదు. కలిగినచో నా సంతానమెప్పుడైన తమమీద పగ వహించునో యన్నట్లున్నది.

నాకు కోపమువచ్చెను. ఈమెకు పెండ్లి చేయవలెను. ఈమె కడుపున పురుషసంతానము కలుగవలెను. వానిచేత జాలంధర రాతులను సంహారింపించవలెను.

మా పల్లెలో గణాచారి యున్నదంటినిగదా! ఆమె వద్దకు వీరి నిద్దరిని తీసికొని పోయితిని ఫాలాతుని కాళిందిని. గణాచారి చెప్పినది. ఈమెకు నితనికి నొక మొగపిల్లవాడు కలుగును. వాడుకాడు. వాని కడుపున నింకొకడుపుట్టును. వాడు తొలుత బుద్ధావతారము. తరువాత కల్క్యవతారము. ఓరీ ఛోకా! ఈ వంశము నిలుచునురా! ఇప్పుడుకాదు పదునేను తరములు గడువవలయును. పదునేనుగూడ నక్కఱలేదు ఎనిమిదితరములు గడిచినచో చాలును. అప్పుడు వీరి వంశములో నొక గొప్పదొర పుట్టును. అతడు నేపాళరాజ సింహాసన మధిరోహించును. వీరి మనుమడని చెప్పితినే వాడు దీనికంతకును పునాదివేయును అఫాలాతుడు వట్టిపెంకి. ఈ వృద్ధురాలు గంగాదేవి యున్నది ఈమె యహిర్వంశ క్షత్రియసంజాత! ఈమె క్షత్రియ స్త్రీ కాదని యెవతెనో తక్కువ కులముదానిని తనయన్న పెండ్లియాడెనని కోపముతో లేచి వచ్చినాడు. ఆ కాళింది యొక విచిత్రమైన వ్యక్తి. ఫాలాతుడు క్షత్రియుడు కాడని. తాను తక్కువ కులము వానిని పెండ్లి చేసికొన్నానని. ఆమె బ్రతికియున్నన్ని నాళ్లి దేగోల!

ఆఫాలాతు డొకకొయ్య. తాను క్షత్రియుడను కాననెడివాడు అప్పుడు మీయన్నయును క్షత్రియుడు కాడుగదా! అతడెవ్వతెనో పెండ్లిచేసికొన్నచో నీకేమియని నేననుచుండు వాడను. దానికి సమాధానములేదు. మరి తానెవడు? గొల్లవాడా! బోయవాడా! మేము రాచగొల్లల మనెడివాడు. అప్పుడప్పుడు మేము వైశ్యులమనెడివాడు. మరల కాళిందియు ఫాలాతుడు నొకరినొకరు సీతారాముల వలె ప్రేమించెడివారు, ఆ గణాచారి చెప్పినదికదా! నా మనుమడే దొరయగునని నా కడుపున పురుషసంతానము కలిగినంతనే నేను చనిపోయెదననెడిది. అట్లే చనిపోయినది. ఆ ఫాలాతుడామె వియోగమునను భవించలేక యట్లే చనిపోయెను.

గాలికి నేనే పెండ్లి చేసితిని. వాలాంబయిచ్చటనే యున్నదికదా! ఈమె క్షత్రియస్త్రీ. కాళింది మేనమామల కుటుంబములు కలవు. వారిలో నొక కుటుంబము తిండిలేక మాడిపోవుచున్నారు. ఆపిల్లకు దిక్కులేక మాడిపోవుచున్నది. ఆపిల్లను నేను తీసికొనిపోయి పెంచెదనంటిని ఈమెను నా యింటిలో నిరువదియేండ్లు పెంచితిని. గాలిచేత నొప్పించితిని. పెండ్లి చేసితిని. ఇదుగో కొడుకు జితేదాస్తి. వీరు నడుమ సుమారెనుబది యేండ్లయినను క్షత్రియయాచారము లేకుండ బ్రతికిరి. వారి రక్తములో క్షత్రియత్వము పోలేదు. ఈ జితేదాస్తి గొప్పవాడగునట! సంపన్నుడగునట! నేనింకను కనీసమైదేండ్లు బ్రతుకుదును. జితేదాస్తి యొక్క గొప్పదనమును చూచి చనిపోవుదును,

అనగా శుకదేవవర్మ లేచి "ఓయీ, ఫోకో! ఇవి యన్నియు నీవు మొన్న మా క్రాంతిపురములో చెప్పితివి మేమందఱము వింటిమి. విచారించితిమి. విశ్వసించితిమి. ఇదుగో మా యాలంబరవర్మ. ఆయన నాకంటె చిన్నవాడైనను మాకు నాయకుడు. ఈ జితేదాస్తి మా వంశమువాడు. మాది ఠాకూరీ వంశము. అందులో రెండు శాఖలున్నవి. అంశుమంతునిశాఖ యొకటి. వామదేవునిశాఖ యొకటి. మేము వామదేవశాఖీయులము. ఇప్పుడు మా వంశములో మహాపురుషు డొకడు పుట్టునని మా జ్యోతిషము మాకున్నది, ఇప్పుడు మీకు బరువైనచో మేము తీసికొనిపోదుము.

అనగా నా యూరి క్షత్రియులందఱు "అతడు క్షత్రియుడని

మేమంగీకరించుచున్నాము. కాని, అతడు వట్టి బుద్ధస్వరూపుడు. ఇతడు వివేకి, పరాక్రమవంతుడు అని మాకు తెలిసినచో మేము మా దొరకూతు నితనికిచ్చుట కంగీకరింతుము,'' అనిరి.

అంత జితేదాస్తి నవ్వుచు లేచి నిలుచుండెను. కోట కొక గోడ యున్నది. అది మువ్వురు పురుషుల యెత్తు, దానిపైకి పులివలె లంఘించి యెక్కెను కత్తి పుచ్చుకొని ఝళిపించెను. "నన్ను మీ రందరు కలిసి పట్టుకొనుడు. మీలో నెందఱు చత్తురో నాకు తెలియదు. ఆ బాధ్యత నాకు లేదు.'' అనగా నందఱు నెవరిదారిని వారు పోయిరి

# 13

పది దినములైనది వచ్చిన గంగాదేవ్యనసూయలు వెళ్ళలేదు. వారు వెళ్లుటకు రాలేదు. వాలాంబకూడ నిచటనే యుండెను, క్రాంతి పురమునుండి క్షత్రియవీరులు వచ్చుచున్నారు, పోవుచున్నారు. కోట కేమి! కోట చాలుచున్నది. ఏ పూట కాపూట గడచుట కష్టముగా నున్నది. అన్నియు రాజభోజనములు. రాజమర్యాదలు. బరువంతయు సుదర్శనభట్టారకుని మీద పడినది. ఏదో పొసగద్రోసిన సంసారము మరల చిద్రువలై పోవు నన్నట్లున్నది. నాగేశభట్టు పదిచోట్లకు పోవును. పెల్లగించి తెచ్చును. మిక్కిలి శ్రమపడును. కార్తవీర్యుడు కదలడు. జితేదాస్తి రేపో యెల్లుండియో యల్లుడయ్యెడివాడు. పొలమమ్మవలయునా? ఈ గ్రామమే యమ్మవలయునా?

ఒకనాడు సుదర్శన భట్టారకుడు జితేదాస్తితో నిట్లనెను: ''అయ్యా! గంధర్వలోకములో అన్నము తిందురా? సంపాదించవల సిన యవసరముండునా?"

అనగా జితేదాస్తి నవ్వెను. నవ్వి ''స్వామీ! నాకు తెలియును. నాలుగైదుదినము లోపికపట్టుడు, నేడు సాయంతనమున పోయి రెండును రెండు నాల్గుదినములలో వత్తును,'' అనెను,

''ఎచ్చటికి పోదు" వని యడుగుటకు తానెవరు? అడుగలేదు.

జితేదాస్తియు, దొరకూతురును కోటకు వచ్చినప్పటినుండి

మరల గలసికొనలేదు. ఇతడు సావడిలో పండుకొనును, ఆమె త వద్ద పండుకొనును. దివావేళల నెట్లున్నను రాత్రివేళల నిరువురును సమానముగనే విరహ మనుభవించుచున్నారు. కలిసి మాటాడుటకే వీలులేకుండ నున్నది.

ఆమెతో చెప్పి నాల్గుదినములలో వత్తునని జితేదాస్తి తాను వెళ్ళవలయునని. ఎచ్చటికని యామె యడుగును. ఎచ్చటికని చెప్ప వలయును? చెప్పకుండ బోయినచో యామె యేమనుకొనును? చెప్పుట యెట్లు? రాజమర్యాదలు కొన్ని గలవు. పరిచారికచేత చెప్పించుట. పెండ్లియైన తరువాత నట్లు చేయవచ్చు? పెండ్లి కుదిరి యొకరినొక రెఱుగనప్పుడట్లు చేయవచ్చును. ఇది సందిగ్ధావస్థయైనది. ఆమెతో చెప్పకుండ వెళ్ళుట తనకిష్టము లేదు.

మరల సుదర్శన భట్టారకుని పిలిచి ఇట్లనెను: "స్వామీ! నా వివాహము కావలయును. అప్పుడుగాని నేను మీకు సాయపడగలిగ నట్లుతోచుట లేదు. నేను నిర్ధనుడను. బావమఱది పవివర్మ. అతని స్థితి చూడవలయును, నాకు రెండు పనులున్నవి, ఇచ్చటి దారిద్ర్యమును పోగొట్టుట. పవివర్మను బాగుపఱచుట ఈ రెంటిని నేనిప్పుడు చేయ గలుగుదునా? చేయలేనా? యన్నట్లున్నది. అయినను నేను పోవుటకు బదులు మిమ్ము పంపింతును. మీరుగూడ నతని నెఱుగుదురుకదా? అతనివద్దకుబోయి 'నీవు పవివర్మ నెప్పుడు వదిలిపెట్టెదవ'ని యడిగి రారాదా? అంతకంటె నత డిచ్చటికి వచ్చినచో నేనే యడిగెదను. నేను రమ్మన్నానని చెప్పివత్తురా?"

సుదర్శన:- అయ్యో! అతడు జపము ప్రారంభించితివా? అని యడుగగా నేనేమని చెప్పవలయును?

జితేదాస్తి:- 'జితేదాస్తి నీతో మాట్లాడుదునన్నాడ'ని చెప్ప వలయును.

సుదర్శన:- అతడంగీకరించునా?

జితేదాస్తి:- అదియేమి స్వామి! అతని బ్రతుకంతయు నీ చేతిలో నున్నది.

సుదర్శన:- నీవు పొమ్మన్నచో పోదును.

జితేదాస్తి:- నేను నా బావమఱది విషయములో నతనితో

మాట్లాడవలయును. మరి నింకొక్కటి మాటాడవలయును. నేను వెళ్లుటకు వీలు లేదు.

సుదర్శన:- ఎందుకు వెళ్ళిరాకూడదు ?

జితేదాస్త్రి:- మీరు పెద్దలు; చెప్పకూడదు.

తరువాత నాల్గుదినములైన పిదప నొకనాటిరాత్రి జితేదాస్త్రి యెంతయో ప్రయత్నముచేసి పవివర్మయు తానును నేకాంతముగా నొకచోట కూర్చుండుటకు వీలేర్పఱచికొనెను.

జితేదాస్త్రి:-వచ్చితివా?

పవివర్మ:-వచ్చితిని.

జితేదాస్త్రి:-మరి మా పవివర్మను నీవు వదలిపోవుట యెప్పుడు?

పవివర్మ:-మీ సుదర్శన భట్టారకుకు జపమారంభించుట యెప్పుడు?

జితేదాస్త్రి:-నా వివాహము కావలయును. అప్పుడుగాని భట్టారకునకు తీరికయుండదు.

పవివర్మ:-నన్నేమి చేయుమందువు?

జితేదాస్త్రి:-కార్తవీర్యార్జునుడు పేదవాడు. నేను నిర్ధనుడను, కోట పెండ్లియిల్లువలె నున్నది. లేచెడు విస్తరియు తీసెడువిస్తరియు. సుదర్శన భట్టారకుడు దీనినే తట్టుకొనలేకున్నాడు. పెండ్లి యెట్లు జరుగును? ఇది జరిగెడి పెండ్లి కాదు. భట్టారకునకు తీరికయుండదు, తీరికయున్నగాని నీ జపమారంభింపలేడు. నేనెంత తొందఱపెట్టియ యనచే చేయింతుమన్నను, ఆయన కనీసము మూడేండ్లయిన చీకుచింతలేకుండ నుండవలయును గదా! కార్తవీర్యార్జునుల సంసారభారమంతయు నతని నెత్తిననున్నది, పెండ్లియైనగాని పిచ్చి కుదురదు, పిచ్చికుదిరినగాని పెండ్లి కాదు.

పవివర్మ;—నన్నేమిచేయుమందువు?

జితేదాస్త్రి:-మాకు గనీసము పాతికవేలదీనారములైన నప్పు పెట్టవలయును.

పవివర్మ: నీవెట్లు తీర్తువు?

జితేదాస్త్రి:-దానిని నావేతనము క్రింద జమకట్టుకొనవచ్చును, వీరదేవునిచేత నంగీకరింపజేయుదువా? అతడు నీమాటవినునా? మన

వధకము నంగీకరించునా? నా శౌర్యమును చూపింతును. నేను భాస్కరదేవవర్మ ముమ్మనుమడ నని చెప్పుదును, అతని ముత్తాతతండ్రియైన నందదేవుని రాజ్యమును నిలబెట్టినది, మా ముత్తాతకదా' ఈ నరేంద్రదేవుడు దేశమునంతయు బౌద్ధమతము చేసెను. నన్ను విశ్వసింపడా?

పవివర్మ:-నరేంద్రదేవునకు ముగ్గురు కొడుకులు, పద్మదేవుడు, రత్నదేవుడు, వీరదేవుడు, వీరదేవుడు మూడవవాడు, పెద్దకొడుకు పద్మదేవుడు. రాజ్యమతనికి వచ్చును, మనము వీరదేవునిమీద నాశ పెట్టుకొన్నాము, ఇది యెంతవఱకు పొసగునో తెలియదు.

జితేదాస్తి: నేను పొసగింతునుకదయ్యా! నాకు పాతికవేలు దీనారములు ఋణమిమ్ము. లేనిచో నీవిట్లే యుందువు. నేను నిట్లే యుందును.

పవివర్మ: నేను సుదర్శన భట్టారకునితో వేఱే మాటాడుదును. అతని కప్పియ్యనక్కఱలేదు కదా! ఆ ధనము నాదియా? అది న్యాసముగా నాయుందుంచ బడిన ధనము.

జితేదాస్తి: దానిని నేను నాకు దానము చేయుమని యడుగుట లేదు. నీకంత యిష్టములేనిచో పోనిమ్ము. నేనును నాభార్యయు మరల నెచ్చటికో లేచిపోయినచో నీ కుటుంబమునకు పూర్వపు ట్రతిష్టలేదు కదా! ఈ యూరిలోని క్షత్రియవీరులు నన్ను చెనకరాదు కదా! పోనిమ్ము. ఆసుదర్శన భట్టారకుడు నిన్ను వదలించినప్పుడే నా భావమది బాగుపడును. అప్పుడే చూచికొందము. నిన్ననవసరముగా రప్పించితిని.

పవివర్మ: అంత కోపమెందుకయ్యా! నేను నారాజుమీద నభిమానముతో మాటాడుచున్నాను. అంతకంటె నామెయున్నది. ఆమె కిదియే నిష్కృతిమార్గము. ఆమె యీ శిథిలనగరమును వదలిపెట్టలేక యేడ్చుచున్నది.

జితేదాస్తి: ఆ నీవు బ్రాహ్మణుడవు. దైవమును నమ్మని బ్రాహ్మణుడేమి బ్రాహ్మణుడు! నీకంటె క్షత్రియుడను నేను నయము. నేను పదిదినములక్రిందటి వఱకు క్షత్రియుడను కూడ కాను.

పవివర్మ: ఇమ్మందువా?

జితేదాస్తి: అది నీ ఇష్టము. నా కివ్వ దవసరము. నీ విమ్ము; ఈ యకపొమ్ము. నేను నిన్ను ప్రధానముగా పిలిచినది దీనికొఱకు గాదు. నీ వ్యవహారము భట్టారకునిమీద నాధారపడియున్నది. నీవు మా పవివర్మను పట్టుకొని బాధించుట యెందులకు? పవివర్మను వదలి పెట్టి పొమ్ము. అతడు పొలము నమ్ముకొనునో, మిగిలిన యీ ఒక్క యూరి ప్రభుత్వమును వదలికొనునో! నేనతనిమీద పడి తిందునా? ఎన్నాళ్ళు తిందును? ఇప్పుడు నేను నా భార్యయు నిద్దరమే కాము; మరి మూడు ప్రాణములు నామీద పడినవి. నా తల్లియు, నా పెద్ద తాతగారి భార్య గంగాదేవియు, నామె కోడలు ననసూయాదేవియు. వారు మూడువందల దీనారములు తెచ్చిరి, నా కిచ్చిరి. వారి బ్రతుకులు నేను కడతేర్చవలయునట. ఇది పూర్వమువలె కాదే ఇప్పుడు మేము క్షత్రియులము, వామదేవశాఖీయులము. క్రాంతిపుర క్షత్రియులు మా ఇంటికి వచ్చుచుందురు, పోవుచుందురు. నా కిల్లెక్కడ? నేను నా భార్యను, వీరి ముప్వురిని తీసికొనిపోయి నా తండ్రియు, నా తాతయు నివసించిన రెండు నిట్రాళ్ళపాకలో నుండుమందువా? లేక—వీరి నలుగురినీ వెంటతీసుకొని మధ్యలక్షు నగరమునకు బోవుదును, నా కత్తి నమ్ముకొని జీవింతును. దయయుంచి నా బావమఱదిని వదలిపెట్టి పొమ్ము. అతడును లోకసామాన్యముగా బ్రతుకును. అతనిచేత తేలికగా వ్యయపెట్టించి నా పెండ్లిచేసికొందును. అతనీ ఋణమును తీర్చికొనగలిగినచో తీర్చికొనును.

పవివర్మ:- నిన్ను నమ్మి ఋణమిత్తును.

జితేదాస్తి:- నాకది ప్రధానము కాదయ్యా! నీవు నా బావమఱదిని వదలిపోవుట ప్రధానము.

పవివర్మ:- రెండును ముడిపడియున్నవి ఒకదానినుండి యొకటిని విడదీయుటకు వీలులేదు.

జితేదాస్తి:- నేను ముడి నూడదీసెదను.

పవివర్మ:- అబ్బ! మీ క్షత్రియులతో నెప్పుడూ ఇంతియే! ఆ వీరదేవమహారాజుతో నెన్ని బాధలు పడితిని? చివరకు నేను బ్రహ్మరాక్షసుడనై యూఱకొంటిని. నీవు ముడి యూడదీయనక్కఱలేదు. నేను మీ పవివర్మను వదలిపెట్టపోయెదను. నీకు పాతికవేల దీనారములు ఋణమిచ్చెదను, నేను పోదునా?

జితేదాస్తి:- ఆ ధనము నాకెట్లు చేరును? ఈ పవివర్మ రేపు పొద్దుటనుండి వివేకిగా మారినచో నది యింకొక గారడి? నా గారడీ మూలముననే యింత యల్లరియైనది. ఆ నాడు నీవులేవు. నేను కోట గోడ యెక్కి కత్తి పుచ్చుకొని మీరు వీరులైనచో నన్ను పట్టుకొనుడు. మీలో యెంతమంది చతురు మీకే తెలియదన్నాను. వారు భయపడి వెనుకకు తగ్గిరిగాని వారు వందమంది నా మీదికి వచ్చినచో నిజముగా నేను వారినందరినేమి చేయగలను? అయినచో వారిచేత బంధితుడను కావలయును. కానిచో, నారెక్కలు నేను తెప్పించికొని మింటి కెగిరి పోవలయును. అన్నట్టు మఱచిపోయితిని, నీకేమి భయ మయ్యా! నా రెక్కలు నీ దగ్గరున్నవికదా? వానిని కుదువపెట్టుకొని నాకు పాతిక వేల దీనారము లిమ్ము.

పవివర్మ:- అయ్యా! నా చెవులను కంసాలియే కుట్టినాడు. నే నందులో బ్రాహ్మణుడను. నీవు చేసినంత యాలోచన నేనును చేయ గలను. నీ రెక్కలు నావద్ద నున్నవి. నిజమే! నీవు మనుజుడుగా బ్రతుకుటకు ఇష్టము లేనిచో నప్పుడు నీకు నావద్ద నున్న రెక్కల ప్రశస్తి.బంగారమువంటి భార్య దొఱికినది.

జితేదాస్తి:- ఆమె బంగారము కాదు. చివఱకు వెలిగారము కూడా గాదు.

పవివర్మ: ఆమె నిక్కముగా బంగారమే. నీకు తెలియును మీరు క్షత్రియులు కదా!మీ యంతఃపుర రహస్యములు నాకు తెలియ గలవు. నేనెంత చెడిపోయినను రాజాంతఃపురముల సంగతి యెఱుగనివాడనుకానుగదా! నీ వామెతో సుఖముగా నుందువు. ఏ వంద యేండ్లో వందయిఱువది యేండ్లో బ్రతుకుదువు. ఈ మానవశరీరము దాని యంతట నదియే సంచ్యుత మగును. అప్పుడు నీవు నీ నిజ రూపముతో వత్తువు, నా ఱెక్కలు నాకిమ్మందువు. ఈయకుండుటకు నేనెవడను? నేనుమాత్రము బ్రహ్మరాక్షసుడను బ్రహ్మరాక్షసుడ నుగా మిగిలిపోవుదును.

జితేదాస్తి: అందుచేత నన్నేమి చేయమందువు?

పవివర్మ: మీ మామగారితో నత్తగారితో చెప్పుము. వారెప్పుడు ని మాట విందురు. ఇప్పుడు నీమీద పెద్ద మోజుగానున్నది కదా!

"పవివర్మ నొక బ్రహ్మరాక్షసుడు పట్టినాడు. నేను వానిని వదలించి నాలుగైదు దినములలో తీసికొని వత్తును. పవివర్మ తిరిగివచ్చినంతనే యందఱివలెనే సమృద్ధిగా లౌకిక పరిజ్ఞానము కలవానివలె నగును" అని చెప్పి యతనిని తీసికొని రమ్ము. ఈ సంగతి యందఱికును తెలియును. అతడు తిరిగివచ్చిన తరువాత నెవ్వరును విడ్డూరపడరు.

జితేదాస్తి: అట్లే చేయుదును. కాని పాతికవేల దీనారము లిచ్చుట కెట్లువచ్చును.

పవివర్మ: నీవే తెచ్చికొనవలెను.

జితేదాస్తి: నేనెట్లు తెచ్చికొందునయ్యా! చివరకు మూడు బండ్లయిన కావలయును. ముప్పది నలుబదిమంది సాయుధ భటు లుండవలెను. సన్యాసివాని పెండ్లికి మొలత్రాడు దగ్గఱనుండి యరువేనట.

పవివర్మ:- నేను తెచ్చి క్రుమ్మరింతును. నీ వెచ్చట దాచెదవు? ఈ ధనమెచ్చట నుండి తెచ్చితినందువు? ఈ లోకములో నెన్ని యిబ్బందులు? మనకు ధనము దొఱికిన దనగనే సరిపోయినదా! నీ పరాక్రమమునకు భయపడి యీ యూరి రాచకుమారు లూరకున్నారుగాని యివుడు దీనికూరకుండరు. నీకు ధనము దొరికినదనిపోయి మధ్యలభు నగరములో నరేంద్రదేవమహారాజునకు చెప్పుదురు. అతని మూడవ కుమారుడైన వీరదేవునకు మనకు సంబధముగాని నరేంద్రదేవునకు మనకు నేమి సంబంధము? ఆయన రాజభటులను పంపించును. నీ పెండ్లి కాదు. నా గొండ్లిలేదు.

జితేదాస్తి:- మరియేమి చేయుమందువు!

పవివర్మ:- నా కొక యూహ తోచుచున్నది. మీ ఛోకో యున్నాడు కదా! మీతాతయైన బలదేవుడు తనవద్ద కొంత ధనమును దాచెనని చెప్పును. వాడప్పుడప్పుడు కొంత కొంతగా తెచ్చి యిచ్చుచున్నట్లు నటింపించుము. మీ పెద్దతాత భార్య గంగాదేవి మూడు వందల దీనారములే తెచ్చినదని యెవ్వరికిని తెలియ నీయకుము. ఆమె మగడు త్రినేత్రుడు. అతడు వ్యాపారమును చేసెను. నాలుగైదువేల దీనారములు దాచెను. అది నీకు వచ్చినది. ఒక్కసారి పాతికవేలు వచ్చినదనగా లోకము దుఃఖించును గాని యింతయని యెవ్వరికి తెలియకుండ నీవు వ్యయపెట్టు చుండుము. నీవు పట్టుబడవు.

జితేదా స్త్రీ:- మరి ధనము నెచ్చట దాచుమందువు?

పవివర్మ:- నీరెండు నిత్రాళ్ళపాకలో గోయిత్రవ్వి యందులో నుంచుము.

జితేదా స్త్రీ:- మేమచటనుండము. అది యొకవైపున నుండి వచ్చి యింకొక వైపునకు బోవునేమో!

పవివర్మ:- నేను దానిని రక్షించుచుందును.

జితేదా స్త్రీ:- నీవు శిథిలనగరమును వదిలిపెట్టి రావుగదా!

పవివర్మ:- నాకంటె దలకుమానిన వాడుండడు. నేను నీతో చెప్పలేదు. నేను సుదర్శనభట్టారకుని కోటిజపము చేయుమంటిని. నాకు కోటియక్కఱ లేదు. అది మహామంత్రము. నా కేబదిలక్షలు చాలును. రెండవ యేబదిలక్షలు నాతోపాటు చనిపోయిన యింకొక ద్వారపాలకుడున్నాడు. వాడు బ్రాహ్మణుడు కాడు. వాడును పిశాచమయ్యెను. వాడు నా మీద నభిమానముచేత చచ్చెను. ఏడ్చెడి దానిమగడు వచ్చినచో నా మగడును వచ్చునని నాతో కూర్చున్నాడు. వాని నిచ్చట నుంచెదను.

జితేదా స్త్రీ:- అతడు శిథిలనగరమున మా కెప్పుడును కనిపించ లేదే!

పవివర్మ:- మీ రచ్చట నెనిమిది నెలలుండిరికదా! ఒక్కనాడు కాకపోయిన మరొక్కనాడు మీకు మానవుడన్న పురుగు కన్పించెనా? వాడు మానవులను విఱుచుకొని తినును. ఆ ప్రాంతముల కెవ్వరు రారు. వాడున్నాడని యందఱకును తెలియును.

జితేదా స్త్రీ:- మమ్మెట్లు రానిచ్చెను?

పవివర్మ:- ఎట్లు రానిచ్చెనా? మన కథయంతయు వానికి తెలియును. పూర్వము నాకును నీకును చెలిమియని వానికి తెలియును. మన పథకమంతయు వానితో చెప్పితిని. తన యొక్కయు నా యొక్కయు పిశాచత్వమును రక్షస్త్వమును పోవలయుననగా నది నీ మీద, సుదర్శనభట్టారకుని మీద నాధారపడియున్నదని చెప్పితిని. వాడప్పటికిని రెండుమూడుసార్లు సుదర్శనభట్టారకుని మీదికి పోనెంచెను. అయన యీ మంత్రమును దినమునకు పదిసార్లయిన జపించునుకదా! అందుచేత నతని మీదికి పోవుటకు వీలులేక పోయెను.

ఇంక నీ వున్నావు. నీవు గంధర్వుడని వానికి తెలియును. పిశాచములు గంధర్వుల నేమి చేయగలవు! కాని నీవు మనుష్యుడవై పుట్టితివని మానవుడవైన నిన్నెందుకు ప్రతారించరాదని వానియూహ. నీవు సాధ్యుడవో కావో, చూడవలయునని వాడొక యెత్తు నెత్తెను. ఆవాడు నీవు మెడ విరిగించి చంపిన భల్లూక మున్నదే! అది వాడు ప్రయోగించినది. వాడుకూడ ముఖాముఖి నీ మీదికి రాలేదు. నీ భార్యమీదికి వెళ్ళెను. ఆమెను హరించినచో, నీవూరకున్నచో నపుడు నీవు సులభసాధ్యుడ వగుదువని యూహించెను.

జితేదాస్తి:- మరి యది యెట్లు తప్పెను?

పవివర్మ:- ఎట్లు తప్పెనా! చెప్పు మందువా? నీ భార్య పేరేమి? వీరదేవవర్మ ప్రేమించిన స్త్రీ పేరేమి? ఆమెను కాచికొనియేకదా నేవా శిథిలనగరముననున్నది! ఆమె పేరుతో నా నగరమును నిర్మించవలయు ననియేకదా, వీరదేవవర్మచేసిన ప్రయత్నము! అది నడుమ విఘటిత మయ్యెగదా! మేమక్కడ మువ్వురు పిశాచులము. నేను బ్రాహ్మణు డను. ఆమె క్షత్రియురాలు. వాడు శూద్రుడు. మీరు శిథిలనగర మునకు వచ్చినప్పటినుండి పిశాచియై వర్తించుచున్న యా క్షత్రియ స్త్రీ నీ భార్యను రక్షించుచున్నది. అంతియేకాక, నీ భార్యను గూరిన[?] భక వేచి యున్నది. దానికేమి! ఇట్లు చేయుదమా?

జితేదాస్తి:- అట్లే చేయుదము, ఓయి! కాలాభట్టా! లోక ములో నిట్టికథలు వందలు జరుగును. వానియంతట నవి జరిగినట్లు కన్పిం చును, వానిని ప్రజలు మూర్ఖులై విశ్వసింతురు. కాని దేవతలు, పిశా చములు కలసి యిట్లు చేసిన వనగా విశ్వసించరు.

పవివర్మ:- తరువాత పిశాచములగు వారెందుకు విశ్వ సింతురు?

జితేదాస్తి:- అట్టివారు పిశాచము లగుదురందువా?

పవివర్మ:- నవ్వుచు నన్నాను. వారిప్పుడు పిశాచములు కాక పోయినకదా!

జితేదాస్తి:- వారికి గోపము వచ్చును సుమీ!

పవివర్మ:- అందులో పెద్ద తప్పేమియు లేదయ్యా! ఇంద్రియా తీతములైన విషయములను విశ్వసించుటయు విశ్వసించక పోవుటయు.

ఆస్తికులు విశ్వసింతురు. నాస్తికులు విశ్వసించరు. తాము ధరించిన శరీరములకు ప్రాధాన్యమా! లోనున్న జీవలక్షణములకు ప్రాధాన్యమా! వారి సంగతి నెందుకాలోచించరో తెలియదు. ఏదో ప్రోగు చేసికొందమని. అంతయు నిక్కడనే తావుకొందమని.

జితేదాస్తి:- బ్రాహ్మణుడైన వాడు దయ్యమైనను వానిగోల వానిదే పోనిమ్ము. నీవు వెళ్లుము రెండు మూడు దినములలో పవివర్మయు నేనును వత్తుము.

పవివర్మ:- సుదర్శనభట్టారకుని తీసికొని రావలయును.

జితేదాస్తి:- నాకు నీ విచ్చెడి ఋణము కావలయును. ఎవని కొఱకు తీసికొని వత్తును.

వారము దినములైనది. పవివర్మ వచ్చెను. అతని కథ పూర్వమే ప్రచారము జరిగెను. అతడు బాకువలె నుండెను. ప్రతివిషయము జితేదాస్తి చెప్పుచుండెను. అతని వివేకమును చూచి జనులు నివ్వెఱ పోవుచుండిరి. వారు లక్షాధికారులవలె ప్రవర్తించుచుండిరి. ఇంత ధన మెచ్చటిది? ఇంత ధనమెచ్చటిది? ఇతనిని వదలి పోయిన బ్రహ్మరాక్షసుడు ఇచ్చెనని యెవరు చెప్పిరో తెలియదు. ఎవ్వరును చెప్పలేదు. దానియంతట నదియే ప్రచారములోనికి వచ్చెను. వివాహమను ఫెళ్లుమని జరిగెను.

సగము కాంతిపుర మక్కడనే యుండెను. పూర్వము వాలాంబను చూచినచో పాలమ్మెడు గొల్ల. ఇప్పుడొక మహాక్షత్రియాంగన. ఆమె పుట్టింటివారు వచ్చిరి. అది యంతయు గ్రామస్థులకేమి! జితేదాస్తికే విడ్డూరముగా నుండెను. అన్నింటికంటె నాశ్చర్య మేమనగా గంగాంబ పుట్టింటివారు జాలంధరము నుండి వచ్చిరి. జితేదాస్తి నాయనమ్మ పుట్టిల్లుకూడ జాలంధరమే యయ్యెను. అంతయు నొక యాశ్చర్యముగా నుండెను. కార్తవీర్యార్జునుని తేరిచూడరాకుండ నుండెను.

సుదర్శనభట్టారకుడును, నాగేశభట్టును పెండ్లి పెత్తన మంతయు చేయుచుండిరి. ఏమి సంతర్పణములు! ఏమి విందులు! ఏమి రాచనడవళ్లు! నిజానికి పెండ్లికూతురు వారు పెండ్లికొడుకు వారు నొక్కటియే. కాని పెండ్లికొడుకువారు తరలి వచ్చుట, విడిది

చేయుట మొదలైన యాచారము లన్నియు యథావిధిగా జరుగు చుండెను. పవివర్మ తన చెల్లెలి భర్తకు వేయి దీనారములు చదివించెను. పళ్లెములోపోసి తీసికొనిరాగా జనుల కనులు మిఱుమిట్లు గొనెను. ౭౪ యూరు చదివించెను. ఆ యూరి పేరు చెప్పలేదుగాని భవిష్యత్తులో నొక యూరు కొని పెట్టెదనని చెప్పెను.

సంతోషించుటకు వీలులేదు. వెక్కిరించుటకు వీలులేదు. కాని, యొక్కటి యున్నది. పవివర్మ యపండితుడు. క్షత్రియోచిత విద్యలు కలచినవాడుగాడు. అది ప్రత్యక్షముగ గనపడుచుండెను. అన్నిటి కంటె నాశ్చర్యమేమనగా కార్తవీర్యుని కుమార్తె యందు సంతఃపురస్త్రీ లక్షణమే లేదు. భర్తయందు లజ్జవహించుటలేదు. పురుషులతో తగ్గిమాటాడుట లేదు. అన్నగారి పేరుమీదుగా వ్యవహారమంతయు తానే చేయుచున్నది. అదియొక్కటి యందఱకు కంటగింపుగా నుండెను. కాని, ఏమి చేయుదురు? భార్యాభర్త లిద్దరు మున్నే లేచిపోయినవారు.

ఇంత సంపదయెక్కడిది? బ్రహ్మరాక్షసుడు పట్టుటయేమి! వాడు వదలుటయేమి! అది మాత్రము ప్రత్యక్షముగా కన్పించు చుండెను. అంతకంటె ప్రత్యక్షమైనది-జితేదాస్తి యొక్క శౌర్యము. అతడు హఠాత్తుగా సుక్షత్రియుడగుట. క్రాంతిపుర క్షత్రియులు తల మిగిలినవారు. మీసాలు మెలికెలు తిరిగినవారు. బొమ్ములు కవాట ద్వారములవలె నున్నవారు. పెండ్లి పెద్దలు. వారికి విడుదులు. వారికి భోజనములు. వాద్యములు. సంతయు భూలోక వైకుంఠముగా నుండెను. క్రాంతిపుర క్షత్రియులకే యీ సంపదయు నీ డాలును నచ్చెరువు గలిగించుచుండెను. ఒకరిద్దరు సుదర్శనభట్టారకు నడిగిరి. అతడు తనకు తెలియదనెను.

శుకదేవవర్మ భట్టారకునితో, "స్వామీ! గంగాదేవిని ననసూయా దేవిని మనము చూచితిమికదా! వారు తెచ్చినవి మూడు వందల దీనారములు. వారు కొన్నివేల దీనారములు తెచ్చెనందురేమి!

సుదర్శన:- "వారు మనతో చెప్పలేదు కాబోలు"ననెను.

శుకదేవవర్మ:- మన పదిదీనారము లెందుకు పుచ్చుకొన్నట్లు?

సుదర్శనుడు:- అట్లు తీసికొనకపోయినచో మనము వారి పెద్దతనమును సందేహింతుమేమోనని కావచ్చును.

ఇట్లొకవైపున మరియొకవైపున "పాలాతుడు తన ధనము నంత థోకోదగ్గఱ దాచినచో పాలాతుడు మైథిలీపురమున నిరుపేద వలె నెందుకుండెను? కొడుకైన గాలికైన నిచ్చిపోవచ్చును గదా! ఇప్పుడు హఠాత్తుగ మనుమని కిమ్మని యింత ధనమిచ్చెనా? ఈ థోకో కడచిన యేబది యరువదియేండ్లుగా మైథిలీపురమునకు వచ్చుట చాల మంది ఎఱుగుదురు. అతడు వచ్చుటయు పాలాతుని యింటగాని, గాలి యింటగాని భోజన మెప్పుడును చేయకపోవుటయు ఏ పూట కా పూట వారు తిండిలేక బాధపడుచుండగా, వారికి నేను బరువగుట ఎందుకని థోకో వారియింట, వారియింట భోజనము చేయుటయు, వీరి పేదఱికమును గూర్చి చెప్పుటయు జరిగెడిది. ఆ థోకో యెప్పుడు నొక్క పచ్చని నాణెము తెచ్చుట గాని, వాని వద్దనుండుటగాని ఎవ్వరు నెఱుగరు. అందందొక రిద్దరు వీరికి బ్రహ్మరాతుసుడు ధన మిచ్చెననియు, ఆ ధనము మాట మధ్యలఖు నగరమునకు తెలియజేయ వలయుననియు ననుకొనుట జరిగెను గాని, యెవ్వరికిని ధైర్యము చాలలేదు.

ఇది యిట్లుండగా నా శుకదేవవర్మ కూతునకు కూతురు గలదు. ఆమె పదునారేండ్ల బాలిక పవివర్మ కిరువదియేండ్లున్నవి. అతని కిత్తునని శుకదేవవర్మ చెప్పెను. ఇత్తుననుట, పుచ్చుకొనుట, లగ్నము నిర్ణయించుట; పవివర్మకు కట్నము నాల్గువేల దీనారములు. ఈ ధనమును కాదనుట యెట్లు? అంతయు నొక యింద్రజాలమువలె నయ్యెను. ఎక్కడి క్రాంతిపుర క్షత్రియులు! వారి మర్యాదలెక్కడ? వారి శౌర్యము లెక్కడ? ఈ పవివర్మ యెవరు? నిన్న మొన్నటిదాక వీడొక మనిసియేనా? కార్తవీర్యార్జునుని యనంతరమున నీ కోటయు వారి గ్రామమును మైథిలీపురములోని క్షత్రియులు తలాయొక చెక్కయు తీసికొందమని యూహించెడి కథ యంతయు తారుమారై పోయెను.

జితేదాస్తి పెండ్లియు, పవివర్మ పెండ్లియు జరిగి కొంత చల్ల బడువఱకు జితేదాస్తియొక్క రెండు నిద్రాళ్ళ పాక పాకగానే

యుండెను. అది యతడు తీయించలేదు. ప్రక్క నొక స్థలమును గొని దానిలో భవనమును నిర్మించెను. రెండునిట్టాళ్ళ పాక యున్న స్థలముతో కలిపి చుట్టును పెద్ద ప్రాకారము నిర్మింపబడెను. జితేదాస్త్రియు, నతని భార్యయు, నతని తల్లియు గంగాదేవియు నన సూయాదేవియు పోయి తమ భవనములో నివసించుచుండిరి.

ఒకనాడు శుకదేవవర్మ జితేదాస్త్రి యింటికి వచ్చి జితేదాస్త్రి భార్యను చూచి, "అమ్మా! నా బిడ్డను మీ చేతిలో పెట్టితిమి. మీరందఱు కలిసియుందు రనుకొంటిని. మీరు వేఱు సంసారమును పెట్టుకొన్నారు. వరుసచేత వదినెగారు వయసుచేత మఱదలునైన మా బిడ్డను నిన్ను జూచి యిచ్చితి" ననగా, నామె, "మా యన్న యిచ్చుట నావద్దనే యుండును. ఆయనకు నేను చదువు చెప్పుట ప్రారంభించితిని. ఖడ్గవిద్య నేర్పించుచున్నాము. ఏడాది రెండేండ్లలో మా యన్న యందరు క్షత్రియులవలెనే యుండును. అట్టివారికి చదువు తొందఱగా వచ్చును. వారి శక్తులు కారణాంతరములచేత నణగియుండును. పుట్టుకచేతనే మూర్ఖులైనచో నది వేఱు. గ్రహ చారముచేత శక్తులు వికసించనిచో గ్రహచారము తొలగినంతనే వారు మేఘ ముఖముగా భూమిని పెగుల్చుకొని వచ్చెడు కొన్ని వృక్షములవలె నగుదురు," అనెను.

కథ నడచుచుండెను గాని, జితేదాస్త్రి తొల్లింటివలె లేడు. అత డెప్పుడును విచారగ్రస్తుడై కనిపించుచుండెను. కారణము భార్యకు గూడ తెలియదు. ఇంత ఋణము నే నెట్లు చెల్లింపగలనా యన్న భయమో దిగులో! కాలాభట్టుతో తాను నిర్ణయించుకొన్న మహా కార్యము నెట్లు సాధింతునా యన్న మనసులోని బరువో తెలియదు. తానింక మైథిలీపురములోనుండి జాగు చేయుటకు వీలులేదు. అన్నింటి కంటె రెండు విషయము లతనిని బాధించుచుండెను. జాలంధరము నందున్న సూర్యవంశ క్షత్రియులమీద పగ సాధించవలెను. ఇది యొకో పట్టుదల. గంగాదేవి కానహిర్వంశ క్షత్రియురాలనును. జాలంధరము నందలి కొందఱు క్షత్రియులు మా యింటి యాడుబిడ్డ యని యందురు. ఎవరి మాట వినవలయును? గంగాదేవి మాటయే ప్రమాణము గావలయును. ఇదియొక విషయము.

రెండవది మరియు పెద్ద విషయము. ఆయాలంబరవర్మయు, శుకదేవవర్మయు వారితోడి గుణకామ, లక్ష్మీకామ దేవవర్మలును, వామదేవశాఖీయమైన వారి సంప్రదాయము, నాటి జ్యోతిష్యము, వారి సంఘముయొక్క రహస్య నిర్ణయములు జితేదాస్తితో రహస్యముగా జెప్పిరి. తన ముత్తాతయైన భాస్కరదేవవర్మ, నందదేవవర్మ మహారాజునకు సాయపడినందువలన గంధగిరిపుర క్షత్రియులు తన ముత్తాత నేమి చేసిరో తన తాతలేమియైరో జితేదాస్తికి తెలిసెను. తానొక్కడు అటు జాలంధర వీరులమీద పగదీర్చికొనవలయును. ఇటు గంధగిరి క్షత్రియులను సాధించవలయును. తన భావమదియత్తగారింటివైపున వారిని సంతోషపెట్టుటకు మధ్యలక్షు నగరమునకు బోయి నరేంద్ర దేవవర్మతోనో ఆయన మూడవ కొడుకైన వీరదేవవర్మతోనో సంబంధము పెట్టుకొనుట యోగ్యముగా కన్పించలేదు.

అది చేయనిచో కాలాభట్టుతో తాను చేసికొనిన యొడంబడిక యేమి కావలయును? అతడు బ్రహ్మరాక్షసుడు. ఆగతానాగతవేది. తాను గంధర్వుడు. దేవయోని. తాను శివప్రసాదమును పొందినను తమరిద్దరు కలిసి వేసికొన్న పథకము నేటికి చూడగా నొకదానికొకటి పొసగివచ్చుటలేదు. ఈ శుకదేవవర్మ తన మనుమరాలిని వదివర్ధకీయకుండినచో నెంత బాగుగా నుండెడిది! ఆ మొగమోటమి యింత బలవత్తరముగా నుండెడిది కాదు ఏదో తాను వామదేవశాఖీయుడు. తన తండ్రి యెఱుగడు. తాత యెఱుగడు. కాలాభట్టు నొత్తిశిచేత తాను గాలియొక్క గర్భమున నుద్భవించెను. గాలి సామాన్యురాలైన యొక రాచగొల్ల యనుకొని.

అన్నిటి కంటె తాను చేసిన తప్పు వేఱే యున్నది. తనకు నుంతజ్ఞానము వచ్చినంతనే తన దారిని తాను లేచిపోక కార్తవీర్యుని యింట పీట పెట్టుకొని కూర్చుండుట యెందులకు? అతని కూతురు మీద తనకు వలపుదయించుట యెందులకు? తనకు పంద్రెండేండ్లు వచ్చినప్పటినుండి యామెను గూర్చియే యూహయయ్యెను. తన గంధర్వలోకమును మరచెను. తాను కాలాభట్టుతో చేసికొన్న యొడంబడిక విస్మరించెను. ఈమెయా యందగత్తె కాదు. మరి

తానెందుకు ప్రేమించుచున్నట్లు? ఆమె మానవి కాదు. గంధర్వ లోకాంగన.

# 14

మిథిల నగరమునుండి వారు మైథిలీపురము వచ్చి రెండు నెల లైనది. జితేదాస్తికి పెండ్లియైన తరువాత గాని యతడు నతని భార్యయు మరల నొకనాటి రాత్రి కలిసికొన వీలుపడలేదు. జితేదాస్తి వ్యవహారములలో మునిగియుండెను. వారొకనాటి రాత్రి కలిసికొన్నను కలిసికొన్నట్లు లేదు. తాను చాల ప్రొద్దుపోయి గదిలోనికి పోయెను. ఆమెయు పవలెల్ల శ్రమపడి అలసిసొలసి నిదు రించుచుండెను. ఇత డామెను మేల్కొలుపనేలేదు. ఇంతలో స్వంత భవనమును నిర్మించుట. మరల నీ ప్రయత్నము, తనకు పట్టిన దిగులు; తానింక బయలుదేఱిపోవలయును. భార్యతో చెప్పవలయును. ఆమె యేమనునో తెలియదు. ఎట్లయిననేమి యిన్నాళ్ళకు భార్యాభర్త లిద్దఱు నాడాశ్రమములో నెంత స్వతంత్రముగా నుండిరో యంత స్వతంత్రముగా నుండిరి. వారికి ప్రొద్దుపోవుటయే నొడళ్లు తెలియ లేదు. లోకము తెలియలేదు. జితేదాస్తికి తన నెత్తిననున్న కార్య భారమే గోచరించలేదు. అట్లు మూన్నాళ్లు గడచిన తరువాత వాల్గవనాటికి ప్రేమప్రవాహము కొండలనుండి దిగి బయలుల లోనికి వచ్చెను.

అత డిట్లనెను :- ఎచ్చటనైన బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు తొలుత నుపనయనము, తరువాత వివాహము, ఆపైన శోభనము. మన యిద్దరి నడుమ చివరినుండి మొదలుపెట్టినది.

ఆమె:- కలి ప్రవేశించి మూడువేల యయిదువందలయేం డ్లయినది.

అతడు:- అనగా పోను పోను ఇట్లే యుండునందువా?

ఆమె:- ఇంతకంటె నెక్కువగా నుండును. ప్రొద్దున నుపనయ నము, మధ్యాహ్నము పెండ్లి, రాత్రికి శోభనము.

అతడు:- కాదు కాదు. ప్రొద్దున నుపనయనము. మధ్యాహ్నము పెండ్లి. శోభన ముండనే యుండదు. అదివఱకెప్పుడో జరిగిన దానికి తొందఱ ఏమున్నది?

ఆమె:- అవును. మనమేమి తొందఱపడినాము? ఆనాటి యాశ్రమములోని జితేదాస్తిని నేడు మరల నాల్గుదినముల క్రింద నెఱుగుదును.

అతడు:- రెండు నెలలకే యిట్లన్నచో నీసారి నీ మగడు పోయి రెండేండ్లకు తిరిగి రావచ్చును. అప్పుడేమందువు?

ఆమె:- అట్లు వీలులేదు. నిన్ను నేను వెంటనే వెడలి పోనీయను.

జితేదాస్తి:- నీతో నెన్నియో రహస్యములు చెప్పవలయును. నీ వంగీకరించనిచో, నీవనుగ్రహించనిచో నే నెత్తిన జన్మ వృథా యగును. ఇంకొక భర్తయైనచో భార్య నీవంటి వివేకవతి కానిచో చెప్పడు, సంపూర్ణమైన నీ యంగీకృతి కలిగిననే పోదును. కలుగునను కొందును.

తరువాత జితేదాస్తి సర్వ విషయములు భార్యతో నెలనాళ్లు చెప్పుచుండెను. అప్పటి కామె కొంత యంగీకరించెను. ఆమె సంపూర్ణముగా నంగీకరించవలయును. దానికి మరల రెండు నెలలు పట్టెను.

ఈలోపుగా కాలాభట్టు రెండుసార్లు వచ్చెను. ఎట్లు వచ్చెను? పవివర్మ రెండు దినములు స్తబ్ధువలె నుండును. జితేదాస్తి బావ మఱదిని ప్రత్యేకముగా పిలిచి కాలాభట్టుతో మాటాడును.

జితేదాస్తి చివరి కిట్లనెను:- నీకేమి తెలియును? నీ వాజన్మ బ్రహ్మచారివి. భార్యయొక్క యంగీకృతి లేకుండ నేను పోను. నా మాట పోయినను సరే! ఆమెను సర్వవిధాల నొప్పించితిని. నేను రెండు మూడు దినములలో బయలుదేఱి మధ్యలఖు నగరమునకు పోవుచున్నాను. నీవు మరల నా బావమఱదిమీదికి రానని వాగ్దాన మిచ్చినచో పోదును. లేనిచో పోను.

ఇదుగో వాగ్దానము.

ఇదుగో, రేపు నేను బయలుదేరుచున్నాను.

# 15

''లోనికి పోవచ్చునా?''

''ఆ రీతి నడుగనక్కర లేని వారడుగుటలో నా క్షేపణ యున్నదా?''

''ఆక్షేపణ యెందుకు కావలయును? చమత్కారము కావచ్చును. ప్రేమ కావచ్చును. పరాచికము కావచ్చును.

"రాక్షసుల కిట్టివి తెలియవు.''

''పోవచ్చుననుకొందును.''

''లోన తమరి కొరకెదురు చూచుచున్నారు.''

"సరే! దౌవారికుని యనుమతి లేకుండా పోరాదు,''

''చివరకు నా చేత నిట్లడిగించికొని నన్ను వలదనుటకా!''

''అయినచో పోయెదను.''

ఆమె లోనికి పోయెను. ఆమె వెంట జితేదాస్తి కూడ వెళ్ళెను.

వెళ్ళుచు జితేదాస్తి "ఏమయ్యోయి! కాలాభట్టా! నేను కూడ పోవుచుంటిని. ఆమె కనుమతి యున్నది కాని నాకు లేదు. పైగా నిది యంతఃపురము. నేను పురుషుడను." అనగా,

కాలాభట్టు:- ''అయ్యా! నాకు తెలిసినదొక్కమాట చెప్పెదను. పురుషులు, స్త్రీలు నన్నది జంతువులకు, మానవులకు పిశాచములకు లేదు. కాని కొన్ని గ్రహములున్నవి. వానికున్నది. పురుష గ్రహములు స్త్రీని పట్టుకొనును. స్త్రీ గ్రహములు పురుషుని పట్టుకొనును. అది శృంగారరసము కాదు. చట్టుబండలు కాదు. శృంగార రసవ్యాజమున నెత్తురు పీల్చుట. నేను వందపైన నేండ్లుగా నిట్లుంటిని. ఆ శాకినీ ఢాకినీ ప్రముఖ గ్రహములను గూర్చి యెప్పుడును విచారించ లేదు. మీ రెట్లును లోనికి పోవుదురు. ఇప్పుడు నా యధికారము లేదు. నేనిక్కడ నూఱకే నిలుచుంటిని. మరల నెప్పుడు నీ దర్శనము చేయుదునో నాకు తెలియదు. నీతో నొక మాట స్నేహముతో చెప్పవలయు ననుకొంటిని. అది పెద్దమాట

కాదు. దానివలన ప్రయోజనము లేదు. ఒకప్పుడు నీతో పిశాచములు, మానవులు మొదలైన ప్రసంగము చేసితివి. ఆ సంబంధమైన మాట. ఏదో నాకుతోచినది అప్పుడు నీతో చెప్పవలయు ననుకొన్నాను. ఇప్పుడు మరల జ్ఞాపకమునకు వచ్చినది, నీ కాలమును వ్యయపరచుచున్నానేమో;'' అనెను.

జితేదాస్తి:- నేడు శుక్లపక్ష దశమి. ఈ యారు దినములు మాకు పని లేదు. తరువాత నామె మైథిలీపురము పోవును. నేను మధ్యలఘునగరమునకు బోదును.

కాలాభట్టు:- మరి యిక్కడకు వచ్చుట యెప్పుడు? పని ప్రారంభించుట యెప్పుడు? మధ్యలఘునగరములో నేమి చేసితివి?

జితేదాస్తి:- విత్తనము వేసితిని. అంకురించినది. కొంత పెరిగినది. దోహదములు వేసి పెంచుచుంటిని. మరల నింకొక శుక్లపక్ష దశమినాటికి వత్తుము కదా! అంతయు నప్పుడు చెప్పుదును.

కాలాభట్టు:- నాకు తొందరగా నున్నది. కాని నిన్ను తొందఱ పెట్టుట యెందులకు? ఇది నీ దయమీద నాధారపడియున్న పని. ధనము నేనిచ్చునదే యనుకొనుము. పని చేసి పెట్టెడివాడవు నీవు కదా!

జితేదాస్తి:- ''నేనిప్పుడు కూడ వేతనము తీసికొనవచ్చునా? వేతనమెంత? నెల కింతయని తీసికొమ్మందువా? వారమున కింతయని తీసికొమ్మందువా?

కాలాభట్టు:- ఆ మాట యేమిటయ్యా జితేదాస్తీ! ఆ పాతిక వేల దీనారములు నీవు వేతనము క్రింద కట్టుకొనుము. మా కీరెండు పనులును చేసిపెట్టుము.

జితేదాస్తి:- "ఒక పనికే కద! మనము మాటాడుకొన్నది,

కాలాభట్టు:- ఏ పని?

జితేదాస్తి:- ఈ నగర నిర్మాణము.

కాలాభట్టు:- :-మరి నా మాట!

జితేదాస్తి :- అది నీవును, సుదర్శనభట్టారకులును చూచుకొనవలయును.

కాలాభట్టు :- లౌకికులతో నిబ్బంది యిది. నేనంతయు జట్టిగా మాటాడితిని.

జీతేదాస్తి:- మరి లౌకికము తెలియదందువేమి?

కాలాభట్టు:- సరే! నేను భట్టారకులతో మాటాడెదను. అది యెంత దూరము వచ్చినది?

జీతేదాస్తి:- రెండు వృత్తములును సమానముగా పెరుగు చున్నవి.

కాలాభట్టు:- లోనికి పొందు.కాని జీతేదాస్తీ!లోన నంతఃపుర స్త్రీ యున్నది. నీవు పురుషులలో నెంత యందగాడవో, ఆమె స్త్రీలలో నంత యందగత్తె.

జీతేదాస్తి:- నీవు పురుషులలో నెంత యందగాడవో, నా భార్య స్త్రీలలో నంత యందగత్తెయనియా నీ యుద్దేశ్యము?

కాలాభట్టు:- అయ్యా! వివాహమైన తరువాత స్త్రీ పురుషులు తమ జతగానియొక్కగాని, తమ జతగత్తెయొక్క గాని యందమును విచారించరు. అవియన్నియు మొదటనే. ఎవరో తలకు మాసినవారుగాని ఆ విచారణ చేయరు.

జీతేదాస్తి:- ఆయూరులో మంగలు లుండరనుకొందును.

కాలాభట్టు:- ఉన్నను వాడు చేయించుకొనును. ఆమె యెట్లు చేయించుకొనును!

జీతేదాస్తి:- కొన్నిచోట్ల భర్త చనిపోయిన తరువాత బ్రాహ్మణ స్త్రీలు బుఱ్ఱలు గొరిగించుకొందురట. భర్త చనిపోయి వాడు. ఆమెకు తల మాసినది. మంగలికి వార్త పెట్టినది. వారు రాలేదు. మావారున్నచో మంగలినైన పిలుచుకొని వచ్చెడివారు అని. స్త్రీలలో తలకుమాసిన దనగా నది. ఇంతకు నీవు చెప్పవచ్చిన మాట యేమి?

కాలాభట్టు:- ఏమియు లేదు. నాకిది యాశ్చర్యముగా మున్నది. నేను బ్రహ్మరాక్షస్సునైనాను కదా! నాతో నింకొకడు పిశాచమైనాడని చెప్పితిని, వానితో నేను "ఒరీ! మన యిద్దరకు నీ పిశాచ జన్మలు పోవుటకు నేను ప్రయత్నము చేయుచున్నాను." అనగా వాడు "జీతేదాస్తి ఒప్పుకొన లేదయ్యా! నేనెన్నాళ్ళు పిశాచముగా నుందునో! భగవంతుడెన్నాళ్ళు నాకిట్లుండవలయునని వ్రాసెనో? అన్నాళ్ళు నిట్లే యుందును. నాకీ పిశాచజన్మ పోవుట

యిష్టము లేదు. ఈ జన్మలో నాకు సుఖమున్నది. దానిని నన్నెందుకు పోగొట్టుకొమ్మందువు? నేను మనుష్యుడుగా నున్నప్పుడు కూడా నాకిట్లే యుండెడిది. అప్పుడు నేను చచ్చిపోవుట నాకిష్టము లేదు. ఆ మనుష్య జన్మలో నున్నప్పుడు నేను వట్టి సేవకుడనే. నాకు తెలియును. కాని నాకెన్ని యాశలుండెడివి. సేవకులందరి మీద నేనధికారిని కావలయునని యుండెడిది. రాజభోజనము చేయవలయునని యుండెడిది. నాకు కొందఱిమీద విరోధము యుండెడిది. వారిని వధించవలయునని యుండెడిది. నాకవేమియు సాధ్యము కాలేదు. బ్రతుకవలెననియే యుండెడిది. ఏమో! ఎప్పుడేది వచ్చునో! ఏది ప్రాపించునో! నేను చనిపోవుట యనగా మత రాము నాకిష్టముండెడిదికాదు. ఇప్పుడు నట్లే యున్నదయ్యా! ఈ పిశాచ జన్మ పోవుట నాకిష్టము లేదు." అన్నాడు. "నోరు మూయుమురా గాడిదా!" యంటిని.

"ఇదియేమి సృష్టి! ఎప్పుడే జన్మ యెత్తిన, దానిమీద నంత మమకారమా! నన్ను మనుష్యులను చూచి జాలిపడమందువా? పిశాచములను చూచి జాలిపడుమందువా?"

జితేదాస్తి:- కాదు కాదు. గంధర్వుడను నన్ను చూచి జాలి పడుము నేనేమి తక్కువ వాడనటయ్యా! నీవు బ్రాహ్మణుడవు కనుక నిది యంతయు వ్యామోహమని తెలిసికొన్నావు. నీ యదృష్టము. మీ బ్రాహ్మణులలో నెంతమంది యిట్టి కోరికలు గలవారు లేరు! బ్రాహ్మణులు కానివారిలో నెంతమంది నీవలె వైరాగ్యము కలవారు లేరు. నిజానికట్టి వైరాగ్యము కలవారందరు బ్రాహ్మణు లననుగాని బ్రాహ్మణభావము కలవారు కావలసినదది. మరి నా నిష్కృతి మాట యేమి చెప్పితివి? నేను గంధర్వుడనై మానవుల కంటె నధికభోగములనుభవించు, మానవుడై యనుభవించు భోగముల స్వరూపమెట్టిదో యన్న యాశచేత కదా! నీతో నీ యొప్పందము చేసికొంటిని.

కాలాభట్టు:- మరి యిప్పుడెట్లున్నది?

జితేదాస్తి:- ఇప్పుడిదే బాగున్నది. అప్పుడది బాగుగా నున్నది. ఒకవేళ నేను పిశాచమునైనచో నెట్లుండును?

కాలాభట్టు:- అది కూడ కావలయునని యున్నదా?

జితేదాస్తి:- నేను మధ్యలఖు నగరము పోను. నాకు నీ నగర నిర్మాణముతో పనిలేదు. నేను నా భార్యయు సుఖముగా నుందుము.

కాలాభట్టు:- మరి నా ఋణము మాట యేమి చెప్పితివి?

జితేదాస్తి:- నేను తీర్చలేనయ్యా! కాలాభట్టూ! తీర్చలేను.

కాలాభట్టు:- నరకలోకములకు పోదువు.

జితేదాస్తి:- పోయినచోనేమి! అక్కడివారు మాత్రము నీవు నరకలోకమునుండి పో అనగా పోవుట కంగీకరింతురందువా? ఆ యమ బాధలే పడుచుందురు. అక్కడికదే బాగుగా నున్నదనుకొందురు. భారతములో నున్నది కదా! ధర్మరాజు నరకలోకమునకు పోయెనట! ఆ నరకబాధ లనుభవించు వారి మీదికి చల్లనిగాలి వెళ్ళినదట. వారు 'అమ్మయ్యా!' అనుకొన్నారట. ఎప్పుడో అట్టి సుఖము వచ్చునని యక్కడివారెదురు చూచుచుందురు. కాని, యా లోకమునువదలి పెట్టి వచ్చుటకు వారంగీకరించరు. వారివారి కర్మాను గుణముగా వారివారికి సుఖదుఃఖములు సమకూర్చుచున్నానని యీశ్వరుడనుకొన వలసినదే గాని వారెవ్వరు ననుకొనరు. అనుకొన్నచో సృష్టి లేదు. మానవులు లేరు. పిశాచములు లేవు. యమలోకము మొదలైనవి లేవు.

కాలాభట్టు:- మరి యేమందువు? నా ధనము నెగగొట్టి మానవుడవుగా వందయేండ్లో, యెంతో బ్రతికి నరకలోకములకు పోవుదునందువా?

జితేదాస్తి:- నా కెచ్చటకు బోయిన నభ్యంతరములేదు. ఉన్న చోట నక్కడనుండిననే బాగుగా నున్నదని యనుకొనుచున్నప్పు డెక్కడ నున్ననేమి!

కాలాభట్టు:- ఓయి! జితేదాస్తీ! నా కొంపమీదికి తెచ్చెదు నట్లున్నావు. వైరాగ్య మార్గములలో నిదియొక మార్గము, నా పని పాడుజేయకుము. కార్తవీర్యార్జునిని కూతును తలకు మాసిన దానిని చేయకుము.

జితేదాస్తి:- ఇదివఱకటి మనయొప్పందము వేరు. ఇప్పుడింకొక నియమము పెట్టుచున్నాను, నీవు దానికి కూడ నంగీకరించినచో నేను నీ పనిచేసి పెట్టెదను. కానిచో నేను నరకలోకములకే బోయెదను.

అక్కడ నింతకంటె బాగుగనే యుండును. ఇప్పు డుండదనిపించ చ్చును. అప్పుడు బాగుగనే యున్న దనిపించవచ్చునుగదా! నష్టమేమి?

కాలాభట్టు:- ఇంతకు నీవేమందువో చెప్పుము.

జితేదాస్తి:- బ్రహ్మరాక్షసుడవై నీకీ వైరాగ్య మెందుకు కలిగి నది? బ్రహ్మరాక్షసుడవై యుండి యిది బాగుగనే యున్నదని నీవను కొనవలయునుగదా! నీ వెందుకనుకొనవు? ఆ రహస్యము నాకు చెప్పు నేను కూడ నేడు మానవుడనగా మరల గంధర్వుడుగానుండి యట్లను కొనకుండ నుండెడి మార్గమును బోధించు. అప్పుడు మన యిద్దర యనుబంధము.

కాలాభట్టు:- మంచి కోరిక కోరితివి. ఏ జన్మ మెత్తినను కోర వలసినదిది. నీవిప్పుడు క్షత్రియుడవు కదా! కర్మ బాహిరుడవు కాదు. నీవు చిన్నప్పటినుండియు చేసిన తప్పొక్కటి యున్నది. నీ భార్య సంస్కృతము చదువుకొన్నది. నీకు సంస్కృత మదివరకే వచ్చును. అందుచేత నీవు సంస్కృతము చదువుకొన నక్కర లేదనుకొన్నావు. నీకొక మహావిషయమును చెప్పెదను. నాగేశభట్టు మంచి పండితుడు. కాని లౌకికుడు. అతడు ఖడ్గవిద్యా నిపుణుడు. మీ దేవయోనుల ఖడ్గ విద్య ముందు మానవుల విద్య నిలువదు. నీవతనికి నీ ఖడ్గవిద్య నేర్పి వానివద్ద భాష్యములు చదువుము. ఓయీ! శ్రీ శంకరులు భారతదేశ మున శంకరుడుగా నవతరించి ప్రస్థానత్రయమునకు భాష్యములు వ్రాసెను. మన తెలివి వానిముందు పనికిరాదు. సురేశ్వరాచార్యుడు నైష్కర్మ్యసిద్ధి యను నొక గ్రంథమును వ్రాసెను. అగుటకు ప్రకరణ గ్రంథమేగాని యది మానవుని యొక్క యూహా యెంత జటిల ముగా నుండవచ్చునో అంత జటిలముగా నుండును. వైరాగ్యము కలుగుటకు ప్రస్థానత్రయమును చదువుము. అది స్థిరపడుటకు నైష్కర్మ్యసిద్ధివంటి గ్రంథములు చదువుము. ఇది నాగేశభట్టునకు కూడ లాభము. అతడు పండితుడై మాయలో నున్నాడు. నీకు పాఠము చెప్పుచున్నప్పుడు వానికి జ్ఞానముదయించును. నీవు గంధర్వు డవైనచో నగుదువు. కానిచో కావు. నీ దొరకూతురును మాత్రము వదలిపెట్టకుము. నా పనిని పాడుచేయకుము. నేను మరల నీకు కనిపించనేమో! నగర నిర్మాణమైన తరువాత మరల వత్తును.

అంతట కాలాభట్టు అంతర్హితుడయ్యెను. వారిద్దఱును లోనికి బోయిరి. అచట నొక ఖాతిమీద నొక లోకోత్తర సౌందర్యవతి కూర్చున్నది. వారి కామె పిశాచమని తెలియును. కాని యామె సౌందర్యము పిశాచమనిపించలేదు.

జితేదాస్తి యిట్లనుకొనెను. "ఈమెకు రక్తమాంసములు లేవు. చర్మము లేదు. బొమికెలు లేవు. ఈ రూప మెట్లు వచ్చినది? నామ రూపములలో నామముది యేమున్నది? ఉన్నది రూపములో నున్నది. ఈ సృష్టి రూపవశమై తిరుగుచున్నది.

అంత నతని భార్య యా కనిపించిన స్త్రీతో నిట్లన్నది:- "నీవు మహారాణి వనుకొందును. నీ విచ్చట నుంటివని తొలుత మాకు తెలియదు. తరువాత కాలాభట్టువలన తెలియును. నేను సామాన్య క్షత్రియ స్త్రీని. నీవు రాణివి. నేను నీతో నెట్లు మాటాడవలయునో తెలియదు."

ఆమె:- "నీవు నాకంటె చాల నయము నేను పాలమ్ముకొని బ్రతికెడివారి పిల్లను. రాణిని కాలేదు. ఇదిగో ఈ శిథిలనగరమునకు రాణిని. ఈ రాణితనముకూడ కాలాభట్టువలన గ్రిఫ్ఫివలన నివ్వాళ్లు వలిచినది.

జితే - భార్య:- గ్రిఫ్ఫి యెవరు?

జితేదాస్తి:- వాడింకొక పిశాచము.

రాణి:- నీ పేరేమి? నిన్నేమని పిలువవలయును?

జితే భార్య:- తమరి పేరేమి? నేను మిమ్ము రాణిగారని పిలిచెదను.

రాణి - నేను నిన్నేమని పిలువవలయును?

జితేదాస్తి:- దొరసానీ! అని పిలువుము. క్షత్రియస్త్రీ యామాత్రము కాకపోవునా?

రాణి:- ఇద్దఱిలో నెవరు గొప్ప?

జితే:- రాణికంటె దొరసానియే గొప్ప. ఇది బ్రతికియున్నది కదా!

రాణి:- ఔనయ్యా! నేను చచ్చిన రాణిని. ఆమె బ్రతికియున్న దొరసాని.

దొరసాని:- నీ కథ యంతయు నాకు చెప్పుదువనుకొందును. తొలుత నా కథ చెప్పుమందువా?

రాణి:- నీ కథ యంతయు కాలాభట్టుతో నీవు చెప్పుచుండగా నేను విన్నదే! నీ కథ యేమి? మీ కథ యంతయు నాకు తెలియును. నా కథయే చెప్పెదను. నేను వలదంటిని. కాలాభట్టు కాదనెను. యుగాంత మిట్లు పిశాచమువలెనుందు ననుకొండు. నష్టమేమి? కాలాభట్టున కిష్టము లేదు. ఈ నగర నిర్మాణము పూర్తియైనగాని నా పిశాచత్వము నాకు పోదు. ఈ లోపుగా నా కథ నీకు చెప్పెదను. పాడుబడ్డ నగరము బాగుపడి నా పిశాచత్వము పోయిన తరువాత నా కథ నెవ్వరితో చెప్పుదును? నా కప్పుడప్పుడనిపించును. నా కథ కొందఱికి తెలియవలసిన యవసరమేమున్నదని? నాకు నవ్వు కూడ వచ్చును. పిశాచములు నవ్వలేవు. మీకా సంగతి తెలియునా? తమ పేరు నిలువవలయునని తమ కథ యందఱకు చెప్పిపోవలయునని తమ పేరెంతవఱకు ధాత్రిలో నుండునో అంతవఱకు జీవులు స్వర్గలోకమం దుందురని జన మనుకొందురు. శాస్త్రములు చెప్పుచున్నవి. కాని దుర్జనుల పేరు చెప్పికొనుచుందురు. వారు స్వర్గమునం దుందురా?"

దొరసాని:- "నీ కథ చెప్పుదునంటివి కదా! మేమిచ్చట నైదారు దినము లుందుము. ఈ యైదారు దినములలో పూర్తి యగునా?

రాణి:- నాకైదారు దినములేమన్నా! అది కాలాభట్టునకు. అతడు బ్రహ్మరాక్షస్సగుటచేత నొకప్పుడు సాధువు. మఱియొకప్పు డసాధువు. నేను వారివంటి పిశాచమను కాను. నాకు వెన్నెల లేదు. చీకటి లేదు. నీ వెప్పుడు వచ్చినను నే నిచ్చటనే యుందును.

దొరసాని:- నాకా సంగతి తెలిసినచో నేను పూర్వమే వచ్చెడి దానను. ఆ కాలాభట్టు వలదన్నాడు.

జితేదార్సి:- అదిసరేకాని, గ్రీష్మి నన్ను నీమెను కూడ వధిం చుట కత్యంతరము లేనివాడని కాలాభట్టు చెప్పినాడు. ఒకనా డొక భల్లూకము మామీదికి వచ్చెను. దానిని నీవు తొలగించితివట కదా! నీకు మేము ఋణపడి యున్నాము.

రాణి:- ఋణపడియుండుట చెప్పకు. భగవంతు డనుగ్రహించి:

నీవీ నగర నిర్మాణము చేసినచో నీ కెన్ని జన్మలు ఋణపడియుండ వలయునో తెలియదు.

జితే:- కాలాభట్టున కిది చివర జన్మగా భావించుచున్నాడు నీ కట్లు గాదా?

రాణి:- నాకా రీతి నెట్లగును? అతడు గొప్ప పండితుడు. బ్రతికియున్నప్పుడే గొప్ప వైరాగ్యవంతుడు. శాస్త్రములు చదివిన వాడు. కామక్రోధాదులు జయించినవాడు. మా మహారాజతనిని తెచ్చి నాకు దౌవారికుడుగా నియమించినాడు. అతడు నా హేతువున బ్రహ్మరాక్షసత్వమును పొందెను. అతడు బ్రహ్మరాక్షసుడగుటకుకూడ వానికి లెక్కలేదు. నాయందు దయచేత బ్రహ్మరాక్షసుడైనాడు నా కథ మీరు విన్నచో నవియన్నియు వచ్చును.

"మాది గంధగిరిపురము. అంతకుపూర్వ మా యూరిలో క్షత్రియులు లేరు. నాయీ కథ యెంతవఱకు నిజమో నాకు తెలియదు. మా నాయనమ్మ చెప్పుచుండెడిది. నాకు నుంత తెలివి వచ్చి యామె చెప్పెడి మాటలు కొంత గ్రహించెడువేళ కామె సగము తెలివిగా నుండెడిది. సగము పిచ్చిమాటలు మాటాడెడిది. ఒకప్పుడు మా పూర్వు లెచ్చటినుండియో గంధగిరి నగరము వచ్చిరనియెడిది. ఒకప్పుడచ్చటివారమే యనెడిది. ఒకప్పుడు క్షత్రియులమనెడిది. మఱి యొకప్పు డేదో నీచకులవారమనియు, అదెచ్చటినుండియో దొరలు లేచిరాగా వారితో పాటు లేచివచ్చిన పరిచారికాకులమువారమనియు చెప్పెడిది. ఏ మాటలు నిజమో. ఏ మాటలు కావో తెలియదు. నా తండ్రి మాత్రము మధ్యలఖునగరములో నుండెడివాడు.

"చిన్నప్పటినుండి మా యమ్మ పాలుపోసి సంపాదించి మా బ్రతుకును కడతేర్చుట నే నెఱుగుదును. మేము తప్పకుండ తక్కువ కులమువారము. తక్కువ కులము వారి లక్షణము లన్నియు మా యందుండెడివి. ఉత్తమకులములలో పురుషులు సంపాదింతురు. స్త్రీలు గృహకృత్యములందు నిమగ్నలై యుందురు. వీరు బయటకు పోవుట తప్పు. తక్కువ కులములోనే స్త్రీలే యది యమ్మి, యిది యమ్మి, పనిపాటులు చేసి సంపాదించి సంసారమును నిర్వహింతురు. పురుషు డేదియో పని చేయుచుండును, వాని యిష్టము. పనిలోనికి వెళ్ళినచో

వెళ్లును, మానివేసినచో మానివేయును. పనిలోనికి వెళ్ళకుండుటయే మంచిది. వాడెంతయో సంపాదించును? చివరికింటికి వచ్చువేళకు కల్లుమ్మి పాకలకుపోయి కల్లు త్రావి యింటికి వచ్చును. డబ్బు నేమి చేసితివని పెండ్లమడిగినదా-ఆమెను చచ్చినట్లు కొట్టును. వాని సంపాదన యింటికి రాదు సరిగదా, వాడింటిలో దొంగతనములు చేయును. ఈ భార్య తాను సంపాదించిన దానిలో కొంత గోధుమలు పోసెడు. దుత్త యడుగున పెట్టును. ఒక్కొక్కప్పుడు గూళ్ళలో చెత్తక్రింద దాచును. మరియొకప్పుడు తట్టలలో పాతచీరలలో నుంచును. అతనికీ స్థలము లన్నియు తెలియును. భార్య యింటిలో లేనప్పుడు వాని నన్నింటిని గాలించును. ఆ డబ్బు తీసికొనిపోయి త్రాగి యింటికి వచ్చును. అడది యొక్క చేతిమీద పెద్ద కుటుంబము నెట్లు నిర్వహించును? నా కాశ్చర్య మేమనగా మా యమ్మ యిట్టి మా తండ్రిని మిక్కిలి ప్రేమించెడిది! ఆయన కొట్టును. తిట్టును. ఈమె యతనిని నోటికివచ్చి నట్లెల్ల తిట్టెడిది. ఆయన కొట్టెడివారు. నాకు బుద్ధి వచ్చినప్పటినుండి యెఱుగుదును. దినదినమదియే గోల. ఇంటిలో నాకొక యన్నగారు ముప్వురు చెల్లెండ్రు, మరియొక తమ్ముడు. వాడు పసివాడు. మా అమ్మ మమ్మందఱను రక్షించుచుండెడిది

"ఈ సంసారమేమి? భార్యాభర్తలు నిత్యము నిట్లుండుట యేమి? ఈమె మరల గర్భవతి యగుచుండుటయేమి? నాకు చిన్న ప్పటి నుండియు లోకజ్ఞాన మెక్కువ. తండ్రిని వదలి యెచ్చటికైన లేచిపోదమని నేను మా అమ్మతో చెప్పెడిదానను. నాకు పదియేండ్లు వచ్చువఱకు నప్పుడప్పు డిట్లు అనుచుండగా నామె యూఱకుండె డిది. తరువాత రెండుసార్లు కోపబడినది, ఒకమారు కొట్టినది. 'ఛీ, ఛీ! నోరు మూయుము. పెండ్లి చేసికొనిన భర్తను వదిలిపోవుదురటే! నీకు బుద్ధి పెడతలను బట్టెనటే? అతడు భర్త యనగా నతడే భర్త! నీవు చచ్చిననైన నతడే భర్త!' మా అమ్మ పెంపకమిది. నేనట్లే యయితిని కాని, యిందులో నేను గొప్ప శీలవతిననిగాని, మహాకులీనురాలనని గాని చెప్పుటలేదు.

"నేను గంజాయితోటలో తులసిమొక్కవలె పుట్టితినని చెప్ప వలయును. ఈ సామ్యము లోకములో సామాన్యముగా శీలమును

గుఱించి చెప్పుదురు. నేను నా సౌందర్యమును గూర్చి చెప్పుచున్నాను.
మా తల్లి రూపసి. ఎంత రూపసియనగా నామె పది యిండ్లలో పాలు
పోయును. ఆ పది యిండ్లలోని యజమానులు మా తల్లి నెప్పుడో
యొకప్పుడు కోరినవారే! ఆమెచేత నిరాకరింపబడినవారే. ఈ సంగతి
యొకటి రెండుసార్లు మా తండ్రికి తెలిసినది. ఆయనకు బ్రహ్మాండమైన
కోపము వచ్చినది. మా యింటిలో నొక చిన్న యటక యున్నది.
దానిమీద నొకకత్తి యున్నది. అది పెద్ద కత్తియే. మాతండ్రి యనాది
నుండియు మధ్యలఖునగరములో నున్నవాడు కాడు. మేమెవ్వరము
పుట్టకమునుపు మా తల్లి వయసులో నున్నప్పుడామెను పెండ్లియాడి
యామెను సుఖపెట్టుదమని తానేదో యుద్యోగము చేయుదమని -
ప్రధానముగా రాజసైన్యములో చేరుదమని యా మహానగరమునకు
వచ్చినాడు. ఆ కత్తి యా నాటిది! మా యన్న యుదయించెడివఱకు
నతడు రాచకొలువులో చేరవలయునని ప్రయత్నము చేయుచునే
యుండెను, అది వేఱే కథ యనుకొనుము.

"చివరికా యూరినుండి లేచిపోవలయునా, అచ్చటనే యెట్లో
యొకట్లు బ్రతుకవలయునా? యన్న ప్రశ్న వచ్చినది. అప్పటికి మే
మిద్దఱము సంతానము కలిగితిమి. నా కాముదమునకు లేదు. నా
తల్లిదండ్రులకు, నాయన్నకు తినుటకులేదు. అప్పుడొక వృద్ధ బ్రాహ్మ
ణుడు మమ్ము తమ చెంతకు చేరదీసెను. అప్పటినుండి వాని పంచ
నుంటిమి. ఆయన యింటికి చేరితిమి. ఏదో నాలుగు మెతుకులు మా
కుటుంబమునకు లోనికి పోవుచుండెను. ఆయన సంపన్న గృహస్థు.
రాజాంతఃపురములో రాజభవనములలో ప్రతి దినము పోయి
పంచాంగము చెప్పివచ్చెడివాడట. నాటినుండి మాకు రక్ష కుదిరినది
కాని, యది యేమి కర్మమో—నాటినుండి బాగుపడవలసిన మా తండ్రి
చెడిపోనారంభించెను. కొందఱి ప్రకృతి యొక విధముగా నుండును.
సంసార మేదో విధముగా సాగుచున్నచో వారికంటె పోమరు
లుండరు. కాలు కదపరు. అట్టివాడు మా నాయన. పోనీ, అది
యెందుకు? మా నాయన తన చిన్ననాటి ఖడ్గమును పుచ్చుకొని మా
తల్లిని కోరిన యొకఱిద్దరిని చంపుదునని బయలుదేఱెను. మా అమ్మ
వారించినది. ఇంతకు మేమెట్లు బ్రతుకుచుంటిమనగా నా బ్రాహ్మణు

నకు పది యావు లుండెడివి. అన్నియును గోదానములే! వానిలో కొన్ని పెయ్యలు. రెండు మూడు పాలిచ్చెడివి. వానికి మా సంసారము గడ్డి వేయవలయును. నీళ్ళు పెట్టవలయును. పాలించవలెను, పాలు పిదుకవలయును, పెరుగు చేయవలెను. ఆ బ్రాహ్మణసంసారమునకు గావలసినవి పోయగా తక్కిన పాలు మేమమ్ముకొని జీవించవలవలయును. ఒక్కొక్కప్పుడా బ్రాహ్మణుని యింటికి పదిమంది బంధువులు వచ్చెడివారు. ఆనాడు మేమమ్ముకొనుటకు పాలు మిగులవు. ఆనాడు మేము వస్తు వండుకొనవలసినదే. నాకు పదియేండ్లు వచ్చువఱకు మా యిల్లు యిట్లుండెనది

"చిన్నప్పుడు నేనందమైన పిల్లనని యనుకొనెడివారట. తల్లిని పోలి పుట్టినపిల్ల యనుకొనెడివారట. ఆమె తన చిన్నప్పు డెట్లుండెడిదో నాకు తెలియదు. నాకు తెలిసినప్పటికి బుగ్గలు త్రోసికొనిపోయి కన్నులు లోతునకు పోయి, బక్కపలుచగా రెపటవలె నుండెడిది. మాకు సంసారము గడచుటయే కష్టముగా నుండెడిదికదా! కాని, నా తల్లి నన్ను మాత్రము వేయికనులతో చూచెడిది. చాటుమాటుగా నన్ను తినిపించెడిది. భారతకథలో నున్నదే. పాండవు లేకచక్రపురమున నున్నప్పు డైదుగురు సోదరులు భిక్షాన్నము తెచ్చెడివారు. అంతయు ప్రోగుచేసి కుంతి సగమన్నము భీమునకు పెట్టెడిదట! నన్ను మా తల్లి యట్లు పెంచెడిది. నేను పుష్కలముగా తినెడిదానను. బుగ్గలుబ్బి యుండెడివి. తిండికి లోటులేని బాలికవలె నుండెడిదానను. ఆ యిల్లేమిటో! నేనల్లేరితి నుండెడిదాననో. యెవ్వరికిని తెలియదు. ఇంతకు గారణమేమనగా నా వృద్ధబ్రాహ్మణుడు గొప్ప జ్యోతిష్కుడట! నాకు పదియేండ్లు దాటిన తరువాత నాయన కొకనాడు ప్రాణముమీదికి వచ్చినది. తనకింక నాయువు లేదని యాయనకు తెలిసెను. అందఱికి నప్పగింతలు చెప్పెనట.

ఒకనాటి రాత్రి యెవ్వరు లేకుండ చూచి మా తల్లిని రహస్యముగా పిలిచి 'యోని! కాలంజరీ! నీ పెద్దకూతురున్నదే - దాని జాతకము చాల గొప్పది. దానిది మహారాజ్ఞీ జాతకము. దానిని జాగ్రత్తగా చూచుకొనుము. నిన్ను గుఱించి నీవు చెప్పకపోయినను నేను విన్నాను. ఈ లోకములో సౌందర్యవతి యన్నది యే కుం

ములో పుట్టినను కష్టమే. ఒక సామెత యున్నది. ఇల్లు ఇరకటము ఆలి మర్కటమని. పేదవాని భార్య సౌందర్యవతి కాకూడదు. అందులో పొగరు మిగిలిన కుటుంబములుగల యూరిలో నుండనేరాదు. నా తర్వాత మీరిబ్బంది పడుదురు. నా కొడుకు వట్టి మలప. మీరిచట నుండి లేచిపొండు. ఎక్కడికనగా, నెక్కడికని చెప్పుదును? నేను మిమ్ము రాజభవనమున ప్రవేశపెట్టవలయునని చాల యూహించితిని. రాజునకు నాలుగావులమందలు కలవు. ఏ మందలోనైన మిమ్ము చేర్చినచో కోటలోనికి పాలిచ్చుచుందురు. మీరు సుఖముగా నుందురని యోజించితినిగాని, యిదివఱకే నలుబది యేబది సంసారములు గొల్ల వాండ్రు రాజుకోట నాశ్రయించియున్నారు. నేను మిమ్ము ప్రవేశ పెట్టుట సాధ్యపడలేదు. మఱియు నీ భర్తయొక్క త్రాగుబోతుతనము మాటలు పరులు లెక్కింపకుండుటకు హేతువయ్యెను. నీవు సద్గుణవతి వని చెప్పితిని. ఇవి నాకు చివరి దినములు. కాని, నాకీ గండము గడువవచ్చు. గడచుటకు వీలున్నది. గడచినచో మరి నాలుగేండ్లు బ్రతుకుదును. నా యదృష్టమువలన — నా యదృష్టమేమున్నది ఎప్పుడో యొకప్పుడు రాలిపోవుదును. నీ యదృష్టమువలన — నీ యదృష్టమువలననుట కంటె నీ కూతుయొక్క యదృష్టమువలన నాకీ గండము గడచినచో మిమ్ము కోటలో పాలిచ్చెడివారుగా నేర్పాటు చేసెదను. నాకీ గండం దాటవలెను. దాటుటకు నాకు తెలిసినంతవఱకు వీలులేదు. కాని, యాయుర్దాయమున్నదే దానిని గుఱించి యెవ్వరును చెప్పలేరు. వీరికి వందయేండ్లు యాయుర్దాయ మున్నదని చెప్పుము. వాడు వాని పదవయేట చనిపోవచ్చు. వానికి నలుబదియేండ్లకంటె నాయుర్దాయము లేదని చెప్పుము, వాడు నూట యిరువది యేండ్లు బ్రతుకవచ్చును. నేను బ్రతికితినా సరే, బ్రతుకక పోతినా నీకొక మాట చెప్పెదను. ఒక యర్ధరాత్రమున మీరీ రాజ ధానిని వదిలి పొండు. మీ యిష్ట మెచ్చటికి పోయినను సరే మీ రెచ్చ టికి పోయినను కూతురు మాత్రము రాణి కాక తప్పదు. నేనను కున్నట్లు మహారాణిని కాకపోయినను మరే చిన్న దొరయో యామెను పెండ్లాడును. దానికొక మార్గమున్నది. మీరు గొల్లవార మని చెప్పుకొనకుడు! క్షత్రియులమని చెప్పికొనుచుండుడు. ఏమి? క్షత్రియులలో మాత్రము కూడు-గుడ్డలకు లేనివారు లేరా?''

బ్రాహ్మణుడీమాటలు చెప్పిన మూడువదినమున నాయనను క్రిందబెట్టిరి. మూనాళ్ళు వీథిలోనుంచిరి. స్మృతిలేదు. ప్రాణముపోదు. నాకు బాగుగా జ్ఞాపకమున్నది. నడివీథిలో వీథి గోడపై నుండి రెండు కఱ్ఱలుపెట్టి దానిపైన చాపలు పఱచిరి. ఆ బ్రాహ్మణు నచ్చట నుంచిరి. మూనాళ్ళు గడచెను. నాల్గవనాటి ప్రొద్దున నాయన లేచి కూర్చుండి 'నాకు గండము గడిచినది. నేనింక నాలుగేండ్లు బ్రతుకుదును. నన్ను లోనికి తీసికొనిపొండు' అనెనట.

ఆ వృద్ధ బ్రాహ్మణుని కూతుండ్రు చాల సంతోషించిరి. వృద్ధ బ్రాహ్మణియు సంతోషించెను. సంతోషించని వాడాయన కొడుకు. ఆ వృద్ధ బ్రాహ్మణుడు జీవితమెల్ల పంచాంగముచెప్పి గడపెను. ఆయనకు వచ్చిన విద్య జ్యోతిషమొక్కటియే. కాని కోటలో ప్రతి దినము రాజస్త్రీలవద్ద పంచాంగము చెప్పెడివాడు.

ఆయన వద్ద నింకొక సుగుణమున్నది. ఆయన బ్రతికినన్నాళ్లు పట్టిన గోదానముల సంఖ్య రెండు మూడు వందలకు తక్కువలేదు. ఒక్క యావు నాతడమ్మలేదు. తనకింటిలో తిండి లేకపోయినను గోవులు మాత్రము కడుపునిండ తినవలసినదే. వారినడిగి, వీరినడిగి తెచ్చెడివాడు. దొడ్డిలోనున్నవి పాతిక యావులు. పాలిచ్చెడివి మూడో నాల్గో. అన్నిటిని పోషించెడివాడు. ఎవరైన మాకొక యావు నిమ్మనగా వారు సొంతముగా మేపుకొందురని తెలిసినచో నిచ్చెడివాడు. ఆయనను ఆవుల బ్రాహ్మణుడనెడివారు. పెద్ద సంపాదన లేదు. ఆవులను మేపుటతోడనే యాయన పనియైనది.

కాని పెద్దయిల్లు కట్టినాడు. ఆయన వద్ద చమ్చు సంభావనగా వేయి దీనారములైన నున్నవని చెప్పికొనెడివారు. వానినెచ్చట దాచెనో బ్రహ్మకు తెలియదు. ఆ కొడుకునకు తెలియదు. తండ్రి చని పోయిన తరువాత నా ధనమెచ్చట దాచెనో యింటిమొత్తము కుళ్ళగించి చూడవలయునని వాని యూహ. మరియు నతడొకడు నామీద కన్నువేసిన వాడు. తండ్రి యుండగా నన్నేమి యనుటకు వీలులేదు.

ఆ తండ్రి బ్రాహ్మణుడుగాడు. వృద్ధుడుకాడు. వాని ముందు కాలాభట్టు పనికిరాడు.

ఇలాభట్టు బ్రతికియున్నప్పుడు కూడా నిట్టి యాకారమే కల

వాడు. కాని, యిప్పుడు నిప్పుడు పరమసాధువు. ఆ సంగతి యెవరికిని తెలియదు. అతడు పండితుడని వైరాగ్యవంతుడని యాజన్మ బ్రహ్మచారియని వేదాంతశాస్త్రము కరతలామలకముగా చదువుకొనెనని తెలిసినవారము నలుపురమే లేనిచో నైదుగురము. మా గృహయజమానియైన యావుల బ్రాహ్మణుడు, నేను, గిఫ్ఫి. నాల్గవవాడు మహారాజు.

ఆయనపేరు వీరదేవవర్మ. ఆయన నందదేవవర్మ మహారాజు కుమారుడు. నందదేవవర్మ రాజ్యము చేసినన్నాళ్ళు క్లిష్టముగానే రాజ్యము చేసెను. ఇందులో నొక చమత్కారమున్నది. నందదేవవర్మ తండ్రి భీమార్జునవర్మ. ఆయన తొంబగి మూడేండ్లు రాజ్యముచేసెను. అనగా నేమి! అనగా, తనకు ముప్పదియేండ్లప్పుడు రాజ్యమునకు వచ్చెననుకొనుము. నూట యిరువది మూడేండ్లు బ్రతికెనన్నమాట. నందదేవుడు భీమార్జునునకు చిన్నప్పుడే పుట్టెను. నందదేవవర్మకు రాజ్యము వచ్చునప్పటికి నందదేవవర్మ వయస్సు తొంబదియేండ్లు. ఆతడిరువది మూడేండ్లకన్న రాజ్యము చేయలేదు.

వీరదేవవర్మకు రాజ్యము వచ్చునప్పటికి పాతికయేండ్లులేవు. వీరదేవవర్మ మరల తొంబదియైదేండ్లు రాజ్యము చేసినవాడు. ఆయనయే నాభర్త. భర్తయెట్లయ్యెనో చెప్పుదును. ఈ లోపుగా నా వృద్ధ బ్రాహ్మణుడు మరల బ్రతికెను గదా! ఆయన బ్రతికిన తరువాత చనిపోయినవాడు బ్రతికెనని లోకములో నదియొక విడ్డూరము. మూన్నాళ్లు బయటపెట్టిరి. మరల బ్రతికినాడు.

అందులో నింకొకకథ. ఆ బ్రాహ్మణుడింకొక కథ చెప్పనారంభించెను. ఎవరో బౌద్ధులవలె నున్నారట! వలుపురితనిని తీసికొనిపోయి యెవడో మ్లేచ్ఛునివలె నున్నాడు, వాని యెదుట నిలబెట్టిరి. ఆ యధికారి వీనిని చూచుటకు మూన్నాళ్లు పట్టినది. నాల్గవదినమున నతడన్నాడుటకదా! ఛీ ఛీ వీడుకాదురా వీనికింకా నాలుగేండ్లా యుర్దాయమున్నది. వీరి యింటికి పది యిండ్ల తరువాత నొక గొల్లవాడున్నాడు. వానిని తీసికొని వచ్చుటకు వీనిని తెచ్చితిరి. వీనిని మరల తీసికొని పొండు, అని చెప్పగా వారాబ్రాహ్మణుని తెచ్చి వదలిపెట్టిరి. ఆయన లేచికూర్చుండెను. ఆ బ్రాహ్మణుడీకథ చెప్పుటతో మరికొంత విడ్డూరమైనది.

మరల నీయన కోటలోనికి పంచాంగము చెప్పుటకు పోవు చుండెను. ఆ కోటలో రాజస్త్రీలు రాచకన్నెలు నెగబడి యితని కథ మాటిమాటికి చెప్పించుకొను చుండెడివారట.

వీరదేవవర్మ మహారాజులు వయసు ముదిరినవాడు కాడు. ఆయన రాజ్యమునకువచ్చి యప్పటికి నాలుగైదేండ్లైయినది. మిక్కిలి యున్నచో నాయనకు ముప్పదిరెండేండ్లుండవచ్చు. ఆయనకు భార్య యున్నది. ఆమె పాతికయేండ్ల స్త్రీ. ఆమె కత్తగారున్నది. పరమవృద్ధు రాలు మరియొక యత్తగారున్నది. ఆమె కొంత నడివయస్సులో మున్నది. ఆ యిద్దఱి మాటకు చెలామణి లేదు. ఈ భార్య వారిని నోరెత్తనిచ్చెడిది కాదు. రాజునకీ భార్యమీద ప్రేమలేదు. అదియొక పెండ్లి జరిగినది. కాని వయసులోనున్న యత్తగారు కొంత స్వాతంత్ర్య మవలంబించెడిది.

మహారాజునకు వృద్ధురాలైన యామె నిజముగా తల్లిగాదు. ఆమె నందదేవవర్మకు మొదటిభార్య. ఈమె రెండవ భార్య. వీరదేవవర్మ యీమెకొడుకు. ఆమెకు కొంతయధికారము కలదు. ఆమెకు జీవులు, పుట్టుకలు, కర్మలు మొదలైన వానియందు మిక్కిలి యిష్టము. ఈ వృద్ధ బ్రాహ్మణుడు మరల బ్రతికి తన బ్రతికిన వైనము మహారాజు తల్లితో నామె వందసార్లడుగగా వందసార్లును చెప్పెను ఆమెకును కోడలికిని నుంతయు పడదు. కోడలు చాలగొప్పయింటిపిల్ల. ఆమె తండ్రికూడ నొక మహారాజు వంటివాడే.

రాజు తల్లి యున్నదే' ఆమెయంత గొప్పయింటి పిల్లకాదు. నందదేవవర్మ తాను రాజ్యమునకు వచ్చిన తొలుతలో సంతానము లేకపోవుటచేత తన వార్ధక్యములో నీమెను పెండ్లాడెను. ఆమెకు వీర దేవవర్మ కలిగెను. నందదేవవర్మకు మొదటి భార్య కడుపున పిల్ల లున్నారు. నందదేవవర్మ రాజ్యము చేసినన్నాళ్లు యుద్ధములే. ఆమె నలుగురు కొడుకులా యుద్ధములలో చనిపోయినారు. రాజ్యము వీర దేవవర్మకు వచ్చెను.

ఈ వృద్ధ బ్రాహ్మణుడు తనకు మహారాజు తల్లియు రెండవ పెద్ద రాణియునైన యామెతో కలిగిన యీ చనవును పురస్కరించు కొని మా కుటుంబము కోటలో పాలు పోసెడునట్లుగా నేర్పాటు

చేసెను. ఇప్పటి రాణి ప్రకారము మేము కోటలో పోయి యుండుటకు వీలులేదు. మేమూ రెండవయ తగారికే పాలు పోసెడివారము.

# 16

"ఇంక నా మనస్సు యొక్క స్వరూపమును నీకు చెప్పెదను వినుము—నేనొక గొప్ప రాణినగుదునని బ్రాహ్మణుడు చెప్పెనుగదా? ఆలులేదు చూలులేదు—కొడుకుపేరు సోమలింగమని నేనొక రాణి ననుకొనుట యారంభించితిని. ఇంటిలో నా పోకిళ్ళకు మా అమ్మ తట్టుకొనలేకపోవుచుండెడిది. నాకది కావలయును. నిది కావలయును. పూర్వము ధరించెడి దుస్తులు పనికిరావు. ఎక్కడినుండి వచ్చును? మా యమ్మ యక్కడికిని కడుపుకట్టుకుని నేనడిగిన దుస్తులు వంద వెల యైనచో నెట్లో యొకట్లు వది ప్రోపుచేసి వానివలె కన్పించెడి దుస్తులను కొని తెచ్చెడిది పట్టుదుస్తులు, వెలగలవున్ని దుస్తులు, దూది దుస్తులు చాల వెలగలవియుండును. వానివలె నుండును, ఇవి చాల చౌక, అట్టి గుడ్డ లమ్ముదురు,

"నిజమైన రత్నమునకు, కృత్రిమ రత్నమునకు భేదమందఱకు తెలియదు, రత్నపరీక్షకులకు మాత్రమే తెలియును. అందుచేత రత్న వర్తకులు సామాన్యులను మోసగింతురు· అదృష్టవశమున నొకనికి నలుబదివేల దీనారముల వెలగల రత్నము దొఱికినచో దాని నంగళ్ళకుపోయి చూపించినచో వాడు వేయి దీనారములని చెప్పును. ఎన్నడును వెయ్యిదీనారములు మొగమెఱుగని వీడు లవక వచ్చి పడుచున్నదని వెంటనే యిచ్చివేయును. తరువాత మున్ను జూచిన వారును వీరును అయిదువేల దీనారముల వచ్చుననియు పదివేల దీనారములు వచ్చుననియు చెప్పుదురు. వీడు దుఃఖించుట యారంభించును.అది యట్లుంచుము,దానివెల నలుబదివేల దీనారములు కదా! అది దొఱికినవాడు గర్భదరిద్రుడు· అది యొక పల్లెటూరులో నొక పొలములోగాని పర్వతముమీదగాని లభించును. మొదట వీనికది రత్నమనియే తెలియదు. ఎవరో చెప్పుదురు. వీడు మధ్యలఖునగరములో పోయిగాని, మగధములో, పాంచాలములోగాని పోయి

యచటనున్న మహారత్నవర్తకుల కిది చూపగా వీనికేపూటకాపూటకే గడువదు. వీడు వెళ్లెడిదెక్కడ? ఈ రీతిగా దరిద్రుడై పుట్టినవాడు దరిద్రుడుగానే యుండును. ఇంతలో రాజునకు దెలిసిన మొదటికే మోసము వచ్చును. ఆ రత్నము రాజుగారి కిరీటములోనో, ఆయన సింహాసమున కీర్తిముఖములో కన్నుగానో యుండవలసిన యోగ్యత యున్నచో నక్కడికి పోవును. వీడువీడే! సృష్టిలోని సర్వ వస్తువులకు మహానర్ఘ్యము లైన వస్తువులకు సామాన్యముగల వెలలేని వస్తువులు మనుష్యుడు చేయుచుండును. భగవంతుడే చేయును. కోకిలను సృష్టించినవాడు కాకిని సృష్టించలేడా? నెమళ్ళుకావుగాని అదియొక లోక, అదియొక మెఱుపుగల పక్షులు చాల యున్నవి. అది ఘించము కాదు. మొఖములటి మెనని విటియదు. అది జారిపోయెడి లోకయే గాని విటిసెడి లోకగాదు.

అట్టి దుస్తులతో నా తల్లి నా కన్నీళ్ళు తుడిచెడిది. సామాన్యులు నావంక మిట్టిమిట్టి చూచెడివారు. వృద్ధ క్షత్రియులు పెడమొగము త్రిప్పికొనెడివారు. నాకు గొన్నాళ్ళకీ దుస్తులు నా సహజ సౌందర్యమును వికారపఱచుచున్నవని తెలిసెను.

"అప్పటినుండి నేను వానిని మానివేసి సామాన్యములైన దుస్తులనే ధరింపగా నావంక చూచెడి కన్నులు పదిరెట్లయినవి. ఊరిలో నున్న క్షత్రియకుమారులు, ధనవంతులు తమ ప్రయాణించు ప్రవహణముల నాపి నిశ్చలముగా నావంక చూచుట, నన్ను పలుకరించుట, జరుగుచుండెను. ఇంక నా తల తిరిగిపోయినది. నా తండ్రి త్రాగుబోతు. నేనాయన నెప్పుడును లెక్కపెట్టలేదు. మా యింటిలో నచటి చెంబిచట నేనెప్పుడు పెట్టలేదు. నా యన్న యున్నాడు. పట్టణములోనికి పోయి యేవో చిన్నచిన్న పనులు చేయుచు, మా యమ్మకు సాయపడు చుండెడివాడు. ఎట్లు గడిచినవో మూడున్నరయేండ్లు గడచినవి.

"మా యావుల బ్రాహ్మణునికి మరల తన మృతి సమీపించు చున్నదని తెలిసెను. ఆయన నా జాతకమును చూచెను. నా చేయి చూచెను. నేను రాణిని కావలయును. ఆయన జ్యోతిషము ఫలించవలెను. ఆయనకా దిగులు పట్టెను. ఆయన కది యొక పెద్ద కోరిక.

ఓయమ్మ! దొరసాని! ఒక్కొక్కని కొక్కొక్క కోరికపట్టును. జీవితమంతయు నది సిద్ధించవలెనని కూర్చుండును ఇది చాలవిచిత్రము. అదియేమోకాని యిట్లు పలుకోరికలు గల జనులకు కాలమంతయు నొకయణువులో వచ్చి కూర్చుండునా? భూత భవిష్య ద్వర్తమానములు కలిసి యెవడైన మూటగట్టునా? సర్వదేశములను ప్రోగుచేసి యొక చిన్న కుగ్రామములో నెవడైన యిటికించునా? ఈ జనుల పేరాస చాల విచిత్రమైనది. తాను బ్రతికియుండగా తన కోరిక తీర వలయును. అది సిద్ధించవలెను. అక్కడికి తన జన్మ చరితార్థము కావలెను. అది స్వర్గానికి కట్టిన మెట్టులోని యొక యిటుకరాయి కూడకాదు. జీవుల యాశలు విచిత్రములు. తనకు దానివలన ప్రయోజనము లేదు. నేను నిజముగా రాణినైనచో నా బ్రాహ్మణునికేమి లాభము? తానొక గొప్ప జ్యోతిషము చెప్పితిననిపించుకొనవలయు నని. తాననిపించుకొనడు, తరువాత నారు నెలలలో చనిపోవును. తాను చనిపోయిన తరువాత నేనొకవేళ రాణినైనచో తానీ జోస్యము చెప్పెనని పరులు అనుకొనవలయును. అతనికేమి లాభము? అతడు వినుటకుకూడ లేడుకదా? తరువాత నతని జీవుడేమగునో! ఎందు ప్రయాణించునో ఏమియు తెలియదుకదా! తాను చచ్చిన తరువాత తనకు పట్టనివిషయము తనకు సంబంధములేని విషయము తాను బ్రతికియుండగా తాను చూచుచున్న లోకమువంటి లోకము భవిష్యత్తులోకూడ నుండునని తాననుకొనుచున్నాడు గనుక నా లోకము తాను చనిపోయిన తరువాత తన్నుగూర్చి తాను లేనప్పుడు చెప్పికొనవలయునని. ఇదియేమి యాశ! యాశ్చర్యముగాలేదా?

ఇది యంతయు నెందుకు చెప్పుచుంటిననగా, నా బ్రాహ్మణుడు చచ్చి యేలోకమునందున్నాడో! ఆయన పేరు నిరంజనభట్టు. తాను చనిపోకముందు నా యీ రాణితనమును నిశ్చయముచేసి చనిపోవల యునని పట్టెను. ఆయన కొక్కటి తెలియును. నేను చాల దురహం కారముగల బాలికనని. పరులకు చచ్చినను లొంగనని తెలియును. కాని పదిమందివచ్చి బలవంతముగా నన్ను తీసికొనిపోయి నా బ్రదు కును పాడుచేసినచో నొక నిస్సహాయురాలైన బాలిక యేమి చేయ గలదు? నా తండ్రి వృద్ధుడు. నా అన్న పరమసామాన్యుడు. నిరంజన

భట్టు పెద్ద సామంతుడుగాడు. కాని, యాయన యన్నచో మధ్య లఖునగరమున కొన్నిచోట్ల గౌరవమున్నది. ఆ గౌరవము నాకు కొంత రక్షగా నుండెను. నా ధూర్తమైన ప్రవర్తనచేత నా సౌందర్యమును చూచి తొలుత నభిలాషపడి ప్రథమ దృశ్యాంతమునవే నిరాకృతులైన వారు, తిరస్కారముగా భావించిన వారు కొందఱు దీనిని పాడుచేయవలయునని, పట్టు పట్టుకొని కూర్చుండిరి. తన దేహములో నుండి హంస లేచిపోయినంతనే నాస్థితి యేమియు బాగుగానుండదని యాయన గ్రహించెను.

ఆయన యొకనాటి సాయంతనమున మాయింటికొక పురుషుని తీసుకొనివచ్చెను. అతడు మనుష్యుడో దయ్యమో నాకు తెలియదు. తాడిచెట్టంత యెత్తున్నాడు. నల్లనికొఱవి. ఎఱ్ఱనిగ్రుడ్లు. మాట్లాడుచున్నప్పుడు పైదంతములు కనిపించుచుండును. కాని, మెడలో యజ్ఞోపవీతమున్నది. బ్రాహ్మణు డనుకొనవలయును. నిరంజనభట్టు వానిని నాకు చూపించి, "ఇతడు నీకింక రక్షగా నుండును. నీవు మీ యమ్మకు బరువుగానుంటివి. సృష్టిలో నిద్దఱు వ్యక్తులు వివేక హీనులని చెప్పవలయును. ఒకడు తనకు ముందేదో ధనము వచ్చునని మూలము నాశనము చేసికొనెడివాడు. రెండవవాడు తనకున్న సంపదయంతయు పోగా తినుటకు తిండిలేనప్పుడు సంపదకలనాడు వ్యయపెట్టినట్లుగా వ్యయపెట్టువాడు. నీవు మొదటిజాతికి చెందినదానవు. ఒకచెట్టు పెరుగవలయుననగా దానికి నీళ్లు పోయవలయును. దోహదమును చేయవలయును. దానినే పురుషకారమందురు. అప్పుడు దైవము ఫలించును.

"ఈయన బ్రాహ్మణుడు. మహాబలవంతుడు. కోటలో పలుకుబడి కలవాడు. నేటి మహారాజుగారి పేరు వీరదేవవర్మ యని నీకు తెలియు ననుకొందును. ఆయనతండ్రి నందదేవవర్మమహారాజు. ఆయన కిద్దరు భార్యలు. మొదటి యామె ముసలిది. ఆమె వృద్ధురాలు. వందయేండ్లు దాటిన యామె. ఆమె పేరు తారాదేవి. రెండవ భార్య నడివయస్సులో నున్నది. ఆమె పేరు సుభద్ర. వీరదేవవర్మమహారాజుగారు సుభద్రాదేవి కుమారులు. ఈ సుభద్రాదేవి నాయన యెంతయో ప్రేమించెడివాడు. నందదేవవర్మ వృద్ధుడు. సుభద్రాదేవి పడుచుది.

దశరరథమహారాజు కైకను ప్రేమించునట్లు ప్రేమించినాడు. కాని, సుభద్రాదేవి కైకవంటిది కాదు. అగునో కాదో, తారాదేవి కడుపున పుట్టిన కొడుకులు నలువురును యుద్ధములో మరణించిరి. అందుచేత, నా కొడుకునకు రాజ్యమిమ్ము. తారాదేవి కొడుకులను నడవికి పంపించుమని చెప్పవలసిన యగత్యమే లేకపోయెను.

"రాజాంతఃపురములందు దౌవారికు లుందురు. సంప్రదాయకముగా పండితులును, వృద్ధబ్రాహ్మణులునై యుందురు నందదేవవర్మ మహారాజు ఈ సుభద్రాదేవిగారి యొక్క యంతఃపురమునకు నితనిని ద్వారరక్షకునిగా పెట్టెను. అప్పటి కితడు చిన్నవాడు. వయసులో నున్నవాడు. చూచుటకు భయంకరుడు. శౌర్యవంతుడు. రాజుప్రక్క నుండి కొన్ని యుద్ధములలో రాజుయొక్క ప్రాణములను రక్షించినవాడు.

"ఆ నందదేవవర్మకు తన మునలితనములో రాజ్యము వచ్చెను. అందఱును శత్రువులే. ఆయన కొన్ని యుద్ధములలో గెలిచెను. కనీసము పదిసార్లయినను యుద్ధములలో సంహరింపబడెడివాడే! ఆయనను రక్షించినది యిద్దఱే. గంధగిరినగరమునందు భాస్కరదేవవర్మ యని యొక మహావీరుడుండెను. అతడిప్పుడు కూడ బ్రతికియేయున్నాడేమో తెలియదు. బ్రతికియుండడు. శత్రువుల కత్తిదెబ్బలతో నతని కాయము తూట్లుపడి యుండును. రెండవవాడీ కాలాభట్టు.

"ఈయనపేరు కాలాభట్టు సుమా! ఇతనిని పెద్ద పెద్ద యోధులు కూడ కత్తితో తాకలేకపోయిరి. ఇతడు మహాపండితుడు, చిన్నప్పుడు వేదవేదాంగములు చదివినవాడు; మరియు వేదాంతశాస్త్రము కరతలామలకముగా నున్నవాడు. నిర్మముడు. బ్రహ్మచారి. యుద్ధములో నొకవేళ నితడు చనిపోయియుండినచో పురుహూతు డితని వద్దకు రంభనో, యూర్వశినో పంపియుండినచో నిస్సంశయముగా నాకు మీ రక్కఱలేదని చెప్పెడివాడు. అంతటి జితేంద్రియుడు. ఆ సంగతి నందదేవవర్మ మహారాజునకు తెలియును. ఆయన తన ప్రియురాలైన సుభద్రాదేవి యంతిపురమునందు దౌవారికుడుగా నుంచెను.

"ఆ మహారాజు పోయినాడు. కొడుకు వీరదేవవర్మ రాజ్యమునకు వచ్చినాడు. సామాన్య సంసారములలోనే భర్తపోయినంత భార్య

యెందుకును పనికిరాదు. రాజవంశములలో నీ పనికిరాకపోవుట పతి రెట్లగును. కొడుకు పెండ్లి చేసికొనును. ఆ కోడలు రాణి యగును. పెత్తన మామెది. తొలుత కొన్నాళ్ళు కొడుకు తల్లి వైపవలబించినను కొన్నాళ్లు తల్లిని భార్యను సమానముగా చూచును. తరువాత తల్లి కొమ్ము పడిపోవును.

"వీరదేవవర్మకు తండ్రి బ్రతికియుండగా వివాహము కాలేదు. తండ్రి చనిపోయిన తరువాత నతనికి పట్టాభిషేకము చేయవలయును గదా? అవివాహితునకు పట్టాభిషేకము జరుగరాదు. పెండ్లి చేయ వలయును. తారాదేవి గొప్పయింటి బిడ్డ. ఆమె పుట్టింటివారు నేపాల దేశపురాజులంతవారు కారుగాని, వీరియంత శౌర్యము, పరాక్రమము ప్రతిభయు గలవారు. ఈ సుభద్రాదేవి యంత గొప్పయింటి పిల్ల కాదు. ఈమె గంధగిరి నగరముయొక్క యాడుపడుచు. ఈమెవలననే భాస్కరదేవవర్మరాజున కంగరక్షకుడుగా వచ్చెను. ఈ భాస్కరదేవ వర్మ తనకు ప్రాణరక్షకు డగుటచేత, నతడు సుభద్రాదేవికెక్కడో దూరపు చుట్టమగుటచేత, సుభద్రాదేవి తెచ్చినవాడగుటచేత నంద దేవవర్మకు సుభద్రాదేవియన్నచో ప్రేమరెట్టింపుగా నుండెడిది. కోట కోటయంతయు సుభద్రాదేవికి విరోధము. ఒక్క తారాదేవిమాత్రము సుభద్రమ్మ నాదరించెడిది. ఈ పురుషులలోవలె స్త్రీలుకూడ భిన్న ప్రకృతులుగా నుందురు. కొందఱు స్త్రీలు భర్తయొక్క పరస్త్రీ సంగమము నామోదించలేరు. కొందఱామోదింతురు. వారు భర్త నమితముగా ప్రేమింతురు. భర్త సుఖపడుటయే వారి కోరిక. తారా దేవి చాల యుత్తమురాలు. తన నలుగురు కొడుకులు చనిపోయిరన్న దుఃఖముచేతనే క్రుంగిపోయినది. సహజముగా మంచిది. కాని, యామె యందొక చెడ్డగుణమున్నది. ఆమె యితరులు చెప్పిన మాటలు వినును. అదియంత చెడ్డగుణము కాదు. ఎవరో చెప్పినప్పుడు వారి మాటలు వినును. మనము పోయి చెప్పినప్పుడు మన మాటలు వినును.

దానికేమి? వీరదేవవర్మ మహారాజు సుభద్రాదేవి కడుపునపుట్టు వను తారాదేవి యాయనను చిన్నప్పటి[illegible] మిక్కలి ముద్దుచేసెను. ఆమె యాయనను పెంచిన తల్లి. ఈమె కన్నతల్లి. ప్రేమ సమానము గానే యున్నదనుకొనుటకు వీలులేదు. పెంచిన తల్లియందే మొగ్గు.

అందుకనియే మహారాజు తామె చెప్పిన ఆమె దగ్గఱిబంధువుల పిల్లనే పెండ్లియాడెను. అది వేఱు కథ. కన్నతల్లి యన్నచో గౌరవము లేక పోలేదు.

నందదేవవర్మ మహారాజు పోయినతరువాత కోటలో పైచేయి తారాదేవిది. సుభద్రాదేవికి లోపమేమియు లేదు. కొడుకునకు గౌరవముకూడ కలదు. కోటలో తారాదేవిగారికున్నంత గౌరవములేదు. సుభద్రమ్మగారికి తన యాస్తి తనకున్నది. తన పరిచారికా పరిచారకులు తనకున్నారు. మహారాజు పోయినతరువాత ప్రత్యేకముగా దౌవారికుడని యుండనక్కఱలేదు. అంతఃపుర ద్వారపాలకులుందురు. అప్పటి మహారాజు భార్యకే ప్రత్యేకముగా నొక దౌవారికుడుండును.

అందుచేత కాలాభట్టుయొక్క యుద్యోగము పోయినదన్న మాట. కాని, సుభద్రాదేవి యితనిని వదలిపెట్టలేదు. కోటలో వారు వారు సణుగుకొందురు. మహారాజుతో చెప్పి లాభములేదు. తారాదేవి తానెప్పుడును బయటపడదు. మహారాజు తన తల్లి యిష్టమువచ్చిన ప్రకారమే కానిమ్మనెను. కోటలో కాలాభట్టు నెవ్వరు నేమియు ననుటకు వీలులేదు. ఎవరైన సుంత యమర్యాదగా ప్రవర్తించిరా కాలాభట్టు నవ్వును. కాలాభట్టు కోపించినచో గుండెయాగదు. నవ్వినచో వాడి కదలదు.

నేడు నిన్ను కాలాభట్టున కప్పజెప్పుచున్నాను. ఇతనికి కోటలో నివసించుటకు రెండు మూడు గదులున్నవి. ఇది యతని యిల్లు. అచట నెవ్వరును ప్రవేశించుటకు వీలులేదు. నీవచ్చటనున్నచో నిన్నెవ్వరును చెనకరాదు. చెనకుటకు వీలులేదు. మహారాజు ఇద్దఱు ముగ్గురు భార్యలను పెండ్లి చేసికొన వచ్చును. నా జోస్యమారీతిగా ఫలించునే మోయని నేననుకొనుచున్నాను. కాని యొడలెల్ల మంచిగంధము నత్తరులు పూసికొని పట్టుచీరలు ధరించిపోయి ముండ్లకంచెమీద పండుకొనుట వంటిది, నీ కిష్టమైనచో వెళ్ళుము."

అని నిరంజన భట్టనగా నేను వెంటనే వెళ్ళుదునని చెప్పితిని. దానికి నాలుగైదు కారణములు కలవు. అందులో రెండు ప్రబల కారణము లున్నవి. అవి చిక్కులి ప్రధానములైనవి. నిరంజనభట్టు చెప్పిన కథలో కొంత నాకు తెలియును. తారాదేవి గొప్ప కుటుంబము

లోనిదనియు, మా కుటుంబమువారు ప్రభు వెట్టివాడో వారు నట్టివారే యనియు; నింక నేమనగా ప్రభువు ప్రభువు గనుక చివరకు వానిమాట పొగును ఒక్కొక్కప్పుడు ప్రభువుగూడ వారి ననుసరించి పోవును. మహా సేనాధిపతులు, మహామంత్రులు తఱచుగా వారి కుటుంబములోని వారే యైయుందురు. రాజ్యపాలనము వారిమీద నాధారపడి యుండును. సేనలు వారిచేతిలో నుండును, రాజ్యాంగము వారిచేతిలో నుండును. వారును రాజును కలిసి రాజ్యము చేయుదురు. ఒక రాజు రాజ్యము చేయుచున్నాడనగా సర్వము నతడే చేయుననుకొనుట యవివేకము. అతని క్రింద మంత్రులుందురు. సేనాపతు లుందురు. అధికారు లుందురు. నిజముగా రాజ్యము చేయునది వీరు. వీరు చెప్పి వట్లే రాజు రాజ్యమును చేయును. రాజును, రాజ్యమును వారి క్షేమమును సమాలోచించి వీరు చెప్పుదురు. ఒక్కొక్కప్పుడు రాజు చెప్పి వది వీరికి పడదు. వీరు చెప్పినది రాజునకు పడదు, అప్పుడు రాజ్యములో క్లిష్టపరిస్థితు లేర్పడును. కొందఱు రాజులు తమ మంత్రులను తమ సేనాపతులను తామే నిర్ణయించుకొందురు. అప్పుడు నిజముగా రాజు సర్వాధికారి. మంత్రియో, సేనాధిపతియో రాజు చెప్పినట్లు వినని చో రాజు వారిని తీసివేయును. మరి యొకరిని నిర్ణయించును. నేపాళదేశములో నట్లుగాదు. పరిస్థితి యిది.

ఆ తారాదేవియొక్క బంధువుల కుటుంబములు నాలుగున్నవి. అవి పెద్ద కుటుంబములు. వారికి వేఱే చిన్న చిన్న రాజ్యములవంటివి కలవు. అవి వీరదేవవర్మ మహారాజునకు లొంగియుండవలసినవే. నిజానికాయన రాజ్యములోని భాగములే కాని, యా నలుగురు ప్రభువులు మహారాజవంశమునకు దగ్గఱి బంధువులై తాము స్వతంత్ర ప్రభువులవలెనే సంచరింతురు. ఆ వంశములు నిమిషుడు, మానాతుడు, శాకవర్మ, పశుప్రేతదేవుడు మొదలైన మహారాజుల నాటినుండి వచ్చుచున్నవి. ఆ వంశములు నేటికి రెండువేలయేండ్లు మూడువేల యేండ్లనుండి వచ్చుచున్నవి. ఆ నాల్గువంశములవారును కనీసమైదారు వందలయేండ్ల నుండి కలిసియే యుందురు. చుట్టరికము లెప్పటికప్పుడు కలుపుకొనుచుందురు. నిజానికి నందదేవవర్మ తన రాజ్యాధిపత్యమువందు తాను నిలువద్రొక్కుకొ నెననగా వారే కారణము. వారు నంద

దేవవర్మ పక్షముననుండి యుద్ధములు చేసిరి. ఈ వీరదేవవర్మకు రాజ్యము వచ్చినదనగా, నితడు పట్టాభిషిక్తుడయ్యెననగా, వారి ప్రాపకముచేతనే జరిగెను. ఇట్టి స్థితిలో వీరదేవవర్మ మహారాణి తారాదేవి చెప్పినట్లు పెండ్లి యేల చేసికొనకుండును?

ఆ నాల్గు వంశములలో నొక వంశము వాలంబవంశము. రెండవది ఉదయదేవవంశము. మూడవది కాకవర్మవంశము. నాల్గవది అభయమల్లవంశము. నీకీ పేరులన్నియు తికమకగా నుండవచ్చును. నేనందులో మునిగి తేలినదానను గాన నా కవియన్నియు తెలియును. ఈ నాల్గువంశములలో కాకవర్మవంశము, అభయమల్ల వంశమువారు చాలధూర్తులు. వారియందు సాధుత్వములేదు ఆ రెండు వంశములలో జన్మించినవారు చిన్నప్పటినుండి క్రోధమతులుగా, ధూర్తులుగా, యథేచ్ఛావర్తనులుగా నుందురు. తండ్రులు ప్రధానమంత్రులో ప్రధాన సేనాపతులో యైయుందురు. ఈ కొడుకులు నిరంకుశులై ప్రవర్తింతురు. వారెన్నియో యత్యాచారములైన చేయుచుందురు. నీ విట్టిమాటలు లెఱిగియుండవు. రాజ్యములో నొక గ్రామములో, నొక నగరములో, నొక యింటిలో నొక సౌందర్యవతియున్నదని తెలిసినచో వారామెను బలవంతముగా తెప్పింతురు. వారి భర్తలు, సోదరులు వారికాయుర్దాయములున్నచో నూరకొందురు. వారికొకప్పుడు ధనము కావలెను. నీ యిష్టమైనచోట మహా ధనవంతు డొకడున్నాడనుకొనుము. వానికిన్నివేల దీనారములు కావలెనని కబురుపెట్టుదురు. వానికి నేలమీద నూకలున్నచో వాడంతపంపించలేకున్నను తలకాకట్టునైన పెట్టి పంపించును. లేనిచో, వాని తలయొక్కటియే కాదు, వాని తలతోపాటు పదితలలు కాకట్టులో నుండును. వారు వార్తపెట్టి రనగా నది రాజాజ్ఞ యన్నమాట. రాజాజ్ఞకు వారికోరికలకు భేదములేదు. ఆ మహామంత్రి యాకుమీద వ్రాయును. రాజముద్ర వేయించును. ఈ ధనమెందుకని రాజడుగును. అది చేయించవలయు, నిదిచేయించగలయునని మంత్రి చెప్పును. ఆ మంత్రులు వా సేనాధిపతులు నీ నాల్గువంశములలో మరియు నీ కాకవర్మ యభయవర్మవంశములలో కొడుకులు మేనల్లుండ్రు మొదలైనవా రాడిన దాట పాడినది పాట.

నాకప్పటికి పదునారేండ్ల వయస్సు. మినమినలాడి పోవుచున్నాను. నిరంజనభట్టు వారిదొడ్డిలోని యొక కపిలగోవును పెంచి నట్లు నన్ను పెంచెను. ఆ గోవు యొక్క పాలు పెరుగులు నేనే త్రాగవలయును. అది యేమిమమకారమో! ఆ మమకార మెందుకో నాకు తెలియదు. నీవు నమ్ముము. నమ్మకపొమ్ము. నేనిపుడు మాటాడుచుండగా నొక నాగరకురాలు, నొక జ్ఞానవంతురాలు, నొక లోకజ్ఞురాల, నొకవిద్యావతి, సర్వరాజ్యరహస్యపరిజ్ఞాత్రి మాటాడుచున్నట్లున్నది కదా!

నిరంజనభట్టు నన్ను కాలాభట్టున కప్పగించిననాడు. నేను జాన పదురాలను. మూర్ఖురాలను. వట్టి పశువును. చూచుటకందమై దగ్గఱకు పోయినచో క్రుమ్మోడి పొట్లావువంటి దానను. నాకప్పుడు తెలియదు; తరువాత తెలిసినది.

కాకవర్మ వంశములోని యొకగొప్ప దొర కృతవర్మ మహారాజునకు కల యిద్దరు సేనాపతులలో నొకడు.ఆయనకు పురుషసంతానములేదు. అతనికి నలుగురు చెల్లెండ్రు. అందరిని గొప్ప కుటుంబములలోనికే యిచ్చినాడు. ఆయనకొక చెల్లెలిమీద మిక్కిలియు ప్రేమ. ఆ చెల్లెలి భర్త నందదేవవర్మ చేసిన యుద్ధములలో చనిపోయెను. ఆ చెల్లెలికొక్కడే కొడుకు. పది యేండ్లకొడుకుతో వచ్చి ఆచెల్లెలు అన్నగారింట నుండెను. ఆసేనాపతి పేరు కృతవర్మ.

ఈమేనల్లుని పేరు అశ్వత్థామ. కృతవర్మ కశ్వత్థామ మీద నెంత యనురాగమో చెప్పుటకు వీలులేదు. వానికిరువదియేండ్లు వచ్చినవి. మేనమామ యింటికి వచ్చినప్పుడతడింకను పసివాడు. వాడుకొంపలు తీసెడు కొఱవి. వాడు పట్టించి తెప్పించి పాడుచేసిన స్త్రీలప్పటికే పది మంది యున్నారట. అతనికి నిరంజనభట్టనగా మిక్కిలి భయము. ఎందుకో తెలియదు. నిరంజనభట్ట సుభద్రాదేవికి పంచాంగ బ్రాహ్మణుడు. నిరంజనభట్టెవనినైన "ఓరీ! నీవు నాలుగు నెలలలో చనిపోవుదువు" అనినచో వాడు నిస్సంశయముగా చనిపోవును.

ఈ అశ్వత్థామ తండ్రి బాలాయనుడు. నిరంజనభట్టు బాలాయనుని యుద్ధములోనికి పోవద్దు. నీకు మంచిదినములుకావని చెప్పెనట. అతడు పోయెను. చచ్చెను. ఈ సంగతి కొడుకైన యశ్వత్థా

మకు తెలియును. అందుచేత అశ్వత్థామకు నిరంజనభట్టన్నచో భయము; మర్యాదయు. అందుచేత నా ధూర్తత్వము నా పెదసన గొట్టుదనము నాటివఱకు సాగినవి లేనిచో నప్పటికెప్పుడో నేనా పాలుతినై కోటప్రక్కన ప్రవహించు నదిలో కలసి యుండవలసినది.

అతడాతడని నాకు తెలియదు. అతడు పలుసార్లు నిరంజనభట్టు గృహము ముందుగా నాల్గుగుఱ్ఱములబండి మీద పోవుటయు నా వంక చూచుటయు మాత్రమేకాదు. చిటికలు వేయుట, వ్రేళ్లు ముద్దుపెట్టు కొనుట జరుగుచుండెడిది నాకేమి తెలియును? నేను ధాత్రిమీద నంబూకృతి చేయుచుండెడిదానను. అతని కన్నులెఱ్ఱబడెడివి. అట్టి వారిని నేను కొందఱి నెరుగుదును. వారిలో నిత డొక డనుకొంటిని. తరువాత నితని సంగతి నాకెవరో చెప్పిరి.

ఓసి' నీతల పండు పగులా! ఈసారి అతడు నిన్ను చూచి యట్లు చేసినచో తలవంచుకొని పొమ్ము. నేలమీద నుమ్మివేయుట. లెక్కచేత నట్లు తల త్రిప్పుట మొదలైనవి చేయకుము. అతడు సామాన్యముగా నే వేళకు వచ్చునో నీకు తెలియునుగదా! ఆవేళ వాకిటిలో నుండుట పరిహరించుము అని యతని కథ నాకు చెప్పిరి.

వారు మరియు నన్నారుకదా! నీకర్మమెట్లును కాలినది. నిరం జనభట్టు తానెప్పుడు మృతిపొందునో యిదివఱకే చెప్పినాడు. అది నాలుగైదు నెలలకు మించి లేదు. నిన్నశ్వత్థామ నాశనము చేయును. అని చెప్పిరి.

ఆ యశ్వత్థామ చేసెడి ఘోరములను విన్నచో నాకేమి, యే స్త్రీకైనను భయము వేయును. నేను కాలాభట్టు వెంటపోవుట కంగీక రించుట కిది యొక కారణము.

రెండవకారణము ఇంత భయోత్పాతకమైనదికాదు. అదికొంత న్యాయమైనదియే. వీర దేవవర్మ మహారాజునకు పదుగురు మంత్రులు కలరు. అందులో నొక మంత్రి మంత్రిపదవి గొప్పదికాదుగాని రాజు మాత్ర మతడెట్లు చెప్పిననట్లు చేయునట. ఆ మంత్రి ప్రతిభ నందదేవ మహారాజుకాలములో నెక్కువగానుండెడిదట.అతడభయవర్మవంశము లోనివాడు. తారాదేవికి పినతల్లి భర్త. అతనికి కొడుకులున్నారు, కొడుకులకు కొడుకులున్నారు, నన్ను కోరినవాడు మూడవ కొడుకు

యొక్క రెండవకొడుకు. అతడు సూటిగా నిరంజనభట్టునకే వార్త పంపెను. మాది క్షత్రియవంశమని నిరూపించును. నన్నతడు పెండ్లి యాడును, మా దారిద్ర్యమును నాశనము చేయును, ఇంతకును కారణము వాని తాత మహారాజుతో చెప్పినచో మహారాజు మమ్ము క్షత్రియులుగా నిరూపించును, రాజు తలచినచో దెబ్బలకు కొదువయా! మా తల్లియు నన్నయు దీనికి మిక్కిలి ననుకూలురుగా నుండిరి, ఎన్నాళ్ళ దారిద్ర్యము ననుభవింతుము! అతడు పెండ్లియాడును, కోరిక న్యాయముగా నున్నదికదా! దురుసుగా లేదుకదా' ఆ పెండ్లి జరిగినచో మేము బాగుపడుదుము, నీవు సుఖపడుదువు, నీతండ్రి విలువగల సారాయమును త్రాగవచ్చును. గుఱ్ఱపుబండ్లపై పోదుము, పట్టుపరుపులపై పండుకొందుము, మొదలుగా చెప్పెడిది,

ఎందుచేతనో యతడన్నచో నా కిష్టము లేదు, వానిమాటలయందు నాకు విశ్వాసములేదు, తీరా పెండ్లి చేసికొని, లేదా యట్లు నటించి నన్నొక యుంపుడుకత్తెనువలె వారియింట నుంచినచో నేనేమి కావలయును? నా జాతకము ప్రకారము రాణిని కావలెను,

ఈ రెండు కారణములచేత కాలాభట్టు వెంట వెళ్ళుటకు నిశ్చయించితిని.

# 17

కలసివచ్చినప్పుడు చమత్కారముగా కలిసివచ్చును. అనుకోని పరిస్థితు లేర్పడును. వెదకుచున్న తీవ కాలికి తగులును. నాడు నేపాళ దేశముననే మతము ప్రబలముగానున్నదని ప్రశ్న. విక్రమార్క చక్రవర్తి యైదువందల యేబది యేండ్ల క్రిందట నేపాళమునకు వెళ్ళెను.ఆయన యెల్లమ్లేచ్ఛమతములను నిర్మూలించెను. తరువాత వంద వందయేబదియేండ్లు నేపాళమున వైదిక మతమే యుండెను. తరువాత బౌద్ధమతము మరల నెమ్మదిగా ప్రవేశించెను. అప్పటి నుండి నేటివఱకు గూడ రెండు మతములు నా కప్పుడిమతము మొగ్గు, మరొకప్పుడామతము మొగ్గుగా నుండుచునేయుండెను.

నందదేవవర్మ కుమారుడు వీరదేవవర్మ కాలములో రాజుల మతమొక చిత్రముగా నుండెనని చెప్పవచ్చును. కట్టెడివి విహారములు. లోన పెట్టెడివి శివలింగములు. ఉపాసించెడి దేవత పేరు బుద్ధుడుకాడు, శివుడుకాడు. విష్ణువుకాడు. ఆమె యొక యోగిని. వీరదేవుడు తాను స్థాపించిన లింగములకు మణిస్థలములని పేరుపెట్టెను. ఎందుకయ్యా! ఇట్లు పేరు పెట్టెననగా నాయన యిష్టదైవము పేరు మణియోగిని, ఆ మణియోగిని లలితాదేవి యొక్క మరియొక రూపమో యేమో!

కొన్నికోట్ల శివాలయములుండును. కొన్నికోట్ల విష్ణ్వాలయములుండును, మరియు శైవవిద్యాసంప్రదాయమున కొన్ని వందల దేవతలున్నారు. వారివారి పేర్లు వేలువేలు. ఒక చోట కేశవస్వామి. ఒకచోట లక్ష్మీనారాయణస్వామి. ఇట్లు విష్ణువుయొక్క వందల పేర్లుండును. ఊఱకయే మొవ్వి పేర్లేనా? వెనుక నేమైననర్థమున్నదా? అని విచారించినచో నెన్నివందల శివనామములున్నను నెన్నివందల విష్ణునామములున్నను, ఎన్నివందల దేవీనామములున్నను పరమార్థమొకటియేయైనను, నుపాసనామార్గమున భేదములున్నవి.

ఆ యుపాసనాభేదము లెట్లు వచ్చుననగా సంపుటీకరింపబడిన బీజాక్షరముల నుండి వచ్చును. సర్వశబ్దమోంకారమునుండి బయలుదేఱినది. మంత్రశాస్త్రము లందలి యాగమశాస్త్రము లందలి బీజాక్షరములోంకారముగా బయల్వెడలినవి. బీజాక్షర సంపుటి భేదము వలన నాయా దేవతలు భిన్నభిన్న ఫలముల నిత్తురు. అక్షర సమామ్నాయము తొలుత నొక్కచోటినుండియే వచ్చెను కదా! అన్నియక్షరములు నాభినుండి బయల్వెడలిన వాయువు యొక్క వికారములే. అవి బహిరమించు మార్గమున నెక్కువ భేదముండదు. కంఠతాల్వాదులను స్పృశించెడు నప్పటికి బహిరాకృతి భిన్నముగా నుండును. ఈ భిన్నత నాభిస్థానమునందే యేర్పడినదా? కంఠతాల్వాది స్థానములందేర్పడినదా! అన్నచో నాభిస్థానమునందే యేర్పడినదని చెప్పవలయును. గొంతుక్రిందికి వచ్చినేనీ యక్షరముగా బయటికి రావలయునన్న సంకల్పముండును. ఆ యక్షరము పలుకవలెనన్న సంకల్పము తొలుతనే పుట్టును. ప్రయత్నము తొలుతనే

యారంభించుచు. అందుచేత నాభిస్థానమునందు బయలు వెడలినప్పుడే యాయక్షర మాయక్షరముగా బయలు వెడలినదని చెప్పవలయును. పరాపశ్యంతీ మధ్య మా వైఖరులని వాక్కులకు నాల్గు స్థలములందు నాల్గు పేర్లు. మనచేత నుచ్చరింపబడు శబ్దముపేరు వైఖరి. కంఠాధః స్థితియందు కలది మధ్యమ. హృదయము నందలిది పశ్యన్తీ. నాభిగత మైనది పరా. మనకు వైఖరియే తెలియును. మధ్యమ కొందఱు పండితులకు తెలియవచ్చును. పశ్యన్తి మాత్రము యోగులకే తెలి యును. పరారూపమైన స్థితిలో పరమేశ్వరునకు మాత్రమే తెలియును. దాని పేరే సంకల్పము. కనుక సర్వశబ్దము పరమేశ్వరుని నుండి వినిర్గమించుచున్నది.

ఇట్లుండగా, లౌకిక శబ్దము నలౌకిక శబ్దము రెండు నున్నవని యంగీకరించవలెను. పరారూపము పశ్యన్తరూపము రెండును లౌకిక ములు కదా! ఈ యలౌకికరూపములు లౌకిక రూపములకు పూర్వ రూపములేనా! మరియు నింకేమైననున్నదా? లౌకిక శబ్దములున్నవి. వాని కర్థములున్నవి. అలౌకిక శబ్దములకు గూడ నర్థములున్నవా? లేవనవలయును. లౌకిక శబ్దముల కర్థమున్నందున ప్రయోజన మున్నది. శబ్దమునకు మూడుస్థితులు. శబ్దము, అర్థము, ప్రయో జనము. లౌకిక శబ్దమునకీ మూడు దశలు కలవు. అలౌకిక శబ్ద మునకు రెండేదశలు: శబ్దము, ప్రయోజనము మాత్రమే. అది యెట్లనగా, లోక సామాన్యోదాహరణము చూచుకొందము. కవిత్వము - సంగీతమును నున్నవి. కవిత్వము పైన చెప్పిన మూడు దశలుకలది. సంగీతమునకు రెండేదశలు.శబ్దము ప్రయోజనము.దాని కర్థములేదు. కనుక ప్రయోజనము కలిగిన శబ్దమలౌకికము.

అట్టి శబ్దములు యోగులు దర్శించెడివి. వానిని బీజాక్షరము లందురు. అన్ని శబ్దములకు ప్రయోజన మొక్కటియే కాదు గదా! అట్లే బీజాక్షరములకును ప్రయోజనములు భిన్నములుగా నుండును. అట్టి బీజాక్షరములను సంపుటి చేసినచో కొన్ని లక్షణములు కలిగిన శైవమైన మూర్తికో, వైష్ణవమైన మూర్తికో, శ్రీదైవమైన మూర్తి కోయవి ప్రతీకములుగా నుండును. ఇది రహస్యము.

పట్టి లౌకిక శబ్దములే కలవు. సుష్టుగా నన్నింటినందరు

ముచ్చరించలేరు. సర్వకాలములందుచ్చరించలేరు. కనుక, వేళయు కొన్ని నియమములును, భుజించెడి యాహార పదార్థములును శబ్దము యొక్క సుష్ఠోచ్చారణకు కావలయును. ఒకడు మాటాడుచున్నచో నా భాష రమణీయముగా నుండును. ఆ భాషయే మరియొకడు మాటాడుచున్నచో వికృతిముగా నుండును. ఎందుచేత' పైన చెప్పిన కారణములే కాక ఆ వ్యక్తి యొక్క జన్మయందు గూడ నుండును.

నేడు రేడియోలు కలవు. రేడియోలలో వార్తలు ఆంగ్లేయ భాషలో ప్రసారము చేయబడును. ఆ ప్రసారము కొఱకేర్పాటు చేయబడిన వ్యక్తి వేఱు. వానికి వేఱే పనిలేదు. వానికి పెద్ద జీతము. ఇది ప్రత్యక్షముగా కన్పించుచున్నది. అందఱి భాష యొక్కచే - అందఱి యుచ్చారణము నొక్కఁటేయనుటకు వీలున్నదా? లౌకిక శబ్దమునకే యిన్ని నియమము లున్నప్పుడు లౌకికేతర శబ్దముల యుచ్చారణములందు, తత్ఫలము పొందుట యందు తత్ప్రయోజనము సాధించుట యందు నింకను నధికములైన నియమములుండును.

మంత్రము బీజాక్షరములు. వానినుపాసించుటకు యోగ్యులైన పురుషులు, వారి జన్మ సంస్కారము నివి యన్నియు నియమములై ప్రయోజనాపేక్షయావ్యక్తులు, వర్ణములు, తదుపాసనా నియమములు వైదిక మతము నిర్ణయించినది. బౌద్ధమతము దీనిని కాదన్నది. తొలుతటి బౌద్ధమతము కాదన్నది. తరువాతి బౌద్ధమతము వీనిలో పగానికి పైన నలవఱచుకొన్నది.

నేపాళ దేశము నందానాడు తాదృశమైన బౌద్ధమతమున్నది. నేపాళదేశమునందేకాదు, సర్వ భారత దేశమునందు, భారత దేశమందే కాదు తాను పోయి యాక్రమించిన చీనా దేశమునందుకూడ బౌద్ధ మతమున్నది. తంత్రమయము, యంత్రమయము, మంత్రమయము లైనది. అది బౌద్ధవైదిక మతముల యొక్క విచిత్రమైన సంకరము.

వీరదేవవర్మకాలమునసీ సంకరమతములో వైదిక మతమున కెక్కువ ప్రాబల్యము కలదు. బౌద్ధులలో దీనికధికమైన ప్రాబల్యము తరువాత తరువాతనుండెడిది. ఈ వీరదేవవర్మ యొక్క యిష్టదైవమైన మణియోగిని శ్రీదేవీ విద్యాగత బహువికారైక దేశరూపము. అక్కడికక్కడికే లౌకిక శబ్దములవలె వైదిక శబ్దములును ఫలము

నిచ్చును. కాకి-వాయసము-చిరజీవి—మూడు నొకే పక్షి పేర్లు. భిన్న స్థలములందు తమ సహజమైన యర్థమును పోగొట్టుకొనకుండ భిన్నార్థము లిచ్చును. ఇది శబ్దములోని రహస్యము.

మణియోగిని వీరదేవవర్మ కిష్టదేవత. సామాన్యముగా లోకములో శ్రీ దేవతకు బదులు పార్వతీదేవతను చెప్పుదురు. పార్వతి, దుర్గా, లలిత ఇవి యన్నియు నొకటి యందురు. అందఱు స్త్రీ దేవతలు. పార్వతియొక్క యంశలందురు ఈ మణియోగిని పార్వతీదేవి యొక్క వికారమున వచ్చును. లలితా, దుర్గా పార్వతి ప్రభృతి సర్వనామములు పర్యాయ పదములుగానే వాడుకొందురు. వీరదేవవర్మ యిష్టదేవత యొక్క పేరు మణియోగినిగాని అతడీ పై నామములలో దేనినైనను లలితాదేవి యొక్క వికారముగానే భావించును. తాత్పర్యమున వీరదేవవర్మ మహారాజు శ్రీవిద్యోపాసకుడనవలయును. ఈ శ్రీ విద్యను లోకమునందు స్త్రీవిద్యగా కూడ నజ్ఞులందురు. భావింతురు.

వీరదేవవర్మ కాలము పోయినది. ఇప్పుడతని మనుమడు నరేంద్రదేవుడు రాజు. ఇతడు పూర్తిగా బౌద్ధుడు. ఇతడు పెక్కు విహారములను నిర్మించెను. ఇతనికి ముగ్గురు కుమారులు. మువ్వురును సన్యాసులు. పైయిద్దరు వైదికమతము ననుసరించిన సన్యాసులు. మూడవ వాడైన వీరదేవవర్మ కొంత బౌద్ధ సన్యాసి. కొంత వైదిక సన్యాసి-కొంత లౌకికుడు. పైవా రిద్దఱు మాకురాజ్యా మక్కఱ లేదని వెడలిపోయిరి. రాజ్యము వీరదేవవర్మకు వచ్చును. స్థితియది.

ముత్తాతయైన వీరదేవవర్మ యితనికారాధ్యుడు.నంద దేవవర్మ కాలములో రాజ్యము గగ్గోలుగానుండగా, ఈ వీరదేవవర్మ తన బాహుబలము చేత, రాజ నీతి చేత రాజ్యమును నిలువద్రొక్కి, తాను తొంబది యైదేండ్లు రాజ్యపాలనము చేసెను. అతడు పూర్తిగా బౌద్ధుడు గాదు. తనతండ్రియు తాతయు, పూర్తిగా బౌద్ధులు.

తనకొక కోరిక కలదు. తాను రాజగుట యెట్లును నిశ్చయమే. తన తండ్రియైన నరేంద్ర దేవుడు మిక్కిలి వృద్ధుడు. నరేంద్రదేవుడిదివఱకే బదినాలుగేండ్లు రాజ్యము పాలించెను. కార్తాంతికు లతడు మరి రెండేండ్లకన్న నెక్కువ బ్రతుకడని చెప్పుదురు.

నేపాళ రాజ్యముయొక్క సంకటము లన్నియును మధ్యాలఖు నగరము నాశ్రయించి యున్నవని తన యూహ.

తనముత్తాత వేఱినగరమును నిర్మించవలయునని యనుకొనెను. రాజధాని యచ్చటకు మార్చవలయునని యనుకొనెను. ఆ నగర నిర్మాణము సగములో నాపివేయబడినది. ఎందుకాపి వేయబడినదో ఎవరికి తెలియదు. ఆయన రాజ్యమునకు వచ్చిన పదిపదేనేండ్లలో పునవే నగర నిర్మాణము సగము చేయుట, ఆపివేయుట, పరిత్య జించుట జరిగినట్లు అప్పటికా రాజునకు కోపము వచ్చెను.స్వాతంత్ర్య మవలంబించెను. తరువాత నెనుబది యేండ్లు నిరంకుశముగా పాలించెను. ఇది కథగా చెప్పుదురు.

ఆ వీరదేవవర్మ అదివఱకున్న వైదిక మతము మీద కొంత పగపట్టి దానిని సగము బౌద్ధము గామార్చెనట. తరువాత నెనుబది యేండ్లు రాజ్యము చేసినవాడు తానానగరము నెందుకు శిథిలముగా వట్టిపెట్టెనో యెందుకు నిర్మింప లేదో సరిగా తెలియలేదు. కథ లున్నవి. ఎంతవఱకు విశ్వసింపవచ్చునో ఎంతవరకు రాదో తెలియదు.

తనకు రాజ్యము వచ్చిన తరువాత నా నగరమును తా నుద్ధరిం చును. రాజధాని నచటికి మార్చి తీరును. ఇది యతని యంతరాంతర ములలోని కోరిక. అతని కాప్తులున్నారు. ఒకరిద్దరాంతరంగిక మిత్రు లున్నారు. ఈ మాటలు వారితో చెప్పును. కాని. వారు సాధ్యమగునా యందురు.

రెండు మూడుకోట్ల దీనారములుండినగాని యీ పని నిర్వహించ కాదు. ఇట్టి స్థితిలో రాజ్యమన్న తరువాత నెప్పుడో యేదో యే మూలనో చిక్కులు కలుగుచునే యుండును. ఒక రాజ్యములో రెండు మూడు మతము లున్న తరువాత రెండు మూడు జాతులున్న తరువాత నెవరికివారు తమ కొమ్మపైన నుండవలయునని ప్రయత్నించుచునే యుందురు. ఎప్పుడో యెవడో యొకడు సమర్థుడు పుట్టును. వాడు తన యభిప్రాయములకు ప్రాబల్యము తెచ్చును. ఇది సృష్టి లక్షణము.

ఒకప్పుడు వైదిక మతములో బ్రహ్మాండ నాయకుడుద యించును. ఒక విక్రమార్కదేవ చక్రవర్తి, ఒక శాలివాహన

చక్రవర్తి,ఒక సముద్రగుప్త దేవచక్రవర్తి వారి కాలములో మ్లేచ్ఛులు తలెత్తలేరు. ఎత్తినచో తలలు చితుకబొడిచిరి. అంత సర్వభౌరతము నానికొన్న మొగలుల నాడు కూడ ప్రతాపసింహుడు శివాజీ బయలుదేఱిరి. బాలాజీ బాజీరావు పుట్టెను. శ్రీకృష్ణదేవరాయలుదయించెను. వారి తరువాత నెన్ని యెన్ని జరిగెను. ఇది సృష్టి లక్షణము.

ప్రయత్నమనునది దాని కొఱకు పుట్టిన నాడు చేసినచో ఫలించును.అప్పుడు చేసినచో వ్యర్థమగును. ఇప్పుడు నరేంద్రదేవుడు పాలించుచుండెను, తన తండ్రి నరేంద్రదేవుడు. తాత చంద్రకేతు దేవుడు తన ముత్తాతయైన వీరదేవవర్మ సువ్యవస్థితముగా జేసిన రాజ్యమును వారిద్దరు నిష్కంటకముగానే పాలించిరి. ఈ నరేంద్ర దేవుని చివర దినములలో కొన్ని యల్లరులు బయలుదేఱినవి. దానికి కారణములు కలవు. నరేంద్రదేవుడు మిక్కిలి వృద్ధుడగుటచేత నెప్పుడో చనిపోవును. అతని ముప్వురి కొడుకులలో పెద్దవాండ్రిద్దరు సన్యసించిరి. మూడవవానికి రాజ్యము వచ్చుచున్నది. వచ్చును.

శత్రువులు తలెత్తుట కిది యొక హేతువయ్యెను. తన పెద్దన్న గారయిన పద్మదేవుడు తన తండ్రియైన నరేంద్రదేవుని తరువాత రాజ్యమునకు వచ్చినచో నందఱునూఱకుండెడివారు. పెద్ద కొడుకయిన నేమి ? మూడవ కొడుకయిన నేమి? ఈ లోకము యొక్క యూహాలే చమత్కారముగా నుండును. మంచియో, చెడ్డయో మానవుని యూహాలొక గాడికి పడిపోవుచుండును. అందులో కొన్ని ధర్మములవలె కానిపించును. కావచ్చును. దశరథుని తరువాత రాముడు పెద్ద కొడుకు. అతడే రాజ్యమునకు రావలెనని యెచ్చట నున్నది. భరతున కేల రాకూడదు. ఒకడు రాజగుట వాడు ధర్మముగ పాలించుటయు నిదీ ముఖ్యమా ? మాకా పెద్ద కొడుకే కావలయునని కూర్చుండుట ముఖ్యమా? పెద్ద కొడుకునకు రాజ్యము వచ్చును. తక్కిన కొడుకు లేమి కావలయును? సామాన్య సంసారముల మాట వదలి పెట్టుదుము. రాజైనవాడు నలుగురు కొడుకుల నేలకనవలెను? తక్కిన వారేమగుదురు? వారేదో రాజసోదరలుగా బ్రతుకుదురు. వారి సంతానమే మగును? మొదటినుండియు పెద్ద

కొడుకుల వరుస యంతయు రాజులా? తక్కిన వారందరును వందల యేండ్ల మీద చీమలు దోమలునా? అందఱు రాజులుగారు, అగుటకు వీలులేదు.

అందుచేత ధర్మముగా నెవడు పాలించునో వాడు రాజు కావలెను. మూడవ కొడుకు ధర్మముగా పాలింపడని యున్నదా! ఇది వీరదేవవర్మకు పట్టిన పట్టుదల.

నేపాలరాజ్యములో మిక్కిలి దక్షిణభాగమున, రాజధానికి దూరముగా నుండుటచేతను పరరాజ్యములకు దగ్గరగా నుండుట చేతను వీలయినప్పుడెల్ల నల్లరులు బయలుదేఱుచునేయుండును. ఇప్పుడొక యల్లరి బయలుదేరెను. సామాన్యముగా నట్టి సమయములలో సేనాపతులను బంపుచుందురు. వారాయల్లరులను అణచి వత్తురు. వీరదేవవర్మ యేమి చేసెననగా తానేపోయి యా యల్లరి నణచి వత్తుననెను. పెద్దకొడుకు లిద్దఱట్లయిన రాజున కిష్టములేదు.

వీరదేవవర్మ తాను పోయి తన పరాక్రమమును దెలిపి, తన యుగ్ర నీతిని చూపించి: తన తండ్రి తరువాత తాను రాజ్యమునకు వచ్చుటకు సర్వవిధముల యోగ్యుడనిపించుకొనవలయునని కోరిక. ఇప్పుడే తానింతవాడనని రుజువు పరచినచో రెండేడ్లలో తనకు రాజ్యము వచ్చినప్పుడు తన కెదురుండదు. నోరెత్తెడివాడుండడు.

అతడందుచేత సైన్యములను బయలుదేఱదీసి దక్షిణమునకు బోవుచుండెను, అతని సైన్యము జలంధరనగరము మీదుగా పోవుచుండెను. అప్పుడు జలంధరములో జితేదాస్తి యుండెను. జితేదాస్తి తన తాతమ్మయైన కాళిందిని జాలంధరులన్యాయము చేసిరి కదా! ఆ న్యాయమెట్టిదో కనుగొనవలయునని పోయెను. ఇది జితేదాస్తి కప్పుడు వెతుకుచున్న తన కాలికి తగులుట.

వీరదేవవర్మ జాలంధరమువఱకు వచ్చి దక్షిణమునకు పూర్తిగ పోవుటకు మున్ను తన సేనలోని వీరులను పరీక్షించుదామకొనెను. అది జాలంధరమువద్ద చేయుట జరిగినది. యువరాజు పెద్ద పెద్ద పటకుటీరములను వేసెను. వీరదేవవర్మ మంచి నీతిమంతుడు. జాలంధరపురము క్షత్రియ నివాసమైన నగరము. ఈ యోధపరీక్షలో

జాలంధరమునందలి క్షత్రియులు కూడ రావచ్చును. వీరులుగా నిరూపింపబడిచోనవారిని సైనికులుగాగాని వారి యోగ్యతలను బట్టి సేనాపతులనుగా తీసికొందుననెను.

జాలంధరములోనికి కొందఱు క్షత్రియయువకులు వెళ్ళిరి. జితేదాస్తియు వెళ్లెను. వీరదేవవర్మ యొక్క సేనాపతులలోగాని జాలంధర వీరులలోగాని జితేదాస్తిని మించినవాడు కన్పించలేదు. ఆ జితేదాస్తి తన కెదురు వచ్చిన ప్రతివానిని నిర్జించెను. అతడు చివరికొక ప్రతిజ్ఞ చేసెను, "నేను రేపు ప్రొద్దున సూర్యోదయా రంభము సూర్యాస్తమయాంతము నిలుచున్నవాడను నిలుచున్నట్లే యుందును. మీరొక్కరొక్కరు వచ్చినను సరే! పదిమంది, వంద మంది కొన్ని వందలమంది గుంపులు గుంపులుగా వచ్చినను సరే నను నిర్జించినచో నేను నాశస్త్రపరిత్యాగము చేయుదును. ప్రొద్దు క్రుంకిన తరువాత నా మీదికి రాకూడదు, మరునాడా పరీక్ష జరిగెను పగలు నాలుగు యామముల కాలము నిజముగా నతని మీదికి వెళ్లినవాడు గాయపడకుండ తిరిగి రాలేదు. ప్రొద్దు క్రుంకువరకు జితేదాస్తి యొడల నన్నియు గాయములే. కాని ఏవియు ప్రాణాంతకములు గావు. వీరదేవవర్మ యతనికి కట్లు కట్టించెను. తనవెంట తీసికొనిపోయెను. పదిపదేను దినములలో జితేదాస్తి మరల యథాస్థితికి వచ్చెను. ఒక్క జితేదాస్తి వందమంది సైనికు లతో నచ్చటి యల్లగులను పూర్తిగా నణచి వేసెను.

వీరదేవవర్మకు జితేదాస్తి మిక్కిలి స్నేహితుడైనాడు. మిత్రు డైనాడు. అతని పాండిత్యమాశ్చర్యముగా నున్నది. సంస్కృత భాషలో నసర్ఘముగా మాటాడును. ఎంత క్లిష్టమైన సమస్యయు సులభముగా తీర్చిపెట్టును. అన్నిటికంటె నాశ్చర్యమేమనగా తన మనస్సులోని ఏమేమి కోర్కెలున్నవో జితేదాస్తికి తాను చెప్పకుండ తెలియును.

ఒకనాడు వీరదేవవర్మ ముత్తాతయైన వీరదేవవర్మ వదలిపెట్టిన శిథిలనగరము మాట జితేదాస్తి ప్రస్తావించెను. వీరదేవవర్మ యాశ్చర్య పోయెను. ఇది నీకెట్లు తెలియుననెను.

జితేదాస్తి-నీకెట్లు తెలియునన్న మాట యేమి! స్వామి! లోక

ములో నందఱికి తెలియును. సగము నిర్మింపబడి యెందుచేతనో యాపబడి, దానిచుట్టును సుమారు రెండువందలయేండ్లనుండి పెరుగుచున్న యడవి కన్పించుచున్నది. దీనినెవడు చెప్పవలయును! కన్పించుచునే యున్నదికదా! అందందుకొందఱు వృద్ధులకు లీలగానేదో తెలియును. వారనుచునుందురు, నాకెందుచేతనో ఆ పట్టణము తమరిచేత మరల పునరుద్ధరింపించవలయునని పుట్టినది. నేను నిర్ధనుడను. నాకు వచ్చిన దొక్కటియే విద్య. దానిపేరు ఖడ్గవిద్య. ఇది నేను నేర్చికొన్నది కాదు. దైవదత్తమని చెప్పవలయును. నాకు చిన్నప్పటినుండియు మీ రాజవంశమన్నచో నొక యభిమానము. నేపాళదేశమున నుద్భవించి యీ యభిమానములేకుండ నెవడుండును? అయినను నాకు గూడనట్టి యభిమానమున్నదని, యుండుటలో తలమున్కలుగా నున్నదని మనవి చేయుచున్నాను. మీ నాయనగారి దర్శనము చేయవలయునా, మీ దర్శనము చేయవలయునా? మీ నాయనగారు వృద్ధులైనారు. నాకత్తివిద్య వారికెందులకు? వారి సేనాపతులు వారికున్నారు. వారి మంత్రులు వారికున్నారు. నాకు చిన్నప్పటినుండియు తమరిమీదనే మనస్సున్నది. అది యీరీతిగా దైవము ఫలింపజేసినాడు.''

వీరదేవ:-నన్నేమి చేయమందువు? రాజ్యము నాకు వచ్చిన తరువాత నిన్ను మహా సేనాపతిని చేసెదను. మంత్రినిగూడ చేసెదను. చాలునా?

జితేదాస్తి:-మరి శిథిలనగర నిర్మాణమెట్లు?

వీరదేవ:-దానివలన నేమి ప్రయోజనము?

జితేదాస్తి:-నన్నడిగినచో ప్రయోజనమున్నది. నేపాళరాజ్యతంత్రము తత్పూర్వమేమోగాని, భారతయుద్ధము నాటినుండి నాకు తెలియును. తమరికి తెలియకుండనుండుటకు వీలులేదు. నాపేరేమి? జితేదాస్తి. జితేదాస్తి యెవరు? మహాభారతయుద్ధములో నేపాళదేశ ప్రభువై పాండవుల పక్షముననుండి యుద్ధముచేసి యుద్ధములో చనిపోయిన రాజుపేరు. ఆ రాజు కిరాతవంశీయుడు. తత్పూర్వమహిర్వంశమువారు నేపాలమును పాలించిరి. కొన్నాళ్ళకు సోమవంశము వచ్చినది. తరువాత సూర్యవంశము వచ్చినది. తమరు ఠాకూరివంశము వారు. మీమూలపురుషుడంశువర్మ మహారాజు. వారికాలముననే

విక్రమార్కచక్రవర్తి నేపాళదేశమునకు వచ్చి మీ రాజ్యమును సువ్యవస్థితము చేసెను. ఆ యంశువర్మ కుమారుడు కృతవర్మ. వారి కొడుకు భీమార్జునుడు. ఆయన కొడుకు నందదేవుడు. ఆయన కొడుకు వీరదేవుడు. ఆయన మీ ముత్తాత. చంద్రకేతు మహారాజు మీ తాత గారు, నరేంద్రదేవ మహారాజుగారు మీ తండ్రిగారు. తరువాత రాజ్యము తమరిది. నాకింకొక్కటి తెలియును. ఎప్పుడు రాజవంశము మారినను వారు వారు రాజధానులను మార్చుచునే యుండిరి. మీ మూలపురుషుడైన యంశువర్మ మహారాజు రాజధానిని మధ్యలఖు నగరమునకు మార్చెను. ఎప్పుడెప్పుడు రాజధానిని మార్చిరో యప్పటినుండి యా రాజవంశమునకు నూత్నదీప్తి వచ్చుచుండెను. ఇది మీ రాజ్యచరిత్ర. ఆ నగరమును బాగుచేసి, తమరు రాజధాని నచ్చటకు మార్చినచో తమరి రాజ్యము దీనికి మూడురెట్లు దీప్తి మంతముగా నుండునేమో!

వీరదేవ:-(నవ్వి) మా ముత్తాత మార్చవలయుననుకొన్నా డయ్యా! అది జరుగలేదట. జరుగలేదేమో! మా ముత్తాతగారి రాజ్యము దేదీప్యమానముగా ప్రకాశించినదేమో! కనుక నీ మాటలలో నాకు నమ్మకము లేదు.

శ్రీశేదాస్త్రి:-ఆ మహారాజా ప్రయత్నముచేసినాడు కనుకనే నడుమ విఘటితమైనను తరువాత నంత దేదీప్యమానముగా నుండె నేమో! తమరి మిగిలిన పనిని పూర్తిచేసినచో మీతార మిన్నుముట్టు నేమో!

వీరదేవు:—తర్కము చమత్కారమైనది. నీ వందులో నిపుణు డవు.

శ్రీశేదాస్త్రి:-అయ్యా! అదికాదు మీరు ప్రభువులు. మీరు నాకింత చనవిచ్చి మాటాడుట నేను పూర్వజన్మలో చేసికొన్న పుణ్యమనుకొన వలయును. నా కోరికయిది. ఆ శిథిలనగరము మీచేత నుద్ధరింప బడవలయును.

వీరదేవ:-నీవప్పుడప్పుడు నాకు సర్వజ్ఞుడవనిపించును. నీవుకూడ నూహించని కొన్ని విషయము లున్నవన్నమాట. ఒక శిథిలనగరమును పునరుద్ధరించుట యనగా నది మాటలుగావు, మూటలు.

జితేదాస్తి:—ఎన్ని మూటలు గావలయును?

వీరదేవ:-నీదగ్గఱ నెన్నిమూటలున్నవి?

జితేదాస్తి:-దొరా! ప్రయత్నము చేయుదము.

వీరదేవ:-నేనా శిథిలనగరము నెప్పుడును పోయి చూడలేదు. అది యే స్థితిలోనున్నది? నిర్మింపబడినంతవఱకు మా ముత్తాతయెంత వ్యయపెట్టెను? ఆ పత్రములు నా లెక్కలు తెప్పించి చూడవలెను. అది నేను రాజునుగాకుండ చేయుట సాధ్యముకాదేమో! నేను దానిని తిరిగి యుద్ధరించవలయు ననగా మహారాజుగారి యొక్క యాజ్ఞ కావలయును. వా రంగీకరింతురో యంగీకరించరో! బొక్కసమున నెంతధనమున్నదో తెలియదు. ఉన్న ధనమును దీనిక్రింద వినియోగింత మందము. తక్కిన ప్రజాకార్యములు రాజకార్యములు నేమికావలెను? కొందఱు బంధువుల కిష్టముండదు. రాజోద్యోగుల కిష్టముండదు. రాజ్యమునందున్న కొందఱు మహాపురుషుల కిష్టముండదు.

జితేదాస్తి:—నా కొక్కటి చెప్పుడు, ఆ నగరము నుద్ధరింత వలయునని తమరెప్పుడైన సంకల్పించితిరా?

వీరదేవ:-అదీ! నీదగ్గఱనున్న తెలివి. నాకీ సంకల్పమున్నదని నీకు తెలియును. ఇతరుల యూహాలు నీకెట్లు తెలియునో నాకు తెలి యదు. ఏదో చెప్పుదురే! దరిద్రుల మనోరథములు పుట్టుచుండును వాని యంతట నవిలోపించుచుండును. ఒక రాజ్యాధికారి యిట్లనరాదు కదా!

జితేదాస్తి:-ఆ ధనము మనకెచ్చటనైన లభించుననుకొందము. మీ రంగీకరింతురా?

వీరదేవ:-నీ వఖండుడవు. దీనికంతకు నీవేదో పదకమువేసికొని మాటాడుచున్నావు. ఇంత ధనమెవరిత్తురు? అది యెక్కడనున్నది? నీకెట్లు తెలియును? ఆ సంగతి నాకు చెప్పుము.

జితేదాస్తి:-నాదగ్గఱ గ్రుడ్డి గవ్వలేదు. తమరు నాయందింత యనుగ్రహము చూపించినను నా సంసారపు కథ నెన్నడు నడుగలేదు. నేను చెప్పుట న్యాయముకాదని చెప్పలేదు. తమ రాజ్యమునందున్న చిన్నచిన్న కోటలలో మైథిలీపురము కోట యొకటి యున్నది.

వీరదేవ:—విన్నాను. ఆ దుర్గాధిపతి గొప్ప వేటకాడట అతని వద్ద నింకొక గొప్ప వేటకాడు కలడట!

జితేదా_స్తి:-ఆయన వద్దనున్న గొప్ప వేటకాడు నా తండ్రి. నా తండ్రిపేరు గాలి.

వీరదేవ:-ఓహో! అప్పటి తండ్రికొడుకులు. ఇప్పుడు కొడుకు తండ్రులై నారన్నమాట.

జితేదా_స్తి:-ఆ దుర్గాధిపతి కూతురు నన్ను ప్రేమించినది. మేమిద్దఱము పారిపోయితిమి. ఆరునెలలా శిథిలనగరమున తలదాచుకొంటిమి. నా భార్య యీ శిథిలనగరమును తిరిగి నిర్మించవలయునని పట్టుపట్టుకొని కూర్చున్నది. నేను చెప్పితిని. మన బ్రతుకు గడచుటయే కష్టముకదా! ఇది యేమికోరిక! దొరా! స్త్రీలయొక్క మనఃప్రవృత్తి చిత్రముగా నుండును. వారికి భర్త సంపాదన యెంత! ఇల్లుగడచుట యెట్లు? అన్న విచారణయుండదు. వారికి సంవత్సర గ్రాసముగడచుటయే కష్టముగా నుండును. ఒకవేయి దీనారములు వెలచేయు భవనమును నిర్మింపుమని కూర్చుందురు. నేనేమి చేయుదును? నేనామెతో చెప్పితిని. మీదయ సంపాదించి మీరనుకూలించినచో శిథిలనగర నిర్మాణము చేయుటకు ప్రయత్నించెదనని. అందుకని వచ్చితిని. ఇప్పుడు మనవిచేయుచున్నాను.

వీరదేవ:-ధనమును సమకూర్పుము.

జితేదా_స్తి:-నాకీ యూహ కలిగించి, తమకీ యూహను కలిగించిన దైవము తోడ్పడుననుకొందును.తోడ్పడును,తోడ్పడదు. తోడ్పడినచో తమరు నిర్మింతురు. తోడ్పడనిచో నా భార్య నాతో సుఖముగా సంసారము చేయదు. నేను తిండికిలేనివాడను. నా భార్య యొక చిన్న దొరకూతురు. ఆమె మరల పుట్టింటికిపోయినచో నేను చేసెడిదేమియులేదు. తమరితో ప్రసంగించివత్తునని యామె నాపితిని. నాదియొక్కటియే కోరిక. ఈ నగరపునర్నిర్మాణమునకు మహారాజుగారంగీకరించినట్లు పత్రమును పుట్టించినచో, నేనాపత్రము నామెకు చూపించి మరి నాలుగైదేండ్లామెను నేనాపగలను. ఈలోపుగా మాకొక మగపిల్లవాడైన కలిగినచో నామె నన్నువదలిపెట్టి పోదని నా నమ్మకము.

వీరదేవ:-ఇదిమాత్ర మెట్లు సాధ్యమయ్యా! మహారాజుగారు

పోటితో ననుమతింపవచ్చును. పత్రముమీద వ్రాసి యిమ్మన్నచో నిత్తురా? తండ్రికొడుకులనడుమ నిట్టి వ్యవహారముండునా?

శితేదా స్త్రి:-అదికాదు ప్రభూ! నాకిదియొక వెట్టిపట్టినదికదా! శ్రావస్తి నగరమున నొక మహాశిల్పియున్నాడు. అతడు బదరీయాత్రకు పోవుచు నాకు గనిపించినాడు. అతనికి శిథిలనగరమును చూపించితిని. అతనికెందుకు పుట్టినదో యీ నగరముయొక్క నిర్మాణము తాను పూర్తిచేయవలయునని సంకల్పించెను. నేను చెప్పితిని. దీనికి రాజాజ్ఞ కావలయునని అతడొక మనవిపత్రమును వ్రాసి నా చేతికిచ్చెను. దానిమీద రాజముద్రవేయించి రాజాంగీకారమును నీవు తీసికొని రమ్ము. నేనిప్పుడు కాదు. పాతికయేండ్లలోనైన సరే! దీని నిర్మాణమును పూర్తిచేయుదునని యతడు చెప్పెను. అతని లక్షణము చూచి నచో నతడు దీనికి తగిన ధనమును తేగలుగునన్న విశ్వాసము నాకు కలిగినది, ఆ పత్రమిదిగో ఆ నగరమును మరల నిర్మించుటకు తమరు రాజాజ్ఞ తెప్పించుడు. వాని పత్రమును వాని మొగమున వేసెదను. కాని, నేను వానితో మొదటనే చెప్పితిని. 'అయ్యా! నాకదియంతయు తెలియదు. నగరనిర్మాణము పూర్తియైన తరువాత దానిమీది సర్వాధికారము నేపాళదేశపురాజులది — నరేంద్రదేవవర్మ మహారాజు కావచ్చును, వీరదేవవర్మ మహారాజు కావచ్చును' అతడు దానికంగీకరించెను.

అనగా వీరదేవవర్మ దీర్ఘముగా నాలోచించెను. ఇట్లనెను:- "ఇందులో కూడ కొన్ని చిక్కులున్నవి. ఆ నగరాధిపతివినీవు. రక్షించెడివాడవు నీవు. రేపు నగరనిర్మాణము పూర్తియైన తరువాత—వానిది శ్రావస్తిపురమనుచుంటివి. అక్కడ ధనవంతులో రాజులో! దీనికి పెట్టుబడి పెట్టెదరేమో! ఇదియొక రాజనీతియేమో! ఈ నగరము మాది యని కూర్చుండి మన రాజ్యముయొక్క నడిబొడ్డున వారొకనగరమును తమ స్వంతము చేసికొని క్రమముగా దానిని విస్తరింపచేయుటకు చేసెడి ప్రయత్నమేమో! ఇది దూరమాలోచించవలసిన విషయము. నీవు తన్నగరాధిపతివి. నీవానగరమును మా క్రిందనుండి పాలించుకోవలయును. దానిమీది కెవరైన పరులువచ్చినచో బాధ్యత నీది. అప్పుడు నిన్ను మేమెట్లు సాధించవలయునో మాకది క్రమ

యగును. నీవు రాజనీతిజ్ఞుడవు, ఖడ్గవిద్యానిపుణుడవు. తెలిసి తెలిసి బిలవద్విరోధిని నమ్మి నేను నా రాజ్యములో తెచ్చిపెట్టుకొన్నట్లుండును. మా నాయనగారు దీనినడిగినచో నేమి చెప్పుమందువు?

జితేదాస్తి:- ప్రభూ! తమరు మహారాజనీతివేత్తలు కనుక నిట్లాలోచించితిరి. నిజముగా నేనిది యాలోచించలేదు. అయినచో దీనిని మానివేయుదుము.

వీరదేవ:- అట్లుకాదు. ఆ శిల్పి పేరేమి?

జితేదాస్తి:- తీర్థంకరుడు.

వీరదేవ:- అతడు మన యనుజ్ఞ లేకుండ గోడమీద రాయి నెక్కించగూడదు, పడిపోయిన రాయికూడ తీయగూడదు. నగర పునర్నిర్మాణమునకు ధనము నీవీయ వలయును లేనిచో నేనీయవలయును. మూడవచోటినుండి రారాదు. నీవైనను నాకు తెలియకుండ నీయరాదు. నీ వధికమైన ధనము తెచ్చినచో నీవాధనమును తెచ్చిన చోటు నాకు తెలియవలయును. ఆహార వ్యవహారములవట్ల మొగమోటమి పనికిరాదు. నీ శౌర్యాదులు నాకునచ్చినవి. వలసినచో నీకు గొప్పయుద్యోగమిత్తును. కావలసినచో నేను మహారాజునైన తరువాత నీకు పదివేల దీనారములిత్తును. తీసికొనిపొమ్ము. అంతే తప్ప, నా రాజ్యము యొక్క నడుమ శత్రువునువచ్చి కూర్చుండ నీయను.

జితేదాస్తి:- "ప్రభూ! మహారాజనగా నిట్లుండవలయునన్న మాట అల్పులకేమి తెలియును. రాజులైన వారందఱికిగూడ తమకు దెలిసినట్లు తెలియునా? తెలిసినచో నిట్లుండునా? ఆ పత్రమును తెప్పింపుడు. నే నా పత్రమును వానిచేతికీయను. వానికి జూపింతును. పత్రము తమవద్దనే యుండును.

వీరదేవ:- అట్లయినను మోటుసామెత యున్నదే. ముద్ర ముద్రగా నుండగా ముగ్గురుబిడ్డల తల్లియైనదని!

జితేదాస్తి:- స్వామీ! తమరు రాజాంతఃపురములలో పెరిగితిరి. ఇట్టి సామెతలు మీకెట్లు తెలియును?

వీరదేవ:- రాజు కాబోయ్యేడివాడు సర్వము తెలిసికొనవలెనయ్యా! లేనిచో వాడు రాజుగాడు. వాడు గాజు!

జితేదా స్తి:- ప్రభూ! తమరు మహారాజుగారి యనుజ్ఞ తెండు. నేను తమరికొక రహస్యమును చెప్పెదను. ఇప్పుడు చెప్పవచ్చునుగాని చెప్పుటకు నా కనుమతిలేదు. అయినను చెప్పెదను తమరు నేను దీనిని రక్షించినట్లు రక్షించవలయును. ప్రభువులవద్ద వాగ్దానమడుగుట తప్పు. ఇది నా స్వంత వ్యవహారముకాదు. ఒకచోట నొకనిధియున్నది. దాని నొక బ్రహ్మరాక్షసుడు రక్షించుచుండెను. ఆ నిధి యెచ్చటనున్నదో నాకును తెలియదు. అతడీ రాజాజ్ఞను పుట్టించికొని రమ్మనెను. ఇది రహస్యము. మీరు ముఖాముఖి వానితో మాటాడుదుమన్నచో వాని నడిగివత్తును. మీరే వానితో మాటాడుడు. కాని రాజాజ్ఞ లేకుండ వాడు మాటాడడు.

# 18

"నన్ను పెండ్లి చేసికొందునన్న వానికంటె నశ్వత్థామ వలన నెక్కువ భయపడవలయునా? ఇతనికంటె నతనివలన నెక్కువ భయమా? దీనిని విచారించినచో నశ్వత్థామ వలన నెక్కువభయమని పించును. అది నిజముకాదు. అశ్వత్థామ వలననే తక్కువ భయము. ఒక స్త్రీయున్నది. ఆమె నెవ్వడోధూర్తుడు, పొగరుబోతు, పలుగాకి వీధివెంట బోవుచుండగా బాధించుచుండును. నిష్కారణముగా బాధించును. ఆమె ననుసరించుచుండును. కొన్ని యసభ్యపు మాటలాడును. నిజమునకు వాడొక యుపద్రవమువలె కన్పించును. వానితో పెద్ద బాధలేదు. వానివంటి ధూర్తుని మరియొకనిని వానిమీద ప్రయోగించినచో వాడు చచ్చియూఅకుండును. బాధ వానితో లేదు. బంధువులలో కొందఱుందురు. వారి నేమిచేయుటకును వీలులేదు. అందులో వానికి వరుసయైన స్త్రీ. కుటుంబములలో లంకెలుండును. ఆ సంగతి భర్తతో చెప్పుటకు కూడ వీలులేదు. వాడు సరాగములాడును. ఆ సరాగము లొక్కొక్కప్పుడు మితిమీఱియుండును. మరియు నీ స్త్రీ యొక్క కుటుంబము వానికుటుంబముమీద నాధారపడియుండును. వాని దయవలన వీరిసంసారము నడచుచుండును. మరియువాడు తన

య త్తగారికి దగ్గఱి చుట్టము. అత్తగారు దీనిని హర్షించుచుండును. ఈ స్థితి మిక్కిలి చెడ్డది. అరే! బ్రతికినన్నాళ్ళు ప్రతిదినమున దినమునకు నాలుగైదుసార్లు ఆ స్త్రీ తన రక్ష తానుచేసికొనుచుండవలయును. వానికి మిక్కిలి కోపమువచ్చినచో వారియొక్క దయచేత కదా వీరికుటుంబము కొంత సాగుచున్నది—వాడాదయ కుల్యయొక్క తూములు బిగించును. రెండవవాని దట్టిస్థితి. అతని తాత మంత్రులలో సామాన్యుడేగాని తారాదేవికి చాలదగ్గఱి చుట్టము. దగ్గఱి చుట్టమనగా చెప్పితినిగదా! పెద్దతల్లి కొడుకో, పినతల్లి కొడుకో; తారాదేవితల్లి చిన్నప్పుడు చనిపోయెను. ఈమె నామె పెంచెను. ఆమెకు నా మంత్రి యన్నగారు. ఆమె యదుపాజ్ఞలలో పెరిగినవాడు. ఆ మంత్రిపేరు కేశవవర్మ. అతనిని నందవర్మ తండ్రియైన భీమార్జునుడు పెద్దమంత్రిని చేసెదనెనట. ఆయన యంగీకరించలేదు. పెద్దమంత్రియైనచో మంత్రి రాజు చెప్పినట్లు వినవలసివచ్చును. మంత్రిత్వముకంటె బంధుత్వమెక్కువగా నుంచినచో రాజుమీద నధికారము చేయవచ్చును. నందదేవవర్మ రాజ్యము చేసినన్నాళ్ళు తనపెద్ద భార్యయైన తారాదేవికి, కేశవవర్మ బోధించుట ఆ తారాదేవి చెప్పినట్లు నందదేవవర్మ వినుట. నందదేవ వర్మకు వినక తప్పదు. ఆమెకు నలుగురు కొడుకులు. కొందరేమని చెప్పుదురనగా నందదేవవర్మ రాజ్యమునకు వచ్చినచేటు కేశవవర్మ మూలముననే వచ్చినదని అతనికి రాజనీతియనగానేమో! తెలియదు. తనకు దప్ప మరియెవ్వరికి తెలియదని యహంకారము.

ఒకచోట నల్లరి బయలుదేఱినది. దానిని గోటితో తీసివేయవచ్చును. మనమీద ప్రజానురాగము పోవును. రాజు కర్కోటకుడను. కొందురు అని కేశవవర్మ వాదించుచుండెను. చివరికది గొడ్డలితో, తీర్చవలసిన పని యయ్యెడిది. ఆ నందవర్మ మహారాజుయొక్క యదృష్టము కొలది యతనికి రెండు గొడ్డళ్లు దొరికెను. ఒకడు భాస్కరదేవవర్మ. రెండవవాడు కాలాభట్టు. తారాదేవి నల్గురు కొడుకులు యుద్ధములో మరణించువరకు నందదేవవర్మ మహారాజునకు కేశవవర్మ కాలుసేతులాడనీయలేదు, సుభద్రాదేవి వచ్చినది. ఆమె కడుపున వీరదేవవర్మయుదయించెను. ఈమెది గంధగిరి.

భాస్కరదేవవర్మాది గంధగిరి. ఈమె మాటకు విలువయెక్కువయ్యెను. తారాదేవికి పుత్రదుఃఖముచేత క్రుంగిపోవుట యొకటి, తన కడుపున మరల సంతానము కలుగదన్న నిశ్చయమొకటి బాధలుగ నుండగా కేశవవర్మయొక్క జోరుతగ్గెను. కాని, తారాదేవి వీరదేవవర్మ మహారాజును పెంచుచుండెను. అప్పుడు కేశవవర్మకు మరల కొమ్ములు మొలచెను. ఆ కేశవవర్మను నూనెకాళ్ళ వాడందురు. అతడు బంగారమును పట్టుకొననిమ్ము. అది మన్నగును. కాని, యతడామన్నును ఇంద్రనీలమణుల పొడియని వాదించును. వానిమనుమడున్నాడు నన్ను పెండ్లి చేసి కొందునన్నవాడు. వానిమొగమును చూడవలయును నమ్ముదువో నమ్మవో ప్రాణముతోనున్న శవముయొక్క మొగము. వానితండ్రి చెప్పరానంత త్రాగుబోతు. వానికి పుట్టినవాడు వీడు. వీరదేవవర్మ మహారాజు రాజ్యమునకు వచ్చిన తరువాత కేశవ వర్మకు గురువేకాదశ స్థానమునవచ్చి కూర్చుండెను. ఆయన కొడుకు వ్యర్థుడు. ఈ మనుమడు పుట్టినాడు. వీనిపేరు చమత్కారమైనది. ఆ పేరు 'స్తుంకో' ఆ రాజ్యములో నానాడు కొన్ని పేర్లు చమత్కారముగా నుండెడివి. అవి నేపాళదేశములోని సామాన్యజనుల నామములై యుండవలెను. గ్రిఫి, యీ స్తుంకో, ఫోకో, గూజా, కింబు, గస్తి; ఇటువంటి పేర్లుండెడివి. అట్టి పేర్లిప్పటికిని నేపాళదేశములోని యాటవికులలో నుండును. కాలాభట్టు తోడివాడున్నాడే. వాడునొక పిశాచము. వానిపేరు గ్రిఫి. కాలాభట్టు మీకు చెప్పియుండవచ్చును. ఈ కేశవవర్మ మనుమని పేరు స్తుంకో.

అప్పుడు జితేదాస్త్రియనెను: "మాకీపేర్లు తెలియును. మా తాతగారి స్నేహితుడొకడున్నాడు. అతడాటవికుడు వాని పేరు ఫోకో."

రాణి:- ఆఁ! అవును. ఈ స్తుంకోను గురించి చెప్పవలయును. వానినందరు. తృతీయా ప్రకృతియని చెప్పుదురు. వానికి పెండ్లి చేసికొనవలయునన్న యారాటము. ఏ క్షత్రియ కుటుంబమువారు నతనికి పిల్లనీయలేదు. కేశవవర్మ పలుకుబడి యక్కడవని చేయలేదు. అతని పలుకుబడి యెక్కడనున్నది? తారాదేవి దగ్గరనున్నది. ఆమె పలుకుబడి నందదేవవర్మ వద్ద నున్నది. ఇప్పుడు కొందరికి భయము.

దేవి వీరదేవవర్మను దగ్గరికి తీసినది—వీరదేవవర్మమహారాజు తల్లి యెందుకంటె తారాదేవియందు దరికప్రేమ కలవాడు. కొంపదీసి యితనిరాజ్యము మరల నందదేవవర్మ రాజ్యమువలెనగునాయని! ఓ యమ్మ!' దొరసానీ! నేనానాడీ రెండుకత్తుల మధ్య నిరీకికొంటిని. చెప్పితినికదా! నేనానాడవిద్యావతిని, ధూర్తురాలను పరమదురహంకారము కలదానను, అవివేకము నాసొత్తు, నేనీ కత్తెలలోనుండి తప్పించికొనుటకు నిరంజనభట్టు చెప్పిన యీ మాటలు, కాలాభట్టు యొక్క భయంకరమైన మొగములో వెనుకగనిపించుచున్న పరమ సాధుత్వము నాకుప్రశ్రయము కలిగించినవి. నాకప్పుడున్న తెలివి తేటలనుబట్టి కాలాభట్టు మొగములోని గూఢముగానున్న శాంత ప్రకృతి తెలిసికొనుటయే. తరువాత, తరువాత నాకాశ్చర్యమని పించెను, నాకతని యాలంబనమువలన నాయాపదలు తొలగునవి నా కెందుకనిపించినది? నాకట్టి తెలివి తేటలులేవే! ఇంకొక్క యాపద వచ్చినచో ఆ యాపదనుండి తొలగుటకు కావలసిన తెలివి తేటలు భగవంతుడు ప్రసాదించునేమో! దానికదే! నా దురహంకారమునకు దురహంకారము! నేను కాలాభట్టు వెంటబడి పోవుచున్నానని వా తల్లికి చెప్పితినా నేను రాణిని, ఆమె పాలమ్ముకొనెడి స్త్రీ. కర్మము చాలక నేనామె కడుపున బుట్టితిని, అంతే. తండ్రితో నన్నతో చెప్పనే యక్కఱలేదు, వారన్నచో నాకు లెక్కయా? వారిదెప్పుడైన నేను మనుష్యులక్రింద లెక్కకట్టితినా? కాలాభట్టు వెంట వెళ్ళిపోయితిని.

"ఆ కాలాభట్టు నన్ను కోటలోని తన యిల్లని చెప్పదగిన గదులలోనికి దీసికొనిపోయెను. నా కిప్పుడు నవ్వు వచ్చుచున్నది. చెప్పితినికదా! మేము పిశాచములము నవ్వ లేమని? మరిః నవ్వుచున్న దన్నమాట! ఎందుకు వచ్చినది? తొల్లిటి స్త్రీజన్మలోని సంస్కారము నాయీ పిశాచిస్థితి యందుకూడ నన్ననుసరించుచున్నది కాబోలును. కాలాభట్టు ఆజానుబాహువు· ఉదాత్తమైన దేహము కలవాడు. మహా బలశాలి. నేనతని చంకక్రిందికి వచ్చితిని· కొంచెము పొడుగైన పెట్టె వంటి దానిలో లోనికి గాలివచ్చు సందులుకలదానిలో నన్ను నిలు చుండబెట్టి తాను దానిని రాత్రిపూట చీకటిలో మోసికొనిపోయెను. నే వతని యింటిలో నిందుమించుగా రెండేండ్లు గడిపితిని. నేను

కోటలో నున్నానని యెవ్వరికి తెలియదు. అతని యింటిలో నున్నా నని యెవ్వరికి తెలియదు. అత డెచ్చటికైన పోయినచో తలుపులకు బీగము పెట్టి పోవును. అతడు సుభద్రాదేవి యొక్క దౌవారికుడు. ఇతని యనుమతి లేకుండ సుభద్రాదేవి యొక్క అంతఃపురములోని కెవ్వరును పోవుటకు వీలులేదు. ఇతని యింటిముందు దౌవారికుడు లేడు. ఆ లోనికి వచ్చుటకు ననుమతి యెప్పుడు నెవ్వరికిని లేదు.

''ఇప్పుడింకొక చిత్రము. వీరదేవవర్మ మహారాజయ్యెను. సుభద్రాదేవి పట్టి యత్తగారు. అందులో నెట్టి యత్తగారు? రాజున కేమియు చెప్పలేని తల్లి. చెప్పెడి తల్లి తారాదేవి. అందుచేత కాలా భట్టునకు నిజంగా నుద్యోగము లేదు. అదృష్టమేమనగా నతనిని కోటలో నుండి యెవ్వరు వెడలనడవలేదు. ఇతని దినభత్య మితనికి చెల్లుచున్నది. అతని దినబత్తె మనగా నలుగురికి సరిపోవును. అందులో నేనెంత తిందును? నాల్గవవంతు తిందును. నేను వంటచేయ నారం భించితిని. అతడు తినుచుండును. నాకు కాలాభట్టు చేసిన యుపకార మేమనగా రెండేండ్లలో నన్ను వండితురాలిని చేసెను. నాకు రాజ నీతి బోధించెను. ఆ కోటలో నా యంతఃపురములో నేను కనులతో చూడకపోయినను నా యెఱుగనిది లేనట్లుండెను. నాకు మర్యాదగా మాటాడుట నేర్పెను. సిగ్గుపడుట ఎట్లో చెప్పెనమ్మా! యింత యెందుకు? మహారాజు సమక్షమున నెట్లు ప్రవర్తించవలెనో నేర్పెను. అన్నిటికంటె నేను రెండేండ్లు కాలాభట్టుచేత పెంపబడిన తరువాత నా యహంకార మేమైనదో నా దూర్తత్వమేమైనదో నాకు తెలి యదు. అంతకుమించి మరియొకటి జరిగెను నేను రాణి నగుదునో కానో; నూటికి నూరుపాళ్లు కాననియే నేను నిశ్చయించుకొనునట్లు కాలాభట్టు చేసెను. మా చదువులో నందందు రాజులు మాంసాహా రులని వచ్చును' కాలాభట్టు శాకాహారి. నేను వంట చేయుదుననగా నేను దేని నుడుకబెట్టను. ముక్కలు తరుగుట, ఉప్పువేసి కలుపుట, అల్లపుముక్కలు, సైంధవలవణమును నింబరసమును జోడించుట, అన్నియు నివే పదార్థములు. నా వంట యనగా నిదియే. గోధుమలు మొదలైన ధాన్యమెప్పుడైన తెచ్చి కాలాభట్టు తానుడికించికొని తానే తినెడివాడు. నేను ప్రతిదినము తినెడిదానను. ఆ భావము

నాది వేలు. కాలాభట్టుది వేలు. ఆయన కిది ప్రధానమైన యాహారము కాదు. ఆయన యింటిలో నద్దము లేదు. తొల్లి మా యింటిలో నున్నదా? ఒక గాజుపెంకుండెడిది. ఇక్కడ నదియును లేదు.

ఒకనాడు కాలాభట్టొకయాదర్శమును తెచ్చెను. అది నిలువుటద్దము, చాలా పురాతనమైనది. సుభద్రాదేవిగారు తన యంతిపురములో నదియుండగా దానిని పురాణవస్తువు లుంచెడిచోట పారవేయుమనినదట! ఆయన తన యింటికి తెచ్చెను. మరియు నింకొకటి జరుగుచుండెడిది. మహారాజులును, మహారాణులును నుంతమాసినదనునంత నేయెంత వెలగల దుస్తులనైనను ధరించరు. చినుగనక్కఱలేదు. నాలుగైదు సార్లు ధరించి వదలివేయుదురు. ఆ దుస్తులు పరిచారికులు దీసికొనిపోదురు. వారైనను, మరియు చెడినవి ధరించి యంతఃపురమున రాణుల యెదుట తిరుగరాదు, మరియొకప్పుడు మహారాణులు చీరలు కొందురు. పైరాణీ మున్నగునవి కొందురు. అవి ధరింతురు. వారికి నచ్చదు, నచ్చినట్లు కన్పించదు. వానిని పరిత్యజింతురు.

పూర్వమున కాలాభట్టు నందదేవవర్మకు కుడిభుజముగా నున్నప్పుడు నలుగురైదుగురు పరిచారకులు కాలాభట్టు నాశ్రయించియుండెడివారు. వారివద్ద కాలాభట్టు నాకు రాజస్త్రీయోగ్యములైన బట్టలు తెచ్చెడివాడు. నేను వానిని ధరించి యద్దములో చూచుకొనగా నేను రాణినౌదునన్నమాట నాకు మరలమరల స్మృతికి వచ్చుచుండెడిది. నేను శాకాహారముకలదాననుగదా! అది యేమి పుష్టి! అది యేమి నైగనిగ్యము! నా కన్నులు నాకే గిర్రున తిరిగి పోయెడివి. కాని, నాకు మేనభూషణములు లేవు. కాలాభట్టొకసారి యిట్లనెను: "రాణులు ధరించెడి నగలు నీవు ధరించినచో నీవు రాణివి కాదని ఎవ్వరనుకొందురు?" అని. నాకు నగలు సంపాదించవలయును, కాలాభట్టున కిది పట్టెను.

ఒకప్పుడు తోటలో నొక సన్నివేశము జరిగెను. దానివైనను నాకెక్కువ తెలియదుగాని యొక కార్యము జరుగవలెను. తారాదేవి ఆ పనిని వద్దనును, సుభద్రాదేవి చేయుమనును! ఇద్దఱు తల్లులును పోయి కొడుకుతో చెప్పిరి. ఆ కొడుకు తారాదేవి మాట మన్నించి కన్నతల్లిమాట వినలేదు. ఆ పని చేయలేదు, సుభద్రాదేవి

యెంత దుఃఖపడెనో తెలియలేదట. ఆమె కెంతయో వైరాగ్యము కలిగెను. పూర్వమామె ధరించెడి నగలిప్పుడు ధరించుటలేదుగదా! అవి యన్నియు నొక పెట్టెలో భద్రముగా నున్నవి. అప్పుడిట్లు జరిగెను—

సుభద్ర:- కాలాభట్టూ! ఆ నగలపెట్టె నీవు తీసికొనిపొమ్ము.

కాలాభట్టు:- తల్లీ! వా కెందుకు?

సుభద్ర:- అమ్మికొనుము. డబ్బు తీసికో.

కాలాభట్టు:— తల్లీ! నేనాజన్మ బ్రహ్మచారిని. నాకు పెండ్లము లేదు, పిల్లలు లేరు. నాచేత యుద్ధము చేయించికొనెడి రాజులేదు. నేనంగరక్షకుడుగా కూడ నిచట పనికిరాకున్నను మీ దయవలననాకు దినబత్తెము వచ్చుచున్నది.

సుభద్ర:- అట్లుకాదు. ఆ నగలు నా యింట నుండుటకు వీలులేదు. నేనా పెట్టెవంక చూడను. నీవు దానిని తీసికొనిపొమ్ము.

కాలాభట్టు: తల్లీ! మీ యీ కోప ముపశమించిన తరువాత మీ నగలు మీకు దీసికొనివత్తును. అంతవఱకు నావద్ద భద్రముగా నుంతును.

అని వానిని తెచ్చెను. వాని నన్నిటిని నన్ను ధరింపజేసెను. చూచుకొనుట కద్దమున్నది.

కాలాభట్టిట్లనెను: సరిగా తొలుతటి దినములలో సుభద్రా దేవిగారిట్లుండెడిది—

ఒకనాడు నేను కాలాభట్టుతో నంటిని: బాబూ! నేను ఈ గదులలో నుండుచుంటిని. నీవు నాకు రామాయణము చెప్పుచుండగా తొలుత వాలి భార్య తరువాత సుగ్రీవుని భార్య తార యున్నదే ఆమె వానరి. ఆమెను సౌందర్యవతియని, రాణియని వాల్మీకి వ్రాయుటయేమి? అనిపించెడిది. ఇప్పుడు నాకు తెలియుచున్నది. తార జన్మచేత కోతియైనను జన్మచేతనే రాణి, నేను జన్మచేతకోతిని, జన్మచేత రాణినికాను. ఈ భూషణములతో, ఈ దుస్తులతో, నీవు చెప్పిన చదువుతో, నేను మారిన మార్పుతో నేను జన్మచేత కోతిని గాను; జన్మచేత రాణినే యనిపించుచున్నది. పోనీ నన్నిక్కడ నెన్నాళ్లుండుమందువు?

నా చిన్నప్పుడొక సంఘటనము జరిగినది. నేను ముద్దుగా నుంటినని నిరంజనభట్టు నాకొక యుంగరము నిచ్చెను. ఆ యుంగరమును నా వేలికి తొడుగుకొమ్మనెను. మా యమ్మ యిట్లన్నది: స్వామీ! వలదు. నీ సొమ్మిదివఱకే చాల! తిన్నాను, తినుచున్నాను. ఆ పిల్ల జాతకము మంచిదనుచున్నారు. ఇతరుల సొమ్ము ధరించినచో సొంతమైన గీత పోవునందురు. పిల్లకు వద్దులెండి, అనెను. ఆ రీతిగా కొన్నికొన్ని గీతలు అనగా నదృష్టములు ఛాయామాత్రమైన విషయముల యనుభవముచేత మాసిపోవునేమో! నేను కోటలో నెట్లు బ్రతికినను రాజుకోటలో నుండుచుంటినికదా! నా జాతకములోని రాణితన మిదియేనేమో!

అనగానే కాలాభట్టు "కాదు కాదు. నేను దీనికంతకును వధకము వేసితిని. కోటలో నా మాట వినెడి పరిచారకులు పదిమంది కలరు. ఈ కోటలో నాకు తెలియని రహస్యములు లేవు నీవు రాజు కంటికి గనిపించునట్లు చేసెదను. ఆనాడే నీవు రాజభార్య వగుదువు."

అనగా నేను "బాబూ! మహారాజునకు భార్య యున్నదికదా" యంటిని.

కాలాభట్టిట్లనెను: "ఆ రాణిని నీవు చూడలేదు. ఆమె క్షత్రియవంశమునం దెట్లు జన్మించినదో నాకు తెలియదు. ఇది యంతయు నా కేశవవర్మ యొక్క గూడుపుఠాణి. పెద్ద తెలివికలదా కాదు: అందగత్తె అసలే కాదు. దొందపు టొడలు. ఆమె కేశవవర్మ యొక్క అప్పగారి కూతురు. కేశవవర్మ పెంచినాడు. నందదేవవర్మ నిఱకటములో పెట్టి యాయన బ్రతికియుండగా వీరదేవవర్మ మహారాజు నాటికి యువరాజు కూడ కానప్పుడు తారాదేవి కొడుకులు నలుగురు బ్రతికియుండగా వీరదేవవర్మమహారాజగుట యెట్లును లేదు. చివరి కితని పెండ్లికూడ కాదేమో! ఎందుకుపనికిరాని రాజ దొరగా తిరుగునేమో' యన్న భయముండెడిది. సుభద్రమ్మ పెండ్లియైనది, వీరదేవవర్మ పుట్టినాడు. సుభద్రాదేవికి కోటలో నూరును పేరును లేదు. నందదేవవర్మ సుభద్రాదేవిని పెండ్లి చేసికొనుటకూడ భాస్కరదేవవర్మ యొక్క పొసగింపు. అదియంతయు నొక గందరగోళము. ఆ పెండ్లిమాత్రము నందదేవవర్మ స్వతంత్రించి చేసికొన్నాడు

ఈమెను ప్రేమించి చేసికొన్నాడు. వీరదేవవర్మ మొదటిదినములలో తండ్రి యెంత చెప్పిన నంత; తరువాత తన యిష్టమువచ్చినట్లు చేసెడి వాడు, ఇది యీ మొదటి దినములలో జరిగిన పెండ్లి. మరియు నీ శేశవవర్మ యప్పగారిది పెద్ద యాస్తి. అదియంతయు నీ వీరదేవ వర్మకు వచ్చును. ఆ స్థితిలో వీరదేవవర్మకు పెండ్లి జరిగెను. తారా దేవి కొడుకులు చనిపోయిరి. ఇతడు రాజయ్యెను. పెత్తనము కేశవ వర్మదిగా నున్నది. కేశవరవర్మయొక్క బంధుత్వము రాజ్యమునకు రక్షణముగా నున్నది. కొందఱు దుర్గాధిపతులు, కొందఱు సేనాధి పతులు, కేశవవర్మకు తారాదేవికి దగ్గఱి బంధువులు, తారాదేవికి వీరదేవవర్మమీదనున్న మమకారమునకు హేతువు తనయప్ప కూతు రితని భార్య యగుట! వీరవర్మమహారాజు సొంతతల్లి చేయుమన్న పనిని చేయకపోవుట తారాదేవిని సంతోషపెట్టుటకు, తారాదేవిని ఎందుకు సంతోషపెట్టవలయును? వీరదేవవర్మ తన భార్యను సరిగా చూడడు. ఆయన కిప్పుడు ముప్పది యేండ్లు దాటినవి. తా నిప్పుడు మరల పెండ్లి చేసికొనుటకు కోటలో నేమియు వీలుపడదు. అతడెవ్వతెనైన మరల పెండ్లియాడినచో నది కోటలో విప్లవము వచ్చినట్లె. వీరదేవవర్మమహారాజు తన యిష్టమువచ్చిన స్త్రీలతో భోగింపవచ్చును, కాని, యతడు ధర్మాత్ముడు. అధర్మముగా తన కామమును వెలయించడు, నిజమే! ఈ భార్య యన్నచో నిష్టము లేదు, చేసికొన్నచో నింకొకర్తను చేసికొనవలెను. ఆమెతో ననుభ వించవలయును. ఈ పట్టుదల కలవాడు, ఈ నియమము కలవాడు. పలుమంది ఆయనకు రహస్యముగా పలుమంది సౌందర్యవతులైన స్త్రీలను చూపించిరి. ఆయనకు నచ్చలేదు. మరియు నిన్నాళ్ళుగా నాయనకు ధైర్యము చాలలేదు. ఇప్పుడిప్పుడే వీరదేవవర్మ తాను తానిలువ ద్రొక్కుకొనుటకు ప్రయత్నించుచున్నాడు. నిన్నాయన చూచినచో వెంటనే మోహించుననని, అదియే వివాహమగునని నా నమ్మకము. నిన్ను మహారాజున కొకనాడు చూపింతును, ఆపరిచారకల సాహాయ్యముతో చూపింతును. కొద్ది దినములలో నట్టి పరిస్థితి యేర్పడ బోవుచున్నది. పశుపతి మహోత్సవములు జరగబోవుచున్నవి. అప్పుడు కుభ్యలఖునగరమునుండి రాజవంశమంతయు దేవతా దర్శనమునకు

ళ్లుదురు. మహారాజు మాత్రము వెళ్ళకుండ నొక పరిస్థితిని కల్పించు చున్నాను. అట్లు పొసగినచో రాజు నిన్ను చూచును. నిరంజనభట్టు జ్యోతిషముతప్పుటనే నెఱుగను.

అనగా నేను నవ్వుచు నిట్లంటిని: ''నేను మహారాజును కూడవలదా? ఆయన నాకు నచ్చనిచో నేమందువు?''

కాలాభట్టు:- నీవు రాణివగుదువని వ్రాసియున్నదికదా? ఆయన నీకు నచ్చును. మరియు నొక్కటి చెప్పెదను — స్త్రీలలో పురుషులలో నొక భేదమున్నది. పురుషు లందక త్తియలైన స్త్రీలను కోరుదురు. స్త్రీలు ధనవంతులు, వీరులునైన పురుషులను కోరుదురు. పగలు చూచినచో రాత్రి కలలోనికి వచ్చెడు పురుషులతో నెంత మంది యచ్చరలవంటి స్త్రీలు సంసారములు చేయుటలేదు? ఆయన మహారాజు, అంతకన్న కావలసినదేమున్నది? నిజము చెప్పినచో వీర దేవవర్మ సుందరులైన పురుషులలో నొకడుగాని సామాన్యుడుగాడు.

నేను:- నాయీ చీరెలు, నగలు మహారాజు తల్లిగారివి. ఆయన గుర్తుపట్టునేమో?

కాలాభట్టు:- మరియు నయము. నీవు తల్లికి దగ్గఱిదానవను కొనును. అది మనకే లాభము.

నేను:- ఈపీ సంగతి తెలిసినచో మహారాజునకు కోపము రా వచ్చును. సుభద్రాదేవిగారికి కోపము రావచ్చును.

కాలాభట్టు:- ఎందుకు కోపమురావలయును? వారిసొమ్ము మనము దొంగిలించితిమా? ఆమె తన నగలన్నియు నాకు దానము చేసినది. నేనమ్ముకొందును. అద్దుకొందును. తనకేమి? నా పెంపుడు కూతునకు పెట్టుకొందును. పరిచారికలు ధరించు చీరలుకూడ నా పెంపుడు కూతురు ధరించుట తప్పా! తప్పు. ఒప్పికొందును. వారి నగలు వారి చీరలు వారి మొగాన పారవేసిపోదాము.

నేను:- ఎక్కడికి పోదము?

కాలాభట్టు:- ఎక్కడికా? - అని దిగాలుపడి కూర్చుండెను. నేనాయనకు ధైర్యము చెప్పితిని.

''ఓయమ్మ! దొరసాని! తరువాత జరిగిన విషాదపరిస్థితులనుబట్టి యామహారాజు కానే పరిస్థితులలో నన్ను జూచెనో, నేనెట్టి వినయ

పాండిత్యము లతనియందు ప్రదర్శించి యతని గుండె నాకమ్ముడు పోవునట్లు చేసితినో యది యంతయు చెప్పుట యనుచితము. ఒక్కటి మాత్రము చెప్పలేకుండనున్నాను. నన్ను కాలాభట్టు తీసికొనిపోక మునుపు పరమసామాన్యమైన ఆడదానినికదా! ఆనాడు నేను నా వంకచూచిన పురుషులతో నెట్లు వికారముగా ప్రవర్తించితినో చెప్పితినికదా! మహారాజుయొక్క హృదయమును నేను దొంగిలుటలో కొన్ని యానాటి వెఱ్ఱివేసములనుగూడ ప్రకటించలేదనుటకు వీలు లేదు పురుషులలోనేమి! స్త్రీలలోనేమి! అధమకులీనులు కావచ్చును. పండితులుకావచ్చును, వీరులుకావచ్చును. శృంగారరసము సృష్టికి హేతువు. పరమధర్మ్యమైనది. పరమోదాత్తమైనది. పరమ పవిత్రమైనది. కాని యందులో ననత్యములైన లక్షణము లెన్నికలవు! ఏవగించుకొనదగిన లక్షణము లెన్ని కలవు! మోహింపజేసెడి నీచలక్షణము లెన్నికలవు! ఒకరి నొకరాకర్షించెడి యసభ్య ప్రవర్తనలెన్నికలవు! అంతటి కులీనతయు, నంతటి వీరత్వము, అంతటి పాండిత్యము నా శృంగారభావములోని నీచత్వము చేతకూడ నొక్కొక్కప్పు డాకర్షింపబడును.దానియందు రమించును. రాజును నేనట్లు వశముచేసికొంటిని.

ఆనాడు మేమిద్దఱము కలిసికొంటిమి. ఆనాడు మాయిద్దఱికి గాంధర్వవివాహమైనది. రాజిట్లన్నాడు:-''కొలది దినములలో ప్రియురాలా! నిన్ను నేను మహారాణిగా చేయుదును. అందఱికి తెలిసెడి వివాహము చేసికొందును. కొద్దిదినములు కాలాభట్టు నింటనే యుండుము. కాలాభట్టు నీకు పెంపుడుతండ్రి కదా! అతడు నిన్ను నా యింటికి తీసికొని వచ్చుచుండును. నీకు వేఱె సౌధము నేర్పాటు చేయుదును ''

"ఇద్దఱము చొక్కిపడిపోయి యున్నాము.నానోటివెంట మాట వచ్చుటలేదు. నేనొక బ్రహ్మానందమయమైన స్థితిలో నున్నాను. ఇట్లు మూన్నాళ్ళు గడిచినవి. నాల్గవనాడు తెల్లవాఱుననగా రాజస్త్రీ లందఱు పశుపతిక్షేత్రమునుండి తిరిగివత్తురు. మేమిద్దఱము విడివడి పోవలయును.

నే నిట్లంటిని:- మహారాజా! నేను పరమసామాన్యమైన కుటుంబములోని దానను. మావారందరు పాలమ్ముదురు. కాని

మాది క్షత్రియకుటుంబమే. దానిని త్రవ్వి బయటకు తీయవలయును. అది యట్లుంచి నన్ను మీరు వేఱేయొక సౌధములోనుంతురు. అంద ఱకు తెలిసిపోవును. ఈ కోటలోని సంగతులన్నియు నాకు కాలాభట్టు వలన తెలియును. ఆమెనుగూర్చి నేనేమైన నన్నచో సపత్నీ మాత్స ర్య మప్పుడే వెలయించుచుంటి ననిపించునేమో! కాదు. ఆమె తన మేనమామ వంటిది.

అప్పుడు మహారాజిట్లనెను:- "ఇక్కడ వీలులేనిచో నీకొఱకు వేఱే పట్టణము కట్టింతును.'

# 19

జితేదాస్తి కీర్తి నేపాళదేశము నందంతటను, మరియు మైథిలీ పుర శ్రాంతిపుర గంధగిరినగర జాలంధర నగరములందును పెళపెళ లాడుచుండెను. అతడు ఖడ్గవిద్యానిపుణుడా? రాజనీతివేత్తయా? మహానగర నిర్మాణదక్షుడా? అన్నిటికంటె దైవప్రసాదము కల వాడా? ఒకవార్త నీవెంత రహస్యముగా నుంచినను నిప్పువంటిది. ఎక్కడనో యంటుకొనెను. పూర్తియింటి పైకప్పున భగ్గుమని మండె డివఱకు తెలియదు. అన్నిటికంటె జితేదాస్తి శిథిలమైన నగరమును తిరిగి నిర్మించు చున్నాడు. పెఱచోట్ల రాజాజ్ఞతో చేయుచున్నాడ నియు, రాజు ధనమిచ్చుచున్నాడనియు కొంతమంది యనుకొన్నను, మధ్యలఖు నగరములో మాత్రము ధనము రాజిచ్చుటలేదు; రాజు వద్ద ఱ నంత ధనములేదు; రాజు తన కొడుకులు సన్న్యాసులైనందుకే యేడ్చుచున్నాడు, లోమిదేవి నగరమువద్దనున్న తీర్థవిహారమునందు కూర్చున్న బంధుదత్తాచార్యుని యవసరములను దీర్చుటకే రాజు ధనము సరిపోవుచున్నది, అనుకొనుచుండిరి. ఆ యాచార్యుడు గళ గ్రాహి. ఎంత ధనము క్రుమ్మరించినను మరియు తెమ్ము మరియు తెమ్మనునుట, క్రొత్తవిహారములను కట్టించుమనునట. ఆయన యుద్దకు పెద్దకుమారులు పద్మదేవ రత్నదేవులు సన్న్యాసమును స్వీకరించుటకు

విదియొక కారణమని యనుకొందును. ఈ తండ్రి బౌద్ధారామము లను నిర్మించుటతో బొక్కసమంతయు బొక్కలేయగును. అందులో చివరకు కాశీలుకూడ మిగులవు.

శత్రువులు తగినంతమంది యున్నారు. ఈ రాజ్యమునందు బౌద్ధ మతము మాటి మాటికి ప్రబలుచున్నను వేదమతము పునాది పెట్టుకొని కూర్చున్నది. ఆ వేదమతస్థులు సుంత వీలుకుదిరినప్పుడెల్ల నెదురుతిరుగుదురు. బౌద్ధమతమును దేశమునుండి వెడలద్రోలుటకు ప్రయత్నించుచుందును. అనాది నుండియు నేపాళరాజులు వైదిక మతావలంబులై యుండవలయునని యొక యభిప్రాయమున్నది. బౌద్ధమతము నవలంబించిన రాజు రాజ్యము చాలదినములుండదు. దేశమునందెన్నిచోట్లనో సుక్షత్రియులకు స్థావరములైన నగరము లున్నవి. యుద్ధవేళలందు రాజు వారి సాహాయ్యము నవలంబించక తప్పదు.

నేపాళదేశమున నైదారు సుప్రసిద్ధములైన క్షత్రియవంశ ములు కలవు. అన్నివంశములును పూర్వమెప్పుడో రాజ్యముచేసినవే! వారందరు మరల నెట్లైన తమ వంశమువారు సింహాసనము నాక్ర మింపవలయునని కూర్చున్నవారే. రాజు బౌద్ధుడైనచో నదివారికి వీలు. అన్ని రాజవంశముల నట్టిపెట్టి యహిర్వంశ క్షత్రియులని హిమవత్పర్వతోదరమునం దొక క్షత్రియవంశమున్నది. వారెప్పుడో మహాభారతయుద్ధమునకు పూర్వము నేపాళదేశమును పాలించిన వారట. వారు కొందఱు గుడ్డలు నేయుదురు, కొందఱు కుండలు చేయుదురు. కొందఱు పాలేరుతనము చేయుదురు. కాని ఖడ్గ విద్యను మాత్రము పరిత్యజించరట.

వాడు గొడ్లను కాయుచుండెను. నీపేరేమి యని యడుగుము, వాడు 'విష్ణువర్మమహారాజుగారు' అనును. వర్మయన్నది క్షత్రియుల నామము చివర నుండు ననుకొందము. మహారాజ శబ్దము గారన్న యుపపదము వాడే తగిలించికొనును. మూఢత్వము, మూర్ఖత్వము విశ్లేయుండును. ఇట్టిస్థితిలో మరల నేపాలరాజ్య సింహాసనము నధిష్ఠింపవలెనని కోరిక యుండుటలో తప్పేమి. ఈ మహారాజు యొక్క పెద్దకొడుకుల కిర్వురకును తండ్రి తరువాత రాజ్యము

కొమికెల బొమ్మగా నిలుచుననియు, తా మేమియు చేయజేయని యొ
వధైర్యము తోచినదట. మరియు బంధుదత్తాచార్యుని యొత్తిడి
యెక్కువైనదట. నరేంద్రదేవమహారాజును తన ముగ్గురుకొడుకులను
బౌద్ధసన్యాసులను చేయుమని బంధుదత్తుడు రాజు గొంతుకమీద
కూర్చుండెను. పైవాండ్రిద్దఱు మేమైనచో వేదమతమునందలి తురీ
యాశ్రమ స్వీకారము చేయుదుము కాని బౌద్ధ సన్యాసులము వచ్చి
నను కామని అవివాహితులుగానే యత్యాశ్రమమును స్వీకరించిరి.

ఇందులో నొక యిఱకటము వచ్చినది. వేదధర్మమునందు
సన్యాసియైన తరువాత మరల గృహస్థాశ్రమములోనికి రారాదు.
వచ్చినచో వాడు చండాలుడు. అందుచేత నా రాజకుమారుల కిద్దఱికి
రాజ్యాధికారము పోయెను. మూడవవాడు వీరదేవవర్మ. ఇతడు
గొప్ప లౌకికుడు, ఏయెండకాగొడుగు వట్టెడివాడు. వేదమతము
నందు సన్యాసము తీసికొన్నచో తిరిగి రారాదుగాని, బౌద్ధసన్యాసి
యేలరారాదు. ఆ వట్టింపు బౌద్ధులకు లేదే! ఉన్నచో నది వేదమతము
నందున్న వర్ణాశ్రమాచారధర్మములను చూచి నేర్చుకొన్నదేకాని
మరొకటి కాదు, మరియు బంధుదత్తుడు, బౌద్ధసన్యాసి కావచ్చును,
రాజ్యమును జేయవచ్చునని ఘంటాపథముగ చెప్పుచున్నాడు. నిజా
నికి వీరదేవవర్మకు కావలసినది రాజ్యము, అటు వేదమతము కాదు,
ఇటు బౌద్ధమతము కాదు.

రాజ్య మీస్థితిలో నున్నది. ఆ నరేంద్రదేవవర్మవద్ద ధనములేదు.
ఈ శిథిలనగర నిర్మాణమునకు నరేంద్రదేవవర్మ ధన మెట్లిచ్చును?
వీరదేవవర్మ యిచ్చెనా? అతనివద్ద మాత్రము ధనమెక్కడిది? ఈ
సంగతి మధ్యలఖునగరములో నందఱికి తెలియును. ఈ మధ్యలఖు
నగర వార్తలు పలుచోట్ల వ్యాపించెను. ఇంతధనము వీరదేవవర్మ
కెక్కడిదన్న ప్రశ్న మిగిలెను. అచటినుండి మరల నూహలల్లుట
ప్రారంభమయ్యెను. జితేదాస్తి తెచ్చెనేమో! జితేదాస్తి కెక్కడిది?
ఇతని తాతగారి స్నేహితుడు థోకోయన్న వాడు కొంతధన మిచ్చె
నట! అట్లే యిదియు నిచ్చెనేమో! ఇదియొక యూహ. జితేదాస్తి
తన తావమఱదికి పిచ్చిని కుదిర్చెను. ఎవడో బ్రహ్మరాక్షసుడు కుది
ర్చెనట! ఆ బ్రహ్మరాక్షసు డిచ్చెనేమో! ఇది యొక యూహ. ఈ

ప్రపంచకములో వదంతులు పుట్టి వానిని ఒడపోసి యొడపోసి. లోకము యథార్థమును గ్రహించినట్లు ప్రవర్తించెను. ఎవ్వరుచెప్పరు రహస్యము రహస్యముగా నందఱికి తెలిసిపోవును. అది యెప్పుడు తెలియును? గప్పుమని యింటికప్పు మండినప్పుడు తెలియును.

నగరనిర్మాణము జరుగుచుండెను. ఆ శిథిలనగరమున కొన్ని గృహములు నేటికే మంచిస్థితిలో నుండునట్లు చేయబడినవి. ఒక వైపున నడవి నఱుకబడుచుండెను. జితేదాస్తి కుటుంబము సుదర్శన భట్టారకుని కుటుంబము పోయి యాశిథిలనగరముననే కాపుర మున్నారు. జితేదాస్తి మధ్యలఖు నగరమునకు పోవుచుండును; వచ్చు చుండును. నగరనిర్మాణకార్య నిమగ్నుడు కానప్పుడు నాగేశభట్టు వద్ద చదువుచుండును. సుదర్శన భట్టారకునకు వేఱ పనిలేదు. కాలా భట్టుయొక్క బ్రహ్మరక్షస్త్వము తొలగించుటకు గావలసిన మంత్ర మునెప్పుడును పురశ్చరణగావించు చుండుటయే. ఇట్లుండగా జితే దాస్తి కొకభయము వేసినది. ఈ నగరముపేరు చివరికి శిథిలనగర మన్నపేరే నిలుచునేమో!

ఆ కాలాభట్టు మరల కన్పించుటలేదు. ఆ పూర్వరాజు వీరదేవ వర్మ దీనికేమని పేరు పెట్టదలంచెను? దానితో నిప్పటినుంచి వ్యవహ రింపబడుచున్న గాని యీ నగరమున కాచెడ్డపేరు పోదు. ఆ శ్రావస్తి నగరశిల్పి తీర్థంకరుడిచ్చటనే యుండెను. ఎచ్చటెచ్చటినుండి యోపనివాండ్రు వచ్చిరి. తొల్లిటి వీరదేవవర్మవలె పట్టణమంతయు నొక్కసారిగా సిద్ధము చేయబడవలయునన్న యూహ జితేదాస్తికి లేదు. అందువల్ల, జితేదాస్తి యెక్కడికక్కడ నొకప్రాంతము తీసి కొనుటయు, నక్కడి భవనముల నిర్మాణము పూర్తిచేయుటయుగా నుండెను. అందువల్ల నేమగుచుండె ననగా గోడలు కట్టువారు,కప్పులు వేయువారు, నగిషీలుచేయువారు, చిత్రములు చిత్రించువారు, జిలుగు పనులు చేయువారు, నన్నిరకములైన శిల్పులు తేలికగా పదివేల మంది నగరములో నున్నారు. ఇందులో చాలమందికి సిద్ధమైన గృహములే యున్నవి.

"ఇంత మహాకార్యము జితేదాస్తి యొక్కడు నెట్లు నిర్వ హించగలడు? అందుచేత నైదారువందల మంది కార్యకరణ సమర్థ

లైన వారిని క్రాంతిపురమునుండి గంధగిరినుండి జాలంధరమునుండి తెచ్చెను. వారందరు వామదేవశాఖీయులు. ఈ మూడు నగరములలో వామదేవశాఖీయుడైన క్షత్రియుడు నిరుపేదగానున్నచో వాడు వచ్చి యీ నగరమునందే యున్నాడు. వానికేదో వని యప్పజెప్పుట పూర్తియైన యొక గృహము వానికిచ్చుట. లేనిచో వానికొక గృహము పూర్తిచేసిపెట్టుట. ఇది క్రాంతిపుర క్షత్రియుల యిష్టము. ఏనాటికైనను క్రాంతిపురమును ఈ నూత్ననగరమును వామదేవశాఖీయులైన క్షత్రియులకు నాథిస్థానముగా నుండవలయును. ఎంతయైనను చిట్టచివరకు వీరదేవవర్మ తన యిష్టమైన మన్యలఘునగర క్షత్రియకుటుంబములను దెచ్చి యిచ్చటనుంతునన్నచో నేమి కలదు? అది యొక సందేహము కలదు.

రెండవది క్రాంతిపుర క్షత్రియులతో ఖండితముగా చెప్పెను. ఈ నగర పునర్నిర్మాణమునకు మీది కోశి వ్యయమగుటలేదు. మహారాజు తన కిరీటములోని నెమలికన్నులోని యొక యీకయు నిచ్చుటలేదు. కాని, వీరదేవవర్మ యాజ్ఞలేకుండ నీ పురనిర్మాణము సాగదు. సంపూర్ణాధికారము నాకును లేదు. నిర్మాణము పూర్తియైనంతనే వీరదేవవర్మ యప్పటికి రాజ్యమునకు వచ్చినచో నీ పట్టణమాయనకు వశము చేయవలయును. మన శాఖాక్షత్రియ కుటుంబములను మాత్రము రాజిచ్చటనుండి వెడలకొట్టకుండునట్లు నేను పూట పడెదను. ఆ సంగతి నాయనతో తొలుతనే చెప్పితిని. మన క్షత్రియ కుటుంబము లిచ్చట నిలువద్రొక్కుకొను చున్నారు. తక్కిన వారందఱు పనివాండ్రు. వారెవ్వరు నిచ్చట నిత్యనివాసముగా నుండుటకు వీలులేదు.

"మనక్షత్రియులిప్పు డే యిండ్లలో నున్నారో ఆయిండ్లు వారివే. అంతేకాదు. ఎవడెంత యడవి ఛేదించుకొనునో ఆ కలపవానిది. ఆ పొలము వానిది. వీరందఱకు నాయాస్తులు చెల్లునట్లు వీరదేవవర్మ రాజ్యమునకు వచ్చినంతనే పత్రములు రాజముద్రాంకితములు వచ్చును. ఎప్పటికప్పుడు పత్రములు వ్రాయించుచునే యున్నాను. అవి నాదగ్గఱ రహస్యముగా నుంచుచున్నాను. అందువల్ల మీరు వీరదేవవర్మ కిప్పుడే యెదురు తిరుగుదమని కాని, కొన్ని వందలనాటి

జోస్యము నేడే ఫలింపజేసికొనవలయునని గాని మీ తిరుగుబాటునకు నేను నాయకుడనుగా నుందునని గాని మీరనుకొనరాదు. అను కున్నచో మీరు దానిని విస్మరింపుడు" అని వారితో గట్టిగా చెప్పి యాబాధ లేకుండ జేసికొన్నాడు.

ఇంక వీరదేవవర్మ మిగిలినాడు. అంతకంటె ముందు పట్టణ మునకు పేరు నిర్ణయించవలయును. కాలాభట్టు నడుగవలెను. అతడేమైనాడో మరల కన్పించలేదు.

గ్రిఫిఅన్న మరియొక భూతమున్నది. వానిముక్కు మొగము నింతవఱకు జితేదాస్తి యెఱుగడు.

మిగిలినది కోటలో రాణి యొక్కతె. తొలుతనే రాజభవన ములను రాజాంతఃపురసౌధములను నిర్మింతునని తాననగా నా రాణి "అది చిట్టచివరకు జరగవలసిన పని" యని యానెను. ఎందుచేత నమ్మా యని యడుగగా తన కథ పూర్తియైనచో దానియంతట నదియే నీకు తెలియునని నెను. ఈ పట్టణమునకు పేరేమి పెట్టవలయు నని యామె నడుగగా తనకు తెలియదు కాలాభట్టునకు తెలియు ననెను.

జితేదాస్తి కొక్క కోరిక యున్నది - ఈ పట్టణము తన భార్యపేర వెలయవలయునని; ఆమెపేరుతో నీ పట్టణమును వెల యింప జేయవలయునని. భార్యతో చెప్పినాడు. ఆమె నవ్వినది. అట్లు చేసినచో నేమి యభ్యంతరము కలుగునో! కాలాభట్టు కాదన్నచో నేమగును? వీరదేవవర్మ నిరాకరించినచో నేమగును? తరువాత మాట చూచుకొందము. ముందు తన భార్య పేరుతో నీ నగరమునకు వాడుక తేవలయునని నిశ్చయించుకొనెను. మరియు నిందింకొక విషయమున్నది. వందలకొలది వామదేవశాఖీయులను, పేదవారిని తెచ్చి వారికి గృహము లిచ్చుచున్నాడు, పొలా లిచ్చుచున్నాడు. ఎప్పటికప్పుడు పత్రములు వ్రాయుచున్నాడు. ఒక్కసారి చిట్టచివ రకు రాజముద్రికలు వేయించవలెను. ఇన్ని వందలో వేలో పత్రము లొక్కనాటికి రాజముద్రలు పడవలయును. అప్పుడు ప్రతి పత్రము మీద పట్టణము యొక్క పేరుకూడ వ్రాయుచు కూర్చున్నచో కుదిరి చావదు. కాలాభట్టు కనిపించడు. రాజుతో నిప్పుడీ ప్రసక్తి తెచ్చి

వచో నత డింకొక పేరు చెప్పినచో తన కోర్కె సిద్ధించదు. అప్పటికే కొన్ని వందల పత్రము లున్నవి. ఊరిపేరు వ్రాయుటకు స్థలమట్టె పెట్టి వానిని సిద్ధము చేసెను. ఒకనాడు జితేదాస్తి కూర్చుండి వ్రాయుచుండగా నతని భార్య ఏమిటి వ్రాయుచున్నారని యడిగెను.

జితేదాస్తి:- నేనెక్కడో చూచితిని. ఒక దైవముపేరు కొన్ని వేల సార్లు కొన్నిలక్షలసార్లు ఒక కోటిసార్లు వ్రాసి ఆ దైవమున్న చోటికి నీ పేరులో వ్రాసిన పత్రములన్నియు తీసికొనిపోయి స్వామి కర్పింతురట. నేనొక దేవతపేరు వ్రాయుచుంటిని!

ఆమె:- వేలు వ్రాయవలయుననియా, లక్షలు వ్రాయవలయుననియా?

జితేదాస్తి:- లక్షలే! నాకంతటి తీరికలేదు. తీరిక యున్నచో నా దేవతను వదలిపెట్టి నేను పోనేపోను. నాకెన్ని పనులు? అటు నగరనిర్మాణమును చూచికొనవలయును, ఇటు క్రాంతిపుర క్షత్రియులను సంభాళించుకొనవలయును. అటు వీరదేవవర్మను సంభాళించుకొనవలయును, మరి నాగేశభట్టువద్ద శుశ్రూష చేయవలయును. అన్నిటిని మించి నిన్నారాధించు చుండవలయును!

ఆమె:- చాలుగాని, యీ యింటిలో మనమిద్దఱమే కాము. అత్త యున్నది, బామ్మ యున్నది. ముత్తవయున్నది. వారు విని పోదురు.

జితేదాస్తి:- అయినచో నీవు నాతో మాటాడకుము.

ఆమె:- అయినచో మీరా వ్రాయుచున్న దేవతపేరు చెప్పుడు

జితే:- ఇది చాల రహస్యము. ముందఱ యెవ్వరికిని తెలియ కూడదు. వీరదేవవర్మకు తెలిసినను, కాలాభట్టునకు తెలిసినను మన నెత్తిమీదికి వచ్చును.

ఆమె:- నా మాటవిని ఆ దేవత నుపాసించుట మానివేయుడు. వారిద్దరంగీకరింపరేమో యన్నచో మనకది చేయుట న్యాయము గాదు.

జితేదాస్తి:- నేనా దేవత నుపాసించి తీరుదును. నీ కిష్టము లేనిచో నా కొక్కటే మార్గము. నిన్ను పరిత్యజించవలసివచ్చును!

ఆమె:- అప్పుడు మనము ఈ నగరమును వదలిపెట్టిపోవలసి వచ్చునేమో?

జితేదాస్తి:- ఇప్పుడు మనదా? నగరము వీరదేవవర్మది. కట్టించునది కాలాభట్టు. తాను కట్టించుకొనుచున్నాడు. ఎందుకో మనకు తెలియదు. ఇచట నా ప్రసక్తి యేమున్నది? పెట్టుబడి యంతయు రాక్షసునిదా? చివరి కాస్తియంతయు రాజుదా? నేను ఇచ్చట నెవ్వడను? నా దేవత నిచ్చట స్థాపింతును. అదికూడ వీలులేదా?

అంత నామె దూరముగా వచ్చి యతని చేతిలోని పత్రములను దీసికొని యిదివఱకు వదలిపెట్టిన స్థలములలో వ్రాయబడ్డ పేర్లను వదిచోట్ల చదివెను. ఆమె కర్థమయ్యెను. అనగా తన భర్త యీ నగరమునకు తన పేరు పెట్టుచున్నాడని తెలిసెను. ఆమెకు బ్రహ్మానంద మయ్యెను. భర్తతో జరిగిన యీ ప్రసంగమంతయు తనమీద తన భర్తకు గల మహానురాగమును వెల్లడిచేసెను.

ఆమె గోడకు తగిలించియున్న రెండు కత్తులను భర్తకు చూపెను. ఒకటి జితేదాస్తియొక్క ఖడ్గము, రెండవది తన ఖడ్గము.

ఆమె యిట్లనెను: ఆ రెండు కత్తులు నిరుపయోగమగునంత వఱకు నీతోపాటు నేనుగూడ నీ నగరనామమును రక్షింతును. నాది స్వార్థము, మీది ప్రేమ.

జితేదాస్తి భార్యయన్న యీ మాటతో తనకున్న సందేహమును గూడ వదలిపెట్టెను. అతడొకటి యాలోచించెను. కాలాభట్టుగాని, గిఫ్రిగాని, రాణిగాని నగరనిర్మాణము పూర్తియైన తరువాత వారు పిశాచములుగారు, వారి పిశాచత్వము వదలిపోవును. వారు పిశాచములై యుండినచో పిశాచబాధ కొఱకు భయపడ వచ్చును. కనుక నగరనిర్మాణమైన తరువాత వారివలన బాధలేదు. ఒక్క వీరదేవవర్మ యున్నాడు. ఈ మాట యతనిచేత నొప్పించ వలయును. ఇప్పటికి నగరము నగముపైన పూర్తియైనది. ముప్పాతిక యైనదేమో యనికూడ ననవచ్చును. తొలినాడు వీరదేవవర్మ నగరనిర్మాణమునంతయు చేసెను. వీథులాయన తీర్పించినవే. జలాధారమాయన యేర్పరించినదే. ఇప్పుడు పూడిపోయినను బావులాయన తీయించినవే.

ఆ నూటయేబది సంవత్సరముల క్రిందట వాస్తుశిల్ప విద్యా ప్రావీణ్యము చూచినచో నాశ్చర్యము వేయుచుండును. సమృద్ధిగా వాయువురాని గృహములేదు. సామాన్యముగా హిమాలయ పర్వతమునుండి విపరీతపు గాలులు పట్టణముల మీదికి వచ్చుచుండును. ఆ గాలులచేత శిల్పవిద్య యెఱుగకుండ కట్టబడిన గృహము పడి పోవును. ఆ గాలివాటమును జూచి యా శిల్పి యిండ్ల ముఖములు పెట్టెను. వీథు లేర్పరచెను. మహానగరమునకుగాని, గృహములకుగాని వాస్తుశాస్త్ర దోషము లేకుండ జేసెను. ఈ తీర్థంకరుడు మహా కార్యకర్త కాడు, కార్యమునకు వస్తువు నెచ్చటనో తెచ్చికొని దానికి జిలుగుపని చేసి మెప్పుపొందెడు నట్టివాడు. వాల్మీకి వ్యాసులు వేఱు. కాళిదాస భవభూతులు వేఱు. లోకముయొక్క మోహము పెద్దది. వారికంటె వీరే గొప్పవారనుకొందురు. తీర్థంకరుడు పూర్తిచేసిన గృహములను చూచినచో ప్రశంసయంతయు నితనికే యన్నట్లుండెను. అతడ నుచుండును: "స్వామీ! నా తెలివితేట లిప్పుడుగాదు, రాజభవనములు రాజాంతఃపురములు తీర్చిదిద్దునప్పుడు చూడుమని". జితేదాస్తికింకొక భయమున్నది. ఈ తీర్థంకరుడు రాజభవనములను, రాజాంతఃపురములను జగన్మోహనములుగా జేసినచో రాజులు రత్నహారులని వీర దేవ వర్మ వచ్చి యీపట్టణమునే తనకు రాజధానిగా మార్చుకొనునేమో! తనకునగరాధిపత్యమిచ్చుదునని వాగ్దానము చేసెను. అతడు దీనినే రాజధానిగా చేసికొని యిచ్చటనే యుండినచో నప్పుడు తనకు నగరాధిపత్య మెందులకు? రాజున్నచోట నగరాధిపతి యెవడు? ఇదిమాత్రము గడ్డు సమస్యయే. దానిని తరువాత చూడవచ్చును. ముందు రాజుచేత నీ పట్టణమునకు నతనికి తెలియకుండ నీ పేరు నంగీకరించు నట్లు చేయవలయును. ఇచ్చట కొన్ని తొందఱలు మాన్పించి జితే దాస్తి మధ్యలఖునగరమునకు పోయెను. రాజుతో చెప్పెను. "తమరి యనుమతి ప్రకారమే కొందఱి కొందఱి కక్కడ గృహముల నిచ్చుచున్నాను. వారువారు ఛేదించికొనిన యడవులమేర వారికి పొలములుగా నిచ్చుచున్నాను. కాని, ప్రభూ! వారందఱకు నొక భయముగా నున్నది. రేపు తమరు వచ్చి వారినందఱను వెళ్ళి పొమ్మందురేమో? పాటొకనిది ఫలమొకనిదిగా నగును."

వీరదేవ:— అయినచో వారికి వ్పుడే పత్రములు వ్రాసియిమ్ము.

జితే:- నేను రాజునా?

వీరదేవ:- నేను మాత్రము రాజునా?

జితే:- మరి యేమి చేయుదము?

వీరదేవ:- నీవే చెప్పుము.

జితే:- అన్నియును పత్రములు వ్రాసి యుంచుదము. తమరికి రేపు పట్టాభిషేకమనగా నా పత్రము లన్నిటిమీదా రాజముద్రలు వేయుదము. పట్టాభిషేకమైన మరునాడు వారి పత్రములను వారికి త్తము.

వీరదేవవర్మ:- బాగుగనే యున్నది. అట్లే చేయుము. తప్పకుండ రాజముద్రిక నానాడు నీ కిత్తును.

జితేదాస్తి:- పత్రములు వ్రాయుటయనగా ప్రభువులకు తెలియనిదేమున్నది? గృహములుగాని, క్షేత్రములుగాని వాని కెల్లలుండును. వానికి సంఖ్యలుండును. మరియు మహానగరము పేరు పేర్కొనబడవలయునుగదా? ఆ పేరునుగూడ నిర్ణయించకున్నచో పత్రములలో వ్రాయుట కష్టమగును.

వీరదేవవర్మ:— ఆలోచింతము. నేనొకసారి యెంతవఱకు సిద్ధమైనదో యంతవఱకైన నగరమును చూడవలయునుగదా? మొన్న నెవరో వచ్చి చూచిరట. వారు నావద్దకు వచ్చి చెప్పిరి. ఆ తీర్థంకరు డెవడో గొప్ప శిల్పివలె నున్నాడు, నగరమంతయు సుందరముగా నున్నదట. అతడు గృహములమీద చేసిన పనియంతయు లలితముగా నున్నదట!

జితేదాస్తి:- చిత్తము ప్రభూ! నాకింతవఱకు స్ఫురింపలేదు. అతని శిల్పమంతయు నేమి లలితముగా నుండును!

వీరదేవ:- అయినచో బాగుగా నున్నది. లలితనగరమని పెట్టినచో నెట్లుండును?

జితేదాస్తి:- ఆ రెండు శబ్దములు నాకు గలిసినట్లులేదు. ఏదో యొక నగరలక్షణమును చెప్పినట్లున్నదిగాని పట్టణముయొక్క పేరువలె లేదు.

వీరదేవ:- లలితనగరము బదులు లలితపట్టణమన్నచో నెట్లుండును?

జితే:– లలిత విశేషణమువలె నున్నది; పేరువలె లేదు.

వీర:- అయినచో 'లలితాపట్టణము' చాల బాగుగా నున్నది. అమ్మవారిపేరు కూడ కలిసివచ్చుచున్నది. అదికాక, జితేదా స్తీ ఇది బాగున్నదయ్యా! ఎందుకనగా మా ముత్తాత వీరదేవవర్మమహారాజు గారు దేవ్యుపాసకుడట. లలితాదేవిపేర నిది కట్టించెనందము. ఆయన ఆత్మయు తృప్తిపడును.

జితేదా స్తి'– నా యాత్మయు తృప్తిపడును, సెలవు.

# 20

ఆనాడు మరల జితేదా స్తియు నతని భార్యయు శిథిలాంత పురమునకు బోయిరి. ఇప్పుడా నగరము శిథిలనగరముగా లేదు, ఏమియులేదు. ఎందుకనగా నించుమించుగా నగరమంతయు పునర్ని ర్మాణము పూర్తియైనట్లే యుండెను. ఒక్క రాజాంతఃపురము వదలి పెట్టినచో రాజభవనములు కూడ తిరిగి నిర్మింపబడినవనియే చెప్ప వచ్చును. కాని, రాజభవనములంతమేర నెవ్వరు నివసించుటలేదు. పట్టణములో కొన్ని భాగములు జనముచేత క్రిక్కిరిసిపోవుచున్న వనియే చెప్పవలయును. ఇప్పుడా చుట్టుపట్ల నడవియే లేదు. అన్నియు పొలములే. అందందు కొన్ని నివసింపబడని యిండ్లున్నవి. ఛేదింప బడని యడవిముక్కలున్నవి. అది యడవి యనుట కంటె చిన్నచిన్న తోటలనవచ్చును అడవి కొట్టివేయబడుట ప్రారంభింపబడినయంతనే వన్యమృగములన్నియు సంహరింపబడుచుండును. సర్పములుమాత్రము వందలు వందలుగా చంపబడును. అప్పుడప్పుడు జితేదా స్తి కన్పిం చును. కాలాభట్టు నరేసరి, కన్పించనని చెప్పినాడు. గ్రిఘి యేమై నాడు? వాని పొడలేదు. ఈ రాణిమాత్ర మొక్కర్తుక యున్నది.

ఆమెను జితేదా స్తి పరామర్శించెను: "ఏమమ్మా! ఈ నగరము యొక్క పునర్నిర్మాణము పూర్తి గావచ్చుచున్నది. నీ వెప్పు డిచ్చట నుండి వెడలిపోవుదువో యని నేనెదురు చూచుచున్నాను. నీవు వెళ్ళనగాని యిచ్చట పని ప్రారంభించుటకు వీలులేదుకదా!

రాణి:- అయ్యో! నేనిచటనుండి వెళ్ళిపోవలయుననియేగదా! కాలాభట్టు మీకింత పని పెట్టెను. ఆ కాలాభట్టు నాకుకూడ కన్పించుట లేదు. అతడు నన్నెప్పుడు వెళ్ళుమనునో, యెచ్చటికి వెళ్లుమనునో కనుగొనవలయును. నే నెచ్చటనో యున్నదానను. కాలాభట్టు నన్ను తీసికొనివచ్చి యిచ్చట స్థాపించెను. నేను మధ్యలఖు నగరములో నన్ను యాకాశములో పరిభ్రమించుచుంటిని. నాకేమియు తెలియదు. పిశాచములన్నియు నచ్చట నెచ్చటనో యుండునట! నన్ను నచ్చటికి రమ్మని కొందఱు పిశాచములు పిల్చిరి పిశాచముల కేమి పనియున్నది? గాలిలో పరిభ్రమించుచుందుము. కాలాభట్టు నన్నిచ్చటికి తీసికొనివచ్చి నీ విందుండుము. నీ పిశాచాకృతి నేను తొలగింతును. నా పిశాచత్వమును గూడ నేను తొలగించికొందును. దానికొక మార్గమున్నది. మనమందఱ మొక చోటికి పోవలయును. అచట బేతాళుడు కొలువుదీర్చి యుండును. ఈ పిశాచము లన్నియు నతని యాశ్రయములో నుండునట! నేనా బేతాళుని ముక్కు-మొగము నెఱుగను. వీరదేవవర్మమహారాజు తానీ నగరమును నా కొఱకు నిర్మించెను ఇది పూర్తియైన తరువాత తన రాజధానినే యిచ్చటికి మార్చవలయునని యనుకొనెను.

ఆయన నాతో చెప్పెను. "ప్రియురాలా! నేనీ నగరము నీ కొఱకు నిర్మించుచున్నాను. నీపేర నిర్మించుచున్నాను. మన మచ్చటికి పోయినంతనె మధ్యలఖునగర రాజధానిలో, నీ దుర్గములో, నీ యంతఃపురములో నీవు పడెడు బాధలన్నియు తొలగిపోవును. అప్పుడు నీవు దుఃఖపడనక్కఱలేదు. నీకు భయముండదు. నేనును విశ్వసించితిని. ఈ పట్టణమప్పుడు నిర్మించబడుచున్నదని నా కప్పుడు తెలియును. మహారాజు నాతో నెప్పటికప్పుడు చెప్పుచునేయుండెను. నిర్మాణము పూర్తికాకమున్న నన్నొకసారి యచ్చటకు తీసికొనిపోయి చూపింపరాదాయని యడిగితిని. ఇదిగో-ఇదిగో యనుచుండెను. ఒకటి రెండుసార్లు నన్ను తీసికొనివచ్చుటకు గూడ ప్రయత్నించెను. నాకా నగరమొక కత్తులబోనుగా నుండెను. మహారాజు కూడ సంపూర్ణముగా స్వేచ్ఛ నవలంబించుటకు వీలులేకుండెను.

ఆయన పెదతల్లి మిక్కిలి గడుసరి. ఆమె నన్ను కదలనీయ

లేదు; మెదలనీయలేదు. నా మీద నెప్పుడును కాపలాయుంచెడిది. నేనేపూట నేయాహారము తింటినో ఏ చీర కాల్చితినో మహారాజా నా సౌధమున కెప్పుడు వచ్చునో యెప్పుడు వెళ్లునో సూక్ష్మసూక్ష్మాంశముల నుండి యామె తెలిసికొనుచుండెను. అన్నిటికన్న నాశ్చర్యమేమనగా నేను నా భర్తయు నేకాంతముగ నుండి, మేమిద్దఱమే యేదో యనుకొందుము. ఆ సంగతి యామెకెట్లు దెలిసెడిది? కొన్నాళ్లు మహారాజే తన పెదతల్లి యందు తనకున్న మమకారము చేత చెప్పెనేమో యనుకొంటిని. ఆయన నేను నోరుజారితి నను కొనెడివాడు. ఆ రహస్యమేమో! నా కిప్పటికిని తెలియదు.

అది యట్లుంచి యామె యెంత నేర్పరియనగా కోటలోననే లేనిచో కోటకు సన్నిధానమున గొప్ప రాజవంశములలో శుభములు జరుగును. వినోదములు జరుగును. వానిలో వేనికిని నేను పోకుండఁ జేసెడిది. కొందఱునన్ను పిలువకుండ జేసెడిది. పిలచినవారి యింటికి నేను పోవుటకు వీలులేకుండ జేసెడిది. అవి చాల చిన్నవిషయములు. ఆ వేళకు నేనేదో మహారాజుమాట పాలించవలసియుండుటయో, లేదా అన్నిటికంటె గడుసుదనమేమనగా స్త్రీలకొగాని, అశ్వత్థామ కాని యాస్థానమునకు వచ్చునట్లు జేసెడిది. ఆ సంగతి నాకు చమత్కారముగా తెలియఁజేసెడిది. నేను వారిని పరిహరించుట తప్ప యేమి చేయవలయును!

నేను చేసిన పొరపాటేమనగా నా భర్తతో నా తొలుతటి కథ యంతయు మొట్టమొదటనే వివరముగా చెప్పవలసినది. చెప్పలేదు. తరువాతనైనను వీలుకలిగినప్పుడు చెప్పినచో బాగుగా నుండెడిది. నాకు భయముగా నుండెడిది. ఈ రీతిగా సంభవించిన రాణితనమును నేను చేతులారా పాడుచేసికొనుట యగునేమోనని భయపడు చుంటిని. మరియు నప్పుడెప్పుడో నా భర్త నేను లేకున్నచో తాను బ్రతుకలేడని, నేనే తన బ్రతుకునని నా యెడందమీద నున్నుండియో నన్ను బిగ్గ కౌగలించికొని, నా మొగములో మొగము పెట్టినప్పుడో నేనొకటి రెండుసార్లు నా పూర్వ కథ చెప్పెదనంటిని.

ఆయన తన చేతితో నా నోరుమూసి, "చెప్పవద్దు. చెప్పనక్కఱ లేదు. నీవు పూర్వ మెటువంటిదాన వైనను సరే! నీవు మిక్కిలి పేద

కులములో పుట్టిననైనను సరే! నీవు నా కొఱకే జన్మించితివి. కొన్ని పేదపరిస్థితులలో నిన్నెవరైన వాంఛించి యుండవచ్చును. ఆ కథ కొంతదూరము జరిగినను జరిగియుండవచ్చును. నేను వానిని పట్టించు కోను. నాకవి యక్కఱలేదు. నీకు వారిమీద నెవరిమీదనైనను కోప మున్నచో చెప్పుము. వారిని శిక్షింతును. వారిప్పుడు నీ జోలికి రాలేరు. వారికిని తెలియునుగదా! యిప్పుడేమైన నిన్ను గూర్చి చేసినచో వారితలలు నిలువవని.

"ఓసి! ప్రియురాలా! భగవంతుడు నా కొఱకు నిన్ను సృష్టిం చెను. నీ కొఱకు నన్ను సృష్టించెను. స్త్రీపురుషుల నొకరికొఱకొకరిని సృష్టించుటయనగా, వారిద్దరికి యౌవనోదయమైనప్పటినుండి వారి నొకరిని మరియొకరికొఱకు సృష్టించెనని యర్థము. నీవు నాతో చెప్ప కుము. నేను నిన్నెడబాయను. ఎడబాసి యుండలేను. నిన్ను మహా రాజ్ఞిని చేయగలుగుదునో లేదో నా రాజ్యమింకను నాకు వశము కాలేదు. నా తండ్రి దీనినట్లు చేసిపెట్టెను. నేను నీ పేర నిర్మించుచున్న నగరమునకు గావలసిన ధనము కొఱకుగూడ నేను మా తండ్రినాటి పరిస్థితులను సాగనీయవలసివచ్చుచుండెను. నాకట్లు తోచినది. నేనొక మాత్రనగరమును నిర్మించి రాజధాని నచ్చటకు మార్చవలయునని సంకల్పించితినని మాత్రమే రాజ్యమునకందఱకు తెలియును. నీ పేర నిర్మించుచుంటినని యెవ్వరికిని తెలియదు.

చాలమంది యిట్లనుకొనెడివారు: "మహారాజు వీరదేవవర్మ తాను రాజధానిని మార్చిన గాని తనకు స్వాతంత్ర్యము రాదనుకొను చున్నాడు. ఇక్కడ కృతవర్మ, కేశవవర్మ, మహాదేవవర్మ, గుణకామ దేవవర్మ మొదలైనమంత్రులు సేనాపతులు నుండిరి. వీరందరు తారా దేవికి దగ్గఱి చుట్టములు. సంపదేవవర్మ కాలములో మొదటి దినము లన్నియు తారాదేవి రాజ్యము చేసెను. ఆమె తన బంధువులనందఱిని తెచ్చి రాజ్యములో కీలకములైన స్థానములందు నియోగించెను. అందఱికంటె కేశవవర్మ యామె కన్నగారు. అన్నగారనగా పెద తల్లి కుమారుడు. ఈమె వారియింటనే పెరిగెను. అతనికామె మీద నున్న యధికారమునకంతులేదు. అతడు పేరునకు మంత్రి. ఆ మంత్రి త్వమెంతటిది? లొడితెడులేదు. పరికోరి తానామంత్రి పదవిని వరిం

చెను. ఎందుకనగా మంత్రిగా తాను చేయవలసిన పని యుండగూడదు. తానెప్పుడును తారాదేవి యంతఃపురమువద్దనే యుండవలెను. ఇందుకు చేసెను. మరియు నీ నార్గురు నల్గురుమంత్రులు ప్రధానులైన వారిమాటయే కోటలో చెల్లుబడియగును. నందదేవవర్మ స్వతంత్రించి చేసినపని యొక్కటియే, యది సుభద్రాదేవిని పెండ్లియాడుట. అది జాలంధరములో జరిగెను. పోనిమ్మని యందఱు నూఱకుండిరి. ఆమెకు వీరదేవవర్మ యుదయించెను. ఉదయించిన వీరదేవవర్మను చిన్నప్పుడే కట్టుదిట్టములో పెట్టిరి. కేశవవర్మ తన యన్నగారి కూతునిచ్చి పెండ్లిచేసెను. తారాదేవి కొడుకునకు తల్లి కని కాకుండ జేసెను. ఇప్పుడు వీరదేవవర్మ స్వతంత్రుడయ్యెను. ఏమిస్వతంత్రత! అన్నగార్లు నలుగురు యుద్ధములో హతులుకాగా, రాజ్యమీయనకు వచ్చినదన్నమాటయేగాని వచ్చి ప్రయోజనములేదు. ఇచ్చట మహా రాజునకు స్వాతంత్ర్యములేదు. అందుచేత రాజధానిని మార్చినచో నీ బృందమంతయు నచ్చటికి చేరదుకదా! కొందఱు మాత్రమే వెళ్ళుదురు. తన మంత్రులను తాను నిర్ణయించికొనవచ్చును. తన సేనానులను తాను నిర్ణయించుకొనవచ్చును. ఆ క్రొత్తచోట వీరికింత బలముండదు. అందుచేత వీరదేవవర్మ వేఱే నగరమును నిర్మించుకొనుచుండె"నని జనులు చెప్పికొనసాగిరి.

అనగా కేశవవర్మాదులకు తెలిసెనన్నమాట. ఈ నగర నిర్మాణమును మధ్యలో చెడగొట్టవలయునని వారియందఱి యూహయు మరియు, నచ్చముగా మహారాజు నూత్ననగరమును నిర్మించుట యిందులకేనా? మరి యేదైనా హేతువున్నదా? నన్నందఱు క్రొత్త రాణి యనెడివారేగాని నా పేరెవ్వరికిని దెలియదు. మా గాంధర్వ వివాహము తరువాత మహారాజు నన్నగ్నిసాక్షిగా పెండ్లాడవలయు నని రెండుసార్లు ప్రయత్నము చేసెను. రెండుసార్లును కేశవవర్మ వేర్పుతో చెడగొట్టెను. మహారాజునకు దూరనగరముల నుండియో, దూరప్రాంతముల నుండియో మహారాజు వెళ్ళనిచో వ్యవహారము సంపూర్ణముగా నశించిపోవునన్న పరిస్థితులు హఠాత్తుగా కల్పించి వార్తలు తెప్పించును. ఆ రెండుసార్లు మహారాజు వెళ్ళక తప్పక వచ్చెను. ఎందుకనగా నా వివాహము జరిగినచో నా పేరందఱికి తెలి

నెడిదే! నేను క్రొత్తరాణిని క్రొత్త రాణినిగానే మిగిలిపోయితిని. నా కింకొక సంగతికూడా తెలియవచ్చెను. తారాదేవియొక్క బంధువులైన ఈ మంత్రుల యిండ్లలో నెప్పుడు నా ప్రసక్తి వచ్చినను నన్నెవ్వరు రాణియనరట! ఎవరైన నన్నుచో శిక్షింతురట. నేను మహారాజున కుంపుడుకత్తెనుగాని, భార్యను కానేకానట!

వారు వెక్కిరించుచు, "పెండ్లి జరిగినప్పుడు గదా భార్య, అప్పుడుగదా! రాణి," అనుచుండెడివారట. నా స్థితి యిట్లున్నది. ఈ వార్తలు విన్నప్పుడొక్కసారి నేను మిక్కిలి దుఃఖములో నుండగా మహారాజు చూచుటయు, నేనాయన బలవంతముమీద దీని నాయనకు చెప్పుటయు జరిగినది ఆయన నన్ను సముదాయించెను. వారందరిమీద కోపము దెచ్చికొనెను. వారినందరిని సాధించి తీరెదననెను. "ఇదుగో ఈ నగర నిర్మాణము పూర్తికానిమ్ము! వారిపని చెప్పెదను కదా!" అనెను.

ఓయి! జితేదాస్త్రీ! ఓయమ్మ దొరసానీ! నాకు తరువాత తెలినది. నేను వారికి సాధ్యముకాలేదుగాని, వారు నన్నెప్పుడో చంపించెడివారు. నా భర్తకుగూడ నీసంగతి తెలియును. నన్ను పెండ్లిచేసికొని నా రాణితనమును భద్రముగా చేయునంతవఱకు నన్ను వేయి కండ్లతో రక్షించవలయునని నా భర్తకు తెలియును. ఆయన చాల కట్టుదిట్టములు చేసెను. పాపము వారందఱు వీరదేవవర్మ మహారాజు తమ యెదుట పెరిగినవాడనియు, తామెట్లు చెప్పిననట్లు నడచుకొనెడివాడనియు ననుకొనెడివారు. నేను వచ్చిన తరువాత వీరదేవవర్మమహారాజులో చాలా మార్పులు గన్పించెను. 'ఈమె సామాన్యురాలు గాదు. జగజంత్రి రాజును మార్చివేయుచున్నది,' అనుకొనెడివారట. నిజానికి నాకేమియు తెలియదు.

మహారాజే నామీది ప్రేమచేత వారందఱు నా యెడల ప్రవర్తించెడి ప్రవర్తనచేత, వారి కుతంత్రములచేత వారి కెదురుతిరుగ నారంభించెను. అదివఱకు మహారాజున కంగరక్షకులు లేరు. అంగరక్షక సైన్యములేదు. దానిని మహారాజు క్రొత్తగా నిర్మించెను. ఆ సైన్యమునకు సేనాధిపతిని నియమించెను. ఆ సేనాధిపతిగా కాలాభట్టును చేయనెంచెనుగాని కాలాభట్టు నావద్ద లేనిచో వారు నన్నె

వ్పుడో యేదో చేయుదురన్న భయముచేత కాలాభట్టును నావద్దనే యుంచెను. కోటలో నే నొంటరిదానను. బిక్కుబిక్కుమనుచుంటిని. నాకు వేరే సౌధమున్నది. పరిచారకులున్నారు, పరిచారికలున్నారు. వారిలో నెవ్వరిని విశ్వసించుటకు వీలులేకుండెను.

ఒక్క కాలాభట్టే నాకు దిక్కు. ఆయనకున్న రెండు గదులలో నున్నప్పు డెట్లున్నదో యంత పెద్ద సౌధములో నున్నపుడట్లేయున్నది నిజానికి వారు నన్నేమియు చేయుటకు సాహసింపలేదనగా మహా రాజును జూచికాదు, కాలాభట్టును చూచి. ఒకప్పుడు నేననుకొంటిని- నా తల్లిని, చెల్లెండ్రను, నా యన్నను, తమ్ముని తీసికొనివచ్చి నా సౌధములోననే యుండునట్లు చేయుదమని. ధనమున కేమి? మహా రాజు నడిగినచో నిచ్చును. మహారాజు నన్ను ప్రేమించెడి వైఖరిలో వారందఱు నా తల్లియు, సగర్భ్యియునని చెప్పినచో మహారాజు కాదనడు. పేదతనమునకు, ధనమునకు నేమి భేదమున్నది? ధరించెడి భూషణములు, దుస్తులు, వెలయించెడి ఠీవులు, సాగుదల యుండుట. చేయుదమనుకొంటిని; గుండె యాగలేదు.

రాజు తొలుత నంగీకరింపవచ్చును. వారనాగరకులు. నన్ను కాలాభట్టు బాగుపఱచెను. వారు రాజకులమున నెట్లు ప్రవర్తింప వలయునో తెలియనివారు, నా తండ్రి త్రాగుబోతు. అందుచేత నేనా ప్రయత్నమును విరమించితిని. కాని వారికి తగినంత ధనమును పంపించుచునే యుంటిని. నా శత్రువులు దానినొక సాకుచేసికొని రాజధానిలో నేను వారిబిడ్డనని, యెంత గొప్ప కులములో పుట్టినదో చూడుడని! ఈమె మంత్రకత్తెయని, చిన్నప్పుడిది కొంపలుదీసిన కొఱివియని, యెన్ని సంసారములో పాడుచేసినదని, దానికి పదిమంది తక్కువగా మిండమగలు లేరని, యెన్ని కల్పనలు చేసిరో చెప్పుటకు వీలు లేదు. నాకివియన్నియు నెప్పటికప్పటికి వార్తలు తెచ్చేడువారెవరు? నా పరిచారికలు. వీరందరు కొంతసేపు నాయింట నుందురు. కొంత సేపు తారాదేవియింట నుందురు. మరికొంతసేపు పట్టమహిషియింట నుందురు ఆమె పేరు రుద్రాణి. ఆమె యిన్నాళ్ళుగా భర్త ప్రేమ యెఱుగదు. చనవెఱుగదు. సుఖమెఱుగునేమో! తెలియదు. ఎఱిగి నను దానిలోని పొంగులెఱుగదు. అట్టి స్త్రీ నేడు తన భర్త మతి

యొక్క స్త్రీని ప్రేమించుచున్నాడనగా, వామెయే బ్రతుకుగా మను చున్నాడనగా, నా స్త్రీ తాను నిండుగా ప్రేమించుటకు వీలయిన శక్తి లేని లోపము, నిండుగా ద్వేషించుటకు నొక స్త్రీయు నున్నదన్నచోట నామె జీవితముయొక్క పరమార్థము వెలసినది. ఆమె పొంగులు, ఆమె మాటలు విన్నకొలది "ఓరి! బాబోయి! సగము చచ్చినను పాము పడగవిప్పుట మానదుగదా'' యనిపించెను.

ఇంతకును మహారాజు తానొక పనిచేసెను. తారాదేవియొక్క బంధువులందఱును గలసి రాజధానిలో విప్లవమువంటిది నెఱపుటకు వీలులేదు. మహారాజు తన యంగరక్షక సైన్యముచేత మూలబలములో రాజభక్తిని పెంపొందింపజేసెను.మహారాజు మరియు నొకప్రయత్నము చేయుచుండెను. తారాదేవి బంధువులు కాని క్షత్రియ కుటుంబము లున్నవి. వారందఱు నిదివఱకు కేశవవర్మాదు లెట్లు నడపిన నట్లు నడచెడివారు. వారినందఱను తిరుగదీయవలయునని రాజు సంకల్పము. అట్లు చేసిన తరువాత తారాదేవి బందుగులను క్రమక్రమముగా నధి కారములనుండి తొలగించవలయునని యూహ. ముందు సైన్యములు తన యదుపులో నుండవలెను.

ఆ రాజధానిలో తేలికగా నేబదియేండ్లనుండి మహారాజున కంటె కృతవర్మ, కేశవవర్మాదులు ప్రబలురు. మహారాజు నాశ్రయింప నక్కఱలేదు. వారి నాశ్రయింపవలయును. ఇట్టి స్థితియుండెను ఆ స్థితిని పూర్తిగా మార్చవలయునని మహారాజు సంకల్పించెను. ఇది రహస్యము. [ఆ ప్రభువు నాతో చెప్పని రహస్యములేదు. ఓయమ్మ! దొరసానీ! మేము పిశాచులము, మేము నవ్వలేము, ఏడ్వలేము. మా ప్రకృతి యొక్కటియే. అది కోపము! ఇంకొక భావము మాకుండదు. పిశాచమనగా నది. నేను వేలపిశాచమను.

రాజునకు గలిగిన యీ సంకల్పము రెండుమూడు స్థలములందు క్రియారూపముగా పరిణమించినది. ఆ కేశవవర్మ యుద్ధనీతిలో నెంత యధముడో ఈ కృత్రిమనీతిలోనంత యధికుడు. వాడావులించినచో ప్రేవులు లెక్కపెట్టగలవాడు. వా డిది యంతయు పసికట్టెను, వారం దఱు సమావేశమైనారట! రాజిట్టి ప్రయత్నములుచేయుటకు కార ణము నేనని నిర్ణయించికొన్నారట! ఈ మాటలు నాకు పరిచారికలు

వలననే తెలియును. వారు చెప్పి చెప్పనట్లు చెప్పుదురు. సూచనచేసి పారిపోవుదురు. వారు ముప్పది నలుబదిమంది యున్నారు. వారంద తిని నేనెక్కడ శిక్షింపగలను? మహారాజు మాత్రము వారందరినొక్క పారి యేమిచేయగలడు? కాదు వారిని పంపించి వేయుదును. మరి కొందఱు వత్తురు వారు నిట్టివారేకదా! నేనివియన్నియు కాలాభట్టు నకు చెప్పితిని.

కాలాభట్టు పండితుడు, వీరుడు. ఇట్టి కుటిలనీతి కతడు మాత్ర మేమిచేయగలడు? అతడొక్కటియే చేసెను. క్రొత్తగా రాజు నమ కూర్చిన యంగరక్షక సైన్యములో గిత్తియనువాడున్నాడు. వానిని కాలాభట్టు చిన్నప్పటినుండి యెఱుగును. కాలాభట్టు అంబూకృతము చేసి యెండెకి తోపుగా రావలయుననగా వాడు వచ్చును. ఈ పని కోసము నీవు చావుమురాయన్నచో వాడు చచ్చును వానిని తనకు తోడు తెచ్చికొనెను.

కేశవవర్మాదులు నన్ను తొందఱలో వదలించికోలేనిచో వారి యాట కట్టునని భయపడిరి. దానికొకటి చేసిరి. మధ్యాలఖు నగర మునకు వంద యోజనముల దూరమున నీలపురమని కలదు. అంద హిర్వంశ క్షత్రియులుందురు. వారిని పైన కోయుచున్నచో క్రింద నెత్తురు త్రావుదురు. ఈ కేశవవర్మాదుల బలమువారు. అచ్చట విప్లవము లేపిరి. అది ప్రచండ విప్లవము. మహారాజు తన యంగరక్షక సైన్యముతోపోయి యచ్చట నెలనాళ్ళు యున నుండనిచో నచట శాంతి కుదురదు. పెద్ద సైన్యమును రాజు తనవెంట తీసికొని యూ తారాదేవి బంధువులలో తలకట్టులై నవారి నిచ్చటనుంచుట తనకిష్టములేక వారి నందఱనుగూడ నీలనగరమునకు తీసికొనిపోయెను. నేనిచట భద్ర ముగా నుందుననుకొనెను వారింతకంటె నెక్కువ తెలిసినవారు. తాజిట్లు చేయునని వారికి తెలియును.

రాజులేనప్పుడు కోటలోని యధికార మెవరిది? రాజు నిర్ణయించి పోవలయును. రాజు వేఱొకమార్గము లేక యధికారము తారాదేవిది చేసిపోయెను. నేను చెప్పితిని: "మహారాజా! అధికారము కాలాభట్టుది చేయుము, రాణులను వదలిపెట్టి తక్కిన యధికారమంతయు ప్రభు

వులు తిరిగి వచ్చెడివఱకు కాలాభట్టుడి కావలయును. అనగా, రాజు నవ్వి "నీకు భయములేదు. ఆమె యంత దుర్మార్గురాలు కాదు. చిన్న వ్పటినుండి నన్ను పెంచినది. ఆమెకు తన బందుగులన్నచో మక్కువ యెక్కువ. నిజమే గాని నాకు ద్రోహము చేయదు. అంతదాక నెందుకు నా తల్లి నామె యెప్పుడు నేమియుననలేదు. ఒకటి రెండుసార్లు తన స్వార్థముకొఱకు నా తల్లికి వ్యతిరేకముగా నడచెనేగాని యేమియును లేదు. మరియు నీలపురము నేడుగాదు, నేపాళరాజ్యమునందు తర తరములుగా నది ప్రక్కలో వరున్నపాము. ఒక్కొక్కరాజు కానొక్కొ క్కరి సాహాయ్యముతో నా నీలపురమును తన యదుపులోనుంచు కొనుచువచ్చుచుండును. నా తండ్రి యీ కేశవవర్మాదుల సాహాయ్య ముతో నా పురము తన యదుపులో నుంచుకొనెను వారు పశువు కంటె తక్కువవారు. ఒక్కసారి గట్టిగా నెత్తిమీద దెబ్బకొట్టుము వైతొలగిపోవుదురు. నీలపురక్షత్రియులను నేనీసారి అట్లు చేయుటకు వీలులేనిచో వారిని గొంతయణచి మరల రావలయును. అప్పుడు వీరి యాశ్రయము నాకు గావలయును. తారాదేవి నిప్పుడధికారిణిని చేయకపోయినచో, వచ్చటి కార్యము సగమే ఫలించినచో తిరిగివచ్చిన తరువాత నది నాయందు దోషముగా కన్పించును. నేను ప్రధానముగా నీలనగరమున కెందుకు పోవుచుంటిననగా నా యహిర్వంశ క్షత్రియు లలో నొక మార్పు తేవలయును. నా యంగరక్షక సైన్యములో కొందఱివలన వారికుపకారములు చేయించి కొందఱియందు విశ్వాస ములు కలిగించి వారిమీది యధికారము కేశవవర్మాదులకు లేకుండ జేయవలయును. ప్రధానముగానందుకు పోవుచున్నాను. నీకిచ్చట భయములేదు. కాలాభట్టుకలడు, గ్రీష్మికలడు. ఈనగరములో పూర్తిగా రాజభక్తి కలిగిన కుటుంబములు నేడు వాల్గున్నవి. వారి భార్యలు నీ వద్దకు వచ్చుచుందురు. పోవుచుందురు. నీకు మరియు భయముగా మన్నచో కొన్నిరాత్రులందు వారినిచ్చటనే యుండుమనుము. నేను వారి భర్తలతో చెప్పుదును.

రాజిట్లనగా నాకును గొంత ధైర్యము వచ్చినది. నరేనంటిని. రాజు వాల్గుదినముల కొకసారి నాకు వార్తలు పంపింతునని చెప్పి

వెళ్లెను. రెండు నాల్గుదినములు గడచెను. రెండవసారి వచ్చినవా _
కొంచె మధైర్యమును కలిగించెను. ఆ నీలనగరము సాధ్యమగుటలేదు.
వారు ప్రత్యక్షయుద్ధము చేయుటలేదు, పరోక్షయుద్ధము చేయు
చున్నారట. వత్తురు. రాజసైన్యముమీద పడుదురు. పారిపోవుదురు.
కొండగుహలలో దాగికొందురు. మహారాజు నెలరోజులవఱకు వచ్చు
టకు సాధ్యముకాదేమోనని కబురు పెట్టెను. మరల రెండు నాల్గు
దినములు గడచెను. నాకొక్క విషయమాశ్చర్యము కలిగించెను.
ఇన్నాళ్ళు పరిచారికలు వంకరనవ్వులు నవ్వుచు నాతో తారాదేవియు,
రుద్రాణియొక్కయు నంతఃపురములోని వార్తలు నూరిలోనివార్తలు
సూచనలుగా ననుచు దొంగయభినయము చేయుచునుండెడివారు ఈ
యెనిమిదిదినములు వారు మాటాడినదిలేదు. పలికినదిలేదు. నవ్వినది
లేదు. వారి పనులు వారు చేసికొందురు. పలుకరించినచో మాటాడరు.
సమాధానము చెప్పియు చెప్పనట్లు చెప్పుదురు. నాకు భయము వేసినది,
పరమరహస్యమైన కుట్ర యేదో వెనుక జరుగుచుండి యుండ
వలయును.

ఒకనాటి ప్రొద్దున్న భల్లుమన్నది. తారాదేవి తానొక ధర్మ
నిర్ణయసభ నేర్పచినదట. దాని కధ్యక్షుడు స్తుంకో! ఆ సభలో నశ్వ
త్థాము కూడ నున్నాడు. వారందఱు సాక్ష్యములను తెప్పించి నేను
రాజును మోసము చేసితినని నాకు తత్పూర్వము పదిమందితో సంబంధ
మున్నదని నేను వారివద్ద చాల ధనమును గ్రహించితినని నామీద
పది యభియోగములను సిద్ధము చేసిరి. నా యప్రత్యక్షముననన్నియు
రుజువు చేసిరట. నేను బ్రతికియున్నచో రాజ్యమున కాపదయట
వారు నన్నురిదీయుదురట! సర్వాధికారిణియైన తారాదేవి దాని కను!
మతి నిచ్చెనట.

అది యర్ధరాత్రము. నా సౌధము చుట్టును రెండువందలమంది
సేన యున్నది. వాకిటిలో కాలాభట్టు మేల్కొనియుండెను. దొడ్డి
వైపున గిృఘి రక్షించుచుండెను. కాలాభట్టు ఈ సైన్యమును
చూచెను. ఏమి యనెను. వారు చెప్పిరి. తెల్లవారకముందీమెను
వధించుటకు తీర్మానింపబడెను. కాలాభట్టేమి చేయును? తాను కత్తి

పుచ్చుకొని వారి నెందఱను నఱకుదును? గ్రిఘివద్దకే పోవుటకు వీలు లేదు. అన్నిటికంటె నాశ్చర్యమేమనగా నీ సైన్యము వెంట తారాదేవి వచ్చెను! రుద్రాణి వచ్చెను. వంద దివ్విటీలు వెలుగుచున్నవి. కాలా భట్టు నిస్సహాయుడై పోయెను. గ్రిఘికూడ వచ్చెను. కాలాభట్టు వారితో 'మేమిద్దఱము పోయి రాణిని దీసికొనివత్తుము. ఈ విచారణ మా యెదుట జరుగవలయును.' వారట్లు వీలులేదన్నారు. గ్రిఘియు, కాలాభట్టును విడివడి చంపినచో వంద వంద యేబదిమందిని చంపు దురు. తక్కినవారు లోనికి వత్తురు. నన్నచ్చటనే సంహరింతురు.

"అందుచేత కాలాభట్టును గ్రిఘియు నన్ను తీసికొనివత్తుమని లోనికి వచ్చిరి. లోన తలుపులు బిగించిరి. బయట ద్వారబంధములు కత్తులతో గ్రుమ్ముచున్నారు. గోడలను పలుగులతో పడగొట్టు చున్నారు. నేను కాలాభట్టును ఖడ్గముతో నా గుండెలో పొడిచి చంపుమని చెప్పితిని. అతడట్లు చేసెను. నా ప్రేతము చూచుచునే యున్నది. వారిద్దరు పొడుచుకొని చచ్చిరి. మా ప్రేతములుమూడును చూచుచునే యున్నవి. వారు గోడ ఛేదించుకొనివచ్చి మా శవములను చూచి నవ్వుచున్నారు—ఇది నా కథ.

# 21

పట్టణనిర్మాణమంతయు పూర్తియయ్యెను. అంతఃపురభాగము కూడ పూర్తియయ్యెను. పట్టణములో చాలభాగము జనులు నిండి యుండిరి. గృహప్రవేశోత్సవమువంటిది పట్టణప్రవేశ మహోత్సవ మొకటి చేయవలయును. రాజభవనములందును, రాజుగారి భవన ములందును అంతఃపుర భవనములందును గృహప్రవేశోత్సవములు జరుగవలెను సంగీతములు,నాట్యములు, పురాణములు,శాస్త్రచర్చలు, వేదాధ్యయనములు, సైన్యములు ఏనుగులు గుఱ్ఱములు మొదలైనవి పట్టణము నందంతట తిరుగుట. రాజదంపతు లూరేగుట, వారితో పాటు రాజబంధువులు మహోద్యోగులు వెడలుట జరుగవలయును.

అది పెద్ద తతంగము. శాస్త్రి వెళ్ళి వీరదేవవర్మతో చెప్పెను. అప్ప టికి మహారాజైన నరేంద్రదేవవర్మ వ్యాధిగ్రస్తుడై యుండెను. మహా వైద్యులు మందులు నూరుచుండిరి. పోయుచుండిరి. ఔషధములు పది నిముషములు పనిచేసినట్లు కన్పించును: పదునొకండవ నిముసమునందు రాబోవు మృత్యువు తాగి నిలువద్రొక్కుకొనును. నయముగదా! మృత్యువు యౌషధమును సుంతమర్యాద చేయుచున్నది. ఆ మర్యా దయు నంతరించినప్పుడుగాని రాజుగారి ప్రాణములు వెడలిపోవు. ఇట్టిస్థితిలో వీరదేవవర్మ తానేమిచేయును? క్రొత్తపట్టణమునకు ప్రవే శోత్సవమును జేయునా?

ఇప్పుడేకాదు, 'మహారాజు నేడుపోవచ్చును, నాల్గుదినములలో పోవచ్చును. రాజుపోయిన తరువాత మూడు నాల్గు నెలలైన జరుగ నిచో నిట్టి యుత్సవములు జరుగుట సముదాచారము కాదు. సిద్ధ మైన నగరమునందు ప్రవేశోత్సవము జేయకుండుట శాస్త్రికి తనకు నిద్దఱికిని మనస్సున కష్టముగానే యుండెను. ఇదివఱకెప్పుడో వీరదేవవర్మ వెళ్ళి ఇంచుమించుగా పూర్తియైనదన్న పట్టణమును చూచి వచ్చెను. ఆ వీథులు, ఆ గృహములు, జలసారణీయంత్రములు శిల్పంకరుడు చేసిన జిలుగునగిషీలు పెట్టిన కొపిరెలు, తీర్చిన గుంట్ర నలు కంటికెంత యింపుగా నుండవలయునో యంతనింపుగా నున్నవి.

ఆ యువరాజు ప్రస్తుతము తానేమియు చేయలేని స్థితిలో నున్నాడు. ఆ "ప్రవేశోత్సవము నీవును నీభార్యయు కలిపి చేసి కొనుడు," అని చెప్పెను. కాని దానికిని రాజాజ్ఞ కావలయును.

ఇట్టి సందిగ్ధస్థితిలో వీరదేవవర్మ చివరకు తెగించి యిట్లనెను: ఓయి! శాస్త్రీ! ఉత్సవములేదు. ఏమియులేదు. ఉత్సవము మాట తరువాత విచారింతము. నా తండ్రిగారి విషయము తేలవలయును గదా! కార్తాంతికులు మహారాజు నాలుగైదు దినములుకంటె బ్రతుక దని చెప్పుచున్నారు. నాకు దుఃఖముగనే యున్నది. ఇది చమత్కా రము. తండ్రిపోవునని తెలియును. అప్పుడు దుఃఖమున్నది. తెలిసిన విషయము జరిగిన తరువాత నదివేఱు విషయము. ఒకటి సహజమైన దుఃఖము. తరువాత లోకమేమనుకొందురో యన్న బెఱుకు. నీవు నగ

రాధిపతివని చెప్పితిని కదా! రాజధాని యచ్చటకు మార్చినచో నవి యన్నియు రాజభవనములు. మార్చనిచో నవి నగరాధిపతి భవనములు. నీవును నీబంధువులు మాటాడకుండ నచట గృహప్రవేశోత్సవములు చేసికొనుడు. సిద్ధమైన నగరమును; రాజభవనములును మరల నారునెలలు పాడుపెట్టినట్లుంచుట న్యాయముగాదు. నీవు మాటాడకుండ ప్రవేశింపుము. ఆరునెలలవఱకు ఆ రాజ భవనములు నీవి. ఆ యంతఃపురమునీది. నిన్ను కాదనెడువాడెవడు? నీవు ప్రవేశించి భోగించుచుండుము. నీవు మిత్రుడవుగనుక చెప్పుచున్నాను నీవెంత పరాక్రమవంతుడవో అంత మంచివాడవు. ఎంత లాలసుడవో అంత వైరాగ్యము గలవాడవు. నేను నీవద్ద దాచి మాటాడుట మైత్రికి భంగము. నేను నీతో రాజనీతి పచరించుటకు నేనింకను రాజును గాలేదు. నీవేడాదికాదు రెండేండ్లుండుము. ఇందులోకొంత రాజనీతి యున్నది. ఆ పట్టణ నిర్మాణమునకు నేను పట్టుమని పది దీనారములు వ్యయపెట్టలేదు. బ్రహ్మరాతసుడంటివి. మరి యేకోయంటివి. ఆపట్టణమునకు తదభిమానులవలన గాని, తద్ధనదాతల వలన గాని, మరియెవ్వరివలనగాని యాపదలు వచ్చినచో నీరెండేండ్లలోనే వచ్చును. వాని నన్నిటిని నీవే తట్టుకొనవలయును. తట్టుకొమ్ము.

అన్నిపరిస్థితులు శాంతమైన తరువాత నేను వత్తును. నాకది మేలుకదా! రాజకీయముగా నీవు నన్ను మించిపోయెడిదిలేదు. పోవలయునన్న ప్రయత్నము నీవద్దలేదు. నీవు వెళ్లుము. లేదా, పదిదినములు నావద్దనుండుము, నాయనగారి సంగతిచూచిన వెనుక నా నగరమునందలి గృహస్థులకు పత్రములీయవలెను. నీకు రెండేండ్లందుండుట కనుజ్ఞ నీయవలయును. అన్నియు రాజముద్రికలతో నిత్తును. ఇప్పుడుండుమనుటకంటె పది దినములైన తరువాత నిన్ను రమ్మనుట న్యాయము. వెళ్ళుము. ఇచ్చటివార్తలు తెలిసికొనిరమ్ము. నేనిప్పుడే చెప్పుచున్నాను. ఈ రెండేండ్లు నీవు నగరాధిపతివి. ఆజ్ఞాపత్రమును నీవు మరల వచ్చినప్పుడిత్తును. నేను వచ్చి యానగరమును రాజధానిగా చేసికొన్నచో నీకు నగరాధిపతిగా నుండుటకిష్టములేక పోవచ్చును. రాజధానిలోనున్న నగరాధిపతి నగరాధిపతియేమి! నిన్ను సర్వసేనాధిపతిని చేసెదను. నీవు వెళ్లుము. మరల రమ్ము.

తరువాత పదిదినములలో నరేంద్రదేవ మహారాజు స్వర్గస్థుడయ్యెను. తరువాత పదునారు దినములు కర్మలు సాగెను. నెలనాళ్ళకు మధ్యలఖునగరము కొంత శాంతపడెను, జితేదాస్త్రి వచ్చెను. వీరదేవవర్మ తాననిన మాటలనన్నింటిని పాలించెను.

వీరదేవవర్మ రాణియై, పిశాచాకారమున నాశిథిలనగరాంతఃపుర భాగములందు నివసించెడు రాణి రాజాంతఃపురములను పైభాగమంతయు నిర్మించి, దానికలంకారములను జేసి, సర్వము సిద్ధము జేసిన రోజులలో నామె యెచ్చటనుండవలయునన్న ప్రశ్న పదివేలప్రక్రింద పుట్టినది, ఆమె యాపట్టణమును వదలిపోవుట కిష్టపడలేదు.

ఆమె యిట్లనెను! "అయ్యో! జితేదాస్త్రీ! ఈ నాలుగైదేండ్లు కాలాభట్టు నీకేకాదు నాకును కన్పించలేదు. తొలుతటి మాయను కొన్నదాని ప్రకారము ఎప్పటికైనను పట్టణనిర్మాణము పూర్తి కావలయును. నేనప్పుడీపట్టణమును వదలిపోదునని చెప్పితిని. కాలాభట్టు నీ పిశాచత్వస్థితియొక్క యవధికూడ నదియే. వీరదేవవర్మ మహారాజు నీ పేర నగరమును నిర్మించుచుంటి ననగా నప్పుడు నీవు మధ్యలఖునగర మెప్పుడు వదలిపోదును, నా నగరములో నేనెప్పుడుందును అన్నయాశతో బ్రతికినావు. ఆయాశ నీజీవుని పట్టుకొని కూర్చున్నది. ఇది యిట్లువితథమైనది. నేనును నీవును మనతోపాటు గ్రీష్మియు కల్పాంతము పిశాచములుగానే యుండిపోవలయునేమో! తెలియదు. నేను మార్గములను వెదకుదును. ఓయమ్మ లలితా! మనజీవులుగాలిలో నాడుటకంటె మనము పిశాచములుగా పరిభ్రమించుచున్నామన్నది నాకు చాల సంతోషముగానున్నది. వట్టిజీవులు జీవులుగా తిరుగుట వేరు. మానవులుగానో, పిశాచములుగానో తిరుగుటవేఱు. జీవులు జీవులుగా తిరుగుటలో నేమియులేదు. జీవుడనగా ననేకజన్మల సంస్కారముల సంపుటి వాడు నిష్క్రియుడు, నిరూహుడు. వాడు చేసెడిదేమియులేదు. వాడు జీవుడుగా తిరుగుచున్నను నరకములో యమయాతన లనుభవించుచున్నను సమానమే. మానవులును, పిశాచము లట్లుకాదు. వీరూహ చేయగలరు. కార్యములు సాధించగలరు. ఎవరిచేతనైన సాధింపచేయగలరు. కనుక నేనూహింపగలుగు

చున్నాను. నాయూహ కార్యాభిముఖముగా ప్రసరించుచున్నది, మనయున్న స్థితికి నిదిచాలమంచిది కదా! యన్నాడు

శాస్త్రి:—అది సరేకాని మీరు మధ్యలఖు నగరము నెప్పుడు వదలి పెట్టితిరి? మీరు ముప్వురానాడు చనిపోయితిరి? మీ ప్రేతములు చూచుచునే యున్నవంటివి మీకీ మార్పు కలిగినదెప్పుడు? తరువాత నచ్చుటనేమి జరిగినది. అదివినవలయునని యున్నది.

ఆమె:—మేమూరక నీకోటలో నాకాశములో నాసౌధములో కాలాభట్టు గదులలో, రాజు నివసించెడి భవనములలో నెలనాళ్ళు పరిభ్రమించుచుంటిమి. ఆ నెల దినములలో మేము వట్టి ప్రేతములుగా దిరిగితిమి. అంతలో నాలో నేకో మార్పు కన్పించ జొచ్చెను. నాకీ పిశాచాకృతి వచ్చెను కాలాభట్టునకు గూడ వచ్చెను. గిఫ్ఫికి కూడా వచ్చెను. వచ్చిన వెంటనే మాకేమనిపించినది? తారాదేవి ప్రభృతులను పట్టి పొలార్చవలె ననిపించినది. మాకు గొన్ని శక్తులు వచ్చినవి.

ఇంతలో మహారాజు వచ్చెను. అతడు నాకొఱకు చాల దుఃఖించెను. నా మనస్సు శాంతించెను. అతడు నీలగిరి పట్టణమునణగ ద్రొక్కి వచ్చెను. నన్నట్లుచేయుటకు హేతుభూతులైన వారందఱినీ చిత్ర చిత్రముగా హింసించెను. నెలనాళ్ళలో కృతవర్మ కేశవవర్మ వంశములు నిర్ధూమధామములు చేసెను. ఆరునెలలలో పూర్వపు మంత్రి యన్న వాడొక్కడులేడు. పూర్వపు సేనాధిపతియన్న వాడొక్కడు లేడు. అందఱిలో మిగిలిన దొక్కటివుడే, ఆమె తారాదేవి. అతడు తారాదేవిని మాత్రమేమియు చేయలేదు. అతడొక్కటియే చేసెను. అశ్వత్థామను స్తుంకోను తారాదేవి చేత వండించి విషము పెట్టించి యీామె కన్నుల యెదుట చంపించెను. స్తుంకోకు విషము పెట్టుట కామె పడిన బాధను చూచి పిశాచమునైన నాకు సంతోషము పట్టక పెద్దగా నరచితిని. ఆధ్వని యేమిటని నలుగురు గగ్గోలు పడిరి. మహారాజు నేను నిర్మించుచున్న లలితాపట్టణము యొక్క రాణి సంతోషించుచున్నదనెను. అప్పుడు నాకు తోచినది. నేను లలితా పట్టణమునకు రాణినే! నేనచ్చటికి పోయి యుండవలయునే

యని అనుహో రాజెంత మంచివాడనుకొంటిని! తన భార్య రుద్రాణి. ఆమెను పట్టమహిషిని చేసెను. ఆమె యందు సంతానమును గనెను. కాని జితేదాస్త్రీ! నీవు మధ్యలఖు నగరమునకు చాలసార్లు పోయి తివి నీవు చూచితివో లేదో మహారాజసౌధములో రాజు పడక గదిలో నా శిలా విగ్రహము వేయించినాడు. ఇప్పటి రాజా భవన మును మార్పించెను. ఆపడక గదిలోని కెవ్వరు పోయిచూతురు?

ఈనగర నిర్మాణమైనది. మీ రిందులో గృహ ప్రవేశము చేయు వఱకు నేను మీరున్న చోటనే యుందును. మీరు వచ్చి ఈ రాజ భవనములందు ప్రవేశించుడు. అంతఃపురములో నీ భార్య యుండునుకదా! నీకేమియు భయములేదు. నేనుకూడ నుందును. నాకు సంతృప్తికలిగినది, ఎప్పుడు కాలాభట్టు వచ్చి నాకు నిష్కృతి కల్గెనని చెప్పునో అప్పుడు నేను వెళ్ళిపోదును; నాకు పిశాచత్వము వదలిపోవుచున్నది సుమా! నాకు తెలియుచున్నది ఎట్లు తెలియు చున్నదనగా నప్పుడప్పుడు మానవులకు తాము చచ్చిపోవుచున్నట్లు తెలియుచున్నది కదా! అట్లు తెలియుచున్నది. ఎప్పుడో కాలాభట్టు వచ్చును. నేను తరువాత నేమగుదునో! జీవుడిగా పరిభ్రమింతునో! మరల నేదైన జన్మయెత్తుదునో!! జన్మ యెత్తకుండ నున్నచో మీ భార్యాభర్తలను నేను రక్షించుచుందును.

సుదర్శన భట్టారకుని యింటిలో జరిగిన కథలు పదులు పాతి కలు. అవి నాలుగైదు ఘట్టములుగా నుండెను. నాగేశభట్టు జితే దాస్త్రికి వేదాంత గ్రంథములన్నియు పాఠము చెప్పుచుండెను. అతని కనేక సందేహములు. మొదట నాలుగైదు సందేహములు సందేహ ములుగానే యుండెను. తరువాత తరువాత నాగేశభట్టు రేపు చెప్పుదు ననుచుండెను. మరునాడు చెప్పుచుండెను. ఇట్లు పలుసార్లు జరుగు చుండెను. జితేదాస్త్రి దానికారణ మడుగలేదు. నాగేశభట్టు చెప్పలేదు.

ఆ రాత్రిపూట నాగేశభట్టునకు కాలాభట్టు కన్పించి మా సందే హములకు సమాధానములు చెప్పుచుండెను.

జితేదాస్త్రి చదువు వానకాలపు చదువు. అటు వీరదేవర్మ. ఇటు నగర నిర్మాణము. మధ్య మధ్య తీరికచేసికొని చదువు.

ఇట్లుండగా నాగేశభట్టున కెప్పటికప్పుడే యాశ్చర్యము. ఈ జితేదాస్తి మానవుడా మానవాతీతమైన మేధాశక్తి కలవాడా? ఏక సంథాగ్రాహియా! నాగేశభట్టు తన జన్మలో తాను చదువుటయే గాని యనుభవ మెఱుగడు. జితేదాస్తి కా యనుభవము ప్రత్యక్ష ముగా కన్పించుచున్నది.

ఒకనాడు నాగేశభట్టు కాలాభట్టుతో నిట్లనెను: 'ఏమయ్యా! నీకు సర్వ వేదాంత గ్రంథము లింత కరతలామలకముగా నున్నవే! నీవు రాక్షసుడ వెందుకైతివి?'

అతడిట్లనెను: ఒకటి నేనాత్మహత్య చేసికొంటిని. రెండు నేను నా పెంపుడు కూతురైన లలితాదేవిని నా చేతులతో కత్తితో పొడిచి చంపవలసి వచ్చెను. ఆమె కొఱకు నా యీ పిశాచత్వము సాగు చున్నది!

ఒకనాడు సుదర్శన భట్టారకుని మంత్ర పునశ్చరణ యంతయు నైనది. ధారాదత్తము చేయవలయును కాలాభట్టు తత్ఫలము మూడు భాగములుగా జేసి ముగ్గురికి ధారాదత్తము చేయు మనెను.

సుదర్శనుడు తొలుత నిద్దఱి కంటివి గదా? యనగా

కాలాభట్టు:—'స్వామీ! నా కిరువది లక్షలు చాలును. తక్కినవి నా సేవకుడున్నాడు, గిర్ఫియని, నా పెంపుడు కూతురున్నది లలితా దేవి యని; వారిద్దరు నావలెనే, పిశాచములు. నేనిచ్చట కూర్చు న్నది వారి కొఱకు. నా కొఱకుగాదు. నాకొక మహానిధి దొఱికినది. ఆ నిధితో మీ జితేదాస్తిచేత నీ నగర పునర్నిర్మాణము చేయించితిని ఈ నగరము పేరు లలితాపట్టణము. మీరు జితేదాస్తితో చెప్పుడు. ఈ కథయంతయు నీ నగర మహారాజ్ఞియైన లలితాదేవి జితేదాస్తితో నతని భార్యతో నిడివఱకే చెప్పెను. జితేదాస్తి భార్యపేరు లలిత. అతడీనగరమునకు లలితాపట్టణమని పేరు పెట్టెను. నేనేమైన నందు వేమో యని భయపడుచుండెను లలితాదేవి శ్రీదేవి. సర్వము శ్రీ దేవి మయము. ఆమెయే బ్రహ్మపదార్థము. ఆమెయే యిట్లు పొసగించి నది. లలితా పట్టణమనగా జితేదాస్తి తన భార్యపేర నిర్మించిన పట్టణ మనుకొను చుండును. వీరదేవవర్మ మహారాజుగారి ప్రియురాలైన నా

పెంపుడుకూతురు దీనిని తనపేర నిర్మించెనని యనుకొనును. శ్రీవుల యొక్క మోహములు చమత్కారముగా నుండును. అన్నియు తమ వైపునకు త్రిప్పి సమన్వయించు కొనుచుందురు

గృహ ప్రవేశములైనవి. జితేదాస్తి కుటుంబము రాజభవనములో నుండెను. జితేదాస్తి తల్లియు, ముత్తవయు, తామ్మయు, పవివర్మ, భార్యయు, నతని తల్లియు నందఱు నంతఃపురములలో నున్నారు. జితేదాస్తి భార్యయొక్క భవనము వేఱు. అందులో నామెయు నామె పరిచారికలు మాత్రమే. అది నగరాధిపతి యొక్క యంతఃపురము. అందులో నిద్దఱు లలితాదేవులు నుండిరి.

నాడు పూర్ణిమ. రాత్రి రెండు జాములైనది. వెన్నెలలు మిలమిల లాడుచున్నవి. జితేదాస్తి తన భార్యయొక్క యంతిపురము ముందు నిలుచుండెను. కాలాభట్టు వచ్చెను.

జితేదాస్తి ఇట్లనెను: — ఇతరులు లోనికి రాకూడదు.

నవ్వులు... గాలిలో నెగిరిపోవుచున్న ఇద్దఱు జీవులు.

# ప్రొ॥ శ్రీ నాథ వారి

## నేపాళరాజవంశ కథా నవలలు

ఎమెస్కో పాకెట్ బుక్ సిరీస్‌లో ఇంతవరకు వెలువడినవి :

1. [EPB-1] దిండుక్రింది పోకచెక్క (ద్వితీయ ముద్రణ)
ఒక కపటసన్యాసి ఆడిన కపటనాటకమూ, చేసిన కిరాతకాలూ, చివరకు పడిన పర్యవసానమూ ప్రత్యక్ష దృశ్యంవలె ప్రదర్శించే చారిత్రక నవల.

2. [EPB-26] చిట్లీచిట్లని గాజులు
నేపాళరాజవంశ కథా నవలల్లో రెండవది గౌతమబుద్ధునిలో భగవదంశ దర్శించిన ఒక నేపాళపు నెరజాణ విచిత్రోదంతము.

3. [EPB-51] సౌదామని (భృగుపాతం)
నేపాళరాజవంశ కథా నవలల్లో మూడవది. శంకర భగవత్పాదుల శైత్రయాత్ర నాటికథ. ఈ సృష్టిలో దుఃఖములుగాని, సుఖములు కాని అచ్చంగా అవే రావనీ, మిశ్రితంగా వస్తుంటాయనీ నేర్పుగా నిరూపిస్తూ, అపూర్వ కథాసంవిధానంతో ఆమూలాగ్రం ఆసక్తితో చదివించే సొగసైన నవల.

4. [EPB-76] దూతమేఘము
'మేఘదూత'మునకు అవతరణిక ఈ 'దూతమేఘము'. పూర్వ జన్మస్మృతులతో పుట్టిన ఒక విచిత్రబాలిక విస్మయకర వృత్తాంతము. శకకర్త విక్రమాదిత్యుని విజయగాథ. నేపాళరాజవంశ కథా నవలలలో నాల్గవది.

5. [EPB-101] లలితా పట్టణపురాణి
అపూర్వమైన ఇతివృత్తం, ఆశ్చర్యకరమైన పాత్రలు, అద్భుతమైన సంవిధానం, గంధర్వుడిచేత బ్రహ్మరాక్షసుడు శిథిలనగర పునర్నిర్మాణంచేయించిన విచిత్రగాథ.

6. (ఈ సిరీస్‌లో ఇంకొకటి రానున్నది)